శ్రీ

# ఆశీస్సు

## శ్రీ విద్యాశంకర పదమూలవేశ ప్రకాశిత జగద్గురు
## శ్రీ కల్యాణానందభారతీ మహాంతాచార్య మహాస్వాములవారు

శ్రీ విద్యాశంకర భవనము - గుంటూరు

అస్మదత్యంతప్రియాంతేవాసి శ్రీ మిన్నికంటి గురునాథశర్మ శ్రీ చరణ సన్నిధానమున ఆఱువత్సరములు ప్రస్థానత్రయాధ్యయనమును గావించి తన గురుభక్తిని లోకమునకు వెల్లడి సేసినాఁడు. ఈతఁడు చదువుకొనెడి సమయములయందు మిగుల జిజ్ఞాసమీఱ వేదాంతవిషయములను గడుంగడు శ్రద్ధతో దెలిసికొనుచుఁ దత్ఫలమో యనునట్లీ యపూర్వమగు గ్రంథమును రచించెను.

వేదశాఖావిభాగకర్తయగు శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాస భట్టారక ప్రణీత మీ భాగవతమగునా కాదా యనుచర్చ ప్రకృత మనవసరము. భారత గ్రంథము విష్ణుపురాణముయొక్క వ్యాఖ్యానరూపమే యనుచు విష్ణ్వతిశయమును దెల్పు గ్రంథమాత్రమే యైనను ఒకవిషయమున నియ్యది విశిష్టతను సంపాదించుటచే లోకమునఁ బ్రసిద్ధినొందెను. సాధారణముగ భారతదేశమునఁ గల భాగవతులలో ఈ భాగవతగ్రంథమును జదువని భాగవతుఁడుగాని చేతఁ బట్టని భాగవతుఁడుగాని యుండఁడు. అందుత్తరదేశమున సంస్కృతభాగవతమునకును దెలుఁగుదేశమునఁ బోతనరచితంబగు తెలుఁగుభాగవతమునకును బ్రచారము మెండుగాఁ గన్పట్టుచున్నది.

తెలుఁగు భాగవతమును రచియించిన పోతనమహాశయుఁడు భాషా భావముల రెండింటిని మహోజ్జ్వలరూపమున దనగ్రంథమున నగపఱచెను. కాని యాంధ్రులు తమ దుర్విధిపరిపాకవశమున నాతనిగ్రంథమును బరిపూర్ణముగఁ బొందలేకపోయిరి. తుదకు వెలిగందల నారయయొక్క శేషపూరణగ్రంథమే నేఁడాంధ్రుల కుపలభ్యమానమగుచున్నది. నారయ మహాకవియైనఁ గానచ్చునేమోగాని భాగవతగ్రంథముయొక్క తుదిభాగమగు నేకాదశ, ద్వాదశ స్కంధములను బోతనహృదయము ననుసరించి వ్రాయలేకపోయెను. ఏలయనఁగా సంస్కృతభాగవతములోఁ బదుమూఁడువందల యఱువదియేడు శ్లోకములుగల యేకాదశస్కంధమును అయిదువందల యఱువదియాఱు శ్లోకములుగల ద్వాదశస్కంధమునుగూడ అతిసంగ్రహముగా ననఁగా 173 పద్యగద్యములతోఁ బరిమితముగా నొనర్చినాఁడు. ఇట్టిగ్రంథసంగ్రహణముచే సంస్కృతగ్రంథగతవిషయము లెన్నియో పరిత్యజింపఁబడి

యుండునని వేఱఁజెప్పనక్కఱలేదు. కావున నా తెలుఁగుభాగవతములోని చివరిభాగము ఆంధ్రభాషాభిమానుల కెంతవఱకుపయోగపడునో మాకు సందేహమే.

ఇట్టి యవకాశము లభించుటంజేసియే శ్రీ గురునాథశర్మ అయ్యేకాదశ ద్వాదశ స్కంధంబులఁ దెలుఁగుసేసి యాకొఱంతను దీర్చెను. ఈతని విజ్ఞాన కవితాప్రాశస్త్యము గ్రంథముననే సుస్పష్టమగుటంజేసి యవ్వాని నిట మేము ప్రత్యేకముగఁ బేర్కొన నవసరములేదు.

ఈ గ్రంథము ఆంధ్రప్రజానీకమునకు నెంతయో యుపయోగించు ననుటలో సందేహములేదు. కావున నిట్టి శ్రీ గురునాథశర్మకృతి ఆ చంద్రతారకముగ లోకమున నిలచి, యీతనికి ఐహికాముష్మికశ్రేయముల నొనఁగూర్చుగాతమ్మని నారాయణస్మరణమును గావించుచున్నారము.

శ్రీవిద్యాశంకరపీఠస్థానము<br>
[illegible]<br>
శ్రీఖరసంవత్సర ఫాల్గునశుక్ల<br>
పూర్ణిమా భౌమవాసరము<br>
11—3—52

ఇతి<br>
నారాయణస్మృతిః<br>
జగద్గురు శ్రీకల్యాణానంద<br>
భారతీమహంతాచార్యస్వామి

# తొలిపలుకు

ఆంధ్రమహాజనులారా!

తొలిపలుకు లేని గ్రంథము తొడిమ లేని వంకాయవంటిదగును గాన సంచుక పలికెదను.

మా పితృపాదులు కీర్తిశేషులు వేంకటలక్ష్మయ్యగారు సంస్కృతభాగవతమును చక్కని కాగితములపై వ్రాసికొనిరి. నేనిటీవల నాగ్రంథమును నిత్యము పారాయణ మొనరింప సాగితిని. రెండు మూఁడావృత్తులైన పిదపఁ దెలుఁగుప్రతితో జోడించి చదివి పోతనామాత్యుని కవితామృతము జుఱ్ఱుకొనఁ గడంగితిని. ఏకాదశస్కంధమునకు వచ్చునప్పటికది పోతన కవిత కాకపోవుటం బట్టియో లేక గ్రంథపాతములుంటం బట్టియో సంస్కృతమునకుఁ దెనుఁగునకు నేమియుఁ బొత్తుకుదురలేదు సరిగదా యపార్థములు నన్యార్థములు మున్నగున వెన్నియో దోసములు పొడకట్టెను.

సంస్కృతమున నేకాదశస్కంధమున 31 అధ్యాయములు 1373 శ్లోకములు గలవు. దానికి శ్రీమదాంధ్ర భాగవతమందేకాదశస్కంధమున నాద్యంతములు 3 గాక 76 పద్యములు 47 వచనములు మొత్తము 123 పద్యగద్యములు గలవు. అందును 12 మొదలు 18 వఱకుఁ గల పద్యము లమూలకములే. తక్కినవియు సరిగ లేవనుచున్నందులకు క్షమింపుఁడు. మచ్చునకు

కం. చిత్తం బేక్రియ నిలుచుం, జిత్తజగురుపాదపద్మసేవ సదా య
త్యుత్తమమని వసుదేవుఁడు, చిత్తము దగ నిల్పి యెట్లు చెందె మునీంద్రా!

ఆంధ్రభాగవతము 11 స్కం. 27 ప.

దీనికి నుత్తరము గ్రంథమున లేదు.

“నదేహభూపాలుండు భాగవతధర్మం బెద్ది? యే ప్రకారంబున ప్రవర్తించు? వారల చిహ్నంబు లెవ్వి?” 46

అన్న ప్రశ్నంబులకు సదుత్తరంబులు లేవు.

“శ్రీమన్నారాయణమూర్తి లీలావిలాసంబు లనంతంబులు గలవు. మనోవాక్కాయకర్మంబుల హరిపూజనంబు సేయక విపరీతగతులఁ దిరుగుచుండు జనుల కెవ్విధంబున గతిగలుగుననిన నప్పుడప్పుడమిఱేఁ డప్పరమపురుషునిఁ జూచి యట్టిజడులు ముక్తినొందు నుపాయం బెట్టు లంతయు నెఱిఁగింపుఁడనినఁ జమసుం డిట్లనియె” 73

ఎవ్విధంబున గతి గలుగునన్న దెవరు? దానికి నుత్తరంబేమి? అది వినిన వెంటనే పుడమిఱేఁ డుత్తరము వినక మరలఁ బ్రశ్నించు టేల?

“ . . . . . . . . . . . . . . . .

శంకరవేషధారి యొకసంయమి మాయదుర్గాంజేరి నే
వంకను నుండి వచ్చి తన వానిని నిల్లని నర్థి నేర్పెడిన —— 92

కం. అవధూతచుం డనె నంతటఁ, బ్రవిమల విజ్ఞాననిపుణ భవ్యులు గురువుల్
దవిలిన నిరువదినలువురు, నవని విజ్ఞానినై తినని పల్కుటయున్ 93

వ॥ అంతట యమ్మహనీయుడు దేహాద్యోధిసూక్ష్మపదార్థముల నర్జించి జనార్దనుని
సేవిధంబునఁ జేరవచ్చు... 94

ఈ ప్రశ్నోత్తరముల నెంచక చూచితిరా? అడిగినది దానికిఁ జెప్పెడిదానికి సంబంధము లేదు.

క్రిమిదష్టములైన తాటియాకులం జూచి ముద్రించుటలో నిట్టి యసందర్భములు దొరలియుండెనేమో.

మఱియు నెట్టిన గ్రంథము పూర్తియైన దనిపించుటకును నారాయణకవి త్వరపడినట్లు కన్పించుచున్నవి. చూడుఁడు.

“వర్ణాశ్రమ ధర్మంబులు – నిర్ణయముగ నానతిమ్ము...... 106
వ॥ అనినఁ గృష్ణుండు నాలుగు వర్ణముల యుత్పత్తియు నాలుగాశ్రమంబుల
కిట్టిట్టి వర్తంబు లనియును, నాలుగు వేదంబులం జెప్పిన ధర్మంబులును...
మొదలుగాఁగల నన్నియు నెఱిఁగించి... 107

అని తేల్చివైచెను. సంస్కృతమున 17-18 అధ్యాయములలో 105 శ్లోకములలోఁ జెప్పిన విషయ మిది.

ఇఁక నగలే వదలఁబడినవి 20, 21, 22, 23, 25, 28 అధ్యాయములు. 10, 11, 14, 15 అధ్యాయములం దాకవి వదలెను. తక్కిన యధ్యాయముల నెచటనో స్పృశించి విడిచెను. గ్రంథమిట్లగుట కొక వెలిగందల నారయ్యయే. కాక చెదలుపురువులును దాళపత్రములనుండి ప్రప్రథమమున గ్రంథమునచ్చొత్తించిన పరిశోధకులునుగూడ బాధ్యులనియే నాతలంపు.

ఇదియంతయుం జూచి యీచరమగ్రంథము రచింప సంకల్పించితిని. సంకల్పించిన కొంతకాలమునకుఁగాని చైతన్యచోదనము లభింపలేదు. అది లభించిన పిదప నాయల్పజ్ఞతను మఱచి కలమందుకొంటిని. అది 1946 వ వత్సరము గుడ్డ, తిండి, కట్టె, చమురు, చక్కెర దొరకని గడ్డుదినములు. అబ్బబ్బా! ఆ భయంకరదివసముల స్మరించిన నోడలు జలదరించును. ఆ కంట్రోల్, ఆ రేషనింగ్, ఆ చాటుబేరము, ఆ లంచము, ఆ ప్రజల యారాటము, నాన

కములైన వస్తువులు లభింపకపోవుట యేమి చెప్పవలయును ? కలిపురుషుఁడు తాండవ మాడుచుండెను. దేహబలమో, ధనబలమో, యధికారబలమో లేనిచో నింజపుట్టదాయె. అటు వేళ కున్న తపాలశాల కరుగవలె. ఇటు రేషన్ షాపుల దగ్గఱ గంటలకొలఁది నిలిచియుండవలె. ఒంటరిగాఁడను. ఇట్టిస్థితిలో గ్రంథరచనకు దొరకొంటిని. ఎట్లు వ్రాసితినో ? ఎట్లు పూర్తియైనదో ! అంతయు నీశ్వరేచ్ఛ.

ఆప్తులారా !

నాకు బుద్ధిప్రసరింపనప్పుడు భగవద్ధ్యాన మొనర్చెడివాఁడను. ఇతర కార్యములలో నంతగట్టిగాఁ జెప్పలేనుగాని యీ కార్యమునందు మాత్రము భగవచ్ఛక్తి నన్నలమికొని నడిపించెనని గట్టిగాఁ జెప్పఁగలను. అట్టి దృఢవిశ్వాసము నాకుఁగలదు. ఇది నిస్సంశయము నిశ్చయము. అది నాకుఁగానకున్నఁ గృతఘ్నతయు నగునేమో. కాన నెవరెట్లు తలంచిన నాకేమి ? రచనాకాలమునందలి నాయనుభూతులలో నొకటి రెండు మాత్రము నుడివెదను.

ఏకాదశమున దశమాధ్యాయమున 11 వ పద్యము వ్రాసిన పిదపఁ గల మాటలేదు. భగవద్ధ్యానములో రెండునాళ్ళు గడపితి. పిమ్మట 27-5-1946 రాత్రి యొక స్వప్నము వచ్చినది. తెల్లచీర ధరించిన యొక స్త్రీ కనిపించి నా ప్రయాణమున కడ్డుగానున్న వాలుపదాఁటు నెరవు నుడివి దాఁటించెను. అంత మెలఁకువవచ్చెను. నా యానందమునకు మేర లేదు. లేచి యావశ్యకకార్యములు నిర్వర్తించుకొని కూర్చుంటిని.

ఉ॥ కాంచఁగ జైమినీయమను ఘట్టము భీతిజనించి కేలు జో
డించి నినుం దలంచి పవడింపఁగ రేఁ గల నడ్డుకాల్వ దాఁ
టించితి పుట్టి తెచ్చి విఘటించిన నాదు ప్రయాణ మాదృతి
న్మించిన నీదుకూరిమికి నే నతిసేసెద దాసపోషకా !

అని ప్రార్థించి 28-5-45 ఉదయము మూలశ్లోకములఁ జూతుఁగదా. ఏమిచెప్పుదు. పదార్థము గోచరించినది. కలము సాఁగినది.

కలలు కల్లలైననగుఁగాక నాకు ఫలమనుభూతమైనది.

“ యదా కర్మసుకామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి - సమృద్ధిం తత్రజానీయా త్తస్మిన్ స్వప్ననిదర్శనే ”
ఛాందోగ్యము 5-2-9

అని కలదుగదా. మఱియు శ్రీ శంకరభగవత్పాదులవారు “ మంత్ర దేవతాద్రవ్యవిశేషనిమిత్తాశ్చ కేచిత్స్వప్నాః సత్యార్థగంధినో భవంతీతి మన్యంతే। తత్రాపి భవతునామ సూచ్యమానస్య వస్తునః సత్యత్వమ్. సూచకస్యతు

శ్రీదస్సినాదేర్భవత్యేవ వైతథ్యం బాధ్యమానత్వాదిత్యభిప్రాయః" అని నాగేశకభాష్యము 3-2-4 దగ్గఱ సెలవిచ్చిరిగదా.

ఇఁక నాకుఁ గలమూఁడని తావులనెల్ల రచించిన భగవద్ధ్యానపద్యముల నిటఁ గనఁబడు ద్వాదశస్కంధమందలి యొక యనుభవము చెప్పి ముగించెద.

ద్వాదశస్కంధమున 7 వ యధ్యాయము పూర్తిచేసి 8 వ యధ్యాయము వ్రాయఁ గూర్చుంటిని.

కం. ఉద్విగ్నమనస్కుఁడనై, సద్విద్వజ్జనము కలతఁబొందునటులు నెదిరో దోసం
బుద్వేష్టితమైనదో ? నా. యద్వైతా ! శరణు శరణు హరిహరనాథా !

అని ప్రార్థించితిని. ఒక యక్షరము సాగలేదు. లేచితిని. 8, 9 తేదీలు గడచెను. 10-12-46 కూర్చుంటిని.

కం. అశ్రాంతము వ్రాయఁజనదో ?, విశ్రమమావశ్యకమని వెనుదలఁచితివో ? దోః
పాశ్రయుఁడనగుట గనుకనో ? యశ్రద్ధఘటిల్లె రచన హరిహరనాథా !

అని మాత్రము వ్రాసి లేచి దినములు గడపుచుంటిని. వ్రాయఁ దోఁచుటలేదు.

పిమ్మట 15-12-1946 రాత్రి కలలో వ్యాసస్మరణ మొనర్పు మన్నట్లుగా నుండెను. లేచితిని.

కం. సాత్యవతేయస్మరణ మ, గత్యా మొనర్పు మననేల కలలో నేనా
స్తుత్యగుణుని మఱచితినో, యత్యంత మొనర్తునట్లె హరిహరనాథా !

అని ధ్యానించితి. నిజమునకు గ్రంథారంభమున వ్యాసభగవానుని స్తుతింపలేదు. చెంపలు వైచుకొంటిని.

కం. వ్యాసభగవానుఁడా ! త్వ, ద్దాసుఁడ వందన మొనర్చెద క్షమింపుము నా
దోసములనెల్ల, నంతే - వాసులపైఁ జనునె కోపపడుట మహాత్మా !

అని గ్రంథారంభమందలి 11-12-13-14 పద్యములతో ధ్యానమొనర్చి లేచితి. పిదప 19-12-1946 వ్యయవత్సరమార్గశీర్షశుక్లైకాదశీగురువార ముదయమునఁ గూర్చుంటి.

.ం. ఒక్కొకయుపాధిఁగైకొని, యొక్కొకపనిచేసి పోవుచుందువు జగమం
దకటకటికమాని, నీ స, మ్యక్కృతి కంజలి ఘటింతు హరిహరనాథా !

అని ప్రార్థించితిని. 20 వ తేదీనుండి మనోవ్యాకులత యడఁగినది. గ్రంథ రచన సాగినది. వ్యాసస్తవమును బిదప గ్రంథాదికిం జేర్చితిని.

గ్రంథము సాంతము వ్రాసి కాశీకేఁగి 13-2-1949 మధ్యాహ్నము గంగ యొడ్డుననున్న కాశీరాజు భవనమందలి వ్యాసలింగముల దర్శించి యపరాధము క్షమింపవేఁడి వెలుపలికి వచ్చితిని. అచటి కొక వృద్ధపరివ్రాజకుఁడు సమున్నతకాయుఁడు వచ్చి నన్ను నిలువెల్లంజూచి సంస్కృతభాషలో వ్యాసకాశిని జూపెదరమ్ము. తెలియనివారిచటఁ జూచియే తృప్తిపడి మరలిపోదురని శ్రీవారే కొంగాలు మాటాడి నన్నును నాతోడివారిని వ్యాసకాశికిం గొని పోయిరి. అచటఁ దనివిదీఱ వ్యాసలింగముం దర్శించి చెంతఁ గూర్చుండి పూజాదికము నిర్వర్తించి నారచించిన రెండుస్కంధయుగముఁగూడ విన్నవించుకొని యపరాధమును క్షమింప వేఁడికొంటిని.

9 వ యధ్యాయమున 13 వ వచనములో "నంతరంగము నాదరించె" అని వ్రాసిన పిదప నిదురవచ్చెను. ఉదయకాలమున స్నానసంధ్యలు కావించుకొని కూర్చుంటిఁగదా నిదురవచ్చుటేల ?

తే॥ అంతరంగమ్ము నమ్మాయ యాదరించె
ననుచు వ్రాసి యవ్వలఁదోఁప కట్టియుండఁ
గ్రమ్మె నిదుర ప్రాహ్ణమున, నాకైనది నప
రాహ్ణమునఁగూడ నీక నెట్టులయ్యె రచన ?

కం॥ అనలద్యుతి దీప్తాంగా ! వినమద్యతిలోకసంగ ! విఘ్నవిభంగా !
అనవద్యపదోత్తుంగా ! ఘనవిద్యాత్మాంతరంగ కరుణాపాంగా !

అని మఱునాఁడు ప్రార్థించి వ్రాయఁగడంగితి. ఇట్లు కొన్ని చిత్రములు జరిగినవి. అవియట్లుండఁగాక. వీనిని మాత్రము చెప్పుట యేటికనన నశక్తుఁడనైన నన్నొకశక్తి పట్టుకొని యాడించినదనుటకే.

20-3-1946 ప్రారంభించి 19-2-1947తో రెండుస్కంధముల బూర్తిగా రచించితి.

అహంకారావృతుండనై రచించిన స్థలముల దోసఁగులు దొరలియుండ వచ్చును. వానిని దోషజ్ఞులు దెలిపిన నంజలి పట్టెదను. ఈ గ్రంథమునఁ బునరుక్తులు మెండుగాఁగలవు. విషయము లెస్సగాఁ దెలియఁబడుట కట్లువాకొనఁ బడెనని యెఱుఁగుఁడు.

సహృదయుఁడు, విమర్శకుఁడు, సత్కవి, దోషజ్ఞుఁడు, బ్రహ్మవేత్తగదా దీనికిఁ బీఠిక వ్రాయ నర్హుఁడు, ఇంకేమి ? అట్టిమహానుభావుఁడు "మహోపా

ధ్యాయ" శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు నాకు లభించిరి. వీరు గీతాసంఘా ధ్యక్షులు, నెల్లూరుకాలేజీలో నాంధ్రోపన్యాసకులుగ నున్న వారు. అభినవతిక్కన సాహిత్యస్థాపకేత్యాదిబిరుదాంచితులు. ఎనుబది యేండ్లు పైఁబడిన వృద్ధులు. చేయినడఁకుచున్నను నాపై నపరిమిత వాత్సల్యముఁజూపి 'పీఠిక' వ్రాసియిచ్చిరి. ఈ మహోపాధ్యాయునికి నామనఃపూర్వకాభివందనసహస్రములు. పోతన భాగవతమువలె నా కృతియుఁ జెదలు పురుగులవాతఁ బడకుండ నయాచిత ముగా సహృదయహృదయరంగముల నటింపఁజేసిన మహోదారస్వభావుఁడు శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు. వీరికి "బ్రత్యుపకృతింగావింప నే నేర నంజలిగావించెద". ఆహాహా! ప్రత్యుపకారనిస్పృహులు నేటికిం గలరుగదా.

గురుదేవుల యనుగ్రహ ప్రసారము లేకున్న నెంతవాఁడును భవసాగర ముత్తరింపనేరఁడు. నా భాగ్యవశమున జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మాంతాచార్య మహాస్వాములవారి పాదారవిందసేవ లభించినది. ధన్యుఁడను. వారి పవిత్రాశీస్సును వినమ్రభావమున నౌఁదలఁదాల్చి యంజలిపట్టి మోఁకరింతెదను.

గుంటూరు
17—3—1952

ఇట్లు విధేయుఁడు,
ఏన్నికంటి గురునాథశర్మ

# పీఠిక

ఈ గ్రంథకర్తయగు శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారితో నాకుఁ బరిచయము పరిమితము. 1947 సంవత్సరమునఁ గాబోలు గుంటూరులో జరిగిన ప్రాచ్యసారస్వత విజ్ఞాన పరిషత్తువారి ఐదవ వార్షికోత్సవము నే నధ్యక్షింపఁ బోయినపుడు శర్మగారి సౌహార్దమునకుఁ బాత్రుఁడనై యప్పుడు వారు తెనిఁగించుచున్న భాగవత - ఏకాదశస్కంధములోని కొన్ని భాగములు వింటిని. అందు వారి సునిశ్చిత వేదాంత విజ్ఞానమును, సజాతీయ సరసకవితాధారయు సువ్యక్తములు కాఁగా, వారికి నా హృదయమును వెల్లడిపఱిచి, ఆంధ్రీకృతి సాగింపుఁడని వేగిరించి యుంటిని. ఆవల నెప్పుడును ఈ గ్రంథమును గుఱించిన స్ఫురణయే నాకు లేకుండెను. కావున 1952 సం॥ జనవరి 5 తేది 'రిజిస్టరు పోస్టులో' ఈ బృహత్సంపుటము నాకుఁ గరగత మగుడు విప్పిచూచి, అది శ్రీ శర్మగారు భాగవత చరమస్కంధములు రెండింటికిని గావించిన యనువాదమని తెలిసికొని పరమానంద భరితుఁడ నైతిని. ఒకటి, రెండు దినములలోఁ బొత్తమెల్లఁ జదివి యది యుత్తమమార్గమున నడచినందుకు లోలోన నుప్పొంగితిని. కాని పుస్తకమునకు పీఠిక వ్రాయ శర్మగారు ఆదేశించినందున నా యలసభావమునకు వెఱచియు, ఇట్టి పుణ్యకృతితో! నా పేరు జతపడి యుండుంగావుత మనియాశించి, నా యియ్యకోలు అయ్యగారికి తెలిపితిని. నాఁట గోలె వ్రాయఁదొడఁగుడు నేదోయాటంకము. చేయివడఁకుట, మూలమలభ్యమగుట, తీఱికచాలమి, మనఃప్రసాదములేమి - ఈదృశకారణములవలన శర్మగారి కోరిక నేఁటిదనుక నెఱవేర్ప నేరనైతిని. ఈ దీర్ఘాలస్యమున నేను గొలిపిన విసుపునకు శర్మగారు నన్ను క్షమింత్రుగావుత.

2. శర్మగారు వినయసంపన్నులు. బమ్మెరపోతరాజు సంస్కృత మూలమును బాడుచేసినాఁడు కావున ఆ కొఱంత తీర్చుటకు ఈ యారంభమని వారు రచనకుఁ దొడఁగిన వారుకారు. తుదకు ఏకాదశస్కంధమును అల్లట్లు వ్రాసిన వెలిగందల నారయ్యదెసను నిరసనము నెఱపినవారు కారు. ఆయన అలఘుమతియని, ఆయన తలంపులు చక్కఁ దెలియమియే యిక్కడంకకు హేతువని శర్మగారు వక్కాణించియున్నారు (4 పే. 35 ప). ఏకాదశస్కంధము ఇర్వురచే నీవఱకే తెనిఁగింపఁబడియుంటయు శర్మగా రెఱుఁగరు. ఈ యిర్వురలో నొకరు బ్రహ్మవిదులు, కొవ్వూరు ప్రబుద్ధాశ్రమ నిర్మాతలు, కీర్తిశేషులు శ్రీ కోవూరు పట్టాభిరామయ్యగారు. వీరిది ఏకాదశమునకు యథామూలమైన యాంధ్రీకరణము. రెండవవారు కీ॥ శే॥ శతావధాని శ్రీమాన్ సంపన్మడుంబసింగరాచార్యులవారు. వీరు ఏకాదశద్వాదశములనేగాక 1937 సం॥ము నాఁటికే భాగవత ప్రథమ, ద్వితీయ, పంచమ, దశమస్కంధములం దెనిఁగించియున్న ప్రౌఢ

కవులు. దీనియున్కి నేను నిన్న మొన్న కనుంగొన్న కారణమున, పీరి భాగవతమునంతయు నిక్లే తెనిఁగించిరో చెప్ప నేరకున్నాను. పీరి యభిజనము కృష్ణామండలములోని జగ్గయ్యపేట కానోపును. అన్యుల యనువాదములు ఉండిన నుండుఁగాక, తన తెనిఁగింపునలన ఆ గ్రంథముల 'మహిమ' పెరుఁగు ననియే శర్మగారు సమాధానము చెప్పుకొనియున్నారు. 4 పే. 33 ప. ఇది ఎంత యమానిత్వము! ఇట్టివాఁడుగదా భాగవతము తెనిఁగింప నర్హుఁడు! శర్మగారు గాయత్రీమంత్రార్థము ననుభూతికిఁ దెచ్చుకొన్న ప్రాజ్ఞులు. 'ధియో యో నః ప్రచోదయాత్' ని పర్యవసన్న మగుచున్న పరమంత్రము దినమును, వేయుమార్లు ఆవర్తించుచున్న యాస్తికశిఖామణులు. ఈ విషయమున బమ్మెరపోతరాజు కును పీరికిని పరమసామ్యము కలదు. పోతరాజుగారు 'క॥ పలికెడిది భాగవత మఁట; పలికించెడివాఁడు రామభద్రుండఁట; నేఁబలికిన భవహార మగునఁట' అని యుపక్రమింపఁగా, శర్మగారు ఆయర్థమునే

మ॥ ముకుంద్రా పంది విభుండు లాగుకొనుచుం బోవంగ నాగించి రె
ద్దుకు శక్యం బటె నేను రా ననుచు గింటాల్ వేయు? న న్నట్లు వాఁ
డొకసంకల్పము పుట్టఁజేసి యెట్కో యుద్ఘాటింపఁగించు; జం
కక పోవం గమకింతు నెట్లయిననేఁగా కావలం ద్రోపలక్.

క॥ నైపశ్చిత్యముచే నే, నీపనికిఁ గడఁగలేద హృదయాబ్జగతుం
డౌ పరమాత్ముండిటు సేయించెను నన్నిట్లు; యిందరుఁపురుష విబుధుల్.

అని స్మరించి యహంకార నిరసన పూర్వకముగా నే, రచనమునకుఁ బ్రారంభించినారు. ఈ పవిత్రగ్రంథమునకు ఈనుడికారము అకృత్రిమ మైన యలంకారము. పూర్వమీమాంసా మతఖండనమున ఒండు శ్లోకమున కర్థము తెలియమిచేత రచన యాఁగఁగా సెలవలువధరించిన యొక వెలఁదిమిన్న కలలోఁదోఁచి భావముస్ఫురింపఁజేయుటయు, పంద్రెండవస్కంధమున ఏడవ యధ్యాయము తెనిఁగించిన పిదప, వ్యాసస్తుతి సేయువఱకు కలము ఆఁగిపోవు టయు – ఇత్యాద్యనుభూతులు కొన్నింటి గ్రంథకర్త 'అధోక్షజాపిక' లలోఁ జెప్పికొని యున్నారు. ఏయే యధ్యాయ మేనాఁడు తెనిఁగించినదియు, పాఠ భేదము లున్నచోటఁ దా నే ప్రతిమీఁద నాధారపడినదియు వారే తెలిపి కొనియున్నారు. అన్నింటను – అంతర్యామి ప్రేరణయే తన యాశయ ధోరణికిఁ గారణ మని శర్మగారి నమ్మకము. ఆగమాంత లతాంతములును తత్సౌరభ మని చెప్పికొనఁదగిన గీతయు నీ యర్థమునే యుద్ఘాటించుచున్నవి.

శ్రు॥ యో వాచి తిష్ఠన్ వాచోంతరోయం వాక్నవేద యస్య వాక్ఛరీరం
యో వాచ మంతరో యమయ త్యేష త ఆత్మా న్తర్యామ్యమృతః 3-8-18

యో మనసి తిష్ఠన్ మనసోఽన్తరో యం మనో న వేద యస్య మనశ్శరీరం ।
యో మనోఽన్తరో యమయత్యేష త ఆత్మాఽన్తర్యామ్యమృతః॥ బృహదారణ్యకము-౩-౭-౨౦

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం । హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥
తమేవ శరణం గచ్ఛ । సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥ భగవద్గీత-18-62

ఇందు ఆస్తికులు వింతపడఁదగిన యంశమేదియు లేదు.

౫. ప్రాకృతుల తెనిఁగింపుఁ బోకడల నెల్లఁ జవిచూచిన రసజ్ఞప్రవరులు గన్నారు. ఆ మార్గము నొందలేక పద్యానువాద సందర్భమున నేనిట్లు పరామర్శించియున్నాను. "మూలము చదువునపుడు తద్భాషాభిజ్ఞులకు నెట్టి యానందము కల్గునో యట్టి యానందము తెనిఁగింపు చదువునపుడు తెనుఁగు చదువరులకుఁ గలిగెనేని, అది సరియైన యాంధ్రీకరణమని చెప్ప నొప్పును. అనువాదకునకు మాతృకవలననే భావము లభించుచున్నది. ఆ భావమును పద్యరూపమునఁ దీర్చి కావ్యలక్ష్మిం గైసేయుటయే యాతనికి మిగిలియుండు పని. మూలానుసరణాభినివేశమున పద్యమును గుంటుపడనీయక పద్యసౌభాగ్యము కొఱకు మూలమందలి భావ, ధ్వని, వ్యంగ్యములఁ బోలిపుచ్చక, ఈ రెంటికి సామరస్యము సాధించుటయే యాతని శిల్పమునకుఁ బేరము. ఏతత్సిద్ధి కొఱకు అనువాదకుఁడు కొన్నియెడల నాతిసార లేశముల నుపేక్షింపవలసి యుండును. కొన్నియెడల మూలావిరుద్ధములు, తత్పోషకములు నగుకొన్ని భావములఁ జేర్చుకొనవలసి యుండును. ఈ పట్టు విడుపుల యెఱుకయే యాంధ్రీకరణ విజ్ఞాన సారము. భారత భాగవతాదిగ్రంథములేగాక ఒక్కొక్క శ్లోకమున కొక్కొక్క పద్యముగఁ దెనిఁగింపఁబడిన భర్తృహరి, కృష్ణకర్ణామృతాది శతకములును ఈసూత్రమునకు లక్ష్యములుగా నున్నవి. ఈ కవులకు భాషాశుద్ధిపట్ల నెంత పక్షపాతమో గాని ఒక్కొక్కయెడ రసభావాదికము లోకింత సడలుటయైనఁ బరిగణింపక తమ తెనిఁగింపుల ననర్గళ మధుర మధురస ఝరులుగాఁ గావించుకొని యున్నారు. అందువలననే యవి ప్రసన్నములై స్వాతంత్ర్యము లనుభ్రాంతిని కలిగించుచు 'సరసులైన కవుల చెవుల కెక్కుట'యే గాక వెనువెంట వారి డెందములుగూడ బందిగొనుచున్నవి. ఇందుకు ప్రాచీన కావ్యములనుండి దృష్టాంతము లెన్నియేనిఁ జూపవచ్చును. 'మాటకుమాటగాఁ గావింపఁబడు ననువాదములు టీకాకల్పములై వ్యుత్పిత్సువుల కుపయోగపడునేమో గాని పద్యము లాలితములై ఝడిత్యర్థ సమర్పకములుగాక రసలోలుపులకు వినుపుకొలుపుచుంట విజ్ఞలోకమునకు విశదము. 'తూ, చ' తప్పకుండ

శ్లోకమునకుఁ బ్రతిపదార్థము చెప్పుటయే యుద్దేశమని, గణయతి పద్యముల మాని యతి ప్రాసముల పీడలేని గద్యమునే యాశ్రయించుట అనుకూలతరము. ఇంతకును అనువాదకుఁడు మూలార్థమును సాక్షాత్కరింపఁజేసికొని రసానుభూతివడసి భాషామర్యాద చెడకుండ దాని దనమాటలలోఁ దాను చెప్పవలయుఁగాని 'ముక్కస్య ముక్కార్థము'గా నేకరువాసికొన్న నది కవనమగునా? సహృదయుల నాకర్షించునా?"

శర్మగారి యాంధ్రీకృతి నా రూపించిన లక్షణములకు నూతన లక్ష్యముగా నున్నది. ఇంతియగాక, మూలమునుండి వీరు కావించిన సంక్షేపవిస్తరములు సమ్మెరపోతరాజుయొక్క రీతినే తలఁపించుచున్నవి. వాని సతిమాత్రముగాఁ జూపుట గ్రంథవిస్తృతికి హేతువుగావున, ఒండు రెండు విశేషములు మాత్ర మిటఁ దడవుచున్నాను. ఏకాదశస్కంధము– భాగవతనందనోద్యానమునందలి పారిజాత పాదపము. ఇట భాగవతము 'పురాణ' కక్ష్యనుదాఁటి "వేదాంతపారీణులే" యనువదింపఁదగిన శాస్త్రగ్రంథమైనది. ఇందు నాలుగధ్యాయములలో నిమి జాయంతేయ సంవాదముఖమున సపరికరము పరమాత్మతత్త్వము రూపింపఁబడియున్నది. అవలి ఉద్ధవగీత యిరువది నాలుగధ్యాయములలో భగవత్తత్త్వ నిరూపణము కావింపఁబడియున్నది. కడపటి రెండధ్యాయములు యదుక్షయము నభివర్ణించుచున్నవి. ఉపక్రమమున ఋషిశాపము, ఉపసంహారమున తత్ఫలము గ్రుచ్చఁబడి యీ గ్రంథము 31 అధ్యాయములుగల స్వతంత్రమైన ప్రత్యేక ప్రబంధముగా నున్నది. కృష్ణోద్ధవ సంవాదము (అదే ఉద్ధవగీత) అద్భుతమైనభాగము. 'భగవద్గీత'తోఁ దులఁదూఁగునది. భగవద్గీత – 700 శ్లోకములుగల గ్రంథమైన, ఉద్ధవగీత – 1073 శ్లోకములు కలది. రెండిటను సంవాదములు పెక్కులు కలవు.

శ్లో॥ విద్యా వినయ సంపన్నే । బ్రాహ్మణే గవి హస్తిని।
శునిచైవ శ్వపాకేచ । పండితా స్సమదర్శినః॥ భగవద్గీత 5-18

శ్లో॥ బ్రాహ్మణే పుల్కసే స్తేనే । బ్రహ్మణ్యేఽర్కే స్ఫులింగకే
అక్రూరే క్రూరకే చైవ । సమదృ క్పండితో మతః॥ భాగవతము 11-19-14

శ్లో॥ యద్యద్విభూతిమ త్సత్త్వం । శ్రీమదూర్జిత మేవవా
తత్త దేవావగచ్ఛ త్వం । మమ తేజోంశసంభవమ్॥ భగవద్గీత 10-41

శ్లో॥ తేజః శ్రీః కీర్తి రైశ్వర్యం । హ్రీ స్త్యాగం సౌభగం భగః।
బలం తితిక్షా విజ్ఞానం । యత్ర యత్ర స మేంశకః॥ భాగవతము 11-16-41

వీనికేమిగాని, భగవద్గీతకును ఉద్ధవగీతకును కొండొక వైలక్షణ్యము కలదు. తొలిది 'లోకా౯ సమాహర్తు మిహ ప్రవృత్తః' అని నిశ్చయించుకొని దానికి 'నిమిత్త మాత్రము'గా నుండుమని 'సవ్యసాచి' సాచివ్యము కోరిన

'కాలా'త్మని యుపదేశము. ఉద్ధవగీత యట్టిది కాదు. భూభారాపనోదనము కొఱకు కౌరవక్షయముకావించి, యదుక్షయమునకు విప్రశాపాపదేశము కల్పించి స్వధామమునకుఁ బ్రస్థితుఁడై యున్న వాసుదేవుని ఫలాననువిద్ధమైన చరమోపదేశము. ఈ రెంటికిని సకామ నిష్కామకర్మలకు ఉన్నంత భేదము కలదు. అర్జునోద్ధవులకును భేదము కలదు. అర్జునుఁడు తాను కోల్పోయిన రాజ్యమును చేఁబట్టుకొనుటకై సంగరమునకుఁ గడంగిన వీరపుంగవుఁడు. అతనికి తత్త్వోపదేశ మానుషంగికము. ఉద్ధవుఁడు కృష్ణనిర్యాణానంతరము, జ్ఞానబోధ మొనర్ప నలంతులులేరని జగద్గురుని చరణములకడ సాక్షాత్తుగా తత్త్వము తెలిసికొనఁగోరిన యేకాంతభక్తుఁడు. ఫల్గునుఁడు కృష్ణునకు బంధువును, బావమఱఁదియునైన, ఉద్ధవుడు యాదవుఁడును, కృష్ణునకు కేవల మాంతరంగికుఁడైనభృత్యుఁడును. 'యచ్చావహాసార్థ మసత్కృతోఽసి – విహారశయ్యాసన భోజనేషు' అని యనుతపింప నక్కఱపడని యలుప్తబోధుఁడు. కృష్ణునిచే ప్రణయసరిణతులు గోపికల కెఱింగింప నియోగింపఁబడుటచేతనే, యీతఁడు ఆతని కెంతప్రీతిపాత్రుఁడో తెల్లమగుచున్నది. ఆగోపసుందరులును ఉద్ధవునిపట్లఁ జూపిన విస్రంభ మపూర్వము. వారు తమప్రియునింగూర్చి యుద్ధవు నడిగిన మాటలు కొన్ని పోతరాజు మాతృక నతిక్రమించి వితతము గావించియున్నాఁడు.

"శా॥ నీతో నర్మగృహాంబులం బలుకునే నే మెల్ల వంశోల్లస
ద్గీత భ్రాంతలమై కళిందతనయా తీరంబునం జేరినం
జేతోజాత సుఖంబులం దనిపి మాచిత్తస్థితుల్ చూడ లీ
లాతంత్రజ్ఞత దాఁచి మెల్లన మదాలాపంబు లాలించుటల్.

క॥ ముచ్చటవేళలఁ జెప్పునె, యచ్చుగ మును నేము నోమునప్పుడు జలముల్
సొచ్చిన, మాచేలంబులు, ప్రుచ్చిలి యిచ్చిన విధంబు మూలం బెల్లన్॥

శా॥ ఏకాంతంబున నీదుసైనొజగి తా నేమేని భాషించుచో
మాకాంతుండు వచించునే రవిసుతా మధ్యప్రదేశంబునన్
రాకాచంద్ర మయూఖముల్ మెఱయఁగా రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్."

జనరాండ్రు తుల్య వయో రూప సంపన్నునొక్కని నిట్లు ప్రశ్నించుటకు ఈ కృష్ణానుచరుని యమాయికవిరాగముపట్ల వారి కెంతవిశ్వాస ముండవలయునో యాలోచింపుఁడు. "భక్త్యా భాగవతం జ్ఞేయం। నవ్యుత్పత్త్యా నటీకయా" అది యట్లుండె, ఈ స్కంధమున ద్రుమిళుఁడు నారాయణఋషి. తపఃప్రభావము విదేహునకు వర్ణించి చెప్పుచోటను (41 పేజీ) అవధూత యదువునకు పింగళా గీతము నుడువుచోటను (75 పేజీ), కృష్ణుఁడు ఉద్ధవునకు వ్యాఖ్యానించు పురూరవోగీతలోను (184 పేజీ), ద్వాదశమున మార్కండేయుని

తపస్సు భగ్నమొనర్ప సునాసీరుఁడు అచ్చరలఁబంపు సందర్భమునను (293 పేజి), విప్రలంభాది శృంగార రసంగముల శర్మగారు తీర్చిన తెఱంగు కరము హృదయంగమముగా నున్నది. అట్లే నిర్వేదప్రధానము లైన కపోతోపాఖ్యానము (67 పేజి), భిక్షుగీత (167 పేజి), సూతుఁడు శౌనకాదులకుఁ దెలుపు మహాపురుష పూజాక్రమము (316 పే) మొదలగు ఘట్టములలోను, ఈయన కలము ప్రాసాదికత్వమునకు కెడగాని పరిపాటితో నడచినది. ఈ నవమస్కంధములు రెండింటిలోను, తక్కిన వానియందుమకంటె పెక్కుశబ్దములు అపూర్వార్థకముగా నిర్వచింపఁబడి యున్నవి. అట్టిచోట్ల నెల్ల శర్మగారు సకలని యవధానముతో మూలమును సరిగా ననువదించియున్నారు. వీరు మూలమును సంక్షేపించిన చోట్లు మృగ్యములు. కాని పెంచినచోట్లనేకములు. అన్నింట వీరిమార్గము ఔచిత్యపూర్వకముగానే యున్నది. విస్తరమునకు వెఱచియు, శర్మగారి కవనము వట్లఁగలగారవముచేత ద్వాదశమునుండి యొక్క ప్రకరణము మాత్రము త్రిచూపుచున్నాను.

### ద్వాదశస్కంధము - ఆఱవయధ్యాయము

1) తక్షకః ప్రహితో విప్రాః క్రుద్ధేన బ్రహ్మసూనునా।
హంతుకామో నృపం గచ్ఛన్ । దదర్శ పథి కాశ్యపమ్॥ 11

2) తం తర్పయిత్వా ద్రవిణై ర్నివర్త్య విషహారిణమ్।
ద్విజరూప ప్రతిచ్ఛన్నః కామరూపో ఽదశన్నృపమ్॥ 12

3) బ్రహ్మభూతస్య రాజర్షే । ర్దేహోఽహి గరళాగ్నినా
బభూవ భస్మసా త్సద్యః । పశ్యతాం సర్వదేహినాం॥ 13

ఈ మూఁడుదళములను మొగ్గను-శర్మగా రెట్లు విరియించిరో పరికింపుఁడు.
ఇందలి జాంగలిక వర్ణనము :— (273 పేజీ)

సీ॥ వెనుక ముంగల బిళ్లలను వాలుఁగా నీరుకావిదోవతి దీర్చి కట్టినాఁడు
బొమలనడుమ గుంకుమ న్సాగంబునఁ దడిబూదిగీఱలుమూఁడు పులిమినాఁడు
బంగరు సరిగంచుఁబట్టు సాలువు చుంగు లుట్టిపడం దలం జుట్టినాఁడు
చెంగావిరంగు తుఱంగలింపంగ నంగీని ముంగోళ్లంటఁ బూనినాఁడు

తాటియాకుల కడితంబుఁ దాల్చినాఁడు
మందుమ్రాఁకులు మిరియాలు మణులు నాది
గాఁగలుగు వెండిబరణిఁ గైఁ గదిపినాఁడు
కశ్యపుండు జాంగలికుండు కాన్సురుండు.

స్వరూపమును మఱుంగుపెట్టి తక్షకుఁడు తన్నుతాఁ బొగడుకొన్న తెలుఁగు:— 274 పేజీ.

ఎవ్వాని క్రోధతామ్రేక్షణంబులకు స
　　హార్యముల్ సురసుర లాడిపోవు
ఎవ్వాని తిరుగుళ్ల కీరేడులోకమ్ము
　　లదరుచుఁ గిరకిర లాడిపోవు
ఎవ్వాని పరుషఫూత్కృతులకు మింటి తా
　　రా కోటి చిటపట రాలిపోవు
ఎవ్వాని గరళవహ్నిజ్వాలకు జగాలు
　　మాఁడును మలమల మాఁడిపోవు

ఎవ్వఁ డింద్రుతోఁ గద్దియ నెక్కు మిత్రుఁ
డెవ్వఁ డీశ్వరుముంజేతి కెక్కు కడియ
మట్టితక్షకుం డేమి? కాటందు లేమి?
ఈవు బ్రతికించు టేమి? యిదెంతవింత!

తక్షకుని కాటు కగ్గమైన వృక్షముపాటు:—(274-5)

సీ॥ ఔర్ధ్వశాఖల నెక్కి యరిగెదమేని నభంబును జేతితోఁ బట్టవచ్చు;
పార్శ్వశాఖలపైనిఁ బయనించెదమేని యష్టదిగ్గజముల నరయవచ్చు;
ఊడలజాడల నూడనిఁబాడిన నతలలోకంబెల్ల వెతకవచ్చు;
సాంధ్యకాలమున నిచ్చట నిల్తుమేని పక్షిజగంబు నెల్ల వీక్షింపవచ్చు;

తే॥ కడవపోఁతలవానలు గలుగుతఱిని
దానిజొంపంబుసొంపును గానవచ్చుఁ
దలిరులం గాయ గసురులం జెలువుమిగులు
నీవనస్పతిఁ జూడుమా! యేమి యగునొ!

మ. అని యాతక్షకుఁ డావనస్పతిని డాయంబోయి గోప్యంబుగా
మునిపంటం దగిలించి యీవలకు రా భూజంబు భగ్గంచు మం
డి నిమేషంబున భస్మరాశి యయి యుండెక్; శంభుకంఠంబుఁ గా
ల్చిన కాకోలము పచ్చివృక్షము నిటుల్ చేయన్విచిత్రంబొకో!

తక్షక కాశ్యపులకు జరిగిన సంభాషణక్రమము :—276 పే.

ఇవన్నియు శర్మగారి సొంతములు. ఇట్టి చమత్కారములు శర్మగారు పెక్కెడల నగపఱిచి యున్నారు. వేయేల? పద్యవిద్యా బ్రహ్మవిద్యలయందుఁ గల్గు వైదగ్ధ్యము గల శ్రీశర్మగారు ఈ స్కంధద్వయిని తెనిఁగించి, బమ్మెర పోతరాజు వీని ననువదింప లేదన్న కొఱఁత తొలఁగించినా రనుట అత్యుక్తి కానేరదు. ఇందుకు నిర్మత్సరము లగు విపశ్చిద్ధృదయములే ప్రమాణము

కాఁగలదు. ఈ పుస్తకము ప్రశస్తముగ దేశవ్యాప్తినొందెనని కృతికర్త్రియశస్సు దశదిశలఁ ప్రసరింపఁజేయుఁగావుత మనియు, ఉపదేశయుక్తములగు నా కయాకృతులు చదివి, విషయ లాలసమై యున్న నేటి లోకము భక్తిజ్ఞాన వైరాగ్యముల బోధించు నీపుణ్యకృతిని పఠించి ధన్యమగుంగావుత మనియు ఆశించుచున్నాను.

నెల్లూరు
14—3—1952

మర్ఘా సుబ్రహ్మణ్యశర్మ

శ్రీ

# ముద్రాపకవంశావళి

తే. నా యనుష్ఠానమైనయ ♦ నంతరంబు
బుజ్జిమని వచ్చి "కా"రింటి ♦ ముందు నిలిచెఁ
"గారు" దిగి వెంటనే శర్మ ♦ గారు. నగవు
మొగముతోడ సౌవస్తికుఁ ♦ డగుచుఁ దక్షిసె 1

తే॥ ఏను స్వాగతికుఁడనై చు ♦ నెదురుపోతి
నంతలోఁ జంద్రమౌళి త ♦ దనుజవరుఁడు
వెంటనే వచ్చి కలిసెను ♦ విరియునవ్వు
తో 'నమస్తే' యటంచుఁ జే ♦ తులు మోడ్చె. 2

తే. అందఱము సుఖాసీనుల ♦ మైతి మనలఁ
గుశలప్రశ్నలఁ దొట్టి పె ♦ క్కు విషయములఁ
గొంతతడవు పుచ్చితి మింత ♦ వ న్మఱచితి
శర్మగారెవ్వరో మీకుఁ ♦ జాటుటకును. 3

కం. పుణ్యుఁడు ముదిగొండాన్వయ
గణ్యుఁడు బ్రహ్మణ్యుఁడు కవి ♦ గాయకనుత కా
రుణ్యుఁడు ధన్యుఁడు సుబ్ర
హ్మణ్యుండు నిజాత్మసంయ ♦ మవరేణ్యుఁ డిలన్ 4

ఆ. ఎడమచేతితోడ ♦ నొడ మెగడించును
వేనవేలు న్యాయ్య ♦ మైన సరణి
ధర్మకార్యములకుఁ ♦ దా నవి వలకేల
వ్యయము సేయు రేఁబ ♦ వల్లితండు. 5

కం. పదిగొండ లోకుఁడైనన్
ముదిగొండకు సాటిరావు ♦ మూఢమతులకున్
గుదిబండ, యెదిరికనులకు
నెదురెండ, శివాశ్రితులకు ♦ నెలదండ సుమీ. 6

తే. అట్టి ముదిగొండ విమలాన్వ ♦ యమున వెలుఁగు
శంకరుని యాదలం జంద్రు ♦ సరణి నిఖిల
నర సదారాధ్యుఁడైన క ♦ న్నయ్య శరభ
సాల్వదేవతానుగ్రహం ♦ చద్యశుండు,

మ. ముఖవస్త్రంబు ధరించియే జపము స♦ల్పంగాక యొక్కొక్క వే
ళ ఖరజ్వాలిక లొండు రెండు నయనా ♦ లానంబునం దోఁచునం
ట ఖలప్రేత పిశాచికాదు లలక♦న్నయ్యాఖ్య విన్పింపఁజాల్
నిఖిలంబుం ద్యజియించి పాఱునఁట న♦ర్ణింపంగ లేమా ప్రథన్. 8

సీ. ‘ఉష్హా’నుచు విభూతి ♦ నొసఁగిన బ్రహ్మరా
క్షస పీడలెల్లఁ దత్ ♦ క్షణమ తొలఁగు
‘క్షూ’యని సాంబ్రాణి ♦ చేయిడునేని మా
రీ స్ఫోటకాదులు ♦ క్రేళ్లువాఱు
‘కన్నయ్య’ యని చెవి ♦ కడఁ బల్కినం గ్రహ
బాధ లా క్షణమునఁ ♦ బాసిపోవు
నట్టి యరిష్టంబు ♦ లేని కన్నయగారి
గాలిసోఁకినమాత్ర ♦ సోలిపోవు

తే. దేశదేశాల వారి ప్ర♦తిష్ఠఁ జూచి
వీరితో వియ్యమందని ♦ వారి దేమి
ఖ్యాతి ? యని హరిఁ గొల్చు సిం♦గమ్మవారు
తలఁచి మల్లాయపాలె మెం♦తయును పొంగ. 9

ఉ. కన్నయగారి పుత్త్రితిల ♦ కమ్మయిమించిన కోటిలింగమున్
సన్నుత సద్గుణాఢ్యునకు ♦ సర్వ విభూషణఁజేసి సీతమన్
కన్నియనిచ్చి పెండిలి యొ♦నర్చిరి వేడుకతోడఁ గుచ్చెలన్
బొన్నరి పొన్న పండు పొల♦ముం జతసేసి బళీ ! యనన్ జనుల్ 10

తే. ప్రాణలింగార్చనారత ♦ స్వాంతుఁడైన
కోటిలింగము మదికి నె♦క్కనటు లమ్మ
హాత్మ్యరాలు చరించె సీ♦తమ్మగారి
వంటి సాధ్వి లేదని యెల్ల ♦ వారు పొగడ. 11

ఉ. జ్ఞాతియొకండు కన్న బుధ ♦ నందను డగ్గఱి కోటిలింగ ! నీ
‘సీతమ’ పేరు మార్పుమని ♦ చెప్పఁగ నాతఁడు కిన్కవచ్చియుం
జాతురిమీఱ నవ్వి శివ ♦ సర్వగ సర్వపదార్థముల్ శివా
మాత నె చెప్పు నీ తెలివి♦మాలినమాటలు చాలుఁ బొమ్మనన్. 12

వ. అట్టి యనుకూల దంపతుల పంట నాగలింగారాధ్యులవారు. 13

కం. భారద్వాజసగోత్రుం
డారాధ్య బ్రాహ్మణుండు ♦ హరదేవ పదాం

భోరుహా యుగళభజనకే
ధీరతచిత్తుండు నాగ ♦ లింగబుధుండున్. 14

కం. హితుఁడు శివభక్తులకు స
ర్హితుఁడాగమ వేత్తలకుఁ గ♦రేధృత శివ సం
హితుఁడు త్రిమలస్ఫురణవిర
హితుఁడుసుమీ నాగలింగ ♦ పృథ్వీసురుఁడున్. 15

మ. తినఁబెట్టంగలదాట నొందుపని కే♦ తేరండు రుద్రాక్ష మా
ల నితాంతం బురియాడుచుండు మునిప్రే♦ళ్లన్, భూతిలిప్తాంగుఁడౌ
చును షట్కాల కృతేష్ట లింగవరి ష♦స్యుండై విరాజిల్లునే
చనినష్టెల్లను నాగలింగ బుధుఁ డీ♦శధ్యానమందుండెడిన్. 16

తే. నాగలింగముగారి పు♦ణ్యములగొంతి
వినుతశీల పతివ్రత ♦ ప్రియకళత్ర
మంబమాంబ, గుణకదంబ ♦ యంబికాప
దాంబురుహలగ్నహృదయరో♦లంబడింభ. 17

కం. పతికెన్నఁడుఁ బ్రతిసెప్పెనె ?
యతిథి ననతివిధియజింప ♦ కతిధృతిఁగనెనే ?
మతిని సుతవితతిగతి స
మ్మతి నితరులఁగనక యంబ ♦ మ ఘ్రణంబున్నే ? 18

కం. ఈ సుకృతుల జ్యేష్ఠసుతుం
డే సుబ్రహ్మణ్యశర్మ ♦ యింకొక సుతుఁ డా
నాసత్యసముఁ డనంగనె
వాసిం గోటేశ్వరుండు ♦ వైద్యములోనన్. 19

తే. సాంబశివరావు మూఁడవ ♦ సత్సుతుండు
నాగలింగముగారికి ♦ నందనలును
నైదుగురు పుట్టి రందు సీ♦తమ్మగారు
పెద్దది గొనంబులంగూడఁ ♦ బెద్దయదియు. 20

తే. రెండవసుత పున్నమ యీమె ♦ రెండువంశ
ములఁ బునీతముసేసిన ♦ పుణ్యసాధ్వి
మూఁడవకొమాంగి సౌశీల్య ♦ మునకుఁ బుట్టు
నెలవు సత్యావ్రతవ్రణ మా♦ణిక్యమాంబ, 21

తే. నాల్గవకొమార్త యీశ్వరి ♦ న్నమ్మికొలుచు
నట్టిగుణవతి మాహేశ్వ ♦ రమ్మగారు
ఐదవతనూజ యనసూయ ♦ సార్థకాఖ్య
భూతదయతోడ నీమె దో♦బూచులాడు. 22

వ. అంబమాంబా నాగలింగారాధ్యులవారి జ్యేష్ఠసుతుండగు-సుబ్రహ్మణ్యశర్మ
గారు 23

ఉ. పిన్నతనంబు వోవఁగనె ♦ పెన్ననువచ్చి గవర్నమెంటులోఁ-
గ్రన్ననఁజేరి యొక్క యధి♦కార పదంబునఁ గొంతకాల మే
గన్నిజమైన స్వేచ్ఛ సరి♦కట్టు నిసీ! యిదియంచు దానిఁ గా
ల్దన్ని స్వతంత్రుఁడై నెగడె ♦ దాస్యము నుత్తము లిచ్చగింతురే? 24

తే. అవల వావిళ్లవారు పూ♦ర్వాంధ్రకవుల
పాత్త్రములతో సరస్వతీ♦పూజసేయు
చొక్కమార్గంబునఁ జరించు♦చుండఁ జూచి
తాను నొకమార్గమున నేగఁ దలఁపు ♦ వొడమ. 25

తే. 'ఓరియంట్' పబ్లిషింగను ♦ నొక్కపెద్ద
కంపెనిం బెట్టి యాధుని♦క ప్రసిద్ధ
బుధులచే వివిధగ్రంథ♦ముల రచింపఁ
జేసి భారతీసేవఁ దాఁ ♦ జేయఁదొడఁగె. 26

సీ. వ్రాయుమనుచుఁజెప్పి ♦ వ్రాసినపిదప గ్రం
థము నాకువలదంచుఁ ♦ దంటపెట్టఁ
డచ్చైనపిదప నీ ♦ యర్థమిత్తునని యం
తట దాని "నప్రూవు" ♦ దాఁక నెట్టఁ
డదిర్ఘైన నేబడి ♦ యందు నీ పాత్త మి
డఁగ లేదు నాకు దం ♦ డుగనికసరఁ
డనుకొన్న డబ్బిక ♦ యటుత్రిప్పి యిటుత్రిప్పి
యేకొంతయో చెప్పి ♦ యిట్టెరాల్పఁ

ఆ. డాడుమాటయొకటె ♦ యది చెల్లవలయును
గాననేకదయ్యె ♦ గౌరవంబు
వచ్చె "నోరియంటు" ♦ పబ్లిషింగ్ కంపెనీ
ఫారి కొరులకుఁ దల ♦ మీఱినంత. 27

ఆ. అన్నపూర్ణ శాస్త్రి ♦ యర్ధాంగలక్ష్మి య
దృష్టమెల్ల నీమె ♦ దే నిజంబ
ఆమె కాలుపెట్టి ♦ నదిమొదల్ కలిసి వ
చ్చెడిని బట్టినది ప♦సిండియగుచు. 28

సీ. అమితభక్తిశ్రద్ధ ♦ లలరాయుచుండ గా
రీ మహాదేవి న♦ర్చించుచుండు.
శ్వశురజనమ్ము భా♦వమెఱింగి వారి యి
ష్టప్రకారంబున ♦ సంచరించుఁ
అతిథ్యాగతులం జెప్ప ♦ నంతితోడ గ్రహాయించి
తలలోని నాల్కయై ♦ మెలఁగుచుండుఁ
చుట్టపక్కములకు ♦ సురభియై యేనాఁట
పుట్టకుండంగని ♦ పెట్టుచుండు

తే. ఎపుడు పదిమంది వచ్చి పో ♦ యెడిగృహంబు
లోప మెవ్వరి కేది క♦ల్గునో యటంచుఁ
గంటపై ఱెప్పకాసినట్టుగ ♦ ఘనవితీర్ణ
సన్నపూర్ణ సుబ్రహ్మణ్య ♦ సన్నపూర్ణ. 29

తే. అంబమయుఁ గమలమ్మ కా ♦ త్యాయనమ్మ
ముగురు పుత్రిక ల్వారికిఁ ♦ బుట్టినారు
పోలికలు తండ్రివి సుగుణ ♦ మ్ములు జననివి
కారణగుణమ్ము లుండవే ♦ కార్యమందు. 30

ఉ. పట్టపరీక్షలో గెలిచి ♦ పట్టును వీడక గానశాస్త్రపుం
గుట్టునెఱింగ గాల్గఁగఁ ♦ గోవిదులుం దలలూఁపఁ బోఁకు బల్కఁగాఁ
దిట్టసి గాయనాంఘ్రియని కు♦లప్రభవున్ 'శివరావుఁ' జేర్చుఁ జే
పట్టి తదంబ మాసతి త్రి♦వర్గము కొల్లగొనంగ నాడంగడిన్. 31

చం. తనువు వెలింగె నింటివిలు ♦ దాలుపుఁగోఁడు, గృహంబు పంచలో
నొనరిన 'కుర్చి'యందలము ♦ చుండెడి నసంతుఁడు గాఁడు, చెంత రం
భ నిలువ దర్శనాథుని కు♦మారుఁడుగాఁ, డెవరీతఁ డన్న నా
కన్నుఁ గట శాస్త్రిగారి పెద♦యల్లుఁడు యూ 'శివరావుగా'రనెన్. 32

కం. ఆ మన్ననయా వినయం
బా మంచితనంబు మెచ్చ ♦ టఁ జూడఁగ నా
మామా యల్లురకే తగు
నేమిసుకృత మొకొ్కో చేసి ♦ రిరువురు తొలుతన్

శుని కృపయే లేకుండిన
మన మేపని చేయలేని ♦ మాట నిజంబే. 42

సీ. ఆశుధారావధా ♦ నామేయశక్తి వి
ద్వత్సభలందు వె♦ల్వాఱుచుంట
హిందుకాలేజి హా♦యిస్కూలులోఁ బ్రధా
నాంధ్ర పండితుఁడవై ♦ యలరుచుంట
'ఉభయభాషా ప్రవీ'♦ణోజ్జ్వల బిరుదమ్ము
విశ్వవిద్యాలయా ♦ భిజ్ఞులిడుట
యతులు కళ్యాణపూ ♦ర్ణానంద భారతీ
స్వాములు జ్ఞానభి♦క్షమ్మొసఁగుట.

తే. ఒసఁగుటయె కాక యాశీస్సు ♦ లెసఁగ నిండు
సభను 'వేదాంతపారీణ' ♦ సద్బిరుదము
నిచ్చుటయు సన్నియును నీశ్వ♦రేచ్ఛ లేక
జరుగఁబోవునె గురునాథ ♦ శర్మగారు. 43

తే. అనుడు నిట్లంటి గ్రంథ స♦మాప్తియయ్యె
జరిగిపోవుచున్నవి దిన ♦ సమ్ములాత్మ
హితులు నీ వేరినే నాశ్ర♦యింప వింటఁ
గూర్చుమన్న గ్రంథం బచ్చు♦గూర్చు టెట్లు? 44

తే. ఎపుడు విద్వత్పరీక్షల ♦ కేగువారి
కేని చెప్పుచుఁ దీక్షక ♦ యొల్లఁ బుత్త్ర
వచ్చునే ప్రయత్నింప వి♦జ్ఞులను నీదు
భాగవతము నీ యింటి లో♦పలనె యుండు. 45

కం. అనసాగి గౌప్యముగ నా
దును ప్రార్థించి వినినట్టి ♦ దాని ప్రకటనముం
బొనరించు కొనఁడె? యీశుఁడె
మొనకొనకున్న మనయత్న ♦ ములు సాఁగునొకో. 46

కం. 'దేహి'యని పరుల వేఁడుట
కీహ జనింపని నియోగి ♦ పృథివీసురుఁడన్
సాహాయ్య మొనర్తుమనిన
నోహటిలము గైకొనెదము ♦ తోడ్పులవలనన్. 47

కం. అని కాలము పుచ్చుచు నుం
టిని నాల్గేండ్లిప్పటికి న♦డిచె దేవుం డె
వ్వని మదిలోఁ జొఱఁబడి దీ
నిని బ్రకటింపించునో య♦ని ప్రతీక్షింతున్. 48

కం. ఒక్కటె నమ్మక మనఘా!
చిక్కుల వెన్నిగలిగినను ♦ జెందుచు రచనా
ఫక్కిని సాగించెఁ గనుకఁ
దక్కక యాతండె యచ్చుఁ ♦ దళ్కొత్తించున్. 49

ఉ. నానుడు లాలకించి సుగు♦ణ ప్రసన్నుండల శర్మగారు స
వ్యానన సీమఁ దోఁపఁ గృతి♦నందిన ముద్రణమున్ బొనర్చినన్
గానఁగరాదు భేదము యు♦గంబును జేరకపోవు సప్త సం
తానములందుఁ గీర్తి సుకృ♦తంబులె కా ఫలమీద్వయంబునన్. 50

తే. కాన హరిహరాంకితమై క♦ళానిధాన
మై పవిత్రమై పూజ్యమై ♦ పాపనాశ
కం బయిన మీ రచించు భా♦గవత మేను
ముద్రిత మొనర్చి యిత్తును ♦ బో-కవీంద్ర! 51

కం. అని పల్కంగ హతాత్సం
జనితానందాతి మాత్ర సమ్మర్ద భరం
బును మోయలేని చిత్తం
బు నెట్టకే నిలిపి యశ్రు ♦ పూర్ణాక్షుఁడనై. 52

కం. ఒక్కింత తడవునకు మదిఁ
జిక్కఁగఁ బట్టుకొని యరరె ♦ శ్రీధరుమదిలో
నెక్కినవాఁడవు నీవా?
దక్కెను బో యిహపరాలు ♦ తప్పక నీకున్. 53

తే. ప్రీతిఁ గర్ణాభరణములు ♦ రెండు భాగ
ములు, సమస్తాంధ్రదేశ వి♦జ్ఞుల గృహాల
నెగడుచున్న వ్యాకరణ చం♦ద్రిక మృగేంద్ర
వాహనయు నచ్చువేయింప♦వా? బుధేంద్ర! 54

కం. అవి యన్ని యొక్కయెత్తీ
ప్రవిమల పుస్తక మొకెత్తు ♦ భళి! భళి! నీ భా
గ్య విశేషమెట్టిదో యా
రవిచంద్రము నీదు పేరు ♦ రాజిలుఁ జుమ్మీ. 55

కం. ఉన్నారు లోభు లతి సం
పన్నులు లక్షలను ముష్టిఁ♦బట్టినవా రా
యన్నలఁ గని ధర యేడ్చుచు
నున్నదయా మోయలేక ♦ యుద్ధుగుణుచుచున్. 56

ఆ. కంపెనీలు పెట్టఁ♦గా నేమి? కాలు సే
తులను బట్టి ధనము ♦ దోఁపనేమి?
పుణ్యమా? మఱింత ♦ పురుషార్థమా? యయో!
దానధర్మములను ♦ దడవ రేని 57

ఆ. బళిరె! 'ఓరియంటు ♦ పబ్లిషింగ్ కంపెనిఁ
బెట్టి న్యాయ్యముగను ♦ విత్తమంది
దానధర్మముల స♦దా గుల్కు నీకు నూ
ఱేండ్ల నాయువీశుఁ ♦ డిచ్చుఁగాక. 58

కం. నీయంతట నీవే వి
చ్చేయుదె? నా యింటికిఁగృతిఁ ♦ జెలువుగ నచ్చున్
వేయింతు నందువే? యా
రా! యీశ్వరు కరుణయున్న ♦ యది యిరుగడలన్. 59

ఆ. తృణమొ? కణమొ? యీవి ♦ దెసల డబ్బ్రమోఁత
నేటిదాతల పరి ♦ పాటియిద్ది
మీరొ? యిట్టిచెయువు ♦ మేకొన రతిగుప్త
దానమునె యొనర్చె ♦ దరు సతమ్ము. 60

ఆ. మోము సూచి పనుల♦లో మెలఁగింతువు
పొట్టసూచి తనివి ♦ పుట్ట నిడెదు
కంపెనీల నడపఁ♦గా మాటలా? యెంత
త్యాగ మోర్పు నేర్పు ♦ తనరవలయు? 61

మ. "ఇది పాఠ్యంబుగఁ బెట్టరెవ్వరు ధనం♦బే తేరదిద్దానిచేఁ
బదులా? వందల? వేలగున్ వ్యయము స♦ర్వగ్రంథ ముద్రార్థ" మం
చెదొ? నేఁబల్కఁగ నవ్వుచున్ సరెసరే ♦ యెల్లప్పు డర్థాశయే
మదిఁ బుణ్యాశయు నుండఁగావలదె? యన్♦మాశర్మ సగ్గింపరే. 62

ఆ. అడవిపువ్వులనెడు ♦ ననుపమకావ్యంబు
విశ్వదాత యచ్చు ♦ వేసియిచ్చె

తండ్రిగారి కంకి♦తం బిడి సవిమర్శ
రామదాసు నేనె♦యోముకొంటి. 63

కం. భాగవతము వ్రాయించి కృ
పా గరిమఁ గా స్వామి భాగ♦వత మహిమయు నా
చేఁ గావ్యము వ్రాయించెను
జాఁగురె! నాజన్మమెల్ల ♦ సఫలంబయ్యెఁ. 64

వ. మఱియు శతకనాటకాదులు ముద్రితాముద్రితములు మద్రచనలు కొన్ని గలవు. వానికేమి? భాగవతముపై మీ దృష్టి ప్రసరించినది. భగవంతుఁడు మీ కీబుద్ధి పుట్టించినందుల కుభయులముకృతార్థులము. 65

తే. శ్రీమహాభాగవత మాత్త♦రేయునుడివె
భారతము జనమేజయుం ♦ బలికె వాని
కొడుకు పేరేదియో యెఱుం♦గుదు రటయ్య
క్షితిని బేరు నిల్పునది యీ♦కృతియె కృతియె. 66

కం. రవివెలిఁగెడినఱకును భా
గవతము వెలుఁగొందు నంత ♦ కాలము మీ పే
రు వెలుంగుచుండు మఱి మ
ర్త్యవరున కాకాంక్ష్య మింత ♦ కన్నను గలదే? 67

కం. అనవద్య చరిత్రులయిన
ఘన సుబ్రహ్మణ్య శర్మ ♦ గారి కొక కుమా
రు నొసంగు చిరాయుష్మా
ద్యనన్యభోగములతోడ ♦ హరిహరనాథా! 68

వ. అని శ్రీముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారికి వంశాభివృద్ధియు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియు నాకాంక్షించి హరిహరు ధ్యానించితి. ఇంక నేఁ జెప్పవలసినది లేదు. 69

తే. ఉత్తమోత్తముఁడగు శర్మ ♦ యుత్తమర్ణుఁ
డయ్యె జనులార! నాఋణం ♦ బణఁగె వంద
నంబుతో, మీ ఋణంబు గ్రం♦థంబుఁ జదివి
తీర్చికొనరయ్య మఱియొండు ♦ తెరువు లేదు. 70

ఇతి శ్రీ.

—గ్రంథకర్త

# విషయసూచిక


| | పేజీ |
|---|---|
| వంశావళి | 5 |
| శివరామయ్య కాశీలింగముం దెచ్చుట | 6 |
| మాతంగిం ద్రోలుట | 8 |
| ...... బావిఁ ద్రవ్వించుట | 8 |
| యంగమ్మ సహగమనముచేయుట | 9 |
| బుచ్చిరాజు పిండాదులఁ దఱుముట | 9 |
| ...... రాజసమ్మానము వడయుట | 10 |
| ఏకాదశస్కంధము ప్రథమాధ్యాయము | |
| శ్రీకృష్ణుఁడు భూభారమడంచుట | 19 |
| శ్రీశుకుఁడు పరీక్షిన్మహారాజునకు యాదవశాపము చెప్పుట | 21 |
| యాదవు లుగ్రసేనునకు ముసలవృత్తాంతము చెప్పుట | 22 |
| ద్వితీయాధ్యాయము | 24 |
| నారదుండు వసుదేవునిచే సన్నుతింపఁబడుట | 24 |
| నారదుండు వసుదేవునకు విదేహర్షభసంవాదము నుడువుట | 25 |
| నిమికిఁ గవి భాగవతధర్మలక్షణాదులు చెప్పుట | 27 |
| నిమికి హరి భక్తధర్మాదులం జెప్పుట | 28 |
| తృతీయాధ్యాయము | 30 |
| నిమికి నంతరిక్షుఁడు మాయాకార్యము నుడువుట | 30 |
| నిమికి నంతరిక్షుఁడు సృష్టిలయప్రకారములు నుడువుట | 31 |
| నిమికిఁ బ్రబుద్ధుండు వైరాగ్య ముపదేశించుట | 33 |
| ...... ప్రబుద్ధుఁడు మాయాతరణోపాయము నుడువుట | 34 |
| ...... పిప్పలాయనుఁడు బ్రహ్మతత్త్వము నిరూపించుట | 36 |
| .... .. ఆవిర్హోత్రుఁడు కర్మయోగము నుడువుట | 37 |
| ........ఆవిర్హోత్రుఁడు ప్రతిమార్చన నుడువుట | 38 |
| చతుర్థాధ్యాయము | 40 |
| నిమికి ద్రుమిళుండు భగవదవతారముల నుడువుట | 40 |
| ........నారాయణఋషితపఃప్రభావము చెప్పుట | 41 |
| ద్రుమిళుఁడు హంసాద్యవతారముల వర్ణించుట | 46 |
| పంచమాధ్యాయము | 48 |
| నిమికిఁ జమసుఁడు భక్తిహీనులగు కర్మపరులగతిం జెప్పుట | 48 |
| కరభాజనుండు చతుర్యుగ హరిపూజాదిక మెఱిఁగించుట | 51 |
| నారదుండు వసుదేవదంపతుల నగ్గించుట | 54 |
| షష్ఠాధ్యాయము | 55 |
| బ్రహ్మాదులు ద్వారకకువచ్చి కృష్ణుని స్తుతించుట | 55 |
| బ్రహ్మ శ్రీకృష్ణుని వైకుంఠమునకు విచ్చేయఁగోరుట | 59 |
| శ్రీకృష్ణుండు యాదవులతోఁ బ్రభాసమున కేగుదమనుట | 60 |
| ఉద్ధవుఁడు కృష్ణుండాసి ప్రార్థించుట | 60 |
| సప్తమాధ్యాయము | 61 |
| శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ దత్త్వోపదేశము చేయుట | 61 |

| | |
|---|---|
| అవధూతయదు సంవాదము | 64 |
| అవధూత తన యిర్వదినల్గురు గురువులఁ బేర్కొనుట | 65 |
| అవధూత యదువునకుఁ గపోతకథ నుడువుట | 67 |
| అష్టమాధ్యాయము | 72 |
| అవధూత యదువుతో నజగరాదిగురులంగూర్చి చెప్పుట | 72 |
| పింగళాగీతము | 75 |
| నవమాధ్యాయము | 81 |
| అవధూత యదువునకుఁ గురరార్భకశిక్షిత మెఱిఁగించుట | 81 |
| అవధూత కన్యకాశిక్షిత మెఱిఁగించుట | 82 |
| అవధూత శరకార సర్పశిక్షితముల నుడువుట | 83 |
| ఊర్ణనాభిశిక్షితము | 84 |
| సుపేశహాశిక్షితము | 85 |
| దశమాధ్యాయము | 86 |
| శ్రీకృష్ణుఁ డుద్ధవునికి నాత్మప్రాప్తిసాధనములఁ జెప్పుట | 86 |
| శ్రీకృష్ణుఁడు ప్రవృత్తిమార్గఖండనము గఱపుట | 88 |
| ఏకాదశాధ్యాయము | 92 |
| శ్రీకృష్ణుం డుద్ధవునకు బద్ధముక్తలక్షణము నెఱిఁగించుట | 92 |
| శ్రీకృష్ణుం డుద్ధవునకు సాధులక్షణము నెఱిఁగించుట | 95 |
| భక్తిలక్షణములు | 98 |
| ద్వాదశాధ్యాయము | 98 |
| శ్రీకృష్ణుం డుద్ధవునకు సాధుసంగమహిమము నుడువుట | 98 |
| కర్మత్యాగవ్యవస్థ | 99 |
| వాగాద్యభివ్యక్తిక్రమము | 100 |
| త్రయోదశాధ్యాయము | 101 |
| శ్రీకృష్ణుం డుద్ధవునికి జ్ఞానోదయక్రమ మెఱిఁగించుట | 102 |
| హంససనకాది సంవాదము | 103 |
| నాగబంధము | 104 |
| చతుర్దశాధ్యాయము | 107 |
| శ్రీకృష్ణుఁ డుద్ధవునకు శాస్త్రవైవిధ్యముంగూర్చి చెప్పుట | 108 |
| ... ... భక్తియోగప్రాధాన్యము నుగ్గడించుట | 109 |
| ధ్యానయోగాభ్యాసక్రమము | 110 |
| పంచదశాధ్యాయము | 112 |
| శ్రీకృష్ణుఁ డుద్ధవునకు ధారణానుగతసిద్ధులం జెప్పుట | 113 |
| షోడశాధ్యాయము | 117 |
| శ్రీకృష్ణుఁ డుద్ధవున కాత్మవిభూతుల నెఱిఁగించుట | 117 |
| సప్తదశాధ్యాయము | 121 |
| శ్రీకృష్ణుఁ డుద్ధవునకు వర్ణాశ్రమధర్మాదులు నుడువుట | 122 |
| ...... బ్రహ్మచారిధర్మము లుపదేశించుట | 124 |
| ......చాతుర్వర్ణ్యధర్మముల నుపదేశించుట | 126 |
| అష్టాదశాధ్యాయము | 129 |
| శ్రీకృష్ణుఁ డుద్ధవునకు వానప్రస్థధర్మముల నుడువుట | 129 |

...... సన్న్యాసిధర్మములు నుడువుట ..130
ఏకోనవింశాధ్యాయము 135
శ్రీకృష్ణుండు జ్ఞానవిజ్ఞానములంగూర్చి బోధించుట 135
......యమనియమాదిలక్షణముల నిరూపించుట 139
వింశాధ్యాయము 142
శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ గర్మయోగము నుపదేశించుట 142
......జ్ఞానయోగము నుపదేశించుట 143
......భక్తియోగము నుపదేశించుట 145
ఏకవింశాధ్యాయము 146
శ్రీకృష్ణుం డుద్ధవునకు ద్రవ్యాదిగుణదోషముల వివరించుట 146
కర్మనిరాసము 149
శబ్దబ్రహ్మనిరూపణము 151
ద్వావింశాధ్యాయము 153
శ్రీకృష్ణుం డుద్ధవప్రశ్నంబు విని తత్వసంఖ్యానిర్ణయమొనర్చుట 153
శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ బ్రకృతిపురుషవివేకము కల్గించుట 157
శ్రీకృష్ణుండు నిత్యునకు జననమరణాదు లెట్లో చెప్పుట 158
త్రయోవింశాధ్యాయము 163
అవంతిభూసురు లుబ్ధత 163
బ్రాహ్మణుఁడు ధననాశమునకు దుఃఖించుట 164
నిర్వేదోదయము 166
భిక్షుకుఁడు పరపీడ సహించుట 167
భిక్షుగీత 169
చతుర్వింశాధ్యాయము 173
శ్రీకృష్ణుం డుద్ధవునకు సాంఖ్య ముపదేశించుట 173
లయప్రకారము 176
పంచవింశాధ్యాయము 178
శ్రీకృష్ణుం డుద్ధవునకు గుణవృత్తుల బోధించుట 178
షడ్వింశాధ్యాయము 183
శ్రీకృష్ణుం డుద్ధవునికిఁ బురూరవోగాథ నుడువుట 184
సప్తవింశాధ్యాయము 191
శ్రీకృష్ణుం డుద్ధవునికి భగవదారాధనక్రమ మెఱిఁగించుట 191
అష్టావింశాధ్యాయము 199
శ్రీకృష్ణుం డుద్ధవునకు జ్ఞానయోగ ముపదేశించుట 199
ఏకోనత్రింశాధ్యాయము 207
శ్రీకృష్ణుం డుద్ధవునకు మరల భక్తియోగము సంగ్రహముగా నుడువుట 209
ఉద్ధవుఁడు శ్రీకృష్ణుని వీడ్కొనిచనుట 211
త్రింశాధ్యాయము 216
శ్రీకృష్ణుండు యాదవులఁ బ్రభాసతీర్థమున కరుగుమనుట 216
యాదవులు సురాపానముచేసి కలహించి మడియుట 217
రామకృష్ణుల యంత్యదశ 222
వ్యాధుఁడు కృష్ణుని ప్రార్థించుట 222
దారుకుండు శ్రీకృష్ణదర్శనార్థ మరుదెంచుట 225

ఏకత్రింశాధ్యాయము 227
కృష్ణావతార సమాప్తి 227
దారుకుండు యాదవులచేటు వసుదేవాదులకుం జెప్పుట 229
దేవకీమరణము 230
వసుదేవుమరణము 231
రోహిణీమరణము 232
రేవతీరుక్మిణ్యాదులమృతి 233
అర్జునవిలాపము 234
సూర్యోదయము 235
వజ్రాభిషేకము 237
ద్వాదశస్కంధము
ప్రథమాధ్యాయము 240
శ్రీశుకయోగి పరీక్షిత్తునకు మాగధాదికలియుగరాజులం జెప్పుట 240
ద్వితీయాధ్యాయము 245
శ్రీశుకయోగి కలియుగధర్మముల నుడువుట 245
కల్క్యవతారము 247
యుగప్రమాణములు 250
తృతీయాధ్యాయము 252
శ్రీశుకుండు భూమిగీత నుపదేశించుట 252
యుగధర్మనిర్వచనము 254
కలియుగమందలి ప్రజలస్థితిగతులు 256
చతుర్థాధ్యాయము 259
దైనందినకల్పములు 259
నైమిత్తికప్రలయము 260
ప్రాకృతికప్రలయము 260
ఆత్యంతికప్రలయము 266
నిత్యప్రలయము 268
పంచమాధ్యాయము 269
శ్రీశుకులు పరీక్షిత్తునకు బ్రహ్మోపదేశ మొనర్చుట 270
షష్ఠాధ్యాయము 272
శ్రీశుకులవారి యనుజ్ఞగొని పరీక్షిత్తు సమాధిస్థుఁడగుట 272
తక్షకుఁడు కశ్యపుమరలించి నృపుం గఱచిచనుట 273
జనమేజయుఁడు సర్పయాగము సలుపుట 277
బృహస్పతి సర్పయాగము మాన్పుట 278
శ్రీసూతుఁడు శౌనకాదులకు వేదవిభాగక్రమము చెప్పుట 282
తైత్తిరీయ శాఖోత్పత్తిక్రమము 284
సప్తమాధ్యాయము 288
సూతుండు శౌనకాదుల కథర్వవిభాగక్రమము నుడువుట 288
పురాణవ్యాప్తి 288
సూతుండు శౌనకాదులకుఁ బురాణలక్షణము వివరించుట 289

అష్టమాధ్యాయము 291

మార్కండేయ మహామునిచరిత్ర 292

దేవతలు మార్కండేయు తపమునకు విఘ్నముచేయఁబూనుట 293

మార్కండేయునకు నరనారాయణులు ప్రత్యక్షమగుట 299

మార్కండేయుఁడు నరనారాయణుల స్తుతించుట 300

నవమాధ్యాయము 302

శ్రీమన్నారాయణుఁడు మార్కండేయునకు వరమిచ్చుట 302

మార్కండుఁడు మాయావిభూతి ననుభవించుట 303

వటపత్రశాయి సందర్శనము 306

దశమాధ్యాయము 309

పార్వతీపరమేశ్వరులు మార్కండేయునకుఁ బ్రత్యక్షమగుట 310

ఏకాదశాధ్యాయము 316

సూతుండు మహాపురుషపూజాక్రమ మెఱిఁగించుట 316

సూతుండు శౌనకాదులకు ద్వాదశాదిత్యవ్యూహము నుడువుట 320

ద్వాదశాధ్యాయము 324

ఏతత్పురాణోక్తవిషయసంగ్రహము 324

ఫలము 328

త్రయోదశాధ్యాయము 331

షోడశదశపరిమాణము 332

అష్టాదశపురాణగ్రంథసంఖ్య 333

భాగవతవిషయప్రయోజనములు 333

గ్రంథమహిమము 334

శ్రీరస్తు - శుభమస్తు - అవిఘ్నమస్తు

# శ్రీమద్గురు భాగవతము

## ఏకాదశస్కంధము

### స్తోత్ర ప్రారంభము

కం. శ్రీశర్వాణి సదాశివు, శ్రీ శారదపేఁమగర్భు ♦ శ్రీ మల్లక్ష్మిన్
గేశవుని భక్తిభావము, చే శుభసంప్రాప్తికై భ ♦ జింతు నెడందన్. 1

కం. అమృతమ్మక్షర మజర, మ్మమేయ మద్వంద్వ మసమ ♦ మఖిలగతమ్మా
గమమూలమస్మదారం, భ మవిఘ్నంబుగ నొసర్పఁ ♦ బ్రార్థింతుమదిన్. 2

చం. తలనొక తుమ్మిపూవిడిన ♦ ద్వారముకాచు సమాయికుం, డెదో
యలుపము చేయవచ్చిన దు ♦ రాత్మునికిన్వరమిచ్చు పిచ్చివాఁ
డలిగి పెనంగియోడిన ని ♦ జాహితుమేనవహించి త్రిప్పు తం
డ్రి లలితమూర్తి శంకరుఁడు ♦ ప్రేముడి నా కయిమోడ్పు లందుతన్. 3

చం. హరునకు నర్ధదేహమిడి ♦ యాదటఁజూపి, వినాయకున్మనో
హరసుఖమించు స్తన్యమిడి ♦ యక్కునఁజేరిచి, భృంగిముఖ్య స
త్పరిజనమున్ సమాదరణ ♦ వైఖరి నేలుచు వెండికొండ మం
దిరమునఁ గాఁపుర మ్మనుమ ♦ తించిన యీశ్వరి మమ్ము నేలుతన్. 4

చం. శిరమున నెమ్మిపించియము ♦ చెన్నసలారఁ, గటీతటిన్మనో
హరకనకాంబరంబలర ♦ నక్షుల దివ్యకృపాకటాక్షముల్
వరలఁగ, వేణునాదమున ♦ భారతభూమిఁగరంచు గోపికా
భరణుఁడు బాలకృష్ణుఁడు శు ♦ భంబులొసంగుత మాకునిచ్చలున్. 5

చం. తరిమల గిర్గిరందిరుగఁ ♦ దద్భ్రమదగ్ర నిఘృష్టిఁ బృష్ఠపుం
దురద యడంగి కూర్కునెకఁ ♦ దోఁచినవేసఁ గలంగి మున్ సరి
ద్వరుఁ డివుడుం దదీయమగు ♦ వాసన శాంతి యెఱుంగ కెప్పుడుం
దిరుగుడు పట్టు నా కమఠ ♦ దేవుని యూర్పులు మమ్ముఁ బ్రోచుతన్. 6

కం. మామాతృ పక్షదేవుఁడు, శ్రీమద్విష్ణువును, మత్పి ♦ తృ స్వామి శివా
భామాపతి, నాహరిహరుఁ, డోముత మద్వాంఛితార్థ ♦ మొసఁగూర్చెదయన్.

కం. పాణి కిసలముల మోడ్తును, వాణికిఁ బరమప్రసాద ♦ పరిపాలిత గీ
ర్వాణికి శ్వేతగరుత్థం, ఖాణికి గణనీయనిత్య ♦ కల్యాణికిసిన్. 8

కం. ఏడాది యీడులోనఁ బ, దాడంబరమొసఁగి, ననుఁబ ♦ దాఱవయేటం
జూడ విబుధు లవధాన, క్రీడలఁ దేల్చితివి వాణి ! ♦ కేల్గవమోడ్తున్. 9

కం. నా యకలంకవృత్తి వి నాయకటా! యేమొసంగి♦నన్ గృపయొసవున్
నాయకమణివి ప్రపన్నుల వి, నాయక! విఘ్నౌఘఫణి వి♦నాయక! జోతల్.

*కం. వ్యాసున్ శ్రుత్యధ్యాపను, భాసున్ ద్రయ్యంతతత్త్వ♦ పరిబోధకళా
భ్యాసున్ వైదికసంస్థా, ల్లాసున్ హృదయంబునందు♦ లంతున్ భక్తిన్. 11

*కం. వ్యాసా! కృష్ణా! సత్యవ, తీసుత! శ్రుతివిభజనకృషి♦ దీపిత విజయో
ల్లాసా! శుకతాతా! వి, ద్యాసదు! ద్వైపాయనా! మ♦హాత్మా! వినతుల్.

*చం. అలఘుతర వ్రతంబుగొని♦ ప్రాణము లొడ్డి పఠించువారికిన్
సులభముగా లభింపవను♦ చున్ విభజించి యొసంగి యెల్ల ప్రా
బలుకుల, మందబుద్ధులగు♦ వారలుగూడఁ దదర్థ మెంతయున్
దెలిసికొనం బురాణములఁ♦ దీర్చితి వ్యాస! నమస్కరించెదన్. 13

కం. నారాయణుఁ బద్మభువున్, ధీరు వసిష్ఠుని శక్తి♦ నిఁ బరాశరునిన్
సూరిని వ్యాసుని శుకు ని, ద్ధారతు గౌడపదు శంక♦ రార్యుఁదలంతున్.

కం. వేదవ్యాస మహాముని, గాదిలిశిష్య! శుకయోగి♦ గణ్య పరీక్షి
ద్భూధయితునకు న్వినిచితి, వాదృతి భాగవత మిదిగొ♦ యంజలిగొనుమా.

కం. శ్రీధర దిగ్వ్యాపి యశ, శ్శ్రీధర! యోపనిషదర్థ♦చింతోజ్జ్వల వి
ద్యాధర! హృదయోపగత, శ్రీధర త్వత్పదములకును♦ జేతులు మోడ్తున్.

కం. మీదీపికఁ జూడకతమి, నేదీ భాగవతముఁ బఠి♦ యింపు మనుము సం
పాదింపంగలరే వి, ద్యాదయితులు గూడఁ దత్ప♦ దార్థచయంబున్. 17

చం. అమరులబాస చిత్రమయి♦ నట్టిది యొక్కొక యక్షరంబె య
ర్థమొసఁగు నందు నొక్కొక ప♦ దంబున కే వివిధార్థముల్, పద
క్రమమును మార్ప వీలుగ ని♦ రాజిలి దాననొసంగుఁ బెక్కుభా
వములను, బై మునీంద్రుఁడిడి♦ భాగవతమ్మన నేమి మాటలా! 18

కం. అమ్మా! భాగవతగ్రం, థమ్మా! నీ వివిధభావతతి సర్వము స్ప
ష్టమ్ముగ నెఱుఁగఁగలమే? యిము, ఖ్యమ్ముగు భావమ్ము దెల్పు♦మంజలియిడుదున్.

ఉ. సన్నుత నీసమాస రచ♦ నామృదువైఖరి కొమ్మనార్య తి
క్కన్నమఖీ! భవత్కవితఁ♦ గ్రాలిన ధారరసానుగుణ్య శ
బ్దోన్నయధీప్రభావ విజ♦ యోదయ మెట్టిన! నీప్రబంధ గీ
వి న్నిగిడించి నాకవిత♦ వెల్గఁగఁ జేయుఁడి దోయిలించెదన్. 20

ఉ. అప్పకవీయముం జదివి♦ యావలఁ బద్యములల్లఁబూన రా
తప్పులు లేకయుండునని♦ తాఁ దనగ్రంథ మొసంగి కైతలో
నొప్పు విశేషముల్ దెలిపె♦ నోపికతోడుతఁ బోతరాజు రా
మప్ప కవీంద్రమౌళి సుకృ♦ తాత్ముఁడు వారికిఁ గేలుమోడ్చెదన్. 21

తే. కావ్యనాటకాలంకార♦కథన గురుని, బ్రముఖు నాదెళ్ల వేంకట♦రమణశాస్త్రి
గారిఁ గౌముది దిప్పిన♦ధీగపర్య, నీలకంఠశాస్త్రివరు వ♦ర్ణింతు మదిని. 22

కం. పూనిక నాతేకులు ప్రస్థానత్రయముం గఱపిన ♦ సంయమి కల్యా
ణానందభారతీ వి, ద్యానిధి శృంగేరిపీఠి ♦ నాథుఁ గొల్తున్. 23

సీ. మనసిచ్చెనా! యెట్టి ♦ మందమతికినైన, నఱచేతిలో మోక్ష ♦ మగపఱచును
వాయెత్తెనా! యెట్టి♦పండితేంద్రుండైన, దాసోహమనిపల్కి ♦ తప్పుకొనును
బోధించెనా! ♦ యెట్టి ♦ భూరిశాస్త్రంబైన, నఱటిపండొల్చి పె♦ట్టినవిధంబె
ఆసీనుఁడయ్యెనా! యానందమున నిర్వి, కల్పసమాధిలోఁ ♦ గ్రాలుచుండు

తే. సంతతజ్ఞాన వైరాగ్య ♦ సంయుతుం డ
నఘుఁడు కళ్యాణపూర్వకా ♦ నందభార
తీయతీంద్రుఁ డస్మద్గురు ♦ దేవుఁ డేను
వారిపాదపద్మంబులన్ ♦ భక్తిఁదలఁతు. 24

ఉ. పేదటికంబు కాఁపురము ♦ పెద్దది దేహియనంగ నాల్కయున్
రాదు మనంబు స్థైర్యమునఁ ♦ గ్రాలక గ్రంథముఁ వ్రాయ శక్యముం
గాదు గురుండ లేఁడు బహు ♦ ఘట్టముల న్నిగమాంతవిద్య యె
ట్లీఁదితివయ్య పోతనక ♦ పీశ్వర! భాగవతాబ్ధివీచులన్. 25

ఉ. బమ్మెరపోతనా! సహజ ♦ పాండితి! నీ కవితామరంద బృం
దమ్ము నమందభక్తిమెయిఁ ♦ ద్రావితిఁ ద్రేవితి మిన్నుసూచితిం
గ్రమ్మెఁ గడున్ బాష్పములు ♦ గ్రంథము తావక మిట్లు ఛిన్నభి
న్నమ్మయిపోవఁగావలయు ♦ నా! యని యింతవిచారమందితిన్. 26

కం. పితృపాదులు వ్యాసులసం, స్కృతకృతినిం గొండపీటి ♦ చిక్కనిపెను గా
కితములపై వ్రాసికొనిన, ప్రతియొక్కటి కలదు నాదు ♦ పజ్జను దానిన్ 27

కం, అనుదినముం బారాయణ, మొనరించుచునుండువాఁడ ♦ నొకయావృత్తిం
దెనుఁగుంజోడించి చదువు,చును రా నేకాదశమున♦సొంపతెఁ దెనుఁగున్ 28

చం. అదిగని చెప్పుచుంటి వినుఁ ♦ డయ్య నిజంబు నవేలహర్షసం
పదుదితమానసుండనయి ♦ భాగ్యముపండె భవంబు ధన్యతా
స్పదమయ్యెఁగాతె నీశ్వరుఁ డో ♦ సంగినకైతకు యోగ్యమైన తా
వు దొరకెనంచు నాకుఁ దలఁ ♦ పుల్ మొఁపుల్ గొనెఁ దోడుతోడుతన్. 29

చం. నలువదియేండ్లనుండి రచ♦నాకృషి సేయుచునుంటిఁగాని వి
జ్ఞులు తలలూఁపఁగాఁదగిన♦చొక్కపుగ్రంథము సేయనైతి సం
చలఘువిచారమొందు నను♦నారసి యీశ్వరుఁ డిప్పు డిమ్మహో
జ్జ్వలపథమొందునూపెనో య♦భంగశుభంగకృపాంతరంగుఁడై. 30

ఉ. ఏమొకొ తాబ్బులాయెనుఁగ♦దా మనభాగవతంబుపుట్టి యీ
లోఁ దలకెత్తలేదె కవు♦లుం గుడిప్రింగఁగఁజాలువార లే
కాఁడొకొ మేటికిన్విడువఁ♦గావలెనో సరిగాఁ దెలుంగులో
నూఁదక? యీశు భావముల♦నోపుదురే యెవరేనెఱుంగఁగన్. 31

ఉ. ఇంతకుమున్ను దీనిప్పృశి♦యించినవారలు లేరటంచు భా
వింతును; గాదు దేశమది♦పెద్దది సత్కవులుందు రేగృహా
భ్యంతరమందు నేని చెలు♦వారక యుండు నె యంచుఁగూడ నూ
హింతు నదైననేమి! హరి♦యీవని నా కిడెనంచు నెంచెదన్. 32

కం ఒకఁలిద్దానిని నేటికి, విరచింపరొ మంచిదె యొక♦వేళఁ గవులు వ్రా
సిరొ యంతకంటెమంచిదె, మఱి నాకృతివలన వాని♦మహిమ పెరుఁగుఁగా.

ఉ. పోతనసత్కవీంద్ర! బుధ♦ముఖ్య! భవత్పదముల్ సభక్తి మ
చ్చేతమునందునిల్పి యిటు♦సేయఁగడంగితి నిమ్ము దీవనల్
ప్రీతిగ నారయన్ గనెడి♦వీక్షణపఙ్క్తులఁజూపు నావయిన్
జేతులుమోడ్చి వందనము♦సేసెడిశిష్యుల నాదరింవరే! 34

కం. వెలిగందలనారాయణ, యలఘుమతీ! కోపపడకు♦మా! నీతలఁపుల్
దెలియంగలేమి నీక్రియ, సలుపఁగడఁగినాఁడ హృదయ♦చాపల్యమునన్. 35

మం. అనిగమయోని యీమా, గ్గాన న్నడుపునసినట్లు♦ గానుండె "ధియో
యోనః ప్రచోదయా", త్తని నేననుటనో వేయిమార్లు♦నిత్యముభక్తిన్. 36

మం. ముకుఁదాద్రిడంది విభుండు లాగుకొనుచుం ♦ బోవంగ నాగంగి రె
ద్దుకు శక్యంబటె నేను రాసనుచు గం ♦ తుల్ వేయ నన్నట్టె వాఁ
డొక సంకల్పముపుట్టఁజేసి యెటకో ♦ యుఱ్ఱూఁతలూఁగించు జం
కకపోవం గమకింతు నెట్లయిననెఁ ♦ గా కావలం ద్రోవలన్. 37

కం. వైపశ్చిత్యముచే నే, నీపనికిం గడఁగలేద ♦ హృదయాబ్జగతుం
డో పరమాత్ముం డిటుప్రే, రేపంగాఁ జుమ్మి యాదరింపుఁడి విబుధుల్. 38

ఆ. తొంటిసుకవివరులు♦త్రొక్కనిత్రోవ లే, దెట్టులైన వ్రాయు మెచటొ యుండు
దానిఁజూచి వర్త♦మానకవుల్ చప్ప, రింతురేమొకొ యను♦కృతియటంచు.

ఉ. లోకములోన నున్న కవు♦లుం బుధులుం గని నాదుగ్రంథ మం
గీకృతిచేయరేమొయని ♦ ఖిన్నుఁడుగాఁ బనియేమి యన్యచిం
తాకలితంబుగాక పర ♦ మాత్మ విచారముతోడ నేఁబవ
శ్లోకతఁబొందు నాహృదయ ♦ మింతకు మించిన మేలుగల్గునే? 40

ఉ. పోతనగారి భాగవత ♦ ముం బఠియించి మహాత్ముఁ డాతఁ డే
రీతిఁ దెనుంగుసేసెనొ వ ♦ రీక్షగఁ జూచి తదీయ శేముషీ

చాతురి కబ్బురంపడుచు ♦ శక్తివిహీనుఁడనయ్యు నిప్పు డీ
చేతలకొగ్గితిం బరిహ ♦ సింపకుఁ డెవ్వరిపిచ్చి వారిదే. 41

కం. కావున నొకచో శ్లోకము, భావముగొని యొక్కచోటఁ ♦ బదముంగొని నా
నా విధముల నేకాదశ, మావల ద్వాదశము నాంధ్ర♦మందు రచింతున్. 42

కం. తూచా తప్పనటందు నే?, ప్రాచీనకవీంద్రపాళి ♦ పట్టిన తెఱువుం
గాచితి నిఁకనేచినటులు, తోఁచినటులు తెలుఁగుసేయు♦దుఁ గాస్కంధయుగిన్

వ. అందు ముందు విచిత్రచరిత్రంబగు మద్వంశస్తోత్రం బొనర్చెదను. 44

## వంశావళి

కం. ధాతృముఖమునుండి నిగమ, జాతముతోఁ బుట్టె విప్ర ♦ జాతి తదీయ
ఖ్యాతి తపస్స్వాధ్యాయా, ద్యాతతధర్మాచరణము ♦ నంద వెలుంగున్. 45

సీ. మూఁడుమూర్తులతత్త్వ ♦ ముంగన్న యక్షుపా
దుఁడు భృగుమహాసి మా ♦ తొంటివాఁడు
హుమ్మని యమరేంద్రు ♦ నుదుటడంచిన ఋత్వి
జుఁడు చ్యవనర్షి మా ♦ గడపవాఁడు
నిస్సమబ్రహ్మతే ♦ జస్సుమంచితుఁ డాప్న
వానమహర్షి మా ♦ వంచవాఁడు
కోపంబు బడబాగ్ని ♦ రూపంబుగా నబ్ధి
నిడిన యౌర్వుండు మా ♦ యింటివాఁడు
గీ. పితృవచఃపరిపాలనా ♦ రతుఁడు పార్వ
తీశుశిష్యుఁ డిదిగొ బ్రాహ్మ్య ♦ మిదిగొ క్షాత్ర
మన్న పరశురాముండు మా ♦ యన్నగారు
మాది శ్రీవత్సగోత్రంబు ♦ మానితంబు. 46

వ. అట్టి జగత్పవిత్రంబైన శ్రీవత్సగోత్రంబునఁ బేరెన్నికంగన్నది మామిన్నికంటి
వారి వంశము. 47

సీ. నిత్యంబు నత్యంత ♦ నియమనిష్ఠల జేసి, కంటఁగొల్చిరి మిన్ని ♦ కంటివారు
అభ్యాగతార్చనా♦భ్యాసులై యనవుహా, ల్గంటఁబిల్చిరి మిన్ని ♦ కంటివారు
సంగీతసాహిత్య ♦ శాస్త్రచర్చలను బె, క్కంటిగెల్చిరి మిన్ని ♦ కంటివారు
సత్యదయాశౌచ ♦ శమదమాదులకు నె, న్నంటినిల్చిరి మిన్ని ♦ కంటివారు
గీ. నరసరాణ్ణగరాది భూ♦వరవరేణ్య, పరివదగ్రపీఠోపరి ♦ భాసమాన
తాసమాన వైభవరమా♦పాంగదృష్టి, నంటి పొల్చిరి మామిన్ని♦కంటివారు.

సీ. నిస్తుల ప్రజ్ఞా ప్ర♦శస్తి వాస్తోష్పతి. యంటివా రిమ్మిన్ని ♦ కంటివారు
పంచాక్షరీమనూ ♦ పాస్తి ముక్కంటి నే, నంటినా రిమ్మిన్ని ♦ కంటివారు
శుశ్రూషాభీష్ట క్రమా♦శూరులై శ్రామలం, గెంటినా రిమ్మిన్ని ♦ కంటివారు
హృద్యవిద్యా సమా♦ర్జితయశస్స్ఫూర్తి మి, న్నంటినా రిమ్మిన్ని ♦ కంటివారు.
అఖిల రాజాధిరాజ స♦భాగ్రపీఠ, మాన్యవత్సహస్రిసయోగి ♦ మండనాయ
[1]మాన శ్రీవత్సగోత్ర సం♦భవవిభూతి, యంటలైనవా రిమ్మిన్ని ♦ కంటివారు. 49

కం. ఈశిష్టాన్వయమందుఁ, శ్రీశివరామప్రధాని ♦ శేఖరుఁడు మహా
కాశమ్మునందు నక్ష, త్రేశుఁడువలె వెలిఁగె నెప్డుఁ ♦ డెవలే కెలమిన్ . 50

కం. అష్టెడు జొన్నలబోనపు, గడ్డఁ బెసలు తవ్వెఁడుముకఁ ♦ గా సూవంబున్
వడ్డించుకొని హరువకు న, సడ్డగొనక యొసఁగి మెక్కఁ♦జాలునఁట సుమీ. 51

తే. భరితసియమమ్ముగలదయి ♦ ప్పాకుసకును, విస్తరినిసర్వ మొకమాఱ ♦ వేసికొనడి
నవల వడ్డింపఁగొనఁడ సి♦ష్యమ్ము తుదకు, సున్నముంగూడ విస్తరిం♦జొర
వలెనఁట. 52

—* శివరామయ్య కాశీలింగముం దెచ్చుట *—

ఉ. కారులు సైకిళుల్ రయము ♦ గాఁ బరువెత్తెడి రైళ్లు రోడ్లు పెం
పారని కాలమం దొకఁడ ♦ యద్దిర ! కాల్నడఁ గాశికేగె న
వ్వారయినం బరుల్ సలుపు ♦ పాకము ముట్టని దీక్షతో నాకే
మాఱు నివేదితాన్నము నె ♦ మానక మెక్కెడి నిష్ఠ రాజిలన్. 53

శా. కాశీఖండకృతిం బఠించు చట వ ♦ ర్ణాణింపఁగాఁ బడ్డ స
ర్వేశాగారము లెల్లఘట్టములు సం ♦ వీక్షించి పుణ్య ప్రభా
రాశింజూచి గయన్, బ్రయాగపృథుతీ♦ర్థంబు న్విలోకించి వి
ద్యాశౌండుం డొనరించె భక్తిమెయి నా♦యాచోట్ల నర్హక్రియల్. 54

తే. అట బుధారాధ్యయగు నయో ♦ ధ్యకును బోయి, రామచంద్రుసంఘ్రులఁ
బవి ♦ త్రతనుగన్న
యయ్యయిప్రదేశముల భక్తి ♦ నరసి సరయు, వందుఁగ్రుంకి హరిద్వార♦
మరసి పేర్మి

కం. అనఘుఁ డవలఁగనె బదరీ, వనమున్ బావనము నఘుల♦వనమున్ ఫలజీ
వనమున్ నారాయణసే, వనమున్ సుఖపవనమున్ శు♦భంయుసవనమున్.

తే. మఱియు బ్రిహ్మకపాలాది♦మహితపుణ్య, తీర్థశేఖరమ్ముల నుద♦గ్దిశనుగల్గు
వానినెల్ల సేవించి యు♦వ్వాల గృహాభి, ముఖుఁడగుచు వచ్చుచును నవి♦ముక్త
మందు 57

1 శతతాళదఘ్న హ్రదమునఁ బడియెఁ అను సూరనసూక్తిని స్మరింపుఁడు.

ఉ. భూసురవంశభూషణుఁడు♦పుణ్యుఁడు మాశివరామధీరుఁ డ
క్కేసరిపుత్త్రుఁ డైన కపి♦కేసరికే సరిపో సరీసృపా
గ్రేసరకుండలాంగము హా ♦ దిన్మణికాంతితరంగముల్ ప్రభా
భాసురరంగముల్ మహిమ ♦ పంక్త్యనుషంగముఁ దెచ్చె లింగముల్. 58

మ. వలఁపల్ పాకవినోదవస్తువులు ది♦వ్యస్వర్ణదీవారిభా
సిలుగిండుల్ పదునొక్కఁ డొప్పెసఁగఁ జే♦ర్చెం గావడి న్మాపుపైఁ
దలఁచుట్టుంబగటుంజతేరినదుమల్♦వల్లింగముంబూని న
బ్బలియుం డుబ్బుచువచ్చె నాంధ్రవిషయ♦ప్రాగ్గ్రామ మేర్చూరికిన్. 59

కం [1]దోసిటికి సైత మబ్బని, యాసురుచిరలింగ మొక్కొ♦కప్డు నడుమునం
గా సెగ్ బిగించి తారిచి, యా సత్త్రికుఁడు తెచ్చె♦నఁట సద్భక్తిన్. 60

సీ. ఎక్కడి కాశిక♦యెక్కడి యేరుచూ, రెప్పుడు పోవుట♦యెప్పుడు వచ్చు
టెన్ని వందల క్రోసు♦లెన్ని కాంతారమ్ము, లెన్ని ఘాతుకజంతు♦లెందఱిల్లు
లరరె! కాశికిఁ జన్న♦యతఁడు గాటికిఁ జన్న. యతనితోడను సమం♦బంచురుగద
యెట్లు తిరిగివచ్చె♦నీశివరామయ్య?, రండు చూతము పుణ్య♦ముండు ననుచు
తే. బహుళవాద్యాళితోఁ బుర ♦ ప్రజలు కడఁగి, యెదురుసని పురివెలుపల ♦ నెనయ నాతఁ
దోఁటకడ వారిఁగని సము ♦ త్సుకతఁ బూజ, సలిపి తోడ్తెచ్చి రింటికి ♦ సంతసమున. 61

కం. అష్టాదశవర్ణమ్ముల నిష్టాన్నవిహాయితముల ♦ నేతద్గంగో
త్కృష్టాప్లవపానమ్ములఁ దుష్టులుగాఁ జేసె వేడ్క♦తో నతఁ డంతన్. 62

కం. ఊరికిఁగడదెస దేవా, గారమునఁ బ్రతిష్ఠసేసెఁ ♦ గాశీలింగం
బాంసి మేల్మారుతము, ప్పారుం డాగమవిధాన ♦ వైభవమెసఁగన్. 63

మ. శివవారాణసి మ్లేచ్ఛహూణహృతమై ♦ చేడ్పాటుతే కెత్తి శాం
తివిభూతుల్ దిగువాఱిపోవు నెడఁగా ♦ దే మిన్నికంట్యన్వయుల్
శివరామాగ్రణి వెంటనంటి కరుణా ♦ శ్రీమీఱ నేర్చూరు వ
చ్చి వెలుంగొందెను నీలకంఠ! యిదె నా ♦ చేమోడ్పు కైకోఁ గదే. 64

శా. స్వామీ! నీలగళా! భవన్మహిమ మి ♦ వ్వట్లన్ వెలారెంతుగా
దా? మే మేఋతువందు వర్షములన ♦ భ్యర్థించినన్ భక్తిమై
వేమార్ గ్లంబుఘటాభిషేకములు గా ♦ వింపంగ వర్షింతు దే
వా! మాయన్వయమేలుచుందుము కృపా♦వర్షంబులన్ ప్రొక్కెదన్. 65

[1] ఆలింగము చుట్టుకొలత — పానవట్టముపై లింగముగుండు కాన దానిపైనుండి కొలిచితి. దక్షిణమునుండి పైనుండి క్రిందికి నుత్తరము 19 అంగుళములు. తూర్పునుండి పడమరపైనుండి క్రిందికి 17 అం. పానమువట్టమునానుకొని లింగము క్రిందిచుట్టుకొలత 24½ అం. లింగముమధ్యచుట్టుకొలత 28½ అంగుళములు.

## శివరామయ్య మాతంగిం ద్రోలుట

శా॥ క్షుద్రాచారము నాదరింతురె? యనీ! ♦ క్షోణీసురవర్యాళ్ళు లే
తద్రీతుల్ తగవంచుఁ దన్ దెగడి మా ♦ తంగీసపర్యావిధుల్
పోఁద్రోలన్ శివరామసూరి పయి కా ♦ ర్చుల్ వెట్టుచున్ స్ఫోటకా
భద్రవ్యాధిని నాపె పంపెనఁట తీ ♦ వ్రక్రోధసంరోధంబునన్. 66

శా. భద్రుం డా శివరాముఁ డంత మెయిబొ ♦ బ్బల్సొండ వీక్షించి రౌ
ప్యాద్రిస్థానుని స్నాతుఁడై కొలిచి ధ్యా ♦ నావిష్టచిత్తుండుగాన్
రుద్రోద్భూతుఁడు వీరభద్రుఁ డతిరౌ ♦ ద్రుండుగ్రుఁడు జంఘోఁపిక్రో
ధోద్రేకేక్షణమాత్రఁ ద్రోలెనఁట న ♦ య్యుద్వృత్తమాతంగినిన్. 67

తే. వీరభద్రు మాతంగి యా ♦ వేళఁ జూచి, నెఱులుజాఱ శిరోహాసం ♦ తీస్ఫులింగ
కములురలఁ బాఱెనఁట నంతఁ ♦ గనులువిచ్చి, యతఁడుగన నంగమున
బొబ్బ ♦ యగపడదఁట. 68

## శివరామయ్య బావిఁ ద్రవ్వించుట

కం. ఒకపర్యాయం బేర్పా, రికిఁ బానీయజలమునకు ♦ ఱేఁగంగ నఱవు
త్సుకతఁ బురికుపద్దిశ నీ, లకంఠు గంగాధరుం ద ♦ లంచుచు భక్తిన్. 69

మ॥ ఖనకశ్రేష్ఠులఁ బిల్చి మేలయిన ల ♦ గ్నంబందుఁ ద్రవ్వించెఁ బా
వనతాధారము మాధురీగుణ సుధా ♦ భండారమున్ నిమ్నతా
వనధిస్ఫారము స్వచ్ఛతాస్ఫటిక శో ♦ భాసారమున్ దృష్టిదా
ఘనమందారము రమ్యతాబ్జరిపు ధి ♦ క్కారమ్ముఁ గాసారమున్. 70

తే. దీనినీరమ్ముఁ గ్రోఁటకం ♦ డించుటకును, సలుపఁబడియున్న సాఁణీ ♦ ష్టకలు నేటి
కిని ఖనిత్రింబులకు మాఱు ♦ పెనఁగుచుండు, నాటిచేఁతలు శశవిషాణ ♦ ములు
నేఁడు. 71

కం. ఒక రెండు నూర్ల యేండ్లవ, ఱకు 'శివరామయ్యబావి ♦ రా'యని రీనా
టికిఁ బూడిపోయి యూరువు, లకుఁ సందుం జెఱువుదెబ్బ ♦ లకు లోనగుటన్. 72

ఆ.వె. మిన్నికంటివారు ♦ మిన్నలు పోతరా, ద్వంశ్య లేరుచూరి ♦ వారు వీరు
ముగురు కరణములు త్రి ♦ మూర్తులనోలె నే, ర్పూరుగ్రామమేలి ♦ నారు
నాఁడు. 73

సీ. ములుగువంశంబునఁ ♦ బుట్టిన గౌరమాం, బిక శివరామయ్య ♦ పెండ్లియాడె
నీ పతివ్రత యొక్క ♦ తేపఁ బుట్టింటికి, బుచ్చయ్యఁ దనముద్దు ♦ పుత్త్రి వెంటఁ
దోకొని చనెనఁట ♦ యాకడ మేనమా, మలఁ బుచ్చయకులింగ ♦ మొలమిఁ గట్ట
యత్నించిరఁట యది ♦ యారసి కూడదు, తండ్రిగారెఱిఁగినఁ ♦ దప్పుగాదె

ఆ.వె. వారియాజ్ఞలేని ♦ పనిసేయఁజనునె యం, చామె 'వాదులాడి♦యున్న లెన్ని
యున్న సరకుగొనక ♦ యట గంజివేళను, జారుదూసి పతిసఁ♦ జేరెనంట. 74

కం. వ్యాఘ్రాజినోపవిష్టుం, డై ఘ్రాణాదీంద్రియముల ♦ పరికట్టి హరున్
శ్రీఘనవరదుఁ గొలిచి బుధ వ్యాఘ్రుఁడతఁడు ముక్తికాంత♦యంగుళిమీఁ జెన్.

—♦ యంగమ్మ సహగమనము చేయుట ♦—

కం. శివరాముని తామహి స, త్యవచన యంగమ్మ యామె ♦ యన్న దమోఘు
మ్మవు నాసతీలలామము, ధవుతో సహగమనము ప్రమ♦యంబున సలిపెన్.

తే. వంగముల్లఱచే నాటి♦ప్రాణములఁదొ, రంగుమని తోడికోడలా♦గంగమ తన
మఱఁది యంగమ్మ పతిఁ దిట్ట♦మడిసె నక్క, తమున ననుమరణమునకుఁ♦ దాఁ
గడంగి. 77

మ. పసుపుం గుంకుముఁ బండ్లు చీర లెలమిం ♦ బందేరముం జేసి పు
ణ్యసతీశ్రేణికి సంత సత్తిముదలన్ ♦ గంగాంబ కేరాలికిన్
వెస బొట్టుం బెడమోముతోఁ బులిమి హృ ♦ ద్వీథిం బతిన్నిల్పి సం
తస మొప్పారఁగఁ జన్న యంగవలన ♦ న్మావంశమే పారెడిన్. 78

తే. అదిమొదలుకొని యస్మదీ♦యాన్వయమున, యంగఁబూజింతు రొక్కరూ♦పమరఁజేసి
యేడుతరములవారల♦నీమె పూతు, లంబొనర్చుసనఁగ సందియంబుగలదె 79

చం. ఒకపురుషాంతరంబువలె ♦ కోయుని పల్కెడిదంట పిల్వ, వేఁ
డికొనిన నెట్టియాపదను ♦ టిల్లినఁ బాపెడిదంట, కొల్వఁ ద
ప్పక కలలోనఁ గన్పడి శు ♦ భంబులొసంగెడిదంట, యంగమాం
బకు సరిదైవమేదియని ♦ పల్కెదు రెల్లరు వింతమేయుచున్. 80

తే. ఈమెమనుమండ యీ శివ ♦ రామవిబుధ
నాథుఁ డీచతురాననుఁ ♦ డకును నాల్గు
వేదములఁ బలె నల్గురు ♦ వెలసి రాత్మ
నందనులు గౌరమాగర్భ ♦ కందళములు. 81

తే. అగ్రజుండు బుచ్చయ ద్వితీ♦యతనయుండు, సింగరాజు మూఁడవపట్టి♦లింగరాజు
నాలుగవవాఁడు కొండయ్య యోలి వీరు, జపతపముల శౌర్యమ్ముల♦జాణ
లైరి. 82

బుచ్చిరాజు పిండారులఁ దఱుముట

తే. 'బుడతకీచులు' మున్న గు♦దుడుకుమూఁక, లాఁక లేక యాకాలమం♦దఱిమియూళ్ల
గొల్లకొట్టుచు స్త్రీలగ♦గ్గోలుపఱచు, చెల్లెడలఁ ద్రిమ్మరుచునుండ్రు ♦ పెల్లు
రేఁగి. 83

కం. పిండారులదండొక్కటి, గండారన్ గుంటుపురిఁ ♦ గలఁతపఱిచి పెన్
బండారము దోడ్డవిడిచి, నిండారుచలమునఁబోవ ♦ నెఱి నపరదిశన్. 84

కం. సరగ భువనగిరిపట్టా, భిరామభూసురవరుండు ♦ వెఱలి యెటో యూ
నరసారాట్పురమునకున్, దొర గుండారాయునికని♦దోఁపిడి దెలుపన్. 85

కం. మలరా ద్గుండారాయం, డిలాధిపతి చెడుగుమూకి ♦ యిదిగో వచ్చెన్
గలవరపెట్టు న్మనపురిఁ, బిలువుం డా 'మిన్నికంటిసీరుల' ననుచున్. 86

ఉ. చారులఁబంప బుచ్చనయు ♦ సత్వరమే తనతమ్ముల న్మహా
శూరుల వెంటఁదోడుకొని ♦ చుక్కగుఱాలను నెక్కి చుంగులిం
పారినపాగలున్ మెలిక ♦ లై గొనబారిన మీసలున్ గొనల్
దీరిన యీటెలున్ దనర ♦ లేచిరి నర్సయపేట వ్రాలఁగన్. 87

కం. వారరుదెంచెడిలోఁ బిం, డారులు వోరకోటగనను ♦ డాసి రపుడ యి
వ్వీరులు నని వడివడి ధర, దోరిచి రైదార్గురం బ్ర ♦ ఘులదోర్బలులై. 88

తే. అవనిఁగూలిన తఱువారి♦నరసి భళిర!, మిన్నికంటిహిడింబులా♦యున్న లువుర
టంచుఁ బిక్కబలముఁజూపి ♦ రాత్మదోర్బ, లమ్ముఁజూపతే కాచెడు ♦
త్రిమ్మరీంద్రు. 89

బుచ్చిరాజు రాజసమ్మానము వడయుట

తే. అవల రాజభటులు పుర♦మందు నచట, నచటఁ దారెడిశత్రుల హత మొనర్చి
రంత సభదీర్చి గుండరా♦యప్రభుండు, గౌరవించెను మా మిన్ని♦కంటివారి.

కం. దాశరథులవలె శాత్రవ, రాశిఁ గలంచితిరి దుర్భ ♦ రత్వాత్రమునన్
మీశక్తికి మెచ్చితి భవ, దాశయమెద్ది యెఱిఁగింపుఁ♦డయ్యదితీర్తున్. 91

చం. అనవుడు బుచ్చిరాజు దర ♦ హాసముఖుండయి గుండరాయ! స
జ్జనసమవాయగేయ! విల ♦ సత్సుగుణోరునికాయ! మాకు నీ
శుని కరుణాకటాక్షమునఁ♦జొప్పడ దేవిధమౌకొఱంత యై
నను భవదీయమానసము♦న న్మదమూరెడినేని కోరెదన్. 92

కం. మీయౌదార్యముచే మే, మే యేల? సమస్తజీవు♦లెలమిఁ గనవలెన్
మాయేర్పూరఁ దటాగము, వేయింపుమ నీదుకీర్తి♦వెలయున్ స్థిరమై. 93

కం. మాకాయుపకారమగున్, మీకాయర్థంబు యోగ్య♦నిహితతఁగాంచున్
లోకులకా ముదమగుఁ గ్రై, కోకదె యీపనియొనర్ప♦గుఁడారాయా! 94

కం. [1]ఇద్దివఱకు వోబళాఖ్యుఁడు, సదయుఁడు మాపూర్వికుండు♦శంభుని చెఱువున్
మొదలించె నూరికిని యా, మ్యదిశ న్మనకడఁగదివ్వా♦షది వాగయ్యెన్. 95

చం. నృపవరులైన మీకటికి♦నేనికులీనుల చెర్వు(ద్రుంగె న
ద్దిపొలముగాఁగ డాసివయి♦దింపుమ చెర్వును గట్టఁగల్పి శా
లివయిరుకష్టుదీఱు నవ♦లీలగనీవనిసాఁగ మేము సా
యపడుదు మెల్ల రైతులు గ♦ణున్ముదమందెద రోనృపాగ్రణీ! 96

వ. అనిపల్క గుండరాయనృపుండు సెబాసని తలయూఁచుచు స్రక్చందన
తాంబూలాంబరాభరణాదులసమ్మానింపబుచ్చి రాజాదులుసంతుష్టులై రాజా!
పంచాంగంబునరయ ఱేపకడ శుభముహూర్తంబు పొడకట్టుచున్నది. 97

తే. అనశుభస్యశీఘ్రమ్మను♦నపుడ యుచిత
యానములవచ్చి యేర్చూరు♦నరసి సర్వ
మపుడ వేయించెఁ జెర్వ దే♦యిపుడు ప్రజకుఁ
బెట్టుచున్నది వరియన్న♦మెట్టిటులనొ! 98

ఉ. ఊరికిఁదూర్పునం బొలుచు ♦ చుండినమాన్యముఁ జూడనేగి మా
శూరుఁడు సింగరాజచట ♦ జొన్నలు మేసెడి యేడుఁబందినొం
డారసి యిస్సటంచెగవ ♦ నయ్యది గుఱ్ఱనుచట్టిచూచి పైఁ
బాఱఁగరాఁగఁ జేబడియు ♦ బాది ధరంబడవైచి నేర్పునన్. 99

ఉ. పట్టుడు గట్టిదానిమెడ ♦ పైఁబడమోపి యడంగియుండఁగా
గట్టిగఁ గాలఁద్రొక్కి పురిఁ ♦ గన్పడఁజేసెద దీనినంచుఁ జే
పట్టునఁ గోణవుంగొనకఁ ♦ బగ్గముతో బిగియించికట్టి య
మ్మొట్టెను దోలితెచ్చెఁ బురి ♦ ముందటి కంద ఱెడందనుబ్బగన్. 100



---

1 ఏల్చూరుగ్రామమున శంభుని చెఱువుకట్టపైఁగల శాసనము.

శ్లో. శ్రీరామానుజ సంప్రదాయకలనానిర్వాణ సర్వంకషః
శ్రీభట్టారక దేశికోత్తమ పదాంభోజాత పుష్పంధయః
శ్రీవత్సాన్వయ చీమకుర్తి నిలయ శ్రీవల్లయాత్మోద్భవః
శ్రీమాన్ హోబళమంత్రిరాడ్విజయతే దేవార్యపౌత్రోత్తమః.

శ్లో. యజుశ్శాఖాంధ్రుర్వా ఏమంపమతి రేర్చూరినిలయో
దయాసింధు శ్శ్రీమాన్ గురుచరణ సేవార్ద్రహృదయః
శరీరార్ధప్రాణాన్ గురువరవశాదుపచితమతం
కృతం మత్వా సమ్య క్స్వచ వినయవా గ్వోబళఘనః.

శ్లో. గుర్వాజ్ఞాకరణశ్రిత స్స్వగురురాడ్భట్టారకేభ్యో ముదా
స్వం సర్వంచనివేద్య హృష్టమనసాం తేషామనుజ్ఞావశాత్
శ్రీరాజద్విసుకొండసీమ్ని మహితే శృంగారలక్ష్మీనిధా
వేర్చూరీనగరే సమంచితశుభః ప్రావీణ్యగణ్యోదయః.

శ్లో. శాకాబ్దే మునిబాణవార్ధిశశిసంఖ్యాకే శుభే మన్మథే
మాసే భాద్రపదే ప్రశస్తఫలదే రాకాదినే శ్రీకరే
శ్రీమద్వేంకటనాథ నామలసితు స్తత్ప్రీతయే సంతతం
శ్రీవిస్తార తటాకరాజమకరో దాచంద్ర మాతారకమ్.

"చీమకుర్తి" వారే "మిన్నికంటి" వారైరని కొండవీటిదండెకవిలె చెప్పును.

ఉ. వాఁడుగొ లింగరాజిటులు ♦ వచ్చుచునుండెనటన్నఁ జాలఁగా
నూడనిఁ బాడుభూతతతి, ♦ యుష్ణ్వనియూఁగ విభూతిపెట్టినం
బీడలువిచ్చిపోవుఁ బెను ♦ పింగడలించిన సిద్ధపెల్లవెం
టాడు నిఁకేల తానసిన ♦ దయ్యొకదెంతటిమంత్రశక్తియో ? 101

ఉ. 'శేషమురాజు మాన్యమున' ♦ శేషమపిండె వదియెర్ల కేర్పడెక్
భేషుగఁ గొండ్రవేయునఁట ♦ పేసముఁ బారియురాకయుండె సం
తోషముతోడ మోకఁగొన ♦ తోసిలుసక్ సృజియించునంట పం
చేషువిరోధిఁ గొల్చునఁట ♦ యెవ్వఁడు కొండమురాజు దీటుగన్. 102

వ. ఈ కొండమురాజుభార్య బొజ్జమ్మ. వీరికుమారుఁడు శేషమురాజు. ఈయన వేదము చదువుకొని కిర్మరుఁడైయుండి మహాలక్ష్మమ్మ యను కూఁతురు పుట్టినపిదప నామెను వెలిదండ శేషయ్యగారికిచ్చి పెండ్లిచేసి యావల శేషమురాజుగారు జ్ఞానవైరాగ్యసంపన్నుఁడై సన్న్యాసాశ్రమము స్వీకరించి యెందేనరిగెను.

సీ. మాఁబుచ్చిరాజొక్క ♦ మఱికి మాగులుచరికెఁ, బోయి యేతెంచు న♦వ్వా
ఢాకచోట
ఖలమునందుజమిలిగో ♦ నెలవరిగలనింపి, పెనుదుస్నమూఁపుపై ♦ వేయుటకును
యువకులిర్వురు శ్రమ ♦ మొందుటఁగాంచి నవ్వఁగ వారుకినుకతో ♦ మగఁడనీవు
జరపఁగలవె నవ్వ ♦ సాఁగెదు కాని యెం. చనఁ గొలుచుఁవ్యాజింతు ♦ రా ?
జరిపెద 103

తే. ననఁగ నీవొకండవ యెత్తి ♦ కొని చనుమనఁ, జేతికఱ్ఱ కాగో నెలం ♦ జేర్చియూఁచి
విసరి మూఁపునందాలిచి ♦ వెస నగవుచుఁ, గ్రోశమందున్న యింటికి ♦ క్ర-
[లికుఁ డరిగె. 104

కం. కలవారు దేహబలమునఁ, గలవా రొరులకును బెట్టఁ ♦ గలవారు తినం
గలవా రీశ్వరుఁగొలువం, గలవా రీమిన్నికంటి ఘనవంశభవుల్. 105

తే. అగ్రజుండగుబుచ్చయ్య ♦ యంగనాల, లామ సుబ్బమ్మ సద్గుణా ♦ లయ పతివ్ర
తాశిరోమణి వారికు ♦ దాత్తకీర్తి, పేరరాజుదయించె గం ♦ భీరమూర్తి. 106

తే. పేరరాజుగా రున్నారు ♦ వీధియరుగు, మీఁదనంచు నా తెరువున ♦ మెదలుటకు నె
భయపడుదురఁట స్త్రీశూద్ర ♦ వర్యులంత, సవితోఁ గరణికము నా ♦
డించినాఁడు. 107

తే. సకలరాజు న్యాసాక్షర ♦ సంకలితము, సలిపి తేటగీతంబునఁ ♦ జంపినట్టి
* సుకవి సేతులూరికులుండు ♦ జోగిరాజు, తనపురము పేటనుండి య ♦ ద్దంకి
చనుచు. 108

తే. సందెవేళ కేర్చ్యారుప ♦ జ్జకునువచ్చి, చెఱువుకట్టపై సందులే ♦ కరుగుచున్న
యాలమందనుగని పేర ♦ య్యార్యునిదని, యొఱిఁగి తలయూఁచి యవ్వాని ♦
నెయిదివచ్చి. 109

తే. ఇల్లు వాకిలి పేరయ్య ♦ యీవి సేవి, పాడిపంటలు సిరి వైభ ♦ వమ్ము చదువు
సందె లరిసి మహాలక్ష్మిఁ ♦ జారుగాత్రిఁ, దనదుపుత్రినొసఁగెఁ గళ ♦
త్రమ్ముగాఁగ. 110

సీ. కటిక నేస్యన్వయా ♦ గ్రణి జమీందారుబం, గారయ్య దొరవారు ♦ గలరుమాగ్రా
హమ్మున కభిముఖం ♦ బై మించుకోటలో, నతఁడువచ్చిన విబు ♦ ధాగ్రణులకుఁ
దాళపత్రగ్రంథ ♦ జాలమిచ్చి పఠింపు, మని యడ్డముగనుంచు నాత్మకీయ
మంగుళిఁ దనయిష్ట ♦ మగు-చోట నపుడావ, కి యథాప్రకారమ్ము ♦ గానమాన

తే. గతి నగోచరాక్షరములఁ ♦ గలిపికొని వ, ఠించినన యర్హవిధి సత్క ♦ రించి
పంపు
నీపరీక్ష నేగ్రంథమం ♦ దే నొకప్పు, డైనఁ దప్పలేదఁట పేరి ♦ య్యప్రధాని. 111

కం. ఒకదినమునఁదాల్చినసొ, మ్మొకదినమునఁ దాల్పఁబోక ♦ యొగి నేడుదినా
లకు సరిపడుభూషల నా, యక పేరయసతి వెలుఁగు మ ♦ హాలక్ష్మిగదా. 112

సీ. కమ్మలగొలుసులు ♦ కత్తిరిబావిలీల్, కర్ణపూల్ జూకీలు ♦ కర్ణములను
తిరుగుడుపువ్వు న ♦ వరకుప్పె రాగిడీ, నెలవంకతింత్రిణి ♦ నెఱులయందు
బిళ్ళలపట్టెడ ♦ పెనుకంటెమిరియాల, గుండ్లు నుత్తండాలు ♦ గొణగొణమను
సూర్యహారమ్ము కా ♦ సులపేర్లు చంద్రహా, రము దుల్లడీలు ను ♦ రమ్మునందు

తే. పావడములు కడియములు ♦ పాముజేబు, లండె లంఘ్రుల వ్రేళుల ♦ యందువీర
మద్దియలుమట్టెయలుచిఱు ♦ బొద్దులుజిగి, క్రాయుపిల్లెండ్లుబొబ్బిలి ♦ కాయలలర.

---

* ఈ నేపయారి జోగిరాజుగారు గొప్పకవులు. వీరు వ్రాసిన చాటుపద్యములు మాత్రంచ
గలవు. [illegible] వంగమాముల లక్ష్మీనారాయణప్పగారికిని, [illegible]
రావా [illegible] లక్ష్మీనరసింహరావుగారి [illegible], [illegible] మున్నింటి
పేరరాజుగారికి [illegible]. జోగిరాజుగారి [illegible] మూడేన త్తయునగు [illegible] అక్కమ్మ
గారి [illegible] పెరిపప్పు మొంటిపదుపుచుండును. [illegible].

సీ. "[illegible] ♦ [illegible], [illegible] ♦ [illegible]వేమి
మ త్తల్లి యన్యాయ ♦ వృత్తిఁజరించెడి, [illegible] ♦ మొత్తవేమి
పలువతనంబున ♦ బిడ్డలుపలికెడి, బిరుగుప్రుచ్చులఁ జావఁ ♦ [illegible]వేమి
......... .. అట్టి నీ విక్రమముచూపి ♦ జుట్టుపట్టి, చంపవేనియు రఘుపతి ♦ చరణమాన, వైరిసంహార
యంజనా ♦ వరకుమార.

"... [illegible]రాజు నాలిరా[illegible]తెగును సందియంబులేదు." అని [illegible]రాజును శపించిన మత్తాక
పద్యపాపము [illegible]. జోగిరాజుగారు రచించిన గ్రంథములు [illegible], నరసారావుపేట
[illegible]లో సున్నవనుచుండెడిది. ఇతడు శాపానుగ్రహసమర్థుఁడఁట.

సీ. పోఁచీలు చేకట్లు ♦ పొన్నంకణాలు గాజులు బాజుబందులు ♦ గులుకుచుండ
కొండిముత్తెపుపోగు ♦ కొండీలబేసరి, చిలుకసత్తు బులాకి ♦ చెలఁగుచుండ
బంగరుగజ్జెల ♦ నరుసల యొడ్డాణమంటి కటిస్థలి ♦ నలరుచుండ
రతనాలు తాపిన ♦ ప్రభలీను మేలుంగరాల్పదివ్రేళులఁ ♦ గ్రాలుచుండ

ఆ. పెట్టిపోతలందుఁ ♦ జుట్టాలసురభిరై
పనులపాటలందు ♦ వాసిఁగాంచి
రెండువంశములను ♦ బండించె నమ్మహా
లక్ష్మి నడతపాల ♦ లంబుపోసి. 114

తే. పండుగులని పబ్బములని ♦ ద్వాదశులని, పితృదినములని యేదియో ♦ పేరువెట్టి
పదుగురకుఁ బెట్టుకున్నఁ దోఁ ♦ పదఁట యామె, కక్కుఱ్తమున "లచ్చమతల్లి" ♦
యందురెపుడు. 115

తే. పేరయకు శివరామయ్య ♦ పెద్దకొడుకు, చిన్నకొడుకు లక్ష్మయ బుధ ♦
శేఖరుండు
మఱియుఁ గూఁతుండ్రుగలరు ము ♦ వ్వురు గుణాఢ్య. రామ లెంతో గారామున ♦
నోమఁబడిరి. 116

కం. తనచిన్నకూఁతు లక్ష్మమ, వినుతచరిత్ర కనుపర్తి ♦ వేంకటదాసా
ర్యునకిచ్చె నతనివిద్యా, ఘనవైభవములు సభాళి ♦ గణనకు నెక్కెన్. 117

మ॥ తనగుఱ్ఱంబును నెక్కిపోవుతఱి గం ♦ దర్పుండె విద్వత్సభా
వనిఁ గూర్చుండి పురాణమున్నుడువుచో ♦ వాచాంప్రభుండే గళ
ధ్వనిసారించుచుఁ బాడుచున్నపుడు గం ♦ ధర్వుండె వాదాళిఁ దీ
ర్చునెడన్ ధర్ముఁడె దాసయార్యునకు తే ♦ రన్ లేర కన్పర్తిలోన్. 118

కం. జనకునియనంతరము ధీ, ఘని శివరామయ్య కరణి ♦ కముఁబూని భళీ !
యనిపించుకొనియెఁ గరణం, బును బ్రజ లోకమాత్ర మెచ్చ ♦ బోవరు సుమ్మీ.

కం. తనతోడికరణముల కెం, దును దీయఁడు ముత్తెములకు ♦ దొరగాదే వ్రా
లనఘుఁడు పూర్వోత్తరభా, గనిబద్ధంబైన రాము ♦ కథ వ్రాసికొనెన్. 120

ఉ. రచ్చలఁగూర్చుచుండి తమ ♦ గ్రామవివాదములాలకించి వా
క్రుచ్చుచునుండు దీర్పుల ని ♦ రూఢిగ న్యాయనిబద్ధబుద్ధియై
వచ్చినసత్కవీశ్వరులఁ ♦ బండితులన్ శ్రుతివేత్తల న్మదిం
బెచ్చఁగ గౌరవించు నొక ♦ యింతపరీక్షయొనర్చి మెచ్చుచున్. 121

వ. ఆశివరామార్యుండు, 122

తే. నాలుగరకలుగట్టెడి ♦ శ్రీలుఁ గలైన, కొప్పరపువరదార్యుని ♦ కూఁతు సుమతిఁ
దిరుమలమ్మఁ గైకొనియామె ♦ తీఱ ధర్మవరపుకోటయ్య సుతను సు ♦ బ్బమ
గ్రహించె. 123

తే. పేరయార్యుని రెండవ♦ప్రియసుతుండు, లక్ష్మయబుధుండు సద్గుణా♦లక్షితుండు
శంకరార్చారతుండు స♦జ్జనయుతుండు, బ్రహ్మపరుఁడు పౌరాణిక ♦
ప్రాగ్రసరుఁడు. 124

ఉ. భాగవతప్రియుం డెపుడు ♦ భాగవతంబుఁబఠించు వ్యాసశ్రీ
భాగవతంబు శ్రద్ధమెయి ♦ వ్రాసుకొనెంజుమీ యంతగ్రంథ మే
లాగున వ్రాసెనో ? తుడుపు ♦ లా ? జిలుగా ? యొకహంసపాదమా ?
బాగటి కొట్టివేయుటయొ ? ♦ బంతితొలంగుటా ? యేది లేదుగా. 125

కం. మాపితృపాదుల యీప్రతి, నేపఠియించుచుఁ దెలుసు ♦ నిటునేయంగా
నోపితి నాకోసంబే, యీపనినేసెనొకొ తండ్రి♦యెవ్వఁ డెఱుంగున్. 126

వ. ఆ లక్ష్మయ బుధుండు 127

కం. ఆపద్ధర్మముగాఁ గృషిఁ, జేపట్టియు నెంతశ్రమము♦నెందియు యుగసం
ధ్యోపాసనశివపూజా, వ్యాపారముగనక కొనఁడ♦పానీయంబున్. 128

తే. అనఘుఁడగు వెలిదండ శే ♦ షయ్యతనయ
సుబ్బమాంబ ప్రథమభార్య ♦ క్షోణిఁబాయ
నవల సన్న్యాప్రగడ గుండ ♦ పయ్యకూఁతు
సుబ్బమాంబను లక్ష్మయ ♦ సూరి గొనియె. 129

సీ. భగవంతుఁదలఁపక ♦ వండదు లేవదు, నాథుసేవింప క ♦ న్నంబుఁగొనదు
పిడికెఁడన్నము బిచ్చ ♦ మిడక గేటుబిగింప, దొరసిన నల్లినే♦నుసురుదీయ
దత్తకుఁ శ్రాదంబు ♦ లొత్తక కూర్కుదు, వదివేలువచ్చిన ♦ బద్దులాడ
దసురుసురయ్యు స♦దాచారముఁద్యజింప, దసమయంబయ్యు దే♦వార్చవిడదు

తే. నెవ్వయందు నతిథిపూజ♦నిలుపఁబోదు, కలిమియందు గర్వంబును♦గొలువఁ
బోదు
బలగమందు నేస్తంబును ♦ మలుపఁబోదు, సుబ్బమాంబకుసరియేరుఁ ♦జూడ
లేరు. 130

ఉ. గుండెలమీఁదఁ జేయునిడు♦కొంచు వచింపుఁడ నేటికాలమం
దుండెనె కోడ లెందయిన ♦ నొక్కతె సుబ్బమదప్ప నత్త ప
న్నుండిన నిద్రపోవుపఱ♦కోర్కిఁ బదంబులనొత్తుచుండఁగాఁ
దిండియు నత్తపెట్టిన య♦దే ముదమంది భుజించుచుండఁగా. 131

ఉ ఒక్కపు డేమితల్లి ! యిటు♦లొందితె కష్టములంచుఁ బల్కి నే
మక్కున వ్రేలుపెట్టికొన ♦ మోమునసవ్వుదొలంక నాయనా !
యెక్కడ నేమహాత్మభజి ♦ యించినచో నది కష్టమందురే !
నిక్కపుబత్తి నావిధిగ♦నేనొనరించితినంచు నెంచుమీ. 132

కం. తనతండ్రి జోగిరాట్క-వి,పనివడి వుట కేడెనిమిది♦బంతులమర వ్రా
సినతాటియాకుగ్రంథము,లను జమవుచుఁ జెప్పు శిష్యు♦లకు నామెసదా. 133

వ. అనిపలికిన పుణ్యసాధ్వి సుబ్బమాంబ మాతల్లిగారు 134

చం. అదియునుగాక యామె యెపు ♦ డంతరదృష్టిమెలంగుచుండు వ్రే
ల్తుదలవి యక్షమాలపెను ♦ త్రుళ్ళకుఁ గాయలుకాచె జ్ఞానసం
ప్రదమగువైఖరిం బరశు♦రామనృసింహగురుల్ రచించు నా
పదములఁ బద్యముల్ రసనఁ♦బాయవ సుబ్బమజన్మమెట్టిదో. 135

తే. సుబ్బమకు సూనులార్గురు♦శుభ్రయశులు,కూఁతులిర్వురు సద్గుణ♦ఖ్యాతచరిత
లగ్రజాత వేంకటసుబ్బ ♦మాంబ యామె,మోర్పు ధీశక్తి పతిభక్తి♦యున్న
తంబు. 136

తే. తండ్రి లక్ష్మయనూరి యీ ♦ తనయను దన,యనుజయగు లక్ష్మమాంబనం♦దనునకుఁ గను
పత్రి గోపాలకృష్ణయా ♦ హ్వాయునకిచ్చి, కూకుదుండను విఖ్యాతిఁ♦జేకొని
యెను. 137

కం. సీతారామమ్మయనెడి,కూతు ద్వితీయ నభిరూపఁ♦గోవిద నొసఁగెం
బ్రీతిఁ ధర్మవర కులో,ద్భూతుండౌ వీరరాఘ♦వునకు ఘనునకున్. 138

వ. అస్మజ్జననీజనకులగు నీసుబ్బమాంబాలక్ష్మయసూరుల యార్గురుకొమరుల
సొరిది నుడివెదను. 139

ఉ. వేంకటసుబ్బరాయఁడను♦విజ్ఞుఁడు జ్యేష్ఠసుతుండు తా భవా
తంకముమై వివాహమును♦దా కొన కాత్మవిలోకనంబునన్
సంకటమున్ సుఖమ్ముఁ బెలు♦చం గనుచున్ సమదృష్టిఁ గాల మి
ట్టింకఁగజేయుచుండు నితఁ♦డే భరతుండౌ యటంచు నెంచఁగన్. 140

ఆ. ఇంటిలోనివార ♦ లేమిటి యీరోద
యంద్రుగాక దాని ♦ నాలకింపఁ
బోక నోరునొవ్వ ♦ దాఁకఁ గీర్తించు శ్రీ
హరిని నిత్య ముదయ ♦ మం దితండు. 141

ఉ. రెండవపట్టి పేరయవ ♦ రిష్ఠుఁడు హూణకళాప్రవీణుఁ డు
ద్దండుఁడు వ్యావహారికుఁ డు ♦ దారుఁడు చేకొలఁదింగడించి తే
వుండెనటంచు నెంచక మ ♦ హోత్సుకతన్ సుహృదాప్తబంధుస
న్మండలికిన్ వ్యయించె గుణ ♦ మండనుఁ డాత్రేయశోవిశాలుఁడున్. 142

ఉ. పేరయ తాత పేరు నిలి ♦ పెం సుబ్రహ్మణార్యుఁ డితండు బంధు మం
దారుఁడు శేముషీగురుఁ డ ♦ నల్పయశుండని విజ్ఞులెంతు రా
ధీరుని దత్తపుత్త్రుఁడుగ ♦ దీక్షనొసంగెను లక్ష్మయార్యుఁ డా
రారతియున్నపై ననఁగ ♦ భ్రాతృసతీమణి సుబ్బమాంబకున్. 143

వ. మాపితృవ్యుండగు శివరామపండితు దత్తపుత్త్రుండైయున్న యీ పేరయ మనీషి ధర్మపరవు వీరరాఘవార్యదుహితను వేంకటరత్నమాంబం బరిణయంబయ్యె. 144

ఆ.వె. ఈమె భర్తమాట ♦ కెదురాడియెఱుఁగదు, బాంధవావళికిని ♦ గూడి మొదవు
పనులు పాటలందుఁ ♦ బైచేయి తలఁపులోఁ, బలుకులోన మేటి ♦ పలుకఁబోటి.

కం. శివరామాఖ్యుఁడు మాఁ, డపసుతుఁ డితఁ డొరులకిచ్చు ♦ టయెచావఁడు కేల్
కవితాకళావిదుఁడు యో, గవిధంబుల నభ్యసించె ♦ గణ్యుఁడు సభలన్. 146

కం. కళకళలాడుచు సీతసి, యులు వెలుఁగు సుతాప్తబంధు ♦ హితకలితంబై
కలదని లేదని యెన్నఁడు, తలఁపం డతిభోగి యద్రి ♦ ధైర్యం డెపుడున్. 147

కం. మునిపల్లె భావయామా, త్యునిసతి మాపిన్నతల్లి ♦ యుభయాన్వయపా
వన యప్పమ యీశివరా, ముని బుత్త్రుఁడుగా గ్రహించి ♦ పోషించుకొనెన్.

ఆ.వె. వీరిభార్య రుక్మి ♦ ణీరమణీమణి, భర్త యడుగుజాడఁ ♦ బట్టితిరుగుఁ
జుట్టపక్కములకు ♦ సురభిరా యీమె యం, చెల్ల రాడుచుండ ♦ నుల్లసిల్లు.

కం. ధీనిధి నిత్యానందము, నా నెగడెడి నందనుండు ♦ నాలవవాఁ డ
వ్వానిం దాడేపల్లి కు,లీనుఁడు సుబ్రాయుఁ డర్మి ♦ లిం గొన సుతుఁగా. 150

తే. ఆజవకుమారుఁ డద్వితీ ♦ య బలయుతుఁడు
సింహసంహననుండు వి ♦ శిష్ట గుణుఁడు
వేంకటేశ్వర నాముండు ♦ విమలమాన
సుండు సర్వక్రియా సమ ♦ ర్థుండు ఘనుఁడు. 151

కం ఏనైదవ తనుజాతుఁడ, జానకి కనువర్తి వంశ ♦ జ మడంగన గా
నానూనవిదుషి సత్యవ,తీ నామక నాకు ముద్దు ♦ దీర్చు తనయయా 152

తే. ఆతనయ యాత్తవినయ స ♦ త్యవతి సుకృతి
నచ్యుతుని వేంకటేశ్వరు ♦ నభిలషించె.
సీతనయ వినీతనయ సు ♦ కృతి వరించె
నచ్యుతుని వేంకటేశ్వరు ♦ నక్కజమున. 153

కం. నీవే యాకృతి కన్యకఁ,గావలెఁ బెండ్లికొడుకవు జ ♦ గంబులు మెచ్చన్
రావయ్యా ! సూత్రాత్ముఁడ,వై వరకౌతుకముతోడ ♦ హరిహరనాథా! 154

కం. గురునాథుండను నే హరి,హరనాథుఁడ వీవు విడువు ♦ లందిక లున్నన్
బరఁగు సమైక్యము కావున, నెఱి నీవే చెప్పికొనుచు ♦ నీవే వినుమా ! 155

కృత్యాదికము సమాప్తము.

---

# శ్రీమద్గురుభాగవతము

## ఏకాదశస్కంధము

### ప్రథమాధ్యాయము

కం. ఓంకారాక్షర మూర్ధా,లంకారశరీర! యుజ్జ్వ ♦ ల శుభారంభా
లంకర్మిణా! మమతా,హంకార విదూరచరిత ♦ హరిహరనా[1]థా! 1

వ. దేవా! యవధరింపుము. అవ్వల శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేం
ద్రునితో నిట్లనియె. 2

కం. శ్రీకమలఁ డిలాభారా,పాకృతికై దేవకికిని ♦ వసుదేవునకున్
శ్రీకృష్ణుఁడై జనించి య,నేకుల రాక్షసులఁ జంపె ♦ నెఱిఁగితి కాదే! 3

—♦ శ్రీకృష్ణుఁడు భూభార మడంచుట ♦—

ఉ. పూతన ప్రాణవాయువులఁ ♦ బుక్కిటఁబట్టెను బండి రక్కసున్
ఘ్మాతలిడొల్లఁదన్ను నుడి ♦ గాడుపుసోఁకు నడంచె వత్సుఁ డా
చేతనుమోదెఁ జంపెబకుఁ ♦ జీల్చెనఘాసురు ప్రచ్ఛెఁగేశి ని
శ్చేతనుజేసెవ్యోము వృషుఁ ♦ జీరె వధించెను శంఖచూడునిన్. 4

శా. నొంచెంగూటు వధించెఁదోసలుని జా ♦ ణూరున్విదారించె మ
ర్దించెంగంసు మురుంగలంచె నరకుం ♦ ద్రెళ్లించెఁ బౌండ్రుం బ్రభం
జించెం జైద్యుహరించె సాళ్వవిడళిం ♦ చెం దంతవక్త్రాఖ్యు ప్రమం
దించె న్మాగధుసర్వసైన్యముల భే ♦ దించె న్మురుందుం డనిన్. 5

కం. బలు రేఁచి వానిచేతం, బ్రలంబుఁ జంపించె గార్ద ♦ భతనుం దైత్యుం
బొలియింపించెన్ ముష్టికు,నిలఁద్రోయించె ద్వివిదు వధి♦యింపించె నృపా.

తే. కాలయవనుని ముచికుంద♦గాథరోష,వహ్ని బ్రుంగంగఁజేసెదు♦ర్వారబలుని
మగధరాజు జరాసంధు♦ప్రమందఁ జేసె,భీముతో నియుద్ధంబు గ♦ల్పించిమించి.

వ. ఇవ్విధంబున శ్రీకృష్ణుండు బలసహితుండై భూభార మడంచుపొంటెఁ
గొంటెరక్కసిమూకలఁ గాలుద్రోలి కంపి మఱియుంగల భూధవుల కన్యోన్య
క్రోధంబులుపుట్టించి హింసాపర్యవసాయియగు వైరానుబంధంబు నెక్కొల్పె.
అక్కతనఁ బాండవధార్తరాష్ట్రులమనంబుల రవరవలు వొడమె. దాన
దుర్యోధనుండు పాండవుల కెన్నేని యెగ్గులొనరించె. తన్నిమిత్తంబుం
బురస్కరించుకొని కృష్ణుండు పాండవసభామధ్యంబున నిట్లనియె. 8

---

[1] అధ్యాయప్రారంభము 3.4.1946

ఉ. ఎంతటిపాపకాల మిద ♦ యించెను గట్ట! సమీరపుత్త్రు నా
యింతముగాశటించుఁ గన ♦ లెత్తి ప్రహదంబునఁగట్టివైచి రే
కాంతమున న్విషాన్నమిడి ♦ రాజ విషోరగదష్టుఁ జేసి ర
వ్వింతిగృహంబున న్మడియఁ ♦ బెట్టిరి కౌరవు లిట్లొనర్తురే? 9

ఉ. కాలము దాఁపురించినది ♦ గాక సుయోధనుఁడాక కట్టి యి
ల్లాలిని యాజ్ఞసేని నగు ♦ నాథ్యఁ బతివ్రత వేణివట్టి పే
రోలగమందు నీడ్తురటె ♦ రొంటమి యుండిన నుండుఁగాక యో
జాలికుఁడైన నీ పరిభ ♦ వంబు సహించుచు నూరకుండునే? 10

ఉ. అంకముఁ జేరరావె యను ♦ నా? కులపత్నిని ద్రౌపదిన్నిరా
తంకముగా సుయోధనుఁడు ♦ దానటె మేటిమగండు? కత్తి విల్
జంకెనె? భీముబాహుల బ ♦ లం బుడివోయెనె? దీని వడ్డికో
నింకిటఁ జెల్లువెట్టవలె ♦ నేయుఁడు డాయుఁడు చూత మావలన్. 11

మ. పదుమూఁడేండ్ల యనంతరంబె తమకుం ♦ బ్రాపించు రాజ్యం బట
న్నది యేమయ్యెను? నేమముం బొలఁగు వ్యా ♦ హారంబు లాడం బనే
మి? దటాయింపరొ ద్రోణభీష్ము లట? లె ♦ మ్మిమ్మా యర్జునా! శంకల
న్మదిలోఁ జొన్పకు పూనుచివ్వ కిదిధ ♦ ర్మంబే సుమీ తేనికిన్. 12

వ. అని యివ్విధంబునం బార్థుండు పాండవులంబురికొల్పి కురుక్షేత్రంబునఁ గౌరవపాండవులకుఁ గయ్యంబుఁగల్పించి యిర్వంకలం జేరిన నానాదేశాధీశుల నష్టాదశాక్షౌహిణీసంఖ్యాకసైన్యంబుల మాయించె. మఱియుఁ దన యాదవసైన్యంబులోఁగూడి పెక్కుమాఱులు బహుశత్రుసైన్యంబుల రూపుమాపె. ఇంతసేసియు నయ్యప్రమేయుండు యాదవసైన్యంబుకలిమిం దలపోసి భూభారమడంపఁ దావచ్చినపని నిరవశేషంబుగాదయ్యె ననియే యొంచి యిట్లు తలంచెను. ఈ యాదవబలంబుమాత్రము భూమికి భారముగదా! మఱియు నిది దినదినాభివృద్ధినందుచు నపజయంబెఱుంగకున్న యది. 13

మ. కృతవర్మం గనఁబోల దేరికి వశం ♦ బే సాత్యకిం గెల్వఁగన్!
రతినాథున్ స్పృశియింతు రేరు! గదుఁ జే ♦ రన్ శక్యమే? సాంబు నా
ద్ధతినాఁగన్ హరుఁడే సమర్థుఁ, డనిరు ♦ ద్ధప్రౌఢి యింతంతయే!
యతులం బంధకవృష్ణిభోజయదుసై ♦ న్యం బస్యదుర్వారమౌన్. 14

శా. అన్యుల్ మద్భుజగుప్త మీపృథుల సై ♦ న్యంబు న్విదారింపఁగా
జన్యంబుల్ వొనరింప నేర, రిఁక నేఁ ♦ జంపంగ యుక్తంబుగా,
దన్యోన్యగ్రథఁ రేఁతు, వారి నదె మా ♦ యం జేసెదన్, మాడవే
వన్యంబుల్ త్వచిసారముల్ స్వతనుభూ ♦ వహ్నిస్ఫురజ్జ్వాలలన్. 15

వ. మఱియు వారి యంతఃకలహమ్ములకు సర్వనాశమ్మునకు బ్రాహ్మణశాపమ్ము నిమిత్తమ్ము సేసెదనని సత్యసంకల్పుండు తలంప నట్ల శాపంబు సంభవించె. అక్కతన సర్వయాదవులు నశించిరి. పిదపఁ గృష్ణుండు స్వధామంబున కరిగె. 16

సీ. సర్వలావణ్యసంజనకమైన స్వమూర్తి, నయనాలకు సుధాంజ ♦ నమ్ము వెట్టి
అభ్రనిర్ఘోషంబు నతికరించెడు గళ, ధ్వని వీనులకు రసా ♦ యనము వెట్టి
అతిసుకుమారాప ♦ యఃమృదుస్పర్శలం, ద్వక్కుల కాప్యాయ ♦ నంబు వెట్టి
పాదాంకితప్రదే ♦ శాదిస్మృతుల మన, స్సులకును జుబ్బన ♦ చూఱవెట్టి

తే. జఠరపరిలుఠన్మాలికా ♦ సౌరభములఁ, బిలిచి ఘ్రాణంబులకుఁ బెద్ద ♦ విందు వెట్టి!
యింద్రియ ప్రియంకరుఁడయి ♦ కృష్ణమూర్తి, యలరఁ జేసె నప్పటి
మాన ♦ వాళినెల్ల. 17

కం. భావిజనంబులు సంసృతి, జీవనధిం దాటుకొఱకుఁ ♦ జేష్టలొనర్చెన్
జీవులు వానిఁ దలంచినఁ, గైవల్యం బంకపేటి ♦ కా ధనముగదా. 18

వ. అనినం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 19

కం. పరమబ్రహ్మణ్యులు మఱి, హరిభక్తులు వృద్ధసేవ ♦ నాదరులౌదా
ర్యరతులు యాదవు లబ్బా, సురశాపము వారి కెట్లు ♦ చొప్పడెనొక్కో? 20

కం ఏ కారణమున శాపము, దాఁకెనొ! యెటువంటిదో క ♦ దా తచ్ఛాపం!
బేకమనస్కులు యాదవు, లే కరణిజనించె భేద ♦ మెఱిఁగింపు మునీ! 21

వ. అనిన శ్రీశుకయోగీంద్రుం డిట్లనియె. 22

—♦ శ్రీశుకుఁడు పరీక్షిన్మహారాజుతో యాదవశాపము చెప్పుట ♦—

సీ. అఖిలసౌందర్యాల ♦ యంబగు దేహంబుఁ దాల్చి మంగళకర్మ ♦ తతులొనర్చె
నాప్తకాముండయ్యు ♦ ద్వారకసౌధంబుఁ, గట్టించి యందుండెఁ ♦ గాఁపురంబు
నొరులు తన్నుంగాంచి ♦ యొనరింపఁగర్మంబు, లాచరించెను నిరీ ♦ హాత్ముఁడయ్యు
బహుఫలప్రదకీర్తిఁ ♦ బరఁగియు స్వీయవం, శంబును సర్వనా ♦ శంబొనర్చె

తే. భూమిభారంబుఁ దీర్పఁగాఁ ♦ బుట్టినట్టి, యీశ్వరుండ వ్యథాసేయ ♦ నెట్లుగడఁగు?
సృష్టిసంహారములు వాని ♦ కెపుడు లీల, లమరవతనికి స్వపరభే ♦ దములు నృపతి!

వ. అట్టి విచిత్ర చరిత్రుండగు రమాకళత్రుండు ద్వారక గృహమేధియై చరించుచుఁ దనవచ్చిన పని కించిదవశిష్టంబయ్యెనని తలంచి యొకనాఁడు 24

చం. హయమఖముల్ బలేర్ వృపచ ♦ యాంవహముల్ సుఖదాయిమంగళా
లయములు గాయకాళి నక ♦ లాఘహరంబులునైన కర్మ సం

చయములొనర్చి శౌరి ముని ♦ సంఘముఁజేరి రొయికరిచి భక్తిఁ ద
త్క్రియలను వారిపీఠ్యాలిపె ♦ హృష్టుఁజేసి సముంచితార్చలన్. 25

తే. గాధినందనుం డసితుండు ♦ కశ్యపుండు
వామదేవుఁ డంగిరుఁడు దు ♦ ర్వాసుండు
భృగుఁడు కణ్వుఁ డత్రి వసిష్ఠుఁ ♦ డిల్వలారి
నారదుండు మున్నగు మునీం ♦ ద్రవ్రజంబు. 26

కం. ద్వారక చేరికఁగల పిం, డారకతీర్థమ్ము చెంగ ♦ టకుఁ జన నచటన్
వారక క్రీడించు యదుకు, మారకవర్గమ్ముఁ గాంచె ♦ మానులఘనులన్. 27

వ. కని కాలప్రేరితులై యొండొరులతో హాసన్ముఖులగుచు 28

కం చూచితిరే యీవేసా, లాచేతలు? జఠరపూర ♦ ణార్థంబ యిటుల్
వాచంయమవేషంబున, నోచెల్ల! చరింతు రెవ్వ ♦ రోగడ వీరల్? 29

కం. వీరిత పశ్శక్తి నివుడ, రారే చూపింతుమని క ♦ రాళించి యటం
జేరినకొందఱు సాంబుం, జీరి పడిగవేసి రవుడు ♦ స్త్రీవేషంబున్. 30

తే. వేసి కొంగదండంబులు ♦ పెట్టుకొనుచు, దాసి యల్లన మునులపా ♦ దాలువట్టి
అయ్య! యీపిల్ల గర్భిణి ♦ యడుగ సిగ్గు, పడుచునున్నది యీమె కే ♦ పట్టికల్గు?

కం. అనవిని మనలనువంచిం, పనుబూనిరె వీ! రటంచుఁ ♦ బటుకోపముతో
ననిరోమందులు! మీకుల, ము నాశనము సేయు నొక్క ♦ ముసలము పుట్టున్.

కం. అనెడినుడి పిడుగువలెఁ జెవు, లనుబడ గడగడవడఁకుచు ♦ లలిచెడి నిలువం
గను యదుకుమారకులు సాం, బునివస్త్రాభ్యంతరమున ♦ ముసలముతోఁ జెన్.

వ తోడనే మును లదృశ్యులై చనిరి. అప్పుడు సాంబాదు లమ్ముసలంబుం
గ్రహించి పరీక్షించి యది యయస్మయంబగుటకు విస్మయంపడి 34

—* యాదవు లుగ్రసేనునకు ముసలవృత్తాంతము సెప్పుట *—

మ. కలదే యిమ్మాయి, యిట్టివింత లెవ్వరుం ♦ గన్నారె? విన్నారె? లో
కులు నిందింపరె, యేమిచేయుదమికన్? ♦ గోపింపరే వీటఁ బె
ద్దలు? కట్టా! మన కేటికీ చెనఁటి చేఁ ♦ తల్ సేయఁగాఁ బాడు బు
ద్ధులు పుట్టెన్? మనమా మునీశ్వరులతో ♦ దోబూచియాటాడుటల్. 35

కం. అని విహ్వలాత్ములై దా, నిని గ్రహియించి మొగమందు ♦ నెత్తురులే కో
య్యన వెన్కకీడ్చునడుగులఁ, జని స్వీయపురంబునకును ♦ సాంబప్రముఖుల్.

కం. తేఁకు కొలువిచ్చియుండఁగ, వాడినమోముల నృపాలు ♦ వజ్జకరిగి చే
మోడువులఁ గతను వినిచిరి, కూడినయాదవులు భీతి ♦ గొల్లుమనంగన్. 37

కం. అప్పుడు కంసునితండ్రికి, నృపతులను గెలిచి యుబ్బు ♦ గొన్నమన కిదో
ముప్పాకటిపుట్టెఁగదరా, యెప్పటి కేదియొదవెడినో ♦ యెవ్వఁడెఱుంగున్. 38

మ. మనకున్ బ్రాహ్మణు లందు సంయమివరుల్ ♦ మాన్యుల్ గదా! నిత్యముం
జను దేరన్ హరిదర్శనార్థము మునీ ♦ శశ్రేణి యీరీతి గనుం
గొనరే! వారిప్రభావముల్ దెలియరే ♦ కోర్వెం దలం గోకకోఁ
జనునే? కొంపల నెల్ల ముంచితిరిరా ♦ సాంబా! నిమేషంబునన్. 39

వ. అన జాంబవతీనందనుం డిట్లనియె. 40

కం. తాతా! యాసమయంబునఁ, జేతంబులు పరవశతను ♦ జెందిన వేదో
భూతావిష్టులగతి విప, రీతప్రక్రియల సంచ ♦ రించితి మనఘా! 41

వ. నారదాదుల నెవ్వరుం జూచుచుండమే? ఏటికట్టి విపరీత బుద్ధులు పుట్టెనో యెఱుంగమన నుగ్రసేనుండు కొంతవడి చింతించి తలయూఁచి 'భవితవ్యతా బలవతీ' ఎవర మేమి చేయఁగలము. 42

మ. అని యాలోహము నూచి బీతుగొని తే ♦ హంబందు నిద్దాని నుం
చినచోఁ జే, టిది యిట్లయున్కి తగ, దో ♦ చ్చెంబిద్దిగా చేయుఁ, గా
వున దీనిం బొడిసేసి సంద్రమునఁగ ♦ ల్పుం డీగతిన్ రావు మా
సిన యారోఁకలి యింక యాదవులకుం ♦ జేటేమి గావించెడిన్. 43

వ. అని యదురాజగు నాహుకుం డాయయోముసలమ్ము నఱుగఁదీయించి తచ్చూర్ణంబుఁ దూర్ణంబ యర్ణవంబునం గల్పించె. అఱుగఁదీయఁ జేఁజిక్కని చిన్నయినుపముక్కనుగూడ సంద్రంబునం బాఱవేయించె. 44

కం. ఇక్కత యెల్లఁ బురంబునఁ, బొక్కెన్ బ్రాహ్మణులశాప ♦ ములు దప్పవటం
చుక్కిరిబిక్కిరి పగలం, జిక్కిరి ప్రముక్కిరిలు వేల్పుఁ ♦ జేరి ప్రజలోగిన్. 45

తే. అయ్యినుపశలాకనొకండు ♦ రొయ్య మ్రింగెఁ జూర్ణజంబాలపటలము ♦ స్తోకతరళ
తరతరంగముల్ గొంపోయి ♦ దఱిని విరియఁ, జిమ్మెనట ముమ్మెనలతుంగ ♦ గ్రమ్ము
దెంచె. 46

తే॥ జాలరి జరాహ్వయుఁడు మత్స్య ♦ సమితితోడఁ
బట్టి యారొయ్యఁ దత్కుక్షి ♦ వ్రక్కలించి
యినుపముక్క కంటంబడ ♦ నిదియు లెస్స
యంబు ముల్కి యాఁగా తమం ♦ చట్లొనర్చె. 47

కం. అంతట హరి హాసలవ, వృత్తాంతము విని కాలరూపి ♦ యఖిలార్థవిదుం
డింతజరుగవలెఁ గావున, నంతయు శాపము మరల్పఁ ♦ జూడం డనఘా! 48

వ॥ అని శ్రీశుకయోగీంద్రుండు వినిపించెను. 49

ఇది శ్రీ మద్గురుభాగవతమున నేకాదశస్కంధమందుఁ
ప్రథమాధ్యాయము

# ఏకాదశస్కంధము

## ద్వితీయాధ్యాయము

క. శ్రీభరితేర్యాచుపుర, క్ష్మాభృదధిత్యకనుపత్య ♦ క వసించి ఖల
క్షోభముడుపు నాశ్రితులద. యాభావనఁగాంచుచుండు ♦ హరిహరనాథా!

వ. [1]దేవా! యవధరింపు మవ్వల శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రు
నితో నిట్లనె. 2

—* నారదుండు వసుదేవునిచే నర్చింపఁబడుట *—

క. శ్రీవాసుదేవ వదనసే, వావిధముల మరగి నిలిచె ♦ ద్వారవతిఁ ద్రిలో
కీవిహృతిమాని నారద, దేవర్షి యదూద్వహుండు ♦ ధృతిఁ దేలింపన్. 3

క. అమలమతి! సేంద్రియుఁడు ని,త్యమృత్యుసన్నిహితుఁ డెవ్వఁ ♦ డర్చింపఁడు ది
వ్యమునీంద్రులె సేవింపఁగ, నమరమనోవిహరణంబు ♦ హరిచరణంబుల్. 4

వ. రాజేంద్రా! వినుము. నారదుండు గోవిందగుప్తోదారకమైన ద్వారకకు
మాటిమాటికివచ్చుచు దీర్ఘకాలమువసించుచుఁబోవువాఁ డొకనాఁడు
వసుదేవమందిరంబునకరుగ నతం డతిభక్తి నర్ఘ్యపాద్యాదిసత్కారంబు
లాచరించి సుఖాసీనుంజేసి పూజించి కేల్దోయి జోడించి యిట్లనియె 5

ఆ. ఓ మహానుభావ ♦ యుత్తమశ్లోకుండ, వైన నీదురాక ♦ యాత్మజులకు
జనకురాకచంద ♦ మునఁ గృపణులకైన, మాకునెల్లరకును ♦ మంచిసేయు. 6

క. భూతములకు గీర్వాణులు, సాతము దుఃఖమ్ము రెండొ ♦ సంగెద రెవ్వుఁడున్
సాతమ్మొకటియెయిత్తురు, పూతచరితులు మిముఁబోఁటి ♦ పూజ్యులు భక్తుల్. 7

ఉ. వేలుపులిచ్చుసౌఖ్య మతి ♦ వేలముగా దెవరెట్లు భక్తి భా
వాలను దమ్ముఁగొల్తురో? ధ్రువమ్ముగఁ దామును నట్లె నీడలుం
బోలెఁ జరింతు రెక్కుడిడఁ ♦ బోవరు కర్మసహాయులయ్యు జే
జే లిఁకమీరో దీనులకుఁ ♦ జేపడియుండిన కామధేనువుల్. 8

ఉ. ఓగురుదేవ! సర్వసుగు ♦ ణోదధి! నారదమౌనిచంద్ర! మీ
యాగమనంబుచేత నె కృ ♦ తార్థులమైతిమి యైనఁ గోరెదన్
భాగవతోరుధర్మముల ♦ వానిని శ్రద్ధగ నాలకింతురే
నోగులు సర్వశోభయము ♦ లొక్కటఁబాసి నరుల్ సుఖింపరే? 9

క. దేవా! పూర్వము ముక్తిదు, గోవిందుంగొల్చి సంతుఁ ♦ గోరితినఁట మా
యావశుఁడనగుచు, నక్కట!, కైవల్యముఁగోరనైతిఁ ♦ గక్కసపడితిన్ 10

---

1 ఈ యధ్యాయము 6.4.1946 ప్రారంభము

కం. చిత్రవ్యసనదమును స, ర్వత్రభయావహము నీ భ ♦ వము దాఁటుటకై
యాత్రమువహుచుంటిని శి, ష్యత్రాతా! నన్నెట్లు ♦ శాసించెదవో? 11

వ. ఇట్లానకదుందుభి ప్రార్థింప నారాయణగుణగణనానుగుణప్రశ్నంబులకుం బ్రహర్షహృదయుండై మహర్షి యిట్లనియె వసుదేవా! విశ్వశోధక మర్మంబులగు భాగవతధర్మంబులడిగి లెస్సనియాచరించితి వెంత యదృష్టము. 12

కం. అనఘా! యీధర్మము వి, న్నను జదివిన నాదరించి ♦ నం బొగడిన నొ
ప్పిన దేవభూతవిద్రో, హినిగూడఁ బవిత్రుఁ జేయు ♦ నెలమి నృపాలా! 13

కం. పరమాత్ముని నారాయణుఁ, బరమశుభుం దేవదేవు ♦ భగవానుని నా
స్మరణమునుదెచ్చి యెంతటి, పరోపకృతిసల్పితీవు ♦ వసుదేవ! యిట్లు. 14

నారదుండు వసుదేవునకు విదేహార్షభసంవాదము నుడువుట

వ. ఏతద్భగవద్ధర్మనిర్ణయవిషయంబున విదేహార్షభసంవాదరూపంబైన యితిహాసంబు పురాతనం బొండుగలదు. అదివిన్పించెద వినుము. స్వాయంభువ మనువునకుఁ బ్రియవ్రతుండుపుట్టె; నతనికాగ్నీధ్రుండుకలిగె; నాతనికి నాభిజనించె. వానికి ఋషభుండవతరించె. 15

తే. ఆఋషభునెల్లవారుఁ గొం ♦ డాడుచుండ్రు, మోక్షధర్మవివక్షఁ జేఁబుట్టె విష్ణు
నంశమున ఋషభుండంచు ♦ నాతనికి జ, నించి రాత్మజుల్ నూర్గురు ♦ నిగమ
విదులు. 16

కం. వారలలో జ్యేష్ఠుఁడు శ్రీ, నారాయణపరుఁడు భరత ♦ నాముఁ డతని ధ
ర్మారూఢిఁ దెల్పెదే యిది, భారతమయ్యె నజనాభ ♦ వర్షము వింటే 17

కం. భరతుం డెంతటి సద్ధ, ర్మరతుండో! యతనిమీఁదఁ ♦ బ్రజ కెంతటి భ
క్తిరసంబో? భారతమని, పరగెన్నామ మజనాభ ♦ వర్షంబునకున్. 18

ఆ.వె. భుక్తభోగమహిని ♦ బోనాడి వని కేగి, హరిపదాంబుజంబు ♦ లాత్మనిలిపి
భూరితప మొనర్చి ♦ మూఁడుజన్మంబుల, కీశుపదముఁ బొందె ♦ ఋషభయోగి. 19

క. తొమ్మండ్రుసుతులు దీవులు, తొమ్మిదిటికిఁ బ్రభువులైరి, ♦ పూర్వావులై బ్రా
హ్మల్యమొ్మలయఁ గర్మరతులై. రిమ్ముల నెనుబదియొకండ్ర ♦ హీనచరిత్రా! 20

తే. మిగిలియున్న తొమ్మండ్రు న ♦ మేయయోగ
బలయుతులు దిగంబరు లాత్మ ♦ పరులు నైగ
మార్థశంసులు శ్రమణు ల ♦ త్యలఘుచరితు
లమ్మహాభాగుల నుతింప ♦ నలవిగాదు. 21

వ. వారి నామంబు లఘహరణచణంబులు వినుము. ఆ ఋషభనందనులు తొమ్మండ్రు కవి, హరి, అంతరిక్షుఁడు, ప్రబుద్ధుఁడు, పిప్పలాయనుఁడు * ఆవిర్హోత్రుఁడు, ద్రుమిలుఁడు. చమసుఁడు, కరభాజనుఁడు నను లౌకిక నామమ్ముల వహించి స్థూలసూక్ష్మాత్మకంబు భగవద్రూపంబు నగు విశ్వంబు స్వావ్యతిరేకంబుగాఁ గాంతురు. అప్పరమహంసవతంసు లవ్యాహతేష్టగమనులై సురసిద్ధసాధ్యగంధర్వయక్షనరకిన్నరనాగలోకంబులను మునిచారణభూతనాథవిద్యాధరద్విజగోభువనంబుల ననాసక్తిం జరించుచు నొక్కనాఁడు 22

కం. వారందఱు ననుదెంచిరి, భారతవర్షమున నిమిస్థ ♦ పాలుఁడు మునిబృం
దారకులఁగూడి సల్పు ను, దారంబగు దీర్ఘసత్ర ♦ యాగంబునకున్. ౨౩

ఉ. అనిమిభూమినాయకుఁడు ♦ నాహవనీయముఖాశ్రయాశులున్
భూనుతఋత్విగాదిముని ♦ పుంగవులున్ మఱి సభ్యులున్ సము
త్థానవిధాభియానముల ♦ దాసిరి తద్భగవానులన్ మహా
జ్ఞానుల మాన్యులన్ సురుచి ♦ చండమయూఖవిభాసమానులన్. ౨౪

ఉ. అమ్మనుజేశ్వరుండు విన ♦ యమ్ము భయమ్మలార నర్ఘ్యపా
ద్యమ్ముల నర్హపూజలను ♦ దన్పి సుఖాసనసన్నివిష్టులై
బమ్మనిసుంగులంబలె న ♦ వార్యతనూరుచి వెల్గువారితోఁ
దొమ్మిదిమందితో నవన ♦ తుండయి తేఁ డిటులాడె వేడుకన్. ౨౫

ఉ. స్వాములు ! వందనాలు భగ ♦ వంతునిపార్షదులై యనన్యభా
వామలచిత్తులై నిరత ♦ హర్షమునందనరారు మీరు మా
భూములఁజేరుటెల్ల మముఁ ♦ బుణ్యచరిత్రులఁ జేయఁగాదె! యే
నోములు తొంటిబామునను ♦ నోఁచితిమో గదె మిమ్ముఁజూడఁగన్. ౨౬

కం. కోరికలులేని మీ రీ, తీరునఁ గ్రుమ్మరఁగ నాదు ♦ తెంచెడియర్థం
బారసితి లోకులం గరు, ణారతిఁ బావనులుగా నొ ♦ నర్పనగాదే! 27

కం. పరమపురుషార్థసాధన, కరణముగుట మనుజతనువు ♦ క్షణభంగురమే
నరిది యదిపొందవినను మఱి,యరిది ముకుందప్రియాద ♦ రాలోకనముల్. 28

తే. అదియు మాయదృష్టమ్మున ♦ నొడవెఁగాన
నడిగెదను మిమ్ముఁ బరమక ♦ ల్యాణపథము
నెమ్మి నుడువరే నరులకు ♦ నిముసమైన
సుజనసన్నిధి సన్నిధి ♦ సూరులార ! 29

* 'ఆవిర్హోత్రోద్రమీళశ్చ' అని వావిళ్లవారి ప్రతి. అవిర్హోత్రోథ ద్రుమిలః " 'అని బొంబై నిర్ణయసాగర ప్రెస్ ప్రతి. గోరఖపుర ప్రతిలోను ద్రుమిల అనియే కలదు.

కం. వేనివలనం బ్రబన్నుం డై నిజదాసులకుఁ దన్ను ♦ హరియొసఁగునో మా
కా నిరుపమభగవద్ధ ర్మానీకము నడుపుఁడు విన ♦ నర్హులమైనన్. 30

-♦ నిమికిఁ గవి భాగవత ధర్మలక్షణములు సెప్పుట ♦-

వ. అని నిమిభూవల్లభుండడిగిన వసుదేవునితో మఱియు నారదుం డిట్లనియె. అట్లు నిమి యడుగఁ బరమకల్యాణంబగు భాగవతధర్మమును నార్షభులలో జ్యేష్ఠుండగు కవిమునీంద్రుం డిట్లు చెప్పందొడంగె. 31

ఉత్సాహ. అనఘ! సతముగాని దేహ ♦ మందు నాత్మభావముం
జినని భయముపుట్టుఁ జుమ్మి ♦ శ్రీనివాసునంఘ్రి సే
వనఁ బొనర్ప నిత్య మట్టి ♦ వారి నెట్టిభీతియుం
జెనక దీశుఁ డభయమిచ్చి ♦ చేరి వారిఁ బ్రోచెడిన్. 32

వ. పరమకల్యాణంబన నభయంపుటుకియ సుమీ. 33

ఆ.వె. ఆత్మలబ్ధికొఱకు ♦ నఖిలేశ్వరుం డే యుపాయములను జెప్పెఁ బామరాళి
కైన నెఱుఁగు భంగి ♦ నవి భాగవతధర్మములని యెఱుఁగవయ్య! భూపవర్య!

మ. అవనీనాయక! యోగముఖ్యపరత ♦ ర్మాళింబలెన్ విఘ్నముల్
దవులన్ రావిట నీసుధర్మముల నే ♦ త్రద్వంద్వముల్ మూసికొం
చవిచారంబుగఁ బర్వదీసినఁ బడం ♦ డట్టిట్టులం బ్రోవఁ గొం
త విడం ద్రొక్కిన నేయుపాయమును బొం ♦ దం డెయ్యెడన్ భూవరా! 35

వ. అట్టిభాగవతధర్మంబు వినుము. 36

మ. తనుబుద్ధీంద్రియచిత్తవాఙ్మనములం ♦ దాఁ జేయుఁ గర్మంబు శా
స్త్రనిబద్ధంబు నవైదికంబుఁ, బ్రకృతి ♦ స్వాధీనుఁడై వానినె
ల్లను నారాయణమూర్తికర్పణము స ♦ ల్పంగా వలెన్ దీనినే
యనఘా! భాగవతోరుధర్మమని ధీ ♦ రానీకము న్వాకొనున్. 37

వ. తనకంటె మఱొకద్వితీయవస్తువున్న దనుసభినివేశంబునను, మఱియు

చం. పరము నెఱుంగ లేమిని వి ♦ పర్యయబుద్ధిజనించి దేహమే
పరమనిపించు నక్కతనఁ ♦ బాటిలుభీతి తదీయమాయచే
నరవర! కానఁ బండితుఁడ ♦ నాంతభక్తినిబద్ధబుద్ధియై
గురునియనుగ్రహంబుఁ గొని ♦ కొల్వవలెం బరమేశ్వరుం బరున్. 39

తే. ధ్యాతృమతిని స్వప్నమనోర ♦ థంబులట్ల
విద్యమానమయ్యు జగంబు ♦ వెలుఁగుచుండుఁ
గానఁ గర్మసంకల్పవి ♦ కల్పకంబు
మానమునరికట్టి యభయ మొం ♦ దును బుధుండు. 40

వ. మనంబుం గెల్వనోపనిచోఁ గొంతసులభమార్గంబుం దెలిపెద విను. 41

కం. హరిజన్మకర్మముల శుభ, కరనామమ్ములను గీతి ♦ కలను వినుచు ని
బ్బరముగఁ బాడుచు భక్త్యా,కరతుండయి వాంఛలుడిగి ♦ క్రాలఁగవలయున్.

సీ. హరినామకీర్తన ♦ మట్లుచేయఁగఁజేయు, నపరిమితప్రేమ ♦ మావహిల్లు
హృదయంబుకరఁగు నో♦యీ! యోడితేయని, బిగ్గిలినవ్వును ♦ పేక్షసేయఁ
దగునని నీకంచు రో♦దనమొనర్చును బల్కు, వేమి రాపిఁవ్వనం♦చిట్టియాడుచు
ననుదయఁజూడరా♦యనిధరఁబడునను. గ్రహముపచ్చెనటంచు♦గంతులిడును

తే. గనిమొనన్నంచుఁబాడును♦గాతునసిమె, నన్నటంచునర్తించును♦న్మాదుఁబోలె
నవశుఁడై యుండునానంద♦మనుభవించు, భక్తవర్యుండునుగుణసం♦పన్నుతుండు.

ఆ వె. భూతపంచకంబు♦జ్యోతిస్సరిత్సము, ద్రములు జంతువులను♦దరులు దిశలు
సర్వమును ముకుందు♦శారీరమేయంచు, నుదితభక్తిమ్రొక్క♦చుండవలయు.

వ. హరిభజనంబు నొనర్చుచుండఁ బ్రతిభజనంబునను 45

తే. భక్తునకునీశ్వరగుణాను♦భవము, భక్తి, భవవిరక్తియీమూఁడొక్క♦పరిజనించు
క్షుచ్ఛమంబునుదుష్టిపు♦ష్టులునుగుడువు, కుడువునందునన్నాదున♦కడరునట్లు.

వ. ఇట్లు ప్రతిభజనకాలమ్మునను హరిగుణజ్ఞానభక్తివిరక్తు లుదయించుచుండం
గ్రమముగాఁ గొంతకాలమునకుఁ బరమశాంతియగుముక్తి కలుగునని చెప్ప
హర్షించి నిమి యిట్లనియె.

ఆ. వె. పరమహానులార!♦భాగవతుని ధర్మ, ములును వర్తనములు ♦ భూరి లింగ
ములను జెప్పఁడయ్య;♦ మొగినాతఁడెట్టివాఁడేమిపల్కుచుండు♦నిచ్చకొలఁది?

— నిమికి హరి భక్తధర్మాదులం జెప్పుట —

వ. అనిన రెండవవారికాంక్షి యగు హరి యిట్లనియె. రాజా! భక్తధర్మములు
విను. 49

కం. తననాభూతములందున్, దనయందాభూతములను ♦ ధరణీశ్వరమం
డన! భగవద్భావముతోఁ, గనువాఁడుత్తముఁడుభక్త♦గణములలోనన్. 50

తే. అభవునందుఁబ్రేమముభక్తు♦లందుమైత్రియజ్ఞజనులందుఁగృపశత్రు♦లందుఁపేక్ష
యిట్లు భేదదర్శనుఁడయి♦యొసఁగుకతన, వాఁడుమధ్యమభక్తుండు♦వసుమతీశ! 51

కం. క్షితినాథ! యీశు నర్చా, ప్రతిమావళియంద మివుల ♦ శ్రద్ధకలిగి త
ద్భక్తులనొరులనరయఁడుప్రా, కృతభక్తుఁడువీఁడుభక్తి♦యిప్పుడయొదవన్.

వ. ఈ ప్రారబ్ధభక్తి క్రమక్రమముగా నున్నతస్థితి కరుగును. ఇఁక భక్తుఁ డెట్లు
వర్తించునో నుడివెద వినుము. 53

తే. ఇంద్రియముల నర్థములు గ్ర ♦ హించి వాన,
హర్ష రోషము లెడఁదకు ♦ నంటనీక
యనఘ! విష్ణుమాయామయం ♦ బఖిల విశ్వ
మంచు వర్తించు భాగవ ♦ తాగ్రసరుఁడు. 54

తే. వసుమతీశ దేహమున కు ♦ త్పత్తినాశ
ములును, బ్రాణమ్మునకు క్షుత్తు, ♦ బుద్ధి కిచ్ఛ,
విషయములకుఁ శ్రమ, మెడఁదకు ♦ భీతి, స్వస్వ
ధర్మములటంచు వానిని ♦ దగులఁబోక
యభవుఁ గొల్చుచు మెలఁగు భ ♦ క్తాగ్రసరుఁడు. 55

కం. కామంబులు కర్మంబు ల, స్తోమంబులు వాసనలును ♦ దొడర వెవనిహృ
ద్ధామమున, నెవఁడుగొల్చునో, దామోదరు, భాగవత♦తంముఁడువాఁడే.

వ. రాజా! భక్తుఁడే లింగముల భగవత్ప్రియుండగునో చెప్పెద వినుము 57

తే. జన్మ కర్మ వర్ణాశ్రమ ♦ జాతులందు
దేవిచేనైన శ్రేష్ఠుండ ♦ నేనియంచుఁ
దనువుపం దహంభావ మె ♦ వ్వనికి లేదో,
వాఁడ యచ్యుతప్రియుఁడు భూ ♦ పాలతిలక! 58

వ. మఱియు భక్తుండు యాదృశుండో వివరింతు వినుము. 59

కం. ధన దేహాదులయందుం, దనదియనుచుఁ బరునిదనుచుఁ ♦ దా భేదంబుం
గనక సకలభూతసముఁడు, ఘనశాంతుఁడునైనవాఁడె♦గా భక్తుఁడనఘ. 60

కం. త్రైలోక్యరాజ్య మబ్బినఁ, గాలము నిమిషార్థమైనఁ ♦ గడవఁడు భగవ
ల్లీలానుభూతిఁ దవులక, యాలము సేసి యతఁడేగ ♦ దా భక్తుఁడనఘ. 61

కం. భగవత్పాదాంభోరుహ, యుగళార్చనకంటె సార ♦ మొకఁడున్నదె యం
చగణితనిఖిలభక్తిం, దగిలికొలుచు భాగవతవ ♦ తంసుండు హరికి. 62

చం. అనఘ! త్రివిక్రమాంఘ్రియుగ♦శాంగుళీశుభ్రనఖాభచంద్రికా
ఘనరుచి, భక్తచిత్తజవి ♦ కారములుం బరితాపముల్ నశిం
చును, రవిచండభానుపరి♦శోష మడంగదె రాకయుందుఁ దూ
ర్పున నమృతాంశుమండలము ♦ పుట్టినయంత నిమిత్తితీశ్వరా! 63

వ. ఇఁక భక్తుం డేమిపల్కునంటివి. అతండు సంతతము సర్వేశ్వరునామముల
కంటె నన్యంబుపల్కునే! 64

మ. అవశుండై తనపేరుఁబేర్కొనినఁ బా♦పౌఘంబు మాయించు న
ట్టి విభుం డుత్కటభక్తిపాశములచే ♦ డెందంబునం బాదప

ద్మవిలాసంబులఁగట్టిపెచు శ్రితు నే ♦ దంఘ్రీ! యితం డౌర భా
గవతశ్రేష్ఠుఁడయంచు నెంచి జనక ♦ క్ష్మాపాలచూడామణీ! 65

శా. అంభోజాసన పాకశాసనకృశా ♦ న్వాద్యాది తేయుల్ శుభా
రంభుల్ సంతత మేమహానుభావుని ద్వా ♦ రఁబుం బ్రతీక్షించుచుం
గాంభీర్యంబులు దక్కియుండు రతసం ♦ గారుణ్యావాధోనిధిక్
దంభానస్థిరభక్తిఁ గొల్వఁగను ని ♦ త్యశ్రేమ మేపారదే! 66

వ. అని హరి మహర్షి నిమికిం జెప్పెనని నారదుండు వసుదేవునకుబోధించినట్లు
శుకయోగి వచించెను. 67

ఇది యేకాదశస్కంధమున ద్వితీయాధ్యాయము.

---

## తృతీయాధ్యాయము

కం. గుంటూరుమండలరమకు, గెంటుమయిన కొండపీటిఖిల్లా క్రేవం
దంటయయిన యేర్యాచురన, నంటుమొయి వెలుంగుచున్న ♦ హరిహరనాథా!

వ.[1] దేవా! యవధరింపు మవ్వల శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో
నిట్లనియె. నారదుండు వసుదేవు నాదరంబునంజూచి వసుదేవా! వినుము.
పిదప జనకభూపతి యార్షభులకు మ్రొక్కి 2

కం. ఓమునులారా! మాయల, నే మోహితులంబొనర్చు ♦ నీశ్వరు మాయా
సామర్థ్యం బెఱిఁగింపరె, నామది తనివోద హరిగు♦ణశ్రవణమునక్. 3

కం. యతివర్యులార! సంసారతాపతప్తుండ నగుచు♦ రాల్పడు నన్నా
దృతి నుద్ధరింపరె వచో,మృతమున భవమునకు మందు♦శ్రీశుకథయొగా. 4

వ.[2] వెనుక విష్ణుమాయామయం బఖిలవిశ్వ మనినుడివితిరి గానఁ దన్మాయను
వివరింపంగోరెదనన నంతరిక్షాహ్వయుండు తృతీయార్షభుం డిట్లనియె.
జనకరాజా! సులభముగాఁదెలియుటకై సృష్ట్యాదికార్యద్వారమున మాయా
స్వరూపము నిర్ణయించెదను 5

-♦ నిమికి నంతరిక్షుఁడు మాయాకార్యము నుడువుట ♦-

*తే.[3] రాజ! దేనిచే నిర్గుణ ♦ బ్రహ్మమందు,
భాసిలుచునుండు నాత్మ వి ♦ వర్తయంబు
అదియె మాయ, యామాయచే ♦ నాద్యుఁడీ ప్ర
పంచము సృజించునని శ్రుతుల్ ♦ పల్కుచుండు 6

---

1 ఈయధ్యాయప్రారంభము 14-4-1946 2 అధ్యాయము 64 వ పద్యము. 3 పూలగుచ్ఛలకు
మూలశ్లోకములు బొంబైప్రతిలోను గోరఖపుర ప్రతిలోను లేవు.

* తే. జాగరణమింద్రియార్థగ్ర♦హాగతంబు, స్వప్నమంతఃకరణసంభ♦వభ్రమంబు
వినుసుషుప్తితద్వాసనా♦బీజమాత్ర, యాస్వతుండై నవాఁడెతు♦ర్యాభిధుండు.

*వ. అని యంతరిక్షుండు నిమిమొగంబుంజూచి రాజా! మరలవిను. 8

*సీ. చక్షురాదీంద్రియ ♦ సమితిచేత నెడంద, నస్థిరరూపము ♦ ఖార్థతతులు
స్థిరములంచుభ్రమమ్ము♦ చెందుట యొజాగ, రము కేవలాంతఃక♦రణజనితము
లస్థిరమ్ములగురూ♦పాదులుసత్యముం, చునుభ్రమించుటస్వప్న♦మనఘ! యీద
శాయుగసంస్కార♦సహితమై జ్ఞానభం, జకముగానున్న బీ♦జమ్మె సూసు

తే. షుప్తియగును జాగ్రత్స్వప్న ♦ సుప్తములు య
థార్థములుగావు మిథ్య లా ♦ త్రయమునందు
నన్వితుఁడయి తురీయుఁ డౌ ♦ వ్వారు వాఁడె
బ్రహ్మ. మాత్మ, సత్యం బదే ♦ వార్థిచేంద్ర! 9

*వ. విశుద్ధంబైన జ్ఞానమొక్కండే మాయవలనఁ ద్రిపుటిగా భాసించుచున్నది. స్వప్నావస్థలో నధిష్ఠానాత్మయందు స్ఫురించు సంవేత్త, సంవేదనము, సంవేద్యము ననుమూఁడును వైతథ్యవ్యభిచారంబులంజేసి మిథ్యలు. స్వప్నమునుండి జాగరమునకు వచ్చుటతోడనే స్వాప్నికపదార్థంబు లేవి? మఱియు నవి యొకప్పుడుంటయు మఱొకప్పుడు లేకుంటయు ననెడి రాకపోకలు గలవిగదా. అందువలన స్వప్నము మిథ్యయని తోఁచుటలేదా? ఈ స్వప్నంబుంబోలె జాగ్రత్సుషుప్తులను లెస్సగా విచారించుకొన్న మిథ్యలని తేలును. ఇదియే మాయాకార్యము. మఱియు, 10

—♦ నిమికి నంతరిక్షుండు సృష్టిలయప్రకారములు నుడువుట ♦—

సీ. భూతాత్ముఁ డాద్యుండు ♦ పురుషుఁ డేతదు
చ్చావచభూతసం ♦ చయము స్వకృత
పంచమహాభూత ♦ పాళిచేతను స్వమా
త్రాత్మప్రసిద్ధికై ♦ యటు సృజించి
తద్భూతములలోనఁ ♦ దాఁ బ్రవేశించి యం,
తర్యామియగుచు నం ♦ తఁ బదునొకఁడు
విధములుగాఁ దన్ను ♦ విభజించుకొని మనో
రూపమ్మున హృషీక ♦ రూపమునను

తే. తత్తదర్థాళిఁగుడుచుచుఁ♦దనువునందె, మివులనాత్మాభిమానంబుఁ♦దవులుకొలిపి
యైహికసుఖంబులకెసక్తుఁ♦డై చరించు, నీనిఖిలముమాయా కార్య♦మేనృపాల!

కం. కర్మేంద్రియములచేతఁ, గర్మము సేయుచును వాఁడు ♦ నాబలమునఁ బ్రా
క్కర్మఫలంబుం గుడుచుచు, నర్మిలి నీజీవుఁ డీ భ ♦ వాంబుధిఁ దిరుగున్. 12

కం. ఇట్టులు జీవుఁడు కర్మముఁ, బట్టి లభించిన వ్యథాల ♦ వాలతనువులం
బుట్టుచుఁ జచ్చుచుఁ బ్రళయము, దొట్టువఱకునవశుఁడగుచు♦దొల్లుచునుండున్

వ. ఇది సృష్టివిషయ మింకఁ బ్రళయవిషయము విను, సర్వమహాభూత వినాశ
హేతువైన సంప్లవంబాసన్నంబగుడు నాద్యంతశూన్యుఁడగు కాలాత్ముండు
పంచభూతములచేతను శబ్దాదిగుణములచేతను నిర్మింపంబడి స్థూలసూక్ష్మ
స్వరూపముగానున్న వ్యక్తంబైన యీ విశ్వంబుచు నవ్యక్తమునం జేర్ప
నాకర్షించు, నంత, 14

సీ. వర్షశతావధి ♦ వర్షమ్ములుండ వ, ర్కుఁడుఁ ముజ్జగంబేర్చు ♦ ఘోరఘృణుల
సంకర్షణముఖాగ్ని ♦ స్పర్శనప్రేరిత, మై యూర్ధ్వశిఖలతో ♦ నఖిలదిశలఁ
బొలయుచు బాతాళ♦మునసుండియుత్థితం, బైనిఖిలము బూది♦గానొనర్చుఁ
బ్రళయకర్తయగుసాం♦వర్తకుండునమేఘ, చయుఁడయిహస్తిహ♦స్తప్రమాణ

తే. భూరిధారలవర్షించు ♦ నూఱువత్స, రంబు లఖిలంబు నంబును ♦ యంబుగాఁగ
నీట సైంధవ మెట్టులఁ ♦ మాటుమణఁగు, నట్టు లానీటిలోనున్న బ్ర♦హ్మాండమణఁగు

తే. అట్టులు నుపాధియానంద ♦ ముంబులయము
గాఁగ వైరాజపురుషుండు ♦ కదలి తనకు
నాదికారణమైన య ♦ వ్యక్తమందు
నడఁగు నింధనశూన్యమౌ ♦ నగ్నిపోలె. 16

సీ. అవని నీరమ్ములం♦ దణఁగు సాంవర్తకుం, డనిలుండు తద్గంధ ♦ మపహరింప
నానీర మగ్నిలో♦నణఁగుఁ దద్రసమును, నవ్వాయుమూర్తియే♦యపహరింప
నాయగ్ని యనిలమం♦దణఁగుఁ దద్రూపంబు, సంవర్తకతమంబు♦సంహరింప
నాయనిలము నభం♦బందణంగును దదీ, యస్పర్శమవకాశ ♦ మాహరింప

తే. ఆనభంబును దామసా ♦ హంకృతిఁ ల
యించుఁ గాలాత్ముఁడైనట్టి ♦ యీశ్వరుఁడు త
దీయశబ్దగుణమ్ము హ్రా ♦ తింబొనర్పఁ,
గాలమున శబ్దము నశింపఁ ♦ గనమె నృపతి ! 17

శా. ఇంకంబోతెడి బుద్ధి యింద్రియదశం ♦ బేకంబుగా రాజసా
హంకారంబున, దేవబృందములతో ♦ స్వాంతంబు తత్సాత్త్వికా
హంకారంబున, నిట్టులా త్రివిధకా ♦ ర్యశ్రేణితో నమ్మహా
హంకారంబు మహత్తునం దదియు న ♦ వ్యక్తంబునన్ భూవరా! 18

కం. ఇమ్మాయయె త్రిగుణాత్మక, యమ్మాయి సృష్టిస్థితులు ల♦యమ్ముల నడికా
ర్యమ్ములకై యీశ్వరుకర,ణమ్మైనది యింక నెది వి♦నన్వలతు నృపా! 19

ప. అనిన విని నిమిభూపాలుం డంజలిఘటించి మహాత్ములారా! యవశీకృతాంతఃకరణులము దేహాత్మాభిమానులము నగు మేము దుస్తరంబైన యీశ్వరమాయను సులభముగా దాఁటుమార్గము నుపదేశించి మమ్ముఁ గృతార్థులం జేయుఁడన నార్షభుండైన ప్రబుద్ధుండు చతుర్థుం డిట్లనియె. 21

—* నిమికిఁ బ్రబుద్ధుండు వైరాగ్య ముపదేశించుట *—

ఉ. చిత్త మొకింతద్రిప్పి పరి ♦ శీలనచేయుము! చూడుమా! నృపా
లోత్తమ! యీ మనుష్యులు మ ♦ హోన్నతసాధను లేర్పఱించి క్రొం
బుత్తడి బొమ్మలన్ సతులఁ ♦ బొందుచు దుఃఖనివృత్తికిన్ సుఖా
వృత్తికిఁ జేయుచేష్ట లవి ♦ వ్రేల్మిడి వ్యత్యయమందుచుండుటల్. 22

ఉ. సంతతమున్ శ్రమంపడుచు ♦ జాల్ములఁ జేరుచు మృత్యుదేవితోఁ
బంతములాడుచున్ నిదుర ♦ పట్టును నాఁకలివట్టకుంగ కెం
తెంతలొ సేయుచున్ సుఖము ♦ లెల్లను బాయుచుఁ బాడుత్రోవలం
గంతులువైచుచున్ ధనము ♦ కై నరులుం బడుపాట్లు చూడుమా! 23

ఉ. ఎన్నిశ్రమంబులోపడి గ్ర ♦ హించిరి, పోషణచేయుచుండి రం
చు న్ననరూని విత్తమొక ♦ చో వసియించునె? తగ్గకుండునా?
కన్నులదుమ్ముగొట్టి పర ♦ కాయనివేళ మొనర్చి యంతలో
న న్నరుఁబాసిపోయెడి ధ ♦ నంబునకై పడుపాట్లు చూడుమా! 24

ఉ. కట్టినగీములుం జెడక ♦ క్రాలునె? ప్రేముడి యాము డిక్కఁజే
పట్టిన నాతివ్యాధులను ♦ వ్రాలదె? కూరిమిపట్టి కెవ్వఁడుం
జెట్ట ఘటిల్లదే? పసులు ♦ చేడ్పడవే? సకలంబు మిత్తియుం
బొట్టనుబెట్టుకొంట కన ♦ మో వినమో మన మో నృపాలకా! 25

ఉ. కాంచుచునుందు మీకనులఁ ♦ గాయము రాకలపోకల న్నిరీ
క్షించుచు నుందు మీధనము ♦ క్రేళ్లులువాఱుచుఁ బోవుచుంట లె
క్కించుచు నుందు మాయువు న ♦ ఖిన్నత వ్రేళులమీఁద నక్కటా!
యించుకయైన బుద్ధి జని ♦ యింపద నిత్యపదార్థ మారయన్. 26

ఉ. నిన్నను గన్న దేదయిన నిల్చెనె నేఁ డొకమార్పులేక? య
ట్లున్నదటన్నఁ గన్గొనుచు ♦ నుండమె జీర్ణశరీరవృద్ధులన్?
గన్నుల నో నృపాలతిల ♦ కా! జగమందున నేది నిత్యమై
యున్నదిలేదు దీనికొఱ ♦ కొందఁగనేటికొ పెక్కుబాధలన్! 27

కం. ఆలింజుట్టుకొనుం గే, హాలిం గట్టుకొను బతుచ ♦ యముఁ బెట్టుకొనున్
జాలఁగఁ జిరసౌఖ్యం బీఁ, జాలకపోఁగ నివి దుఃఖ♦ జాలముఁ గూర్చున్. 28

మ. అకటా ! యస్థిర సౌఖ్యమే యిది యని ♦ త్యంబంచుఁ జింతింతు వే
మొకొ ? నితాంతంబు మఖాదికర్మములచేఁ ♦ బుణ్యంబు నార్జించి పొం
దిన యాముష్మికసౌఖ్యముల్ సయితమిం ♦ తే నిత్యముల్ గావు, క
ర్మనిమిత్తంబున వచ్చు లోకము నరేం ♦ ద్రా ! శాశ్వతంబౌనటే ! 29

తే. అధికులందసూయ సమాను ♦ లందుఁ స్పర్ధ
ధ్వంసమందు భయాదులు ♦ వఱలుచుండు
మండలేశుల కట్లు సా ♦ మాన్యులకును
గాదుసంపద ! యెల్లప్పు ♦ బాధ నెట్టు. 30

వ. అని యిట్లు విచారించి కర్మచితంబైన యీ లోకంబును బుణ్యచితంబైన పరలోకంబును రెండును శాశ్వతములు కావనియు నిరతిశయసౌఖ్యము నీఁజాలవనియు నిశ్చయించుకొని యాత్మశ్రేయస్సునెఱుంగంగోరి 31

-♦ ప్రబుద్ధుఁడు మాయాతరణోపాయము నుడువుట ♦-

చం. సదమలచిత్తునిం బరమ ♦ శాంతుని సాంగముగాఁ ద్రయీతతిం
జదివినవాని నాత్మరతు ♦ సంశయముల్ దొలఁగింప దక్షునిన్
సదయుని బ్రహ్మవేత్త గుణ ♦ శాలి నిరీహుని సద్గురూత్తమున్
ముదమునఁ జేరి యంఘ్రులకు ♦ మ్రొక్కి భజించి నితాంతభక్తిమై 32

మ. గురుఁడే దైవత మాత్మయంచు మదిలోఁ ♦ గొండాడుకొంచున్ నిరం
తరనిర్వ్యాజరమ్యార్చనాక్రియలచే ♦ దన్పుచున్ భక్తధ
ర్మరహస్యంబు లెఱింగి యావిధిఁ జిరం ♦ వం దాన నయ్యీశ్వరుం
డరుసంబంది వశుండగున్ బలియె దృ ♦ ష్టాంతంబు శిష్టాగ్రణీ ! 33

వ. మఱియు మాయందరింపఁగోరువాఁ డెట్లు మెలఁగవలయునో చెప్పెద. విను.

సీ. ప్రథమంబునన్ సాధు♦వరులసాంగత్యంబు, మదికి నెందును సంగ♦మంబు లేమి
దీనులందు దయ స♦మానులందును మైత్రి, ప్రాజ్ఞులయందును ♦ బ్రశ్రయంబు
సంతర్బహిశ్శౌచ ♦ మాత్మధర్మాచర, ణంబు తితీక్ష మౌ ♦ నవ్రతంబు
స్వాధ్యాయనిష్ఠయు ♦ నార్జవంబును బుతు, కాలస్వదారసం♦గం బహింస

తే. కష్టసుఖముఖద్వంద్వాలఁ♦గలఁగకుంట, భాగవతశాస్త్రవితతిశ్ర♦ద్ధాగమంబు
నితరశాస్త్రంబుల ననింద♦యింద్రియాను, భావవిజయంబును యథార్థ ♦
భాషణంబు 35

సీ. అఖిలంబునందు ని ♦ యంతృభావమునసీ, శ్వరునిసంవిత్స్వరూ♦పమున నాత్మ
నన్వీక్షసేయుటే ♦ కాంతశీ త్వంబు, గృహముఖాద్యభిమాన♦రహితతయును

దొరకినదాన సం ♦ తోష మొందుట వివి, క్తనిపాతవల్కల ♦ ధారణంబు
క్షమయును బ్రాణాయామము ♦ మనవాక్సంయమంబు, వంగర్మము, ననీహ ♦
నలుపుటయును:

తే. అద్భుతక్రియుఁడగు హరి ♦ యతులజన్మ
కర్మగుణసమూహంబు ని ♦ ష్కలుషభక్తి
శ్రవణకీర్తనధ్యానముల్ ♦ సల్పుటయును
కృతము సర్వము హరికి న ♦ ర్పించుటయును. 36

సీ. యజ్ఞదానతపోజ ♦ పాచారములఁ గల, ద్రవ్యక్షేత్రపుత్రిక ♦ ప్రాణచయము
నాత్మకుఁ బ్రియమైన ♦ యఖిలంబుఁ బరమున, కంచితమతి నివే ♦ దించుటయును
హర్యాత్మనాథస ♦ ఖ్యంబును స్థావర, జంగమపరిచర్య ♦ సరవి నందు
నరులను ధర్మత ♦ త్పరులను భక్తశ్రే, ష్ఠులను బూజించి ♦ పరలుటయును

తే. భక్తజను లొండొరులు భగ ♦ వానుభవ్య
యశము పాడుకొనుట రతి ♦ నందుట సుఖ
మొనయుట సమస్తదుఃఖని ♦ వృత్తిఁగనుట,
యభ్యసింపంగవలె నీవు ♦ సాధి నెల్ల 37

వ. ఇట్లు భాగవతధర్మంబుల నభ్యసించుచుండం గొండొకకాలంబున నాభక్తులు

కం. కలుషహరుఁడైన హరినిం, దలఁచుచుఁ దలఁపించుచును మి ♦ థస్సాధనభ
క్తులఁ బ్రేమభక్తులం దే, హలతల ధరియింతురు పుల ♦ కాంకురంబుల్. 39

చం. హృదయము నచ్యుతాంఘ్రులప ♦ యిం దగిలించి యలౌకికక్రియా
స్పదులయి యేడ్తురొక్కయెడఁ ♦ బాడుదురొక్కవు డొక్కయిక్క న
వ్వుదు రొకతావు నన్నటన ♦ పొడిమిఁ జూపుదు రొక్కచోటఁ బ
ల్కుదు రవలం బరాత్పరునిఁ ♦ గూడి సుఖింతురు నిష్క్రియావిధిన్. 40

కం. ఈ రీతి భాగవతధ, ర్మారూఢిం దనరుభక్తుఁ ♦ డక్రమమున శ్రీ
నారాయణపరుఁడై దు, ర్వారంబగుమాయదాఁటు ♦ రాజవరేణ్యా! 41

వ. అని యిట్లు వసుదేవునితో నారదుండువల్కి మఱియు నిట్లనియె. అట్లార్షభుండు భక్తిమార్గంబున మాయం దరింపవచ్చునన నిమిభూవల్లభుం డుల్లంబున నించుక మోదించి హస్తముకుళంబులు ఫాలంబునలంకరింప బ్రహ్మవిత్తములారా! నారాయణుఁడు బ్రహ్మము పరమాత్మయని పల్కుదురు. తత్స్వరూపనిరూపణ మొనర్చి నన్ననుగ్రహింపుండన నేనవ మానిపిప్పలాయనుం డిట్లు చెప్పందొడంగె. 42

–♦ పిప్పలాయనుఁడు బ్రహ్మతత్త్వము నిరూపించుట –♦

సీ. విశ్వోద్భవస్థితి♦విలయహేతువయి తా, దనకు హేతువు లేక♦తారు నెవఁడు
స్వప్నజాగరసుప్త♦సంచారియయ్యు న, మాధ్యాదులందును♦మసలు నెవఁడు
దేహేంద్రియాసుస♦మూహంబు హృదయంబు సంజీవితంబయి♦స్వస్వవిషయ
సందోహములయందు♦సంచరింపంగఁ బ్ర, ధానకారణమయి♦తనరు నెవఁడు

తే. వాఁడె నారాయణుండన్న ♦ బ్రహ్మమన్న
వాఁడె పరమాత్ముఁ డన్నఁ ద ♦ త్త్వం బదొకటె
లక్షణవిభేదములచేఁ జె ♦ లంగు నామ
ధేయభేదంబు లింతయుఁ ♦ దెలియు మనఘ ! 43

వ. ఈ పరతత్త్వమును మనోబుద్ధివాఙ్నేత్రప్రాణంబులుం దదితరేంద్రియంబులు నెఱుంగంజాలవు. అగ్నిని దనయంశములేయైన జ్వాలావిస్ఫులింగాదులు ప్రకాశింపంజేయఁగలవా? లేక దహింపంజేయఁగలవా! ఏదియు లేదు. అట్లే జడములైన యింద్రియములు పరముచే వెల్గింపంబడఁదగినవి కాని యజడమైనపరమునే ప్రకాశింపంజేయఁగలవి కావు జడములకుఁ గర్మత్వమే కాని కర్తృత్వము లేదు కాన స్వతఃప్రమాణమగు వేదమువలనఁ దత్త్వము గ్రహింపవలె. ఆ వేదముఁగూడఁ దాత్పర్యార్థముచేఁ జెప్పఁగలుగునే కాని సాక్షాచ్ఛబ్దముచేఁ జెప్పఁజాలదు. ఎట్లన, 'నేతి నేతి' 'అస్థూలమనణు' ఇత్యాది వేదములవలన నిది కా దది కాదు స్థూలము కా దణువు కాదని యిట్లు నిషేధించుటవలననే తదవధిభూతమై శేషించువస్తు వొకటియున్న దని యర్థవశమున స్పష్టమగుచున్నది. తన్మూలమున నది తెలియఁబడుచున్నది. 44

సీ. ఆ బ్రహ్మమొకఁడ మా ♦ యాశక్తిచే గుణ
త్రయమును దాల్చి ప్ర ♦ ధానమయ్యె
నా బ్రహ్మమే మహ ♦ త్తని జ్ఞానశక్తిమిం
చఁగ సూత్రమని క్రియా ♦ శక్తిమించ
నెన్నఁగఁబడె బ్రహ్మ ♦ మే, జీవునకుపాధి
యైన యహంకార ♦ మయ్యె బ్రహ్మ
మే దేవతలు సక ♦ లేంద్రియంబులు విష
యమ్ములు సౌఖ్యదుః ♦ ఖమ్ములయ్యె.

తే. ఇట్లు సర్వరూపమ్ముల స్వేచ్ఛఁగాఁ బ్ర
కాశిలుచు స్థూల సూక్ష్మాఖ్య ♦ కార్యములకుఁ
గారణంబయ్యెఁ దాఁ గార్యకారణము ల
భిన్నములె యిట్లు బ్రహ్మము వెలుఁగు ననఘ ! 45

వ. సర్వాత్మకంబైన బ్రహ్మమునకుఁ గార్యవికారములు సంభవింపవు. ఆత్మకు
జన్మస్థితిమరణవృద్ధిపరిణామక్షయములు లేవు. రాకపోకలుగల బాల్య
యౌవనాదులును సాక్షియగునాత్మకు లేవు అవస్థావంతుల యవస్థలు
ద్రష్టకు సంభవించునా? ఈ యాత్మ సర్వదేశసర్వకాలములందు లభించు
చున్నది అది నిత్యము జ్ఞానస్వరూపము ప్రాణ మొక్కటే వృత్తిభేదము
ననుసరించి యపానవ్యానాదినామముల ధరించినట్లు జ్ఞాన మొక్కటే
యింద్రియబలంబున నీలజ్ఞానపీతజ్ఞానాది వివిధనామముల ధరించుచున్నది.
కాని యీనామములు వాస్తవికములుగావు. నీలపీతాద్యాకారవృత్తులు
నశ్వరములు. నీల జ్ఞానము కలిగినపుడు పీతజ్ఞానము కలిగినపుడు నుభయ
కాలములందు జ్ఞానమున్నదనురీ కనుక నే జ్ఞానము నిత్యము. 46

సీ. వినుచుండె! యండజ ♦ స్వేదజోద్భిజ్జజ, రాయుజభూతవా ♦ రంబునందు
నక్కడక్కడ జీవుఁ ♦ బ్రాణంబననుసరించి, యేవికారము లేక ♦ యొనఁగునట్లు
జాగ్రద్ధృషీకముల్ ♦ స్వప్నసంస్కారవ, దహము సుషుప్తిఁ ల ♦ యంబుగాఁగ
లింగశరీరంబు ♦ లేమిఁ గూటస్థుండు, నిర్వికారుండయి ♦ నెగడుచుండు.

తే. ఎదియెఱుఁగ లెస్స నిద్రపో ♦ యితి నటంచు,
మేలుకొని సుషుప్త్యనుభూతి ♦ స్మృతికిఁ దెచ్చి
కొని మనము వచించుచునుండు ♦ మనుదినంబుఁ
గాన సాక్షి సుషుప్తిలోఁ గలఁడు నువ్వె. 47

ఉ. అంబుజనాభ దివ్యచర ♦ ణాంబుజ భక్తిమరందబిందుబృం
దంబునఁ గర్మజాతమలి ♦ నం బఖిలంబు ఖిలంబుగాఁగఁ జి
త్తంబువిశుద్ధమైనఁ బర ♦ తత్త్వము గోచరమౌను వెంటనే
యంబురుహాప్తకాంతి ♦ యమ ♦ లాక్షులకుం గనుపట్టు చాడ్పునన్. 48

వ. అని పిప్పలాయనుండు మిక్కిలిదుర్గ్రాహ్యంబైన బ్రహ్మతత్త్వము బోధింప
నిమినృపతి యిట్లనియె. 49

ఆ.వె. శిష్టులార! దేని ♦ చే సంస్కృతుండయి, నరుఁడు కర్మములను ♦ దొరఁగి సరగ
జ్ఞాననిష్ఠఁ బొందు ♦ దానినిగర్మయో, గమ్ము నుడువుఁ డాద ♦ రమ్ము మీఱ.

వ. ఈ ప్రశ్నంబునే నేను బూర్వమొకనాఁడు మజ్జనకుండగు నిక్ష్వాకుమహీ
దేవేంద్రుసమ్ముఖమ్మున సనకాదిమహర్షుల నడిగితి నమ్మహాత్ములేలొకో
నాకు నుత్తరంబీరైరి అనవుడు నావిర్హోత్రుండు షష్ఠార్థభుం డిట్లనియె. 51

-* నిమికి నావిర్హోత్రుండు కర్మయోగంబు నుడువుట -*

కం. అనఘ! విహితంబు కర్మం, బనియు నిషిద్ధంబకర్మ ♦ మనియున్ ♦ విహిత
మ్మును జేయమిని వికర్మం, బని కర్మము మువ్విధంబు ♦ లధ్యయనరతా! 52

తే. ఆత్రయంబు వేదైకగ ♦ మ్యంబు వేద
మీశ్వరభవంబు తాత్పర్య ♦ మెఱుఁగ వలయు
వాక్యనికరపౌర్వాపర్య ♦ వశత నద్ది
దుష్కరము సూరివరులె యిం ♦ దును భ్రమింత్రు. 53

ఆ. కనుక నాఁడు చిన్న ♦ తనమందునున్న త్వ, దాత్మకర్మముల య ♦ థాస్థితిం గ్ర
హింపఁజాలదనుచు ♦ నెఱిఁగింపరైరి నీ, కమ్మహానుభావు ♦ లపుడు నృపతి! 54

శా. ఈ వేదంబు పరోక్షవాదమునునీ ♦ యేస్వర్గమో చూపి నీ
భావంబం దధికాశఁ గొల్పి క్రియల ♦ స్వర్తిల్లఁగాఁ జేయుఁ జే
తోవృత్తుల్ పరిశుద్ధతాగరిమ మం ♦ దుఁ గాదావ జ్ఞానోదయం
బా విజ్ఞానముఁ గూడ నావెనుక నే ♦ యావిర్భవం బయ్యెడిన్. 55

కం. కర్మములం బిడపవిడుతువు, కర్మశ్రుతులు విను సల్పు ♦ కర్మమునందలో
మర్మమ్మిదియే నయ్యా, కర్మత్యాగార్థమో జ ♦ గన్నుత వింటే. 56

కం ఎవఁ డజ్ఞం డజితేంద్రియుఁ, డవుచు న్వేదవిహితాధ్వ ♦ మందరుగక క
ర్మవితతిఁ జేయక చను వాఁ, డవశ్యముం జావుదొంతు ♦ లందుం బొరలున్.

చం. అనభినివేశవంతుఁడయి ♦ యాగమచోదితధర్మకర్మముల్
పొనరుచుచుం దదీయఫల ♦ ముల్ మదిఁ గోరక యీశ్వరార్పణం
బొనరుచుచున్న జ్ఞానమెల ♦ యుం జుమి, కర్మఫలశ్రుతుల్ ప్రరో
చనమునకేర్పడెన్ మధువె ♦ సంగినఁ జీమలు సుట్టుమూఁగుఁగా. 58

ఉ. బాలుఁడు లడ్డుకై యగద ♦ పానము సేసి నిరోగతాప్తి మైఁ
గ్రాలెడునట్లు స్వర్గసుఖ ♦ కాంక్షఁ గ్రియల్ పొనరించు చాగమా
ర్థాలవిచారముల్ సలిపి ♦ తత్వమెఱింగి నరుండు జ్ఞానియా
నేలపొనర్పఁ బిమ్మట ఫ ♦ లేప్స నతండు క్రియావితానమున్? 59

వ. ఇట్లు వేదవిహితకర్మాచరణమువలనం గ్రమముగా నైష్కర్మ్యసిద్ధి లభించె
డిని కొంత అహంకారము హృదయమునం బెనవేసికొని యుండఁ దద్హృదయ
గ్రంధిని రయంబు సంబాచికొన నాగమతంత్రోక్తప్రకారము కేశవునారా
ధింతు రెట్లన, 60

—♦ ఆవిర్హోత్రుండు ప్రతిమార్చన నుడువుట ♦—

కం. అనఘాత్ముఁడైన గురువ, ర్యుని సేవించి తదనుగ్ర ♦ హోత్థాగముఁడై
తనయిష్టమూర్తికి సప, ర్య నొనర్పంగవలయు న్మ ♦ హాపురుషమతిన్. 61

తే. పూజకుఁడు శుచియై పూజ్య ♦ మూర్తి కభిము
ఖముగ నాసీనుఁడై శరీ ♦ రమునఁ బ్రాణ

సంతుమాదుల శోధన ♦ సలిపి న్యాస
షట్కకృతరక్షుఁడై కడు ♦ శ్రద్ధతోడ. 62

సీ. భూమిసమ్మార్జించి ♦ పుష్పముల్ శోధించి, యాత్మనవ్యగ్రత ♦ నలవరించి
ప్రోక్షించి యాసనం ♦ బును, నర్ఘ్యపాద్యాది, పాత్రలశ్రద్ధమై ♦ వదలవఱచి
మూర్తిసంక్షాళనం ♦ బుసొనర్చియుందునా, వాహనంబొనరించి ♦ వాసుదేవు
మూలమంత్రంబుచే ♦ న్యాసహృదయాదికృ, తన్మయుఁడై పూజఁ ♦ దగునొనర్ప

తే. అపుడు మఱియు నాభగవంతు ♦ సంగముల సు
దర్శనాద్యుపాంగములఁ ద ♦ త్సన్నిధాన
వర్తులను శాంతమూర్తుల ♦ భవ్యనిష్ఠ
స్వీయమంత్రంబుతోడ న ♦ ర్చింపవలయు. 63

తే. నిర్మలార్ఘ్యపాద్యాచమ ♦ నీయములను
స్నానవాసోవిభూషణ ♦ చందనముల
ధూపదీపోపహారకా ♦ దులను దాంత్రి
కోక్తవిధిని బూజింపఁగా ♦ నొప్పు హరిని. 64

కం. పెక్కు తెఱంగులఁ బొగడుచు
మ్రొక్కుచు సాష్టాంగముగ న ♦ మోహర యేయం
చొక్కండవె దిక్కనుచున్
దక్కితి నీకనుచు వేఁడఁ ♦ దగు భగవంతున్. 65

సీ. అతిశుద్ధసత్త్వమా ♦ యా కాంతతోడుత, దోబూచులాడెడి ♦ దొంగవాఁడ!
స్వాయంభువత్రయీ ♦ శబ్దజాలంబుతోఁ, గుస్తీలుపట్టెడి ♦ కోడెకాఁడ!
జన్మస్థితిప్రళ ♦ యోన్ముఖభూతాళి, తో నెత్తమాడెడి ♦ దొడ్డవాఁడ!
దేశకాలస్థలా ♦ దివ్యతిరిక్తుండ, వై పొంచియుండెడి ♦ యందగాఁడ!

తే. గ్రహములను నదృష్టములఁ గ ♦ ర్మముల శాస్త్ర
ములను నియమంబులం జేసి ♦ మురియువాఁడ!
యోర్పుగలవాఁడ! దయగల్గి ♦ యుండువాఁడ!
నమ్మినాఁడ నన్గరుణింపు ♦ మెమ్మెకాఁడ! 66

వ. ఇట్లు తన్మయుండై తన్మూర్తినిధ్యానించి నిర్మాల్యమును గంటనద్దికొని శిరంబున ధరించి పూజాసమాప్తిగావించి యవ్వల నాప్రతిమను సాదరపూర్వకంబుగాఁ గరండకాదిస్వస్థానంబున నునుపవలయు; దేవుని హృదయమున నిలుపవలయు. 67

కం. ఈ విధమున నతిథిసలిల, పావకరవ్యాదులందు ♦ స్వహృదయమందున్
దేవుఁ బరమాత్మ నీశ్వరు, భావించి యజింప ముక్తి ♦ పరఁగదె నృపతీ! 68

వ. అని యావిర్హోత్రుండు నిమికిం జెప్పెనని నారదుం డాడినట్లు శుకుండు వచించెను. 69

## తృతీయాధ్యాయము సమాప్తము

---

## చ తు ర్థా ధ్యా య ము

కం. అద్వైతద్వైత విశి,ష్టాద్వైత విపశ్చితుల్ త్వ ♦ దంతిక సీమన్
విద్వేషములొందర యు,ద్యద్వైదిక మార్గమంటి ♦ హరిహరనాథా !

వ. [1]దేవా ! యవధరింపు మంత శ్రీ శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. శ్రద్ధాభక్తులతో వినుచున్న వసుదేవునిం జూచి నారద మహర్షి వసుదేవా ! వినుము. ఇట్లు తాంత్రికకర్మయోగమునుగూడ విని నిమిభూవల్లభుం డార్షభులతో మహాత్ములారా ! యిష్టమూర్తి పూజాగుణస్తోత్రము లొనరింపవలయునంటిరి హరి యే యే స్వచ్ఛందజన్మములచే నే యే కర్మము లాచరించెనో ? యాచరించుచున్నాఁడో ? యాచరింపఁ గలఁడో ? యానతీయుండనఁ ద్రుమిలుండను సప్తమార్షభుం డిట్లనె. 2

### —* నిమికి ద్రుమిళుండు భగవదవతారముల నుడువుట *—

మానిని. ఎవ్వఁ డనంతు ననంతగుణంబుల ♦ నెంచఁగడంగునొ యా విబుధుం
డెవ్విధి నేనగుఁబొట్లకుఁ బొలగు ♦ నింతయు నిక్కువ మో నృపతీ !
ఇవ్వసుధారజ మెంచిన నెంచెడు ♦ నెట్టులొ యెంతయొ కాలమునం
దవ్విభు సర్వమహోన్నతశక్తిచ ♦ యంబు గణింపఁగ లే రెవరున్. 3

వ. కాన శక్తికొలంది భగవదవతారముల వర్ణించెద. 4

కం. పంచమహాభూతముల సృ,జించి విరాట్పురము నందు ♦ స్వీయాంశఁ బ్రవే
శించి పురుషాహ్వయంబున, మించెను నారాయణుం డ ♦ మేయాకృతితో. 5

కం. నరవర! యిదియే మొదటిది, పురుషవతారంబు వీని ♦ బుధులంద్రు విరా
ట్పురుషుఁడని, సుఖార్థం బ,వ్వారముం జేరఁడు, విలాస ♦ ముగఁ జేరెనటన్.

వ. ఈ విరాట్పురుషుని గుణాదుల వినుము.

సీ. ఎవనిశరీర మీభువనత్రయము నిండి, యెసఁగునో యెవ్వాని ♦ యింద్రియముల
చే సమష్టివ్యష్టి ♦ జీవులజ్ఞానక, ర్మేంద్రియంబులఁ గునో ♦ యెవని సిద్ధ
మగు జ్ఞానమున జ్ఞాన ♦ మంజలొందెదలో ? యె, వ్వనిశ్వాసనమున జీ ♦ వలతతికెల్ల
నోజోబలేహాదు ♦ లుదయించి వెల్గుచు, నుండునో ? యెవ్వాని ♦ కొలయుసత్వ

---

1 23.4.1946 ఈ యధ్యాయప్రారంభము.

తే. మునను స్థితి, రజోగుణమునఁ ♦ బుట్టుకయుఁ ద
మోగుణమున లయము విశ్వ ♦ మునకుఁ గలుగు
నాతఁడే విరాట్పూరుషుం ♦ డాదికర్త
యాదిదేవుఁ డాదిపురుషుఁ ♦ డతఁడసూవె. 8

తరలము. మొదట బ్రహ్మగనయ్యె నీ జగ ♦ ము౯ సృజింప రజోగుణం
బొదవ, నావలవిష్ణువయ్యె ద్వి ♦ జోరుధర్మము విశ్వముం
బొదలఁ జేయఁగ సత్త్వమూని, త ♦ మోగుణంబున రుద్రుఁడై
మొదలు నాశనముంబొనర్పన ♦ మేయుఁ డాద్యుఁడు భూవరా! 9

వ. ఇట్లే యయ్యాదిపురుషుండు సతతము ప్రజలం దుత్పత్తిస్థితిలయంబులఁ
గల్గించుచుండు, నిదియై రాజపురుషావతారము. మఱియు భగవదంశంబున 10

ఉ. ధీయుతులుం దపోరతులు ♦ దీర్ణమనస్కులు మానిమానవ
ధ్యేయు లతిప్రశాంతు లుద ♦ యించిరి మించుసుచి న్నరుండు నా
రాయణుఁడన్మహాత్ము లన ♦ ఘా! మఱి ధర్మునివల్ల మూర్తి క
త్యాయతపుణ్యమూర్తికి స ♦ ముంచితకీర్తికి సజ్జవర్తికి౯. 11

వ. ఈ నరనారాయణులు మహర్షిజనసేవితాంఘ్రులై నైష్కర్మ్యలక్షణము
నారదాదులకుపదేశించి తద్ధర్మముఁ దాము నాచరించుచు నిప్పటికి బదరి
కాశ్రమముననున్నారు. 12

*— ద్రమిళుఁడు నారాయణఋషి తపఃప్రభావము చెప్పుట *-

కం. నారాయణమౌనీంద్రుఁడు, ఘోరంబగుతపముచేసి ♦ కొనుచుండ సునా
సీరుండు గాంచి యొకనాఁ, డారాటముసెంది యిట్టు ♦ లాలోచించె౯. 13

చం. ఎవఁడురవీఁడు దీర్ఘతప ♦ మిట్టులొనర్చెడి? నిట్టివాని నిం
తవఱకుఁ జూచి నే నెఱుఁగఁ ♦ దన్ననుఁగొన్న మదాధిపత్యముం
దవులఁగఁగోరి నట్టులు గ ♦ నంబడుచున్నది తప్పివచ్చెరా:
శివ! శివ!! యింక నేనెవరిఁ ♦ జేరుదుఁ జీరుదు బాముఁబావఁగ౯. 14

ఉ. ఏమె పులోమజా! పలుక ♦ వేల జయంత! వసంతుఁ డేఁడిరా!
కామునిఁ బిల్వరే! వినవు ♦ గా శశిరేఖ! యయో తిలోత్తమా!
హేమనుజాడరే! తెలుప ♦ రే మనరంభకు; నీ సుధర్మలో
నేమిఁకనుండఁబోము! యెవఁ ♦ డేలునో స్వర్గము నింకమీఁదట౯. 15

ం. అనుచుం బదిమందియుఁ జేరిన పిమ్మట వారల న్ని ♦ రీక్షించి మనం
బునఁ గొంతనిబ్బరము నెట్టనఁబూని పచించె నయ్యెడం గార్య మిటుల్.

ఉ. ఓ మదనా! యెఱుంగవె మ ♦ హోన్నత గాఢ తపోగరిష్ఠ వి
ష్ణ్వామహనీయమూర్తులను ♦ సంయముల న్నరనారాయణాదులన్
భామిని జేరఁ బంట్లయడ ♦ పుల్గల తావున నొక్కఁడుండె మీ
రా మునివర్యుఁ జూచిన మ ♦ హాద్భుతమందెద రిప్డు దేమనన్. 17

కం. అతఁ డతిలోకాద్భుతవి, ర్య తపోయుతుఁ డగుచు నాక ♦ మందుటకై యీ
జతన మొనర్చెడి మీరే, గతి నేఁడు గాచికొనఁగలరొ ♦ శా! యధికృతులన్.

కం. అనవుడు మదనుఁడు మీరసం
బున దుర్వి యెఱుంగ మొక్కొ! మునులం గినులన్
నసతూపు ములికి సోఁకం
గననివఱకె వారితప మిఁ ♦ కం బలుకేలా! 19

ఉ. ఆనతియింక కార్యమది ♦ యంతయుఁ దీర్చెద నేమిరా వసం
తా! నినుఁ జూచినంతటన ♦ స్థాణువుసైతము పల్లవింపదే?
పూను ప్రయాణమున్ సలుప ♦ మాటను మల్లెనుగట్టి మారుతా!
యేనిదె వచ్చువాఁడ వన ♦ జేక్షణలార! చనుండు ముంగలన్. 20

వ. అని యింద్రానుమతింబడసి మదనుండు సపరివారుండై బదరికాశ్రమంబున కరిగె. అంతనట వసంతుఁ డనంతవిలాసభాస్వంతుఁడై నవ్వనాంతమున వింతవింతల గంతులు వేయఁ జొచ్చె. మావులు క్రోవులు మల్లెలు మొల్లలు నాళికేరములు సిందువారములు మందారంబులు మాలూరంబులు ఖర్జూరంబులు జంబీరంబులు పురునాగంబులు పున్నాగంబులు రసాలములు తమాలములు నశోకములు మధూకములు లవంగములు విలుంగములు పనసవకుళకురవకసరళముఖతరునికరము తమ తమ కమరినకొమరునఁ బల్లవముల పెల్లున నుల్లసిల్లి లతాంతలతాంతకాంతుల దిగంతములనింపి పిందియలనందమునందికొని కాయలనికాయములఁ గాయమునిండించుకొని చెలువుగలుగు ఫలముల కలుములనిలువు నిలువుకొని కనులపండువుగా నుండె. అప్పుడప్పువ్వుఁగుప్పలనుప్పతిల్లుపుప్పొళ్లఁ గన్నుఁదెప్పలఁ దెప్పునఁ గప్పుకొన నొప్పుచెడి తేనెసోనలనానమాని నానవడి వడిచెడి విడివడినమగలంగని చెంగటకుం గదలివచ్చిన యంగనల యింగితమెఱింగి మసలుభసరవిసరములును, భసలవిసరములు కసిమసఁగి మునుకుకొని కిసలయరసముల మెసవ నవసరమొసఁగమి నసునసురను పికనికరములును, బికనికరముల కుహూకారములఁ జెవిదోరగించి విఱుచు దోరపండ్లగీఱఁ బాఱని మారునితేరి వారువములైన కీరవారములును, గీరవారముల చేరువలఁ దీఱిక మీఱ బారులుతీరిచి కూరుచుండి వినీలోత్తాలతమాలసాలజాలమాలోకించి

కాలాభ్రాదభ్రవిభ్రమంబునఁ బింఛియములవిప్పి నర్తనంబుసేయు మయూ-
రంబులుంగలిగి యుత్కంఠాగము మనోహరమ్ముగానుండె. అట్టియెడ
నవ్వనంబున 21

ఆ.వె. గుబ్బపూలగుబులు ♦ కోనులతకూనలు
గాలికబురురాఁగఁ ♦ గదలిపోయి
కావితలిరుటాకు ♦ మోవుల రుచిచూపి
సుందరతరుగళము ♦ చుట్టుకొనిరి. 22

కం. పెంటియె పోతుస్వేదువదో? పెంటిన పోతువిడువదో! య♦విరతప్రియుతర
జంటలయి రేఁబవలు వె, న్వెంటఁ దిరుగుచుండు నామ ♦ నిబలంబెదిరో?

ఆ. ఒకరికొకరిచ్చు ♦ చుందురు తాము భు,జింపఁజోక నేది ♦ చిక్కనేని
దాన రెండుకడలఁ ♦ దన్నును వలపును, బెరుగునూపుఁగాక ♦ తఱుఁగురాద. 24

వ. అట్టి స్థితియందు నారాయణఋషివర్యున కింతట నంతట నచ్చర మచ్చె
కంటు లిచ్చమెయి ముచ్చటలాడుచుఁ గచ్చాడుచు వలపుఁజేఁతలకుం
జొచ్చిరి. 25

చం. జలకములాడి యార్ద్రిమగు ♦ సన్నని తెల్లని వల్వయంటుమై
బలియుటఁ బైకి మేసొబగు ♦ బంగరురంగుహొరంగువింతకాం
తులు పచరింప హేమయను ♦ తోయ్యలి యమ్మెడ నొయ్యనొయ్యన
న్గులుకుచు బెళ్కుఁజూపులను ♦ గ్రుమ్మరె నమ్మునిసమ్ముఖమ్మునన్. 26

చం. మడిమలుదాఁకు వాలుజడ ♦ మల్లియపువ్వులఁదాల్చి, కొల్కులం
దిడి నలుపారుకాటుక, మె ♦ యిన్ శిఖిపింఛదుకూలకాంతులుం-
గడలుకొనం, జనుంగవ సి ♦ గల్గయిఁదాఁకుచు నవ్వువెన్నెలల్
నుడిపడ మూనిపై హరిణి ♦ చోపె నపాంగవిలోకనమ్ములన్. 27

వ. ఇటువంటిచేఁతలెల్లఁ బొల్లుకాఁగా మఱొకనాఁ డిదిగాదు తెఱఁగని
యన్నాగవాసంబున రంభ కాలికిం గజ్జెగట్టి 28

సీ. రసభావవాచ్యముల్ ♦ పొసఁగనితాళాను, సారినృత్తంబును ♦ నలిపి నలిపి
ప్రోద్ధతాంగక్షేప ♦ సిద్ధమౌతాండవ,నృత్యమ్ము శక్తిమై ♦ నెఱపి నెఱపి
అమలకోమలమధు♦రాంగవిన్యాసాళి, మృదులాస్యనృత్యమ్ము♦మెలపిమెలపి
పాడుచుఁ దద్భావ♦భంగి సర్వాభిన,యములఁదెల్పుచు నాట్య♦మాడియాడి

తే. వెండియు ఖచారిభూచారి ♦ వివిధనాట్య
భంగిమముల నొయారియై ♦ పఱపి పఱపి
విమలగాంధర్వమును గొల్ల♦ పెట్టిపెట్టి
రంభ యుత్నించె మౌనిఁగ ♦ గంపనొంచి. 29

వ. ఇట్టి ప్రయత్నంబులును బధిరశంఖారవమ్ములుగాఁగ మఱొండుదినంబున

ఉ. చక్కఁదనాలకిక్క సర ♦ సంపు నడల్వలుకంగ జాణ పెం
పెక్కు విలాసచేష్టలకు ♦ సిల్లగు రంభ మృదూరువస్త్ర మా
టక్కరిపిల్లగాఁడు పుక ♦ డంకిఁ దొలంగ మునీంద్రుఁ గాంచుచుఁ జ్
ఫక్కున నవ్వె గుబ్బచను ♦ పట్టిగురె, న్నసఁ గొను కంపిలన్. 31

వ. అప్పుడు కాల్యంబులు నిర్వర్తించుకొని సుఖాసీనుండై యున్న నారాయణ మహర్షి యాసవ్వడిదెసమొగంబై రంభారంభోరూముఖాంభోజంబునఁ జూపులు వొలయింప విదియఁ గుదనని మదనుని మదవతు లెలుగిచ్చి మెచ్చరింప నచాటున నతఁడు వడఁకుఁ జేతుల నలరువిల్లుఁగొని తియ్య తేనియల కెగఁ బ్రాఁకు తుమ్మెదలనారి నెక్కిడఁ జాలక విసివి వెసవెస నవ్విల్లు విసరి వైచి యేచిన తటారమ్మున మొగలికటారింగొని హుటాహుటిం బైకుఱుకం బాఱునింతలో రంభ యిమ్మగ నమ్మని నల్లనడాసి నమస్కరించి శిరమువంచి వినయమ్ముదొలక నిలువలికె. 32

చం. పురుషవరేణ్య! యియ్యలరు ♦ బోణులు నాకమునందునుండు న
చ్చరలు యథేచ్ఛగాఁ దిరుగు ♦ జాణలు మన్మథబాణముల్ ధరా
మరులు మఖాదిశిష్టులను ♦ మ్లానత నొందుచునుంద్రు వీరి య
బ్బురపుఁ దుటారిగుబ్బచను ♦ బొంగరపుంగవ నాడుకొంటకై. 33

చం. రసికవతంస! యే నిటఁ బ ♦ రాకగనుండఁగ నాలితెమ్మెరల్
విసవిసవచ్చి వింతసలి ♦ పెం దమ రేమనుకొందురో! కళా
భ్యసనముగల్గియున్న తమ ♦ వంటిమహాత్ములయంఘ్రి చెంత బా
నిసనుగదా యన న్మౌని య ♦ నెం జిఱునవ్వుదొలంక మోముపై. 34

చం. సరసములాడ నీవు నెఱ ♦ జాణవుగావటె రంభ! నిన్ను నే
నెఱుఁగనె? మాకుకర్షి నల ♦ యింపవె యెక్కటిఁ జూచి యింతలో
మఱతునె? నీవెదో నెపము ♦ మై కదలించి కలంప మెల్లఁగా
సరసకుఁ జేరవచ్చితివి ♦ సంతసమయ్యెను గూరుచుండుమా! 35

కం. నాయన! మదనా! యిటురా, వోయీ! తొల్లి హరనేత్ర ♦ హుతభుగ్జ్వాలా
పాయము గన్నాఁడవుగద, రా! యెవ్వాడు భృత్యజనుల ♦ బ్రదు కింతేరా!

కం. బిడ్డా! వసంత! యెంతటి, దొడ్డపని యొనర్చితివిర ♦ దుర్గతితొలఁగెన్
జడ్డనఁ బశుపక్ష్యాదుల, కడ్డే మీఁకరమ్మ! యస్మ ♦ దాశ్రమమునకున్. 37

తే. పిల్లలార! యోయచ్చర ♦ వెలఁదులార!,
రండురండమ్మ! మామకా ♦ శ్రమమునకును

ఏ మొసంగునాతిథ్యంబు ♦ నెలమిఁ గొన్న,
పిదపఁ దిన్నగా దివికిని ♦ వెళ్ళవచ్చు. 38

కం. వచ్చినదానవు రానే, వచ్చితి వోపిల్లవాయు ♦ వా! యాశ్రమముం
జొచ్చి యిటనున్నప్రాణుల, ముచ్చమరుం బాఱఁజిమ్మి♦పొమ్మా యవలన్.

వ. అని యయ్యండఱంగూర్చుకొని ప్రసాదమేదురావలోకనంబులవిందువెట్టి యియ్యాశ్రమప్రక్రియ శక్రునిదిగాని మీదిగా దోడకుంకుండని వారల కభయమిచ్చి యాదరింప వారు సిగ్గుపడి నమస్కరించుచు నిట్లనిరి. 40

కం. దేవా! మాయాపరుఁడవు, గావునసే వికృతిలేక ♦ క్రాలెద, వేమున్
దేవానాంప్రియులమగుట, గావింతుము మంతువులను ♦ క్షమియింపఁదగున్.

చం. త్రిదివ మతిక్రమించి భవ ♦ దీయపదంబుకు జేరు త్వత్పదా
స్పదులగుభక్తకోటులకు ♦ సల్పుదు రెన్నియొ యంతరాయముల్
త్రిదశు లసూయచే; మఖవి ♦ ధిన్ హవిరాదులొసంగి తమ్ముఁ బూ
జఁదనుపువారి నేమనరు; క్ష్మాపులు గప్పములీయ వేఁతురే? 42

కం. అయినను ద్వత్పాతపదా, శ్రయు లతిధైర్యమున విఘ్న ♦ సమితిశిరములం
బుయిలోడఁదన్నఁగల రవ్యయ! నీ ప్రాపున్నవారి కంగదయున్నే! 43

కం. నినుసేవింపనికొండఱు, ఘనతరదీక్షం దపం బొ ♦ కండ సలిపి మా
ఘను వశులై సంతోషం,బున బహుకామోపభోగ♦ములఁ గాంతురజా! 44

వ. నినుఁగొల్వనిమఱికొంద ఱుగ్రతపంబొనర్చుచు మేమిచ్చు క్షుత్తృట్ శీతోష్ణవర్షమారుతజైహ్వ్యౌపస్థ్యాదిభోగంబులంగూడ ననుభవింపనొల్లక వానినివిసర్జించి మమ్ముఁదృణీకరించి సంద్రంబువిడిచి గోష్పదంబున మునింగినట్లు క్రోధంబునకువశులై శాపాదుల నత్తపశ్శక్తిం బోఁగొట్టుకొని యటుమోక్షంబునకు నిటుభోగంబునకు రెంటికింగాక చెడి నిష్ఫలారంభు లగుదురు. స్వామీ! నీభక్తులుగానివా రిట్లు కామక్రోధంబులకువశులై చెడుట వింతయే? 45

ఆ. అనుచు నిట్లు వేఁడు ♦ కొనుచున్న యప్పుడ, కంటఁబడిరి తపసి♦దంటఁజేరి
సేవసలుపువారు ♦ చెలువారువువ్వారుఁ,బోండ్లుచెరివితోడిగి♦ పూసికట్టె 46

సీ. చల్లందనము లేదు ♦ వెల్లివోయెడిఁబండు, వెన్నెల లివియేమి వింతలమ్మ?
సెత్తావిగొల్పదు ♦ నిగిడెడివల్లగ,ల్వలదండ లిదియేమి ♦ విలయమమ్మ?
ప్రొద్దుగ్రుంకఁగలేదు♦గద్దించెడిం గారుఁ, జీఁకటు లిదియేమి♦చిత్రమమ్మ?
చాంచల్యములు లేవు♦మించిగాపించుఁగ్రొ,క్కారుమించు లిదేమి♦కాలమమ్మ?

తే. ఈ వెలందులు నవ్వెద ♦ రీశువాక్షు
లీదెసంజూడ్కిఁబఱపెద ♦ రీ వినీల
కచలు విముఖతంగనెద రీ♦కలికిమించుఁ
బోణులు మెలంగెదరు తద్వి ♦ భూతు లివియు.

వ. అని నారాయణయోగప్రభావ వినిర్మితాంగనలంగని రంభాదులు వెఱఁగు
పడి యుండొరులు. 48

కం. అక్కా! యెక్కడఁజూడము, యిక్కొమ రీమేనిపొలప♦మీమార్దవ మీ
చక్కఁదన మీయొయ్యారం, బక్కాంతలసాటి లేర ♦ యేలోకమునన్. 49

కం. అనుచుఁ బ్రణతులై యుండన్, మునివర్యుఁడు లేఁతనవ్వు♦మొగమునఁజిందన్
గొనిపొండు స్వర్గలోకం, బును వెలిఁగింపంగఁదగిన ♦ పొలఁతి నొకర్తన్. 50

వ. అనవుడు రంభాదులు తదంగనలలో నూర్వశింబురస్కరించుకొని పునః
పునరభివాదనంబులొనర్చుచు దివికింజని నారాయణర్షిప్రభావంబంతయు
శక్రునకువిన్నవింప నతండు విస్మయాధీనమానసుండై యుండె. 51

* ద్రుమిళుఁడు హంసాద్యవతారముల వర్ణించుట *

తే. అచ్యుతుఁడు జగన్మంగళ ♦ మాచరింపఁ
గోరి హంసదత్తసనత్కు ♦ మారఋషభ
రూపములుదాల్చి ప్రజకు నె ♦ ఱుంగ బోధ
సేసె నాత్మలాభోపాయ ♦ సిద్ధులెల్ల. 52

వ. ఈఋషభయోగీంద్రు లస్మత్పితృపూజ్యపాదులు. వారికి మానసస్కృతులు.
సనకసనందనసనత్సుజాతులు భగవదంశసంభవుల. 53

కం. ఆవల నచ్యుతుఁడు హయ, గ్రీవవతారంబుఁదాల్చి ♦ క్రిందిజగమునన్
దేవారి న్మధుదానవు, జీవంబుఁబాపి శ్రుతులు ♦ చెచ్చెరఁ దెచ్చెన్. 54

తే. ప్రళయకాలమం దఖిలంబు ♦ వారిమయము
గాఁగ వసుధౌషధీభీజ ♦ గణము ఋషులు
మనువు వైవస్వతుఁడు వసిం ♦ చిన కలంబు
పట్టికొని కాచె మత్స్యరూ ♦ పంబుపూని. 55

పంచచామరము. హిరణ్యనేత్రరాక్షసుం డ ♦ హీనశక్తిమై వసుం
ధరాసతిన్ భుజాబలంబు ♦ నం గ్రహించి పోవఁగా
వరాహరూపముంధరించి ♦ వాసఁజంపి భూమి ను
ద్ధరించె వారిరాశినుండి ♦ దానవారి భూవరా! 56

ఉ. పొందికతో సురాసురులు ♦ పూతసుధార్థము పాలసంద్రమున్
మందరపర్వతంబున న ♦ మందరయంబునఁ ద్రచ్చుచో మునుం
గం దయఁ గూర్మరూపమున ♦ క్ష్మాధరమూనుచు నాఫలోదయ
మ్మొందఁగఁ జేసె నీశ్వరుఁ డ ♦ నంతుఁ డమేయబలుండు భూపతీ! 57

కం. నక్రమొకం డక్రమముగ విక్రమమున నాక్రమించి ♦ వేధింప గజం
బాక్రందింపఁ ద్రివిక్రముఁ, డక్రమున న్మకరిఁ జంపి ♦ సామజమేలెన్. 58

మ. సమిధల్ దెమ్మని తండ్రి కశ్యపుఁడు పు ♦ చ్చన్ ఘోరకాంతారభా
గములం గుమ్మరువారు గోష్పదజలౌ ♦ ఘంబం దోఁగిం గూలి యీఁ
గుచు మా బాముల దేవదేవ! యను చుం ♦ గుష్ఠప్రమాణస్వరూ
పములన్ వెల్గెడి వాలఖిల్యులు హరిం ♦ బ్రార్థింపఁ గాచె న్కృపా! 59

ఆ.వె. వృత్రవధయొనర్ప ♦ వెంటంబడిన బ్రహ్మ, హత్యవలన బాధ ♦ నంది యుండి
వజ్రి హరిని వేఁడఁ ♦ బాలించెఁ గరుణతో, హరిదయాంబురాశి ♦ యగుఁగదయ్య!

సీ. నరసింహరూపమ్ము ♦ నన్ హిరణ్యకశిపుఁ
బరిమార్చి చెఱనున్న ♦ వారి దేవ
కాంతల విడిపించెఁ ♦ గాచెఁ బ్రహ్లాదుని
బెక్కుమాఱులు ఘోర ♦ విగ్రహముల
నసురపతులఁ జంపి ♦ యమరుల రక్షించె
వామనమూర్తియై ♦ బలిని వేఁడి
స్వర్గమింద్రునకిచ్చెఁ ♦ బరశురాముండయి
హైహయాదులఁ గూల్చి ♦ యవల నిరువ

తే. దొక్కమాఱు క్షత్రియులను ♦ జక్కఁబెట్టె,
నివ్వ డంబుధిబంధించి ♦ యేచి రావ
ణాదిదుష్టులం జక్కాడి ♦ యఖిలకల్మ
షఘ్నకీర్తి సీతా మాన ♦ సప్రవర్తి
రామచంద్రమూర్తి యదే వి ♦ రాజిలెడిని. 61

తే జనకభూప! భూభారనా ♦ శంబుకొఱకు,
నభవుఁ డయ్యాదువంశంబు ♦ నందుఁ బుట్టి
రామకృష్ణాహ్వయంబులఁ ♦ గ్రాలఁగలఁడు
వెలఁగి దుష్కరకార్యముల్ ♦ చేయఁగలఁడు 62

తే. పిమ్మట వనస్థలా దైత్య ♦ వీరవరులు,
యజ్ఞముల్ సేయఁబూన ♦ మోహమ్ము గొలుపు

వాడి మొనరించు బుద్ధిరూ ♦ పమున ; యుగము
చివరఁ గల్కి-యై శూద్రభూ ♦ ధవులఁ జంపు. 63

వ. జనకరాజా ? యీ విధములైన యీజగత్పతి జన్మకర్మములు పెక్కులు గలవు. వానినెల్ల నాకు వాకొనన లవియగునె! యని ద్రమిళుండు పల్కె నని నారదుండాడినట్లు శుకర్షి వచించెను.

ఇది చతుర్థాధ్యాయము ముగిసెను.

---

## పంచమాధ్యాయము

క. స్వర్గపురద్వారకవా, టార్గళ నిర్భేదనమున ♦ కమృతాయన సం
సర్గమునకు వేదముల న,నర్గళమార్గముల నిడితె? ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! అవధరింపుము శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అవ్వల నారదుండు వసుదేవుంజూచి జనకభూవరుం డట్లు హరిజన్మకర్మములు విని యయ్యార్షభులతో నిట్లనియెను. 2

తే. ఆత్మవిత్తములార! మ ♦ హాత్ములార!,
హరివిభగవంతుఁ గొల్వక ♦ యవిజితాత్మ
లగుచుఁ గోర్కు-లవెంబడి ♦ నరుగు నజ్ఞ,
జనుల కేగతిగల్గునో ♦ వినుపరయ్య! 3

వ. [2] వెనుక నభక్తులు కామక్రోధములకువశులై చెడుదురని వింటెంగదా యనవుడుఁ జమసుండనుఋషభనందనుం డష్టముం డిట్లనియె.

—♦ నిమికిఁ జమసుండు భక్తిహీనులగు కర్మపరుల గతిం జెప్పుట ♦—

సీ. పరమేశ్వరునిముఖా ♦ బ్జమునుండి సత్వగు, ణమ్మున విప్రగ ♦ ణమ్ము బాహు
వులను రజస్సత్వ ♦ ములచేత క్షత్రియు, లూరువులందుఁ ద ♦ మోరజోగు
ణములచే వైశ్యులు; ♦ తమముచేతను జర, ణమ్ముల శూద్రులు, ♦ నాలుగాశ్ర
మములతోఁ బుట్టెఁ; రీ ♦ మనుజులుతమతండ్రి, యీశ్వరుండనిమది ♦ నెఱిఁగియుంభ
తే॥ జింపరే నెఱుఁగమిని య ♦ జింపరేని, యాత్మవర్ణాశ్రమభ్రష్టు ♦ లగుచు వార
లధమగతులకుఁబోయెద ♦ రయ్య యరుదె, దుర్గతులు భగవద్గురు ♦ ద్రోహు
లకును! 5

---

1. ఈ యధ్యాయప్రారంభము 27-4-1946 తేదీ. 2. నాలవయధ్యాయము 45 వచనము చూడు.

కం. హరికథలు వినవలయునని
హరిగుణములు పొగడవలయు ♦ నని యెఱుఁగని యా
తరుణుల శూద్రాదుల నం
దఱను భవాదృశులు చూడఁ ♦ దగు దయతోడన్. 6

తే. ద్విజులు శ్రౌతవిద్యల హరి ♦ భజన సేయు,
నుత్తమాధికారముఁగాంచి ♦ యును ఫలేప్స
వ్రాలెదరు కర్మముల వేద ♦ వాదులగుచు,
జ్ఞానలవదుర్విదగ్ధులుఁ గారె వీరు ? 7

వ. మఱియు భక్తిశూన్యులగు వీరు బంధకమ్ములుగానిపగిదిఁ గర్మమ్ములం జేయంజాలక స్తబ్ధులు మూర్ఖులు పండితమానులునై యుందురు. "అపామసోమమమృతా అభూమ..." ఇత్యాద్యర్థవాదశ్రుతులచే సమ్మోహితులై యత్యుత్తమలోకముల నప్సరస్సౌఖ్యమందంగలవారమని ప్రియవచనములఁ బల్కుచుందురు. దాసికి యజ్ఞము లన్నవస్త్రదక్షిణారహితంబులుగాఁ జేయుచుందురు. అందు హింసాదోషానభిజ్ఞులై జీవికార్థము పశువులం జంపుచుందురు. రజోగుణయోగంబున నభిచారాదిదుస్సంకల్పులుం గాలసర్పంబులుంబోలె దీర్ఘక్రోధులునై యుందురు. దాంభికులు పాపులునై హరిభక్తుల గేలిసేయుచుందురు. పెద్దలసేవింపక కాముకులై స్త్రీలనే సేవించుచు గేహములంబడియన్యోన్యమైథునసౌఖ్యంబులం బ్రసంగించుకొనుచునుందురు. 8

కం. బలవిద్యారూపశ్రీ, కులకర్మైశ్వర్యదాన ♦ గుణముల గర్వాం
ధులగుచు హరినిన్ హరిభ, క్తులఁ బరిహాసంబుసేయు ♦ దురు దుష్టమతిన్.

తే. ఇమ్మెయి మెలంగు వీరాక ♦ సమ్ముపోలె
సర్వభూతస్థు నాత్మ నీ ♦ శ్వరుని వేద
వర్ణితు నెఱుంగక నివృత్తి ♦ పరములైన
శ్రుతులను బ్రవృత్తిపరముగాఁ ♦ జూచుచుంద్రు. 10

వ. లోకంబున వ్యవాయామిషమద్యసేవలు జంతువులకు రాగవశంబున నిత్యంబులైయున్నయవి కాని వీనికి విధిశాస్త్రంబులు లేవు అయినను "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహేత్ ...ఋతౌ భార్యాముపేయాత్" అనుటచే సంతానార్థము గైకొన్న స్వభార్యయందు ఋతుకాలములనే సంగమంబును "పశుమాలభేత...హుతశేషం భక్షయేత్" అనుటచే యజ్ఞవిషయంబుననే మాంసనిషేవణంబును "సౌత్రామణ్యాం సురాగ్రహాన్ గృహ్ణాతి" అనుటచే సౌత్రామణివిషయముననే మద్యసేవయుఁ గర్తవ్యములన్న

యవజ్ఞారూపనియమవిధిమాత్రము లేకపోలేదు. అక్కటతన నివిరో
ఋతుకాలేతర స్త్రీసంగమము నయజ్ఞ మమాంసమద్యసేవనంబును, నిషి
ద్ధంబులను విషయ మర్థవశంబునం దెల్పుచున్నవి. కాన నివి నివృత్తిబోధ
కములు కాకపోలేదు. 11

తే. ధనమునకుఁ బ్రధానఫలంబు ♦ ధర్మమగును
దాన దృఢశాంతి పొడమును ♦ దానివలనఁ
బొందువడుఁ బరోక్షజ్ఞాన ♦ మందువలన
నొదవు నపరోక్షవిజ్ఞాన ♦ మోనృపాల ! 12

కం. ఇట్టి ధనము ధర్మమునకుఁ, బెట్టక దేహమ్ముకొఱకును ♦ బెట్టెద రకటా !
ఎట్టివిమూఢులొ ? రక్కసి, పట్టునఁ దమమేనిమిత్తి♦పట్టు టెఱుఁగరో ! 13

మ. కలుద్రావ న్వచియించునే శ్రుతు ? లవ ♦ ఘ్రాణింపనొప్పెన్ మఖం
బులఁ బశ్వాలభనంబహింసయని చె ♦ ప్పెన్ భక్షణార్థంబు జం
తులహింసించిన హింసయౌ నని; రతిం ♦ దోషంబెయౌఁగాని బి
డ్డలకై మొగ్గిసఁ గాదనెన్ దెలియ రే ♦ ద్దన్ శుద్ధ మీధర్మమున్. 14

మ. ఎవఁ డీనిర్మలధర్మముం దెలియకెం ♦ తే నమ్మికంబూని జం
తువులం జంపి యముత్రసౌఖ్యములఁ దో ♦ డ్తోఁ బొందఁగాంక్షించి యీ
భువి హింసంబొనరించు నాజనుఁడు స్త ♦ బ్ధుం డన్యలోకంబునం
దవనీనాథ ! తదీయజంతులకె భ ♦ క్ష్యంబై శ్రమంబొందెడిన్. 15

మ. పరదేహంబులనున్నస్వాత్మని జగ ♦ ద్వ్యాపిన్ బరంధాము నీ
శ్వరు ద్వేషించుచుఁ బుత్త్రదారముఖసం ♦ బంధంబులంబొల్చు న
శ్వర మీకాయమునం దపారమగు నే ♦ స్తం బుల్లమందూని యె
వ్వరువర్తింతురొ వారధఃపతితులై ♦ పాడౌదు రుర్వీశ్వరా ! 16

కం. కేవలమూఢులుగాకయుఁ, గైవల్యముపొంతఁబోవ♦కయుఁ జెలఁగెడు నా
త్రైవర్గికు లక్షణికులు, కోవిదవర ! యాత్మఘాత ♦ కులు గారొకో. 17

తే. అనఘ ! యిట్టు లాత్మావహ్ను ♦ తిని బొనర్చు
కొనుచు నజ్ఞానమును జ్ఞాన ♦ మని తలంచి
కాలవశత నీప్సితములు ♦ గూలిపోవ
నకృతకృత్యులై శాంతిలే ♦ కలమటింత్రు. 18

కం. అనవరతాయాసంబులఁ, గనుకని కూర్చినధనాది ♦ కంబు విడిచి ఘో
రనిబిడతమోగృహంబుల, కును జొత్తురు హరివరాఙ్ము♦ఖులు మనుజేంద్రా!

వ. అనవిని నిమిభూవల్లభుం డుల్లంబున నుల్లసిల్లి భక్తి కర్తవ్యమంటిరిగదా!
భగవంతుఁ డేకాలంబున నేవర్ణాభిధాకారంబులుగలవాఁడై యేవిధిప్రకార

మెట్టినవరులచేఁ బూజింపంబడు నావతిండనఁ గరభాజనుండు నవమార్గభుం
డిట్లనియె. 20

* కరభాజనుండు చతుర్యుగహరిపూజాదిక మెఱిఁగించుట *

ఆ.వె. ధరణినాథ! వినుము ♦ తామరసాక్షుండు
ప్రతియుగంబునందు ♦ బహువిధాకృ
తులు వహించి నామ ♦ ములు వర్ణములు పెక్కు
వెలుఁగ బూజలొందు ♦ వివిధగతుల. 21

తే. కృతయుగంబున జడలువ ♦ హించి వల్క
లాంబరముఁగట్టి జందెంబు ♦ నక్షమాల
దండమును గమండలువును ♦ దాల్చి యజిన
మలర నలుగేలఁ దెల్లని ♦ హరి వెలుంగు. 22

కం. జను లప్పుడు నిర్వైరులు, ఘనశాంతులు శమదమాది ♦ కలితులు సుహృదుల్
వినయపరులగుచు నద్దేవుని గొల్తురు ధ్యానయోగ ♦ పూర్ణమనములన్. 23

కం. పురుషా! హంసా! యోగీశ్వర! యవ్యక్తా! సువర్ణ! ♦ వైకుంఠా! యీ
శ్వర! ధర్మా! యమలా! యని, పరికీర్తింతు రవు డాత్మ ♦ భగవంతుఁ బ్రజల్.

తే. స్రుక్స్రువాద్యుపలక్షణ ♦ శోభితుండు
మృదులదీక్షాంగభూత్రి ♦ మేఖలుండు
త్రేతయందును యజ్ఞమూ ♦ ర్తి హరి కపిల
కచుఁడు రక్తవర్ణుఁడు చతు ♦ ష్కరుఁడు వెలుఁగు. 25

కం. ధర్మిష్ఠులు బ్రహ్మవిదులు, నిర్మలబుద్ధులయి నరులు ♦ నిగమోక్తవిధా
కర్మముల సర్వమయు హరి, నర్మిలి యజియింతు రవు డ ♦ నల్పప్రీతిన్. 26

కం. ఉరుగాయ! యజ్ఞ! విష్ణూ!, ఉరుక్రమా! పృశ్నిగర్భ! యోయి జయంతా!
పరసర్వదేవ! మముఁ బ్రో, వర పేర్మి వృషాకపి! యని ♦ ప్రార్థింత్రు జనుల్. 27

సీ. అతసీసుమాతను ♦ ద్యుతితతుల్ దశదిశా, భాగంబులందును ♦ బ్రబ్బికొనఁగ
కచ్చులు దీఱిచి ♦ కట్టిన బొజ్జపైఁ, బచ్చని పట్టుదు ♦ వ్వలువ నిగుడ
పాంచజన్యసుదర్శ ♦ నాంచత్ప్రభలు ద్వ్యగు, ణీకృతంబై నేల ♦ నింగి నిండ
ఎఱ్ఱతామరలట్లు ♦ విఱ్ఱవీఁగెడి కన్నుఁ, గవ నెనరుం జూడ్కి ♦ కలుకలీన

తే. అక్కడక్కనపుం దెస ♦ యందు దక్కి
నంవు నుడి వెంద్రుకల్ సొంపు ♦ పెంపు నింప
పొడవుఁ బూదండ నిగ్గులు ♦ కడలుకొనఁగ
మెరయు నొకపరంజ్యోతి ద్వా ♦ పరమునందు. 28

తే. ఆమహాపురుషుని మాన ♦ వాళిచేరి,
తత్త్వజిజ్ఞాస వేదతం ♦ త్రములచేతఁ
బ్రచురచామరచ్ఛత్రాది ♦ రాజలాంఛ
నముల నర్చింతు రవ్విభు ♦ నరవరేణ్య! 29

తే. వాసుదేవ! సంకర్షణ! వందనంబు
ప్రణుతి ప్రద్యుమ్న! యనిరుద్ధ! వందనంబు
వందనంబు నారాయణ! వరఋషీంద్ర!
వందనంబు మహాత్మ! యోవరమపురుష! 30

తే. వందనము విశ్వ! విశ్వేశ! వందనంబు
వందనము సర్వభూతాత్మ! ♦ వందనంబు
వందనము భగవానుఁడా! ♦ వందనంబు
లనుచు జగదీశ్వరుని రాజు ♦ లభినుతింతు. 31

వ. ఇది ద్వాపరయుగవిషయంబు. ఇఁకఁ గలియుగంబున నానాతంత్రవిధానంబులఁ బూజింతురు. 32

సీ. ఇంద్రనీలద్యుతుల్ ♦ సాంద్రంబులై స్వీయ, కాయంబునందుండి♦గంతులిడఁగ
శ్రీవత్సకౌస్తుభశ్రీలు విశాలవ, క్షోభాగమందును ♦ శోభిలంగ
శంఖచక్రంబులు ♦ శార్ఙ్గనందకములు, కరచతుష్టయమున ♦ మురువుసూప
నందసునందాదు♦లందుపాటున వినయభయంబులఁ గొల్చి ♦ భృత్యములనిలువ

తే. పీతవసనప్రభల దిశల్ ♦ పిక్కటిల్ల
మందహాసకాంతులు ముఖ ♦ మందుఁ గులుక
నెవరుఁ గ్రుమ్మరించెడి చూపుఁ ♦ లనువుమీఱఁ
బొలుచు కృష్ణుఁ గీర్తింతురు ♦ కలియుగమున. 33

చం. శితిగళపద్మగర్భులు యు ♦ జించెడితావు, శ్రితేప్సితంబులం
బితికెడి గోవు, భృత్యజన ♦ పీడనడంచెడి తావు, ఘోరసం
సృతిమరుపీఁగుమావు, సిరు ♦ లీనెడి పున్నెపుఁబ్రోవు, ధ్యేయసం
తతిఁ దలపూవు, నీదుచర ♦ ణంబులలావు హరీ! నమస్కృతుల్. 34

చం. చిఱునగ వాననంబునను ♦ జిందులుద్రొక్కఁ బ్రసాదమేదురో
దరరుచిమాలికల్ నయన ♦ తామరసంబుల నాట్యమాడ భా
సురవరదాభయాభీహరణ ♦ శోభనముద్రలు కేలరాజిలన్
గెరలెడి లోకమోహనము ♦ కృష్ణుని విగ్రహముం దలంచెదన్. 35

వ. అని యిట్లుయుగవర్తులగుమనుజులు యుగానురూపములైన నామరూపములతో నొప్పు శ్రేయోదాయియగు నీశ్వరుంబూజించుచుందురు. 36

తే. గుణమెఱిఁగి సారముగ్రహించు ♦ కోవిదాళి
కలియుగమ్మునె మిన్నగాఁ ♦ దలఁతు రీశుఁ
డీయుగమున నిష్టార్థంబు ♦ లిచ్చుఁగాదె
మనుజులకును సంకీర్తన ♦ మాత్రముననె. 37

తే. దేహులకు నీభవాంభోధిఁ ♦ దిరుగువారి
కింతకంటెఁ బరమలాభ ♦ మెద్దికలదు ?
తొలఁగు సంసృతి, పరమశాం ♦ తి లభియించు
మహితసంకీర్తనముననే ♦ మనుజనాథ ! 38

తే. అకృతమునఁ గృతాది యు ♦ గాంతరముల
మెలఁగెడిప్రజాసమూహంబు ♦ కలియుగమునఁ
జొరఁదలంచెద రటులైన ♦ సులభముగనె
తమకు నారాయణపరత్వ ♦ మమరుననుచు. 39

వ. రాజేంద్రా ! కలియం దిట్లు జనించి భక్తులైనవా రనంతముఁగలరు. విశేష
ముగా ద్రవిడదేశమున నందును తామ్రపర్ణియుఁ బయస్వినియుఁ గృత
మాలయు మహాపుణ్యయగు కావేరీమహానదియు నెచటం బ్రవహించు
నచటిజను లాజలంబుం గ్రోలువారు పవిత్రాశయులు వాసుదేవభక్తులునై
యుందురు. మఱియు 40

కం. తృష్ణాపీడఁదలంగుచుఁ, దృష్ణాళిమనోరథములఁ ♦ దీర్చుచు నృపతీ !
కృష్ణాహ్వాయముననె పొందిన, కృష్ణానదిమహిమ వశమె ♦ కీర్తింపంగన్ ? 41

కం. విష్ణుపదోద్భవజలమే, నిష్ణాతముగాఁగ భక్తు ♦ ని సలుప, సాక్షా
త్కృష్ణాంగస్పర్శం బది, కృష్ణునిఁగాఁజేయదెట్టు ♦ లిమ్మానవునిన్ ? 42

కం. హరి విశ్వేశు ముకుందున్, శరణ్యు సర్వాత్ము భేద ♦ సంగతి విడి యే
నరుఁడు శరణుచొచ్చునో వం, చఋణంబులు నేమిసేయఁ ♦ జాలవు వానిన్.

ఉత్సాహము ఇతరభావ ముజ్జగించి ♦ యీశుపాదపద్మముల్
సతము భజనసేయునరుఁడు ♦ సత్ప్రియుఁడు వికర్మసం
గతికిఁబో, డొకప్డు పోవుఁ ♦ గాక యేమి ? వానిహృ
త్స్థితుఁడు తత్పరేశుఁ డఘముఁ ♦ జెండివేయకుండునే ? 44

వ. అని కరభాజనుండు నిమినృపతికిం దెల్పెనని నారదుండు వసుదేవునకుం జెప్పి
మఱియు నిట్లనియె. 45

కం. ఈరీతిని జాయంతే, యేరితధర్మములవిని ప్ర ♦ హృష్టమతిని భూ
మీరమణుఁడు సగురుండై, యాఋషివర్యుల సపర్య ♦ లందుం దేల్చెన్. 46

కం. అంతటఁ బ్రసిద్ధులగు నా, యంతర్ముఖులార్షభులు మ ♦ హాత్ములు సిద్ధుల్
శాంతమతులు సర్వాత్మకు, లంతర్ధానులయి రెల్ల ♦ రరయుచునుండన్. 47

కం. నిమిభూపాలుం డీధ, ర్మములననుష్ఠించి యుక్తి ♦ సుగతిం బొందెన్
రమణీయచరణ! వసుదేవ! మహాత్మా! వింటివిగద ♦ పరమప్రీతిన్. 48

వ. ఇఁక నేమి? యేతద్భాగవత ధర్మముల ననుష్ఠించి నిస్సంగుండవై పరమగతిం
బొందఁగల వదియునుంగాక. 49

— నారదుండు వసుదేవ దంపతుల నగ్గించుట —

కం. వసుదేవా! మీ దంపతు, లసదృశులు గదయ్య! యీశు ♦ హరి భగవంతున్
స్వసుతునిఁగఁ బడయఁగలిగితి, రసమునఁ బూరించితిరి స ♦ మస్తజగంబుల్. 50

సీ. ఎంతచక్కనివాఁడొ ♦ యీముద్దుబిడ్డఁడం, చని కౌఁగిలించి ము ♦ ద్దాడియాడి
ఇటునడయాడుచో ♦ నీకెంక కెంతటి, కళవచ్చెనే? యంచుఁ ♦ గాంచికాంచి
నాయనా! యిష్టమై ♦ నపదార్థములు తింటె, వా బొజ్జనిండ? నం ♦ చడిగియడిగి
ఎండలో వచ్చితే ♦ యెంతకందెను మోము? బడలితే? యని మేను ♦ పుడికిపుడికి

తే. పోకుమెవ్వరిపైకి నే ♦ పుట్టలోన
నేమిపాముండునో మన ♦ మెఱుఁగ, మింట
హాయిగాఁదిని కూర్చుండు ♦ మనుచు హరినిఁ
దనయుఁబోలె బెంచితి రెంత ♦ ధన్యులయ్య! 51

కం. పుత్రప్రేమంగనుటఁ బ, విత్రములయ్యె భవదీయ ♦ విమలహృదయముల్
శత్రుత్వమునంగనుటఁ బ, విత్రులయిరి చైద్యసాళ్వ ♦ పృథివీశాదుల్. 52

వ. వైరభావంబును ధ్యానయోగంబునం జేరును. ఎట్లన,

మ. హరి యేయూరఁ జెలంగునో? యతనిదే ♦ హం బెట్టిదో? వాని కం
ఠరవం బెట్టులనుండునో? యతని యా ♦ సంప్రేక్షణాదుల్ గుణా
లరయంగా నెటులుండునో? యని తదీ ♦ యస్వాంతులై శత్రుభూ
వరు లెల్లప్పుడునుందు రిద్ది తపమా? ♦ వైరమ్మ? యోచింపుమా! 53

మ. హరి యేయింట వసించు? వాని శయనా ♦ హారాసనక్రీడ లె
త్తెఱ! యేకాంతముగాఁగ నెయ్యెడల వ ♦ ర్తించున్? స్వకీయాయుధో
త్కరభృత్యుల్ నివసించు టెడ? యని రం ♦ ధ్రప్రేక్షణార్థంబుగా
వరు లెల్లప్డు తలంచుచుం ద్రిది హరి ♦ ధ్యానంబుగా కేమగున్! 54

ఉ. పౌండ్రకవాసుదేవునకు ♦ వచ్చె సరూపత భూమియందు తాఁ
దీంద్రమునాఁగఁ జిహ్వల నె ♦ దిర్చిననేమి? యెటైననేమి! పె

కేంద్రుఁడు వినఁగా యదూద్వహాలసి ♦ కార్యములెంచెను జైద్యుఁ డట్టులే
పీంద్రకు భక్తవర్యులకు ♦ భేదము క్రోవఁగ, గమ్య మొక్కటే. 55

కం. కనుక వినుదేవ! కృష్ణుఁడు, తనయుండనుబుద్ధి మాను ♦ తా సర్వాత్ముం
డును బరుఁ డవ్యయుఁ డీశ్వరుఁడు నిగూఢైశ్వర్యుఁడు నరుఁ ♦ డుంబలెఁ
దిరుగున్. 56

తే. దైత్యులు నృపాలురై వసుం ♦ ధర జనించి
రక్కటన నొదవిన భూమి ♦ చిక్కుఁ దీర్ప
సుజనులం దయఁదేర్పఁ గృ ♦ ష్ణుఁ డుదయించె
స్వీయయశము వర్ణింప ని ♦ ర్వృతిని బొంద. 57

వ. అని నారదుండు నుడివి పూజితుండై యరిగెనని శుకయోగి పరీక్షి
త్తుతో నిట్లనియె. 58

కం. ఈ వృత్తాంతంబును విను, దేవుఁడు నిర్మలుఁడు పూజ్య ♦ దేవకి విని యెం
తే విస్మితులై విడిచిరి, భావంబుల మోహముల నృ ♦ పాలవరేణ్యా! 59

కం. [1] ఈ యితిహాసంబును శ్రద్ధాయుతుఁడై విని యెడంద ♦ ధరియించినవాఁ
డీయెడలన యఘరాశిం, బాయు ననుక్షణము బ్రహ్మ♦భావమునొందున్. 60

వ. అనవిని నృపుం డలరెను.

ఇది యేకాదశస్కంధమున బంచమాధ్యాయము

---

## షష్ఠాధ్యాయము

కం. వివిధావ్యాయ వివిధాకృతి, వివిధత్వాంతారవాస్య ♦ విధ మెఱిఁగిన స
ర్వవిపశ్చిద్బుద్ధుల కె, ల్లవుడువుగావయ్య నీవు ♦ హరిహరనాథా!

వ. [2] దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో
నిట్లనియె. 2

### — ♦ బ్రహ్మాదులు ద్వారకకువచ్చి కృష్ణుని స్తుతించుట ♦ —

వ. అంత నొకనాఁడు తేజస్వులగు సనకాదులతోడను బ్రజాపతులగు మరీ
చ్యాదులతోడను గూడి బ్రహ్మయు భూతగణంబులంగూడి భూత భవ్య
ప్రవేశుండైన భవుండును, వసురుద్రాదిత్యదస్ర ఋభ్వంగిరోవిశ్వసాధ్య
గంధర్వాప్సరోనాగసిద్ధచారణగుహ్యక ఋషిపితృవిద్యాధర కిన్నరాదులం
గూడి యింద్రుఁడును శ్రీకృష్ణదిదృక్షువులయి ద్వారకకరిగి యచట, 3

---

1 సమాప్తి 4-5-1946    2. 8-5-1946 ఈ యధ్యాయ ప్రారంభము.

సీ. మాయూరపింఛశో ♦ భాయూథము ఘటిల్ల, చూడాగణంబుతో ♦ గోడగింప
మకరకుండలమణి ♦ ప్రకరకాంతులు గండ, మండలద్వయము పైఁ ♦ దాండవింప
రుచిరమందస్మిత ♦ ప్రచురరోచులు నవ్వ, సన్నాసనాబ్జంబు ♦ వెన్నడింప
పీతాంబరద్యుతి ♦ వ్రాతంబు కోమల, నీలదేహంబుతో ♦ మేళవింప

తే. హారమకుటకేయూరము ♦ జీరకంప
నాంగుళీయకాదివిభూష ♦ లంగకములఁ
గ్రమ్ముకొని భూష్యభూషణ ♦ త్వమ్ము నెఱప
వరలు కృష్ణమోహనరూప ♦ మరసి యరసి. 4

వ. అవి తృప్తాక్షులగుచు సర్వలోకమలాపహంబైన సద్యశోరుచిరావహంబైన
సర్వోర్వీజనమనోహరంబైన కల్యాణకరంబైన భగవానుని విగ్రహంబు
నకుఁ జేతులు జోడించి మ్రొక్కుచుఁ జెంతం జేరి. 5

కం. నందనవనమందలి మృదు, మందారలతాంతముల న ♦ మంద ప్రీతిం
బృందారకబృందము గో, విందుం బూజించి యిట్లు ♦ వేడం దొడఁగెన్. 6

తే. ఘోరకర్మపాశవిముక్తిఁ ♦ గోరి భక్తు
లాత్మభావాళిఁ జింతించు ♦ నట్టి నీప
దాబ్జములకు బుద్ధీంద్రియ ♦ ప్రాణహృదయ
వాక్తతిం బ్రణతులు సేయు ♦ వార మనఘ! 7

వ. దేవా! నీవు గుణనియంతవై త్రిగుణాత్మకంబైన మాయచే స్వాత్మయంద
మనోదుర్విభావ్యంబైన మహదాదిప్రపంచము నసృజించుచుఁ బోషించుచు
లయ మొనరించుచునున్నాఁడవు. అజితా! స్వాత్మారాముండవు రాగాది
రహితుండవు నగుకతన నిక్కార్యమ్ములచే నీవు బద్ధుండవు గాకుండెదవు. 8

తే. ఋషభ! త్వద్యశశ్శ్రవణప్ర ♦ వృద్ధమైన, శ్రద్ధసాత్త్వికులకు శుద్ధి ♦ గ్రాలినట్లు
రాగులకుఁ గ్రాలదు తపఃక్రియాగమాధ్య, యనవితీర్ణశ్రుతోపాస ♦ నాదికముల

చం. ఎదలవహించి ముక్తికి ♦ మునీశ్వరులున్ సమభూతిఁ గోరి యెం
చఁ దగినవ్యూహపూజలను ♦ సాత్త్వతు, లాత్మవిదుల్ వికుంఠవాం
ఛఁ దొడరి మూఁడుకాలముల ♦ సంభజియించద రేని నట్టి నీ
పదము మదీయదుర్విషయ ♦ వాసనలన్ దహియించుఁగావుతన్. 10

చం. పదిలులు యాజ్ఞికుల్ ప్రయత ♦ పాణులఁ బూతహవిస్సులంది ప్రాఁ
జమువచించురీతిఁ గ్రతు ♦ జాతకృశానువులందు వేల్చుచోఁ
ద్రిదశవరస్వరూపివి గ ♦ దే యనియోనిఁ దలంతు రట్టి నీ
పదము మదీయదుర్విషయ ♦ వాసనలం దహియించుఁగావుతన్. 11

కం. నెమ్మది నీమాయాబిం, బమ్మగు నణిమాదిఁ గోరి ♦ వరయోగులు యో
గమ్మునఁ గొల్చెడి నీచర, ణమ్మస్మద్విషయవాస ♦ నల దహియించున్. 12

కం. ఇమ్ముల భక్తిభృతస్వాం, తమ్ముల భాగవతు లెల్ల ♦ తతిఁ బూజాకా
ర్యమ్ములఁ గొల్చెడి నీచర, ణమ్మస్మద్విషయవాస ♦ నల దహియించున్. 13

చం. హృదినివసింప నేను నిది ♦ యేటికిఁ బర్యుషితంపుమాలయుం
బొదలె సపత్నివోలెనని ♦ బుద్ధి ననాయవహింప లక్ష్మి, య
య్యది గణియింప కాశ్రితస ♦ మర్పితమాలల నాదరించు నీ
పదము మదీయ దుర్విషయ ♦ వాసనలన్ దహియించుఁగావుతన్. 14

చం. సదయత్రివిక్రమత్వమున ♦ సత్యము దాఁకి త్రిమార్గగాయుతిం
బొడలి జయధ్వజంబొతునఁ ♦ బొల్చిన యెయ్యది సాధునిర్జరా
భ్యుదయము దుష్టరాక్షసస ♦ మూహవలాతున మాచరించె నా
పదము మదీయదుర్విషయ ♦ వాసనలన్ దహియించుఁగావుతన్. 15

చం. మృదువగు దేనిసేవ లొన ♦ రించుచు భక్తగణం బనన్యమా
హృదయముతోడ నీ సదయ ♦ వీక్షణవిభ్రమలీలఁగాని నీ
వదనముఁగాని నీ నగవు ♦ వైఖరిఁగాని గ్రహింపఁబోదొ యా
పదము మదీయ దుర్విషయ ♦ వాసనలన్ దహియించుఁగావుతన్. 16

చం. అది దరిలేనినమ్మకమొ ! ♦ యారని ప్రేమయొ ? గాఢభక్తిసం
పదయొ ! యనూనమాధ్యమొ ? య ♦ పారరసానుభవావశత్వమో
తదితరతావకాంగము శ్రి ♦ తవ్రజమెంచదు దేనిఁగొల్చు నా
పదము మదీయదుర్విషయ ♦ వాసనలన్ దహియించుఁగావుతన్. 17

చం. ఎదియొ విశేషముండవలె ♦ నిచ్చట లేనియెడం ద్రయీశిఖల్
త్రిదశవరుల్ దిశాధిపులు ♦ దేనికి స్వీయశిర స్తటీకిరీ
టదృఢమణీఘృణీగణక ♦ టాహముతోడ నివాళులిత్తు రా
పదము మదీయదుర్విషయ ♦ వాసనలన్ దహియించుఁగావుతన్. 18

చం. అది సకలాఘకాననద ♦ వానల, మద్దిచరాచరావనాం
చదమృతభాండ, మద్దిస్థితి ♦ జన్మలయాచరణక్రియావిశా
రద, మది సర్వపావనక ♦ రద్యుసరిజ్జని భూతధాత్రి యా
పదము మదీయదుర్విషయ ♦ వాసనలన్ దహియించుఁగావుతన్. 19

చం. మొదలిటమిన్కుఁ జాల్ చిగురు ♦ మొల్లములంబసిపట్టె యెంతయో
వదిలముగా న దేవనిగఁ ♦ బాటులు చెప్పినచొప్పువట్టి యే
వెదకినఁగూడఁ గన్మొఱఁగి ♦ వేఁచును వేదులనైన నట్టి నీ
పదము మదీయదుర్విషయ ♦ వాసనలన్ దహియించుఁ గావుతన్. 20

చం. మదగజశిక్షణాంకుసృణి, మ ♦ హత్వగిరీంద్రముఁ జెండవజ్ర, ము
ద్యదఘసమూలదారణము ♦ నందు హలమ్ము, సుఖామృతంబిడన్
మృదుకలశంబుఁ గీర్తిరమ ♦ నింప ధ్వజంబు, ధరించునట్టి నీ
పదము మదీయదుర్విషయ ♦ వాసనఁ దహియించుఁ గావుతన్. 21

తే. ముక్కుఁద్రాడుఁబసుఁబోల్కిఁ ♦ బురుషపర్వ
కాలరూపివౌ నీకును ♦ గైవసులము
బమ్మమున్నగా నే మట్టి ♦ ప్రకృతిపురుష
వరుఁడవగు నీపదము మాకు ♦ సిరుల నిడుత. 22

వ. దేవా! యీ జగత్సర్గస్థితినాశములకు నీవ కారణుండవు ఏలన సవ్యక్తంబైన ప్రకృతికిఁ జీవాఖ్యపురుషునకును మహత్తత్త్వమునకును గాలరూపంబున నియామకుండవై యున్నవాఁడవు అఖిలాపచయంబునం బ్రవృత్తిగలదియుఁ, జాతుర్మాస్యత్రయంబనెడి త్రినాభులు గలదియు, గభీరరయము గలదియు నగు సంవత్సరకాలచక్రము నీవగదా. కనుకనే నీవుత్తమపురుషుండవు స్వామీ! పురుషుండు నీవలన శక్తిం బొంది యమోఘవీర్యుండై మాయచే నీప్రపంచమునకు గర్భముంబోలె మహత్తత్త్వము సృజించెను ఆమహత్తు తన్మాయచేతనే యనుగతంబై బహిరావరణోపేతంబైన హైమాండ కోశము నాత్మనుండి సృజించె. అక్కారణమున నీవు స్థావరజంగమాత్మకంబైన జగంబున కధీశ్వరుండవు ఈశా! మాయోజ్జృంభితేంద్రియ వృత్తులచే నుపనీతంబులైన యర్థంబుల నుపభోగించుచున్నను నీవు హృషీకపతివగుట నలిప్తుఁడవై యుందువు కనుకఁ దద్విషయగతపుణ్యపాపంబులు నీకుండవు. ఇతరు లట్లుగాదు వారు విషయములఁ బరిహరించుచున్నను తద్వాసనామాత్రంబుననే బద్ధులగుచుందురు. కాన వారు వానికి వెఱచుచుందురు. మఱియును, 23

సీ. ముసిముసినగవుల ♦ ముసరిసిబ్బితిచూపుఁ, దొంగలిఱెప్పలఁ ♦ ద్రోచిత్రోచి
లేనవ్వు నిగనిగ ♦ ల్వారియు కన్గ్రేవ వాల్జూపుఁదూపులఁ బైకిఁ ♦ జోఁపిచోఁపి
తలఁపుఁదీవులఁబట్టు ♦ గొలుపుతున్నిఁ బొమ్మ, ముడిత్రోడి చూడ్కులఁ ♦ గడపికడపి
వల్గొత్తుకెమ్మోవి ♦ వచరించి చెంగల్వ, కనులజంకెనచూడ్కిఁ ♦ గ్రాఁచిక్రాఁచి

తే. కళలతావు తిథులెఱింగి ♦ కమిచికమిచి
లలితసౌరతమంత్రశౌం ♦ డలగు పదియు
నాఱువేలయెన్మిదియెమ్మె ♦ లాండ్రు నీకు
వికృతిఁగల్గింపలేరైరి ♦ విజితవిషయ ! 24

తే. త్వత్పదక్షాళనమున నే ♦ ర్పడిన త్రిపథ
గాదు లమృతతుల్యభవత్క ♦ థాపగలును

మూఁడులోకంబులందును ♦ బొదలి ఘోర
కల్మషంబులఁ బోఁగొట్టఁ ♦ గలవు దేవ ! 25

తే. కానఁ దన్నిమ్నగాదుల ♦ స్నానములను
సలిపి తచ్ఛ్రుతికథితయు ♦ న్మత్కథాప్ర
సిద్ధతీర్థమ్ముఁ జెవులచే ♦ సేవసేసి
ధర్మాచరితులు పూతులై ♦ తనరుచుంద్రు. 26

—♦ బ్రహ్మ శ్రీకృష్ణుని వైకుంఠమునకు విచ్చేయఁగోరుట ♦—

కం. అని నిర్జరసహితుండై, వనజభవుఁడు పొగడి యవలఁ ♦ బ్రణమిల్లుచు మిం
ట నెయుండి వెండియును ని, ట్లనె గోవిందునకు సంత ♦ తానందునకున్. 27

కం. మును మేము భూమిభారం, బును దీర్పవె దేవదేవ ! ♦ పురుషోత్తమ ! యం
చును విన్నవించుకొనఁగాఁ, జనుదెంచితి, వెల్లపనులు ♦ సమకూరెఁ బ్రభూ !

కం. అసదృశధర్మమ్మును స, త్యసంధులగుసాధులందు ♦ స్థాపించితి ది
గ్వసనమున మలాపహమగు, యశమును వ్యాపింపఁ జేసి ♦ తంబుజనాభా! 29

కం. జనియించియదుకులంబున, ననుత్తమంబైనరూప ♦ మంది జగము మే
లునకై యద్భుతకర్మము, లను సలిపితి ప్రేమజలధి ! ♦ లావణ్యనిధీ ! 30

సీ. సాధువుల్ కలిని నీ ♦ చరితముల్ వినుచుఁ గీ, ర్తించుచు భవముఁ ద ♦ రింపఁగలరు
యదువంశమున నీవు ♦ నవతరింపఁగ నూట, యిరువదియైదేండ్లు ♦ జరిగె నిపుడు
దేవకార్యంబుసా ♦ ధింప శేషము లేదు, కులము శాపముచేతఁ ♦ గూలినట్లె
కావునఁ దమకిచ్చ ♦ గలదేని నిజధామ, మునకును వేంచేయుఁ ♦ డనఘచరిత !

తే. లోకముల నమ్ము లోకపా ♦ లురను గింక
రులను బాలింపు వైకుంఠ ♦ యలఘు కరుణ
ననుచు ధాత ప్రార్థింపంగ ♦ నచ్యుతుండు
పలికె జలధరనిర్ఘోష ♦ భాషణముల. 31

సీ. అమరేశ నీవన్న ♦ యట్లు నేనును దలం, చితిని మీపనులెల్లఁ ♦ జేయఁబడియె
వసుధాభరంబు దిం ♦ పంబడె, నైన నీ, యాదవకులము దై ♦ ర్యబలశౌర్య
వీర్యాదుల న్విఱ్ఱ ♦ వీఁగుచు లోకంబు, గబళింప నుంకించి ♦ కాంచుచుండె
సాగరంబును వేల ♦ చందాన నరికట్టి, యుంచితి, నీవని ♦ యొకఁడు సేయ

తే. కవలవచ్చిన జగతికి ♦ హానికలుగు
నిపుడపొడసూపె నాశన ♦ మీకులమున
కద్ది తుదిదాకపిమ్మట ♦ నరుగుదెంతు
మామకీన వైకుంఠధా ♦ మమ్మునకును. 32

వ. అని జగన్నాథుండు పలికినపిమ్మట నా స్వయంభువుండు నిర్జరసహితుండై
ప్రణమిల్లి నిజలోకంబునకరిగె నని మఱియుఁ బరీక్షిన్నరేంద్రునితో శుక
యోగి యిట్లనియె. నంతం గొంతకాలంబున కొకనాఁడు శ్రీకృష్ణుండు
యాదవవృద్ధులం బిల్చి 33

—♦ శ్రీకృష్ణుండు యాదవులతోఁ బ్రభాసమున కేగుదమనుట ♦—

కం. నిలయములఁదూరె ఘూకం,బులు దివిఁదిరుగుచును గాకి♦మూక లఱచె సం
దెల నక్కలువాపోయెడి, మొలిచె బెరటులందుహస్త♦నులు వికృతముగాన్.

కం. మీరును గనుచున్నారా? ద్వారక నుత్పాతములు స♦మస్తదిశల దు
ర్వారంబై పొడమె ఋషుల,ఘోరోక్తులు సైతము మన♦కులమునకుండెన్. 35

తే. కాన మన మిఁకనిటనుండఁ♦గాదు ప్రాణ
ములను దక్కించుకొన నాల♦ముం బొనర్పఁ
గదుగవలయు నిప్పుడ యార్యు♦లార! పుణ్య
వాసమునకుఁ బవిత్ర ప్ర♦భాసమునకు. 36

శా. ఆతీర్థంబులఁ గ్రుంకి కాదె మనుశీ♦తాంశుండు దక్షోగ్రశా
పేతక్షీణరుజన్ దలంగె, సుకళా♦వృద్ధింగనెన్, గల్మష
ప్రాతంబుం గృశియింపఁజేసె,మన మా♦భంగిం బ్రవర్తింపరా
దే తద్బ్రాహ్మణశాపముం దొరగ లెం♦డీ! యాదవోర్వీవరుల్! 37

తే. స్నానతర్పణమ్ములఁ బాత్ర♦దానములను
భూరిగుణవన్మహీసుర♦భోజనముల
ఘోరవృజినమ్ముఁ దొలఁగించు♦కొనఁగవలయు
నావలను సముద్రము దాఁటు♦రేవ మనము. 38

వ. ఇట్లు శ్రీకృష్ణుండు నుడువవల్లెయని యందఱుం దత్ప్రయాణసన్నాహమ్ముల
నుండి రట్టియెడ బుద్ధిమంతుండైనయుద్ధవుం డదియంతయు నెఱింగి కృష్ణాను
వ్రతుండుగావున, 39

—* ఉద్ధవుఁడు కృష్ణుండాసి ప్రార్థించుట *—

కం. ఒంటరిగా శ్రీకృష్ణుం,డుంట యెఱిఁగి డంటకరిగి♦యొరగి యడుగులం
గంట నొగినద్దికొని యిఁటు,లంటఁబోనేఁగయిమోడు♦పాదలనిగుడన్. 40

శా. దేవా! యీయదువంశనాశనము పూ♦ర్తిం జేసి యీదివ్యలీ
లావిన్యాసముమాని భూమివిడువన్♦లక్షించితే? కానిచో
నీవా బ్రాహ్మణశాపము న్మలపలే♦వే? వీరలంగావ,నీ
శాపం బల్పులమైన యేము గ్రహియిం♦పన్ లేము సర్వేశ్వరా! 41

కం. ఓపురుషోత్తమ ! కృష్ణా !, నీపాదాబ్జములవిడిచి ♦ నిముసమయిన నే
నోప ధరనిలువ,నీకుం, గోపులు : నీతోడ నన్నుఁ ♦ గొనిపోవఁగదే. 42

కం. నీవివిధక్రీడలు భ,ద్రావహములు పూతములు మ ♦ హామధురసుధా
స్రావములు గానఁ జెవులం,ద్రావి పరస్పృహలవిడిచెదము శ్రీకృష్ణా! 43

తే. స్నానశయ్యాసనాటన ♦ స్థానభోజ
నాదికముల నాటలఁ బాట ♦ లందుఁ బ్రియుఁడ
వాత్మఁ దవగునీతోఁ గూడి ♦ యాడి మెలఁగు
మేము నినుఁబాసి యెట్లుందు ♦ మో ముకుంద ! 44

తే. నినువదలియుండలేక తో ♦ డ్కొనిచనంగ
వేఁడెదముగాని మాయకు ♦ నోడి కాద !
అనఘ ! త్వద్భుక్తశేషగం ♦ ధాంబరస్ర
గశనభూషాళిఁ గైకొను ♦ టయ్యె మాయ ! 45

కం. శ్రమణులు దిగంబరులు నూ, ర్ధ్వమంథులుఁ శాంతులుం ద ♦ వస్వ్యాలములు లు
త్తమమగు త్వద్బ్రహ్మస్థానము నెన్నియొ శ్రమములొంది ♦ నంగదె కనుటల్.

చం. వనజదళాక్ష మేము సుల ♦ భంబుగ సంసృతిదాఁటిపోదు మా
ఘనులగు భక్తులంగలిసి ♦ కర్మపథంబున నీ మృదూక్తుల
న్వినుచును నీక్రియావళుల ♦ నీనడపొంపుల నీస్మితాల నీ
గొనముల నీదుచూపులను ♦ గోరి స్మరించుచు సన్నుతించుచున్. 47

వ. దేవా ! నీ యీనృలోకానుకరణస్మరణము భవతరణముగదే యని యిట్లు
పలుకఁగా భగవంతుండు విని యేకాంతియుఁ బ్రియుండును భృత్యుండును
నగు నుద్ధవుంజూచి యిట్లనియెనని శుకర్షి వచించెను. 48

ఇది షష్ఠాధ్యాయము.

---

## సప్తమాధ్యాయము

కం. ఇషణాత్రయమ్ములనియెడు, నిషువులు మర్మములఁజొచ్చి ♦ యేర్పని యాశ
ల్మపరహితుని హృద్ధ్రష్టుల, కమడక్షీణముగఁ దోఁతు ♦ హరిహరనాథా !

— ♦ శ్రీకృష్ణుం డుద్ధవునకుఁ దత్త్వోపదేశము సేయుట ♦ —

వ. [1] దేవా ! యవధరింపు మంత శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో
నిట్లనియె. అయ్యెడ శ్రీకృష్ణుం డుద్ధవుని సాదరంబుగ నాలోకించి మహా
భాగ ! నీ చెప్పిన దంతయు నిక్కవంబ. యదువాశం బొనర్చి వైకుంఠమున

1. అధ్యాయప్రారంభము 11-6-1946

కేగెద బ్రహ్మేశానాదుల కాంక్షితంబు నిదియ సురజ్యేష్ఠ ప్రార్థితుండనై స్వాంశంబున నవతరించి దేవకార్యంబు నిరవశేషంబుగ నాచరించితి. ఈ కులంబును మునిశాపవశంబున నన్యోన్యము కలహించి నశింపఁగలదు. తదనంతర మేడవనాఁడు సముద్రకల్లోలంబుల నీద్వారక మునుంగంగలదు. 2

కం. ఇద్ధర నేఁజనినంతనె, సద్ధర్మం బెడలి కలివ ♦ శంవదయై భ
ద్రోద్ధతినిబాసియుండెడి, నుద్ధవ! నేలీవి యిచట ♦ నుండకు మింక౯. 3

తే. స్వజనబాంధవస్నేహంబు ♦ సర్వమును ద్య
జించి డెందంబు నాయందుఁ ♦ జేర్చివైచి,
అఖిల మాత్మస్వరూపంబ ♦ టన్న తుల్య
దృష్టిగల్గి యీ భువి సంచ ♦ రించుచుండు. 4

సీ. ఇంద్రియంబులచే గ్ర ♦ హింపఁబడునదెల్ల
మాయయే యది మనో ♦ మయము, – మనస్తు
విక్షిప్తమనమైన ♦ వెలయువానికి భేద
విషయమైన భ్రమ మా ♦ విర్భవించు
నా భ్రమంబు గుణదో ♦ షాఖ్యఁగూర్చును, విహి
తం బకర్మము నిషి ♦ ద్ధంబు ననెడి
కర్మభేదములు గ ♦ ల్గవు జ్ఞానులకు, భ్రమో
జ్జృంభిత గుణదోష ♦ చిత్తులకగు.

తే. అమలచారిత్ర! నీవింద్రి ♦ యములబుద్ధి
నిగ్రహించి యీ విశ్వంబు ♦ నిఖిల మాత్మ
యందు మఱియు నయ్యాత్మను ♦ నఖిలనాథుఁ
డైన నాయందుఁగనుము నీ ♦ కలరు ముక్తి. 5

వ. ఏతత్సమదృష్టి కంతరాయములోదవు ననకుము. 6

తే. శ్రుతులయర్థంబు నిర్ధరిం ♦ చుకొని స్వాను
భవమునకుఁ దెచ్చుకొని తుష్టి ♦ వడెదవేని
యఖిలభూతాత్మభూతుండ ♦ వగుదుగాన
విఘ్నతతి యేమిచేయనో ♦ పెడిని నిన్ను? 7

కం. ఇది చేయరానిపనియని, వదలం డిది చేయఁదగిన ♦ పనియని చేయం
డెద సంకల్పవికల్పము, లుదయింపక చేయు జ్ఞాని ♦ యుం బాలుపలె౯. 8

వ. ఈ జ్ఞాని గుణదోషోభయాతీతుఁడు. ఇతఁడు కర్మములఁ బూర్వసంస్కారవశమున నొకప్పుడు చేయు. నొకప్పుడు మానును. సంతియకాని యీ చేయుట మానుట లోకనిమిత్తంబుం బురస్కరించుకొని కాదని యెఱుంగుము. 9

ఆ॥వె. సర్వభూతహితుఁడు ♦ శాంతుండు జ్ఞానవి
జ్ఞాననిశ్చయుండు ♦ సర్వ విశ్వ
మును మదాత్మకముగఁ ♦ గనువాఁడు సంసార
మునను మఱల దుఃఖ ♦ ముల గనండు. 10

వ. ఇట్లు భగవంతుండైన కృష్ణుం డానతీయ మహాభాగవతోత్తముం డైన యుద్ధవుండు ప్రణామంబాచరించి తత్వజిజ్ఞాసువై యిట్లనియె. 11

సీ. యోగేశ! యోగాత్మ! ♦ యోగసంభవ! యోగ
విన్యాస! భద్రముల్ ♦ వెలయుఁ బొంట
నాకుఁ జెప్పితివి సన్న్యాసలక్షణమైన
త్యాగయోగంబు భూ ♦ మా! సుదుష్క—
రముఁ గదే విషయాభి ♦ రతుల కీత్యాగ, మం
దుఁ భవద్భక్తిహీ ♦ నులకుఁ దలఁప
నైన రానిదనుమ్మి ♦ యట్టిచో మాయాప్ర
కల్పిత పుత్రాది ♦ కలితదేహ

తే. మందహామ్మమకారముల్ ♦ పొందువడిచి
యున్నమూఢుండ యుష్మదీ ♦ యోక్తు లే గ్ర
హింపవచ్చితినే? యీభృత్యుఁ ♦ డెట్లు సులభ
ముగను సాధించుఁ బరముఁ దె ♦ ల్పుము ముకుంద! 12

వ. ఆత్మండవు సత్యుండవు స్వప్రకాశుండవు నగు నీవుగాక యాత్మోపదేశ మొనరింప నెబ్బుధుం డన్యుండు గలండు? బ్రహ్మాదిశరీరధారులందఱుఁ ద్వన్మాయామోహితులగుచు విషయార్థబుద్ధులై యుందురు. కనుక ననవద్యుండవు ననంతపారుండవు సర్వజ్ఞుండవు నీశ్వరుండవు నకుంఠవైకుంఠనిలయుండవు నారాయణుండవు జీవుండగు నరునకు సఖుండవు నగు నిన్ను నిర్విణ్ణచిత్తుండను వృజినాభితప్తుండనగు నేను శరణమొందెదను రక్షింపు మన శ్రీకృష్ణుం డిట్లనియె. 13

తే. లోకతత్త్వపరీక్షకు♦ల్మనులు లోక, మందు సాధారణంబుగా నశుభవిషయ
వాసనలనుండి తమ్మును♦స్వయముగానె, యుద్ధవా! యుద్ధరించుకొం♦చుందు
రయ్య. 14

తే. అఖిలజీవులయందు హి ♦ తాహితములఁ
జెప్ప నాత్మయే గురుఁడు వి ♦ శేషముగను
మానవుండు ప్రత్యక్షాను ♦ మానములను
శ్రేయముం గంట స్వీయాత్మ ♦ చేతనె సుమి. 15

వ. అందుఁ బ్రత్యక్షము విను. 16

తే. సాంఖ్యయోగవిదులు పురు ♦ షత్వమందె
సర్వశక్తిమంతుని నన్ను ♦ సరిగఁ గంద్రు
వసుధ నేకపాదులు ద్వితి ♦ పాదులుం జ
తుష్పదుల్ బహుపదు లప ♦ దులును గలర. 17

వ. ఇవియన్నియు మత్సృష్టంబులైనను నాకుఁ బురుషపురమునందు ప్రీతి. కాన బుధు లప్రమత్తులై యీ పురుషదేహంబుననే యహంకారాది వ్యతిరిక్తుండనైన నన్నీశ్వరుని గృహ్యమాణగుణలింగములచే వెదకుచున్నారు. ఉద్ధవా! తెలిసినదా? ఎట్లన, బుద్ధ్యాదులు జడములు ప్రకాశరహితములు. కాన వీనిం బ్రకాశింపంజేయు స్వప్రకాశుం డొకఁ డుండవలెఁగదా. మఱియు బుద్ధ్యాదులు సాధనములునగుట వాశ్యాదులవలె సాధనము లెప్పుడుం గర్తకుం బ్రయోజ్యంబు లగుచుండుం గనుక నీ కరణములు గలవాఁ డొకఁ డుండవలెఁగదా. అని యిట్లనుమానప్రమాణము వలన నన్ను వెదకుచున్నారు. ఇంతమాత్రమునుచేతనే యాత్ముం డానుమానికుండని తలంపవలదు. ఆత్ముండు దేహాదివ్యతిరిక్తుండనియుం బరిశుద్ధుండనియు మాత్రము దీనం గ్రహింపుము. ఏతద్విషయమున మహాతేజశ్శాలియగు యదువునకు నొక యవధూతకు జరిగిన సంవాదం బొండు గల దప్పురాతనేతిహాసంబుం జెప్పెద వినుము. ఒకనాఁడు, 18

—* అవధూత యదు సంవాదము *—

కం. [1]అవధూతం ద్విజవర్యుం, గవి నకుతోభయుని దరుణుఁ ♦ గనుఁగొని సద్ధ
ర్మవిదుండు యదువు ప్రొక్కుచు, సవినయముగ నిట్టులనియె ♦ సంభ్రమవరుఁడై

సీ. స్వామి మిమ్ముఁ గన నా ♦ శ్చర్యమయ్యెడిని నిం
ద్రియతృప్తికొఱకు న ♦ ద్దియును జేయ
విట్టి నిపుణబుద్ధి యెట్టులొదవె నీకుఁ?
బండితవరుఁడ వే ♦ బాలుపోల్కిఁ
జరియింతు వేటికి? ♦ సాధారణమ్ముగ
నరులు త్రివర్గముల్ ♦ సిరులు యశము
నాయువు వృద్ధిచే ♦ యం గడంగుదురు నీ
యెడ నద్దికన్పట్ట ♦ దింత యేని

తే. కల్యుఁడవు సుభగుఁడవు స ♦ త్కవివి సత్యసంధుఁడవు జడోన్మత్తపి ♦ శాచు
లట్టు లుందువేల? యేకోర్కియు ♦ నొందవేల? యేపనికిఁ గర్తకావు నీవేల
చెప్పుమ? 20

---

1 ఈ యవధూత దత్తాత్రేయులవారు

ఉ. అందఱుఁ గామలోభజద ♦ వాగ్నిశిఖావళిఁ గూలిమాఁడుచున్
మ్రిందుచునుండ గాంగఝరిఁ ♦ గ్రాలు గజంబుబోలె నెచ్చటే
నుందువు స్పర్శముల్ గనవ ♦ యొంటరిగా వసియింతు వైన నా
నందము నాత్మఁ బొందెదవు ♦ నా కిది యెంతయు వింతయయ్యెడిన్. 21

కం. అని బ్రహ్మణ్యుండును ధీ,ఖని యదు వసుగంగ ద్విజశి ♦ ఖామణి వినయా
వనతుంగని యాచందం,బునఁ జెప్పందొడఁగె విను మ♦పూర్వవిషయమున్.

-* అవధూత తనయిర్వదినల్వురు గురులఁ బేర్కొనుట *-

ఆ. ఏరివలన నేను ♦ నీబుద్ధి గ్రహియించి, పొంది ముక్తిఁ దిరుగు ♦ చుందు నట్టి
గురులు నాకుఁ గలరు♦నరవర! పలువురు, వారిఁగూర్చి చెప్పు♦వాఁడ వినుము.

వ. భూమి వాయువు గగనము జలము వహ్ని చంద్రుఁడు సూర్యుఁడు కపోత
మజగరము సముద్రము పతంగము మధుకరము గజము మధుహారి హరి
ణము మత్స్యము పింగళకురరము బాలుఁడు కుమారి శరకారుఁడు సర్పము
సాలీఁడు కీటము ననెడియిరువదినలువురు నాకు గురువులు. వీనివృత్తులచే
హేయోపాదేయంబులైనయర్థముల నెఱింగి యట్లు మెలంగెద. నేది యే
గురువువలన నేర్చితినో వివరింతు వినుము. 24

కం. దైవవశానుగమగు భూ, తావళిపీడింప నెఱిఁగి ♦ యది, నిజపథముం
ద్రోవక ధీరుఁడు నిలువం, గావలె నన్న క్షమఁ గంటి ♦ క్షమఁ జూచి నృపా.

మ. నగముల్ చూచితె! యేకతంబ పొలుచున్ ♦ సత్త్వాళికావాసమై
నెగడున్ గైరికముఖ్యధాతువుల మా ♦ ణిక్యాదిరత్నాళిఁ గొ
ల్లఁగనిచ్చున్ దృణవీరుధోషధిఝరుల్ ♦ దాల్చుం బరార్థంబ, యీ
యగరూపక్షితిచేత నేరిచితి న ♦ న్యార్థాత్మవృత్తిత్వమున్.

మ. అనఘాత్మా! విను ప్రాణవాయు వది యా ♦ హారంబుమాత్రంబుఁ గై
కొని శబ్దాదులవాంఛసేయక మెలం ♦ గున్ వాని తద్రీతి భో
జనమాత్రంబునఁ దృప్తిఁ బొంది విషయ ♦ స్పర్శంబొనర్పంగఁ బోఁ
దనవృత్తిం గదె డెందముం జెడక జ్ఞా ♦ నాంతంబుగాకుండెడిన్. 27

వ. జ్ఞానమునకు దేహము, దేహమునకుఁ బ్రాణము, ప్రాణమునకాహారము వల
యుంగదా. కనుక విషయార్థముగాక జ్ఞానార్థమాహారము గ్రహించి
దేహయాత్ర సాగింపవలెనని ప్రాణవాయువువలన నేర్చికొంటిని. 28

కం. శీతోష్ణాదివివిధ ధ,ర్మాతతవిషయముల నంటి ♦ యాగుణదోషా
పేతమ్మై వెల్గు బహి,ర్వాతముచే సంగరహిత ♦ భావముఁ గంటిన్. 29

చం. అనిలము పుష్పగుచ్ఛముల ♦ యందుఁ జొరంబడి తత్పరీమళం
బెనసిన, దాని నైజగుణ ♦ మే యది యంటుమె? కాన నాత్మప
ర్యనుఁడగు యోగి పార్థివపు ♦ రంబునఁ జొచ్చి తదీయధర్మముల్
గనినటులుంచు నిక్కమున ♦ గాదని వాయువుచే నెఱింగితిన్. ౩౦

వ. ఇట్లు వాయువువలన నిస్సంగత్వ నిర్లేపత్వముల నెఱింగితి. సర్వగతంబైన గగనము ఘటాదులచే ననంగావరిచ్ఛేదముల నొందుటం జూచి యఖిల వ్యాప్తంబైన యాత్మకు దేహాద్యసంగమున వ్యవచ్ఛేదము ముని భావించి సర్వము బ్రహ్మాత్మభావమున సమన్వయించుకొనునని గ్రహించితి. మఱియుఁ దేజోఽన్నమయంబులు వాయుప్రేరితంబులు నగు మేఘాదులచే గగనము స్పృశింపఁబడనట్లు కాలసృష్టములైన తేజోఽన్నమయగుణమ్ములచేఁ బురుషుం డంటంబడఁడని గగనమువలన నేర్చితి. ౩౧

కం. క్షితినాథా! ప్రకృతిస్నిగ్ధత స్వచ్ఛత తీర్థభూత ♦ తయు మధురత కాం
చితి జలమున మునియుం; దత్కతన నెకని తాకి పొగడి ♦ కాంచుట శుద్ధిన్.

వ. ఇది జలముల గ్రహించితి.

తే. ఉదితతేజస్వి దుర్ధర్షు ♦ డుదరభాజనుఁడు తపోదీప్తుఁడగు మునీం ♦ ద్రుండు సర్వ
భక్షుఁడయ్యు దోషమ్ములఁ ♦ బడయఁడయ్య. వహ్నివోలె నియ్యదియగ్ని ♦ వలన
గంటి. ౩౩

చం. నివురునడాగు, నాజ్యమున ♦ నెక్కును, నాకరతాళ్యపాస్యుఁ డౌ
దివిజులకై హవిస్సులను ♦ ద్రెక్కును బావకుఁ; డట్లె యోగి యొ
క్క-వలను ఛన్నుఁ డొక్కెడఁ బ్ర ♦ కాశుఁ డొకప్డు ముముక్షుపూజ్యుఁ డొ
క్కవడిని భూతభావిమల ♦ ఖండనుఁడై కొను దాతృభక్తముల్. ౩౪

మ. అనలం బాసమిధంతరస్థమగుచున్ ♦ హ్రస్వత్వదీర్ఘత్వధ
ర్మనికాయంబులు బొందుమాడ్కి సదస ♦ త్ప్రాయంబు మాయాకృతం
బులు నా సృష్టమునం బ్రవిష్టుఁడయి దే ♦ వుండంచు దైత్యుండటం
చును భిన్నాకృతులం గనంబడెడి నీ ♦ శుం డొక్కఁడం చెంచితిన్. ౩౫

తే. సతము వెలుఁగుచున్నను శిఖా ♦ వితతి వహ్ని
కలదు నిత్యమై యటులె భ ♦ వావ్యయములు
భూతములకు నిత్యమ్ములై ♦ పొలుచుఁ గాల
వశతనంచు వైరాగ్యంబుఁ ♦ బడసినాఁడ. ౩౬

తే. కాలగతిచేతఁ గళలకే ♦ గాని హాని
వృద్ధులు సుధాంశునకుఁ గాద ♦ యిద్దిగాంచి

జననముఖమద్వికారముల్ ♦ తనువునొందుఁ
గాని యాత్మనొందవటంచుఁ ♦ గఱచినాఁడ. 37

కం. కిరణములచే జలముఁగొని, తరణి తఱియెఱింగి విడుచుఁ, దద్గతి మునియుక్
గరణములవిషయములఁగొని, యొసఁగుఁగియభిని వేళ ♦ మొందక మెలఁగున్

చం. అనఘ ! స్వరూపసంస్థితున ♦ కాత్మున కే భిదలుండ, వేయుపా
ధినయినఁ బొందినప్పుడు గ ♦ దే కనువట్టు ననేక భేదముల్ ;
వనజహితుం డొకండ దివిఁ భాసిలుచుండి జలాదిబింబితుం
డు నగుచుఁగాదె కన్గొనఁబ ♦ డున్ బహురూపముల న్కృపాలకా ! 39

వ. ఇట్లుపాధులవలన భేదంబులు స్థూలదృష్టికి గోచరించుచున్నవి కాని వాస్తవ స్వరూపంబునకు లేవని సూర్యునివలన గ్రహించితి. 40

♦– అవధూత యదువునకుఁ గపోతకథ నుడువుట –♦

ఆ॥ ఎవరితోడనైన ♦ నవ్వాడైనను నతి, స్నేహభాషణములు ♦ సేయరాదు
చేసెనేని గువ్వ ♦ చెలువున సంతాప, మందఁగలఁడు వినుమ ♦ యువ్విధంబు. 41

చం. కలదొక పావురంబు చిర ♦ కాలమునుండి యరణ్యమందు నా
కులఁ జిఱురెమ్మలం బఱవుఁ ♦ గొమ్మల నిమ్మగుమఱ్ఱిమ్రాఁకుపైఁ
బులుఁగమిఁ గూడు కట్టుకొని ♦ పొత్తియొకర్తుకతోడ జోడుగ
ట్టి లలిత కామసౌఖ్యముల ♦ డెందమునం బరితోషమందుచున్. 42

చం. ఎరలకుఁబోవుచో నిరువు ♦ రేగుదు, రెయ్యెడఁగూరుచున్న ని
ర్వు రొరసికూరుచుం, డ్రెవుడు ♦ బువ్వఁ బరస్పర మిచ్చిపుచ్చుకొం
దు, రొకటనాడుచుం, డ్రొకటఁ ♦ డ్రొక్కుచునుం, డ్రొకటన్ సముల్లసత్
దిరుగుచునుండ్రు చూడ్కిని మ ♦ దిం బెనవేసియు నాల్మగల్లిటుల్. 43

కం. పవలనక రేయనక యిటు, కవఁబాయక మరులుఁదేసి ♦ కామసుఖములం
దవిలి మెలఁగఁ జూలునిలిచె, నువిద కదిధవుండెఱింగి ♦ యుత్సాహమునన్.

సీ. పెసలలో మిసమిస ♦ నెసఁగెడి చిఱుత ను, వ్వనిజాలఁ దెత్తునా ! ♦ నాతిమిన్న !
వరిగల నిరవొందు ♦ సురభిళమృదు భూక, లిక తేర్చి తెత్తునా ? ♦ సకియమిన్న !
ఱోళ్ల క్రేవల బాఱి ♦ చోళ్లు పొట్టుడ్చి గిం, జల నేరి తెత్తునా ? ♦ కలికిమిన్న !
ఇప్పపూగుత్తులఁ ♦ గువ్వకట్టిన మంచు, బొట్టులం దెత్తునా ? ♦ పొలఁతిమిన్న !

తే. ఈవు నాతోడ నెగిరిరా ♦ లేవుతొట్రు, పడక నడయాడ లేవు నా ♦ పడఁతిమిన్న !
యింటఁగదలక యుండుమా ♦ యెద్దికోర్కి, తెలుపుమది దుర్ఘటంబైనఁ ♦ దీర్చు
వాఁడ. 45

తే. అనుచును గపోతి కోర్కుల ♦ నడుగ నడిగి
వానిఁ దీర్పంగఁ జని కొంత ♦ పట్టు మరలఁ
దరుణిఁ జూడ వెన్కకువచ్చు ♦ దానిఁ బాసి
నిలువలేద క్షణంబైన ♦ నృపవరేణ్య! 46

తే. ఎటులో ప్రాణమ్ము బిగపట్టి ♦ యిటునటు చని
యాచరించు నాయావను ♦ లా కపోత
మింద్రియములకు వశుఁడైన ♦ నెవఁడు నింతె
పక్షియేమి! నరుండేమి! ♦ పార్థివేంద్ర! 47

కం. అంత యథాకాలంబునఁ, గాంతయు నీడమున నిడియెఁ ♦ గనదండములన్
గాంతుఁడవి చూచి ముదిత, స్వాంతుండయ్యెఁ దనకొలము ♦ సాఁగునటంచున్.

కం. ఆజలధరితాండంబుల, రాజా! హరిదుర్విభావ్య ♦ రాజచ్ఛక్తిన్
దేజరిలిరి శిశువులు స్వీ, యాజేయంబైన కర్మ ♦ మది తోడుపడన్. 49

వ. అంతం గపోతి యండంబులం బొదిగి పిల్లలం జేసె. 50

కం. ఆమృదులావయవములా, కోమలతనురుహములా ప్ర ♦ కూజితగతులా
గోములు గని తలిదండ్రులు, భూమీశా! యెంతొ మోద ♦ ముం గనిరి గదే.

చం. కలరవముల్ ఘటించుచును ♦ గ్రమత రెక్కల నట్టిచూచుచున్
గులుకుచు నిల్చుచున్ మెడలఁ ♦ గొంచొకవాలిచి యుంజ్రదొక్కుచున్
బలుకులఁ దియ్యమూన్చుచును ♦ బైఁబడి ముక్కుల నల్లఁ బ్రాముచున్
గలికివనుల్ వొనర్చుచును ♦ గ్రాలిరి బిడ్డలు వారు మోదిలన్. 52

ఉ. ఎచ్చట నేవదార్థము గ్ర ♦ హించినఁ దాముభుజింప కింటికిం
దెచ్చి ముఖంబులం దిడుచు ♦ దిక్కులనేరవమైన దాచుచుం
దిచ్చ మొగమ్ముగా గఱుల ♦ తెంకల గూటిమొకమ్ము చేరఁగా
వచ్చినఁ గూడ నోర్వ కిటు ♦ పావలఁ బెంచుచునుండి రిర్వురున్. 53

ఉ. బాలిశు లింట నొంటరిగ ♦ వర్తిలుచుందు రటంచొకప్పు డి
ల్లాలినిఁ బంపుఁ దిండికొఱ ♦ కామె నొకప్పుడు నిల్పి యింటఁ దా
నే లలినేగు నిట్టు లెర ♦ నేర్పునఁ దేఁగని కోలతో నదు
తోక్కలొనరించు సంతుఁ బిత ♦ రుల్ గని యెంతముదంబుఁ గాంతురో. 54

చం. ఒరగుచు వాలుచుం బదము ♦ లూనుచు ముక్కునఁ నొడ్డికొంచు నే
వరుసనొ మెల్లగా నడచు ♦ వైఖరి నేరిచి రెక్కలెత్తుచున్
బఱచుచు నూఁచుచున్ గొలఁది ♦ వట్టువదాఁటుచు గూటినుండి యు
ర్వరకునుడిగ్గుచున్ జదలఁ ♦ బాఱఁగఁ గొండొకనేర్చె బోదలున్. 55

ఉ. పిల్లల యిట్టిపోకడల ♦ వేడుకఁ జూచుచు నాల్మగల్వు రా
ముల్లములందు మోదముల ♦ నొందుచునుండుదు రెందుకోసమో!
తల్లియటంచుఁ జూచెదరె? ♦ తండ్రియటంచును గౌరవింతురే?
ఱెల్లలఁ దెచ్చిపెట్టుదరె! ♦ ఱెక్కలువచ్చినపిమ్మటన్ సుతుల్. 56

వ. అంత నొకనాఁడు కపోతంబును గపోతియు బిడ్డ లొకింత పెరిగిరిగదా యని నిర్భీకులై యిరువురు గొఱఁకుల కరిగినతఱి దైవికంబుగా నొక బోయ యయ్యెడ కేతెంచి వనస్పతి నవలోకించుచు 57

కం. కిలకిల కవకవ కువకువ, కలరవములుసలుపు గువ్వ ♦ కందులఁగని సూ
రెల వలలఁబన్నిచనె గు,ల్మలతాంతాంతరితనీల ♦ మహీతాంగుండై. 58

కం. ఆ సిసుఁగులు మెల్లఁగ ను,డ్డీనము సండీనముం బ్ర ♦ డీనము నేర్వం
బూని కడుఁద్రుళ్ళుచును వల,లోనఁబడిరి తెలియకెట్టు ♦ లుంగర్మగతిన్. 59

కం. వలఁబడి గోళ్ళఱక్కుచు ♦ బల్మరుఁ ద్రాళులఁబట్టి ముక్కుడొ
వ్వలతుదినొక్కుచున్ గఱుల ♦ వట్టుకదల్పుచు మింటికేగ మే
నలయికఁ ద్రివ్వుచున్ గలక ♦ లారవముల్ వచరించుచున్ విది
క్కులఁబరికించుచున్ జనని ♦ కోసము కుందుచు సొమ్మసిల్లఁగన్. 60

కం. అచ్చటఁ గపోతి ధవుతో, నొచ్చెల! తడవాయె గింజ♦యుం గఱవాయె
న్బిచ్చిగనుండెను మది నీ,వెచ్చటనే వెదకి తెమ్ము♦యొర నేఁబోదున్. 61

కం. అనిచెప్పి యొక్కవరుగునఁ, జనుదెంచి స్వనీడమున క♦చట వలలో నుం
డిన బిడ్డల దీనులఁ గనుఁ,గొని గుండియవగులఁగొట్టు♦కొను చల్లాడెన్. 62

సీ. అయ్యో! యిదేమియ♦న్యాయంబు దేవుఁడా!, కూనలగొంతులు♦గోసినాఁడ
వివి నిన్నుఁదిట్టెనా? ♦ యేమేనిచేసెనా?, బోదలఁగసజాలి ♦ లేద నీకు!
ఒరులజోలికిఁబోక ♦ యుండు నాకడుపును, గాల్చితివేమి రా♦క్షణములోన
నీవనిసేసిన ♦ నేమిలాభము? పక్షి, నేడిపించుటలును ♦ గ్రీడలటర

తే. అయ్యో! దేవుఁడా! యింతక్రూ ♦ రాత్ముఁడవుర!
కనులఁజూపి కొంపోవఁగాఁ ♦ జమునె? కట్ట!
పిచ్చికవయి బ్రహ్మాస్త్రంబు ♦ వేయుదురటె!
దిక్కులేని మే మగవడె ♦ తిమటె నీకు? 63

చం. తొడుకొనవైతిఁబున్నములఁ ♦ దొల్లి నదృష్టవిహీనురాల నా
కడుపున నేలఁబుట్టితిరి ♦ గాదిలి నందనులార! పున్నముల్
పుడికిన యొందుజవ్వనికిఁ ♦ బుట్టినవైనఁ జిరాయురున్నతుల్
వడసి సుఖింతురేమొకద ♦ బాపురె! యెంతటికీడువుట్టెరా! 64

కం. అని పిల్లలఁ గని జననియు, జనకుం గని పిల్ల లొక్క ♦ సారి యెగచి రో
దన మొనరింపఁగ సాఁగిరి, విని విజితేంద్రియులుఁ గూడ ♦ విహ్వలపడఁగన్ 65

కం. వినఁజాలక పిల్లల రొద, మనఁజాలక వారిఁ బాసి ♦ మఱచే టెడువం
గనఁజాలక పెక వెరవా, ఘనజాలకములను దొరఁగె ♦ గ్రక్కునఁ దానున్.

కం. అంతం గపోత మట నొక
కొంత మనస్సే యింటిగాలి ♦ కొబ్బున సుడియన్
స్వాంతమున నొదవెఁ దన యి
ల్లంతియుఁ గూల నపుడేమి ♦ యగుదునొ యనుచున్. 67

వ. అంతట వెంటనే 68

కం. ఛీ ! పాడు తోఁపికించటు, చూపువఱపి వెనుకఁ జూచి ♦ జోబిళ్లు భవా
నీపతికని నుడివి యెగిరి, కూపెట్టుచుఁ బఱవఁ బిట్ట ♦ కూటువఁ జదలన్ 69

కం. కని యేమీపాపులబల ? మే, వనచరుఁ డట రాఁడు గద శి♦వ! శివా! మాకుం
దినగండము నూటేఁడుల, మనుగడ యీపాడు బ్రదుకు♦మాదియటంచున్

కం. ఎంచుచు నెఱకలకవ జా, డించుచు ముంజూపుతో వ ♦ డిం బర్వాడి యే
తెంచి యెఱుకలు జాలింగనుఁ, గొంచుండం బీతు గదుర♦గూట్రన్వాలెన్. 71

కం. దోయిడి గూటింగని యే, దోయిడుమ ఘటిల్లెనంచుఁ ♦ దొరతొర లోనం
బోయి మరల వెలికిం జని కూయిడుఁ గనఁబడవ కనులఁ♦గూడన్ భీతిన్. 79

తే. అంతకు న్వగచివగచి ♦ యాస్యము వఱు
పట్లుగొన సొమ్మసోయిన ♦ వనిత ప్రియుని
సారము విని తెప్పలెత్తి యా ♦ పురుమటంచు
నేడ్చె బిల్లలుఁ దోడ్తోడ ♦ నేడువంగ. 73

కం. ఆ యేప్పటులివు విని య,య్యో! యనిమాత్రమని గూట ♦ నొరఁగె నవశమై
ఏయొకవడికో లేచి క,టా! యను చత్తరువు చెంగ ♦ టకు నెట్లో చనెన్. 74

కం. చని గుండె చెఱువుగా లల, నను బిల్లలఁ గాంచి వగచు ♦ నద్దైసలం జు
ట్టును గ్రిందఁబడును బొరలా,డును దలబాదుకొను జేష్ప♦దుం జెయ్యాడుగన్.

వ. అంత గొంతతడవున కక్కపోతనాథుండు మెడయెత్తి మిన్ను సూచి 76

ఆ. ధాత ! నీవరిష్ట♦తాతివి గాక మా, కొంప నొక్కసారె ♦ కూల్చితటర !
చిన్న పెద్దలకును♦జేరిచి యొకనాఁడె, వ్రాయుదురకు పట్టి♦పాడు వ్రాఁత? 77

కం. మా పెద్ద లతిథిజనపూ, జావరులై స్వతనువులనొ ♦ సంగిరటులు నే
నోవనె సేయఁగ? నీవసి, పూవలకై యొగ్గఁదగునె? బోయపెదన్నా ! 78

సీ. అయ్యో! కళత్ర మి♦త్రవశయైపడియుండఁ, జూచునాకను లెం♦సూఁడరాదు!
వాయెండఁగా బిట్టు♦వాపోవ వినెడి నా,వీనుల నేటికి ♦ వ్రేఁకబారవు?
ఉచ్చుబిగింపుల♦నొదిగె ముద్దగనని, యెఱుఁగు నామది నేల ♦ లెఱుగరాదు!
ఆలుబిడ్డలగోడుఁ ♦ ద్రోలలేనిగృహాధి, కారిని నన్నేల ♦ కాల్పరాదు!

తే. అక్కటా! యిల్లువల్లకాఁ ♦ డయ్యె నేఁడు
బాపురే! మదాశలు పాడు ♦ వాఱె నేఁడు
మాయురే! నాతనువు వ్యర్థ ♦ మాయె నేఁడు
కటకటా! యెట్టు లీకీడు ♦ గడచు నేఁడు? 79

కం. అనురూపయు ననుకూలయు, ననువ్రతయు భర్తృదేవ♦తాత్మయునగు భా
ర్యను బాసి యెుండిబ్రదుకే, మని బ్రదికెద సుఖము లేక♦యులమటపడుచున్.

సీ. అతిథు లభ్యాగతు ♦ లరుదేర వారికిం, బువ్వను బెట్టెడి ♦ రెవ్వరింక?
పనులచే నలయిక ♦ పడి గీముసేర నా, యెల్లశ్రమము దీర్తు ♦ రెవ్వరింక?
వెలివాకిటంగాంచి♦విరియు నవ్వులను నా, కెదురుగాఁజనుదెంతు♦రెవ్వరింక?
మదిలోని నావ్యథ ♦ లదవదలైపోవ, నించుగాఁ బల్కువా ♦ రెవ్వరింక?

తే. అట్టి ప్రాణంబు ప్రాణ మర్ధాంగి గేహ
లక్ష్మి భార్యగా గార్హస్థ్య ♦ లక్ష్మి నిజకు
లాంకురముస్వీయ తేజ మ ♦ య్యనుఁగుసంతు,
నిట్లుగా నెల్లు జీవింతు ♦ నింక మీఁద. 81

వ. అని యక్కపోతవిభుండు మిక్కిలి విలపించి విలపించి నిలువోపక తాను
నవ్వల నవ్వలందూఁకె. నిదియంతయుం జూచుచున్న లుబ్ధకుండు క్రూరుండు
చనుదెంచి కపోతకుటుంబంబుం గ్రహించి సిద్ధార్థుండై నిజగృహం
బున కరిగె. నాహుపాత్మజా! యిట్లు ద్వంద్వారాముండశాంతాత్ముం
డగు కుటుంబి కుటుంబము పోషించుకొనుచు సానుబంధుండై కపోతమువలె
దుదకు నశించును. 82

తే. ఎవఁడు మోక్షలక్ష్మీద్వార ♦ వివృతిసేయఁ
జాలు మానవజన్మంబె ♦ సంగికూడ
గృహవిలంపటుండగును వా ♦ డీ కపోత
మట్టు లారూఢవిచ్యుతుం ♦ డని యెఱుంగు. 83

వ. అని యవధూత పలికెనని శ్రీకృష్ణుండు నుడివినట్లు శుకసూరి వచించెను. 84

ఇది సప్తమాధ్యాయము.

## అ ష్ట మా ధ్యా య ము

కం. బంధురవృథులాశాసం,బంధము బంధమౌ ప్రవృత్తి ♦ వరునికి మఱి యిం
బంధముగల బుధుఁడును తో, కాంధతమసమందుఁ బడును♦ హరిహరనాథా!

వ. [1]దేవా! శ్రీ శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. 2

తే. అంత శ్రీకృష్ణపరమాత్మ ♦ యాత్మ శిష్యుఁ
డైన యుద్ధవుతో నిట్టు ♦ లనియె నుద్ధ
వా! యదుమహీమహేంద్రున ♦ కాదరమునఁ
దనగురులఁగూర్చి యవధూత ♦ యనియె నిట్లు. 3

—* అవధూత యదువుతో నజగరాది గురులంగూర్చి చెప్పుట —*

వ. భూరమణా! మహాజగరముం గని నేర్చినదానిం జెప్పెద. 4

ఉ. కోరినఁ గోరకున్న నొడఁ ♦ గూరును దుఃఖము ప్రాణికోటి; కా
తీరున నెప్పు డైంద్రియక ♦ దివ్యసుఖంబులు నాకమందు న
న్నారకమందుఁ గల్గు జన ♦ నాయక! కర్మచయానుసార; మా
కారణముం గ్రహించి బుధ ♦ గణ్యుఁడు కోరఁగరాద దేనినిన్. 5

సీ. సారవంతంబైన ♦ నీరసంబైన మ
హాస్వల్పమైన న ♦ త్యధికమైన
దైవికంబుగను బ్రా ♦ ప్తంబైన యన్నంబుఁ
గుడుచుచు సంతృప్తిఁ ♦ గూరవలయు
నొకవేళ నాహార ♦ మొదవనిచో నిరు
ద్యముఁడై నిరాహారుఁ ♦ డై శయించి
దినములు పుచ్చంగఁ ♦ జనుఁగాని దానిని
బడయుంగ నింతయుఁ ♦ గడఁగరాద

తే. కరణబలము స్వాంతబలంబు ♦ కాయబలము
కలిగియుండగూడ సేవని ♦ సలువరాదు
నిదురమాని యాత్మనిరీక్ష ♦ నెగడుచు న్న
యుంపవలె నజగరముచే ♦ నివ్వి గంటి. 6

సీ. ముని సముద్రునిచెలు ♦ వున దుర్విగాహ్యుం డ
నంతపారుండు దు ♦ రత్యయుండు
వినుతప్రసన్నగం ♦ భీరుఁడక్షోభ్యుండు
నారాయణపరుం డ♦నఘ చరిత్రుఁ

1 ఈ యధ్యాయము 17-5-1946 ప్రారంభము.

దనియెఱిఁగితి; మఱి♦యర్ణవంబు సరిత్ప్ర
యుప్రవేశత వృద్ధి ♦ నొందఁబోవ
వానకాలంబులఁ ♦ బటుతరగ్రీష్మంబు
లందు నదీప్రవా ♦ హములు లేమి

తే. శోషిలదు; ముని యట్లు సం ♦ తోషమందఁ,
బోవఁడు సమృద్ధకాముఁడై ♦ భూపవర్య !
వాంఛ లవి నెఱవేఱమి ♦ వనరఁబోఁడు,
యిద్ది సంద్రంబువలన గ్ర ♦ హించినాఁడ ; 7

తే. మిడుత రూపమునను భృంగ ♦ మడరుగంధ
మునను గజము స్పర్శమునను ♦ వనహరిణము
శబ్దమునను మీనమ్ము ర ♦ సమ్మునను వి
మోహితములై నశించును ♦ భూపవర్య ! 8

తే. నిప్పు మిడుత గాంచి భ్రమించి ♦ గుప్పుమంచు,
నగిరి యందులోఁబడి చచ్చు ♦ వగఁ బురుషుఁడు
వనిత దేవమాయం గాంచి ♦ భ్రాంతి నురికి
కడకు నంధతమో నర ♦ కమునఁ గూలు. 9

సీ. ముద్దుమో మిదిగాదు ♦ పూర్ణేందుబింబంబు, కనుఁగవ గాదిది♦కలువదోయి
చెక్కులుగావివి ♦ చెల్వుటద్దంబులు, తొగరుమో విదిగాదు ♦ దొండపండు
గళమిదిగాదు సిం ♦ గారంపుఁజిందంబు, బలుగుబ్బ లివిగావు ♦ పైఁడిగిండు
లూరులు గావివి ♦ భూరిరంభాలతల్, నెన్నడుమిదిగాదు ♦ నింగిపొంగు

తే. పదములా యివి చిగురుజొం ♦ పములుగాక
కరములా యివి తూడుల ♦ సిరులుగాక
నెఱుకలా యివి తుమ్మెద ♦ గఱులుగాక
కొమ్మయటె యిది బంగారు ♦ బొమ్మగాక. 10

వ. అని పురుషుండు భోగాభిలాషం జేసి కాంతంగని స్వాంతంబునఁజింతించుచు 11

మ. అనఘా ! యీపసిఁడిన్ హసించు మృదుదే ♦ హచ్ఛాయ నాసోయగం
బును నావాల్గనుఁజూడ్కి నావరువ మా ♦ మోమందమానందహా
సనిధానంబును నాయొయ్యారినడ నా ♦ చన్దోయిలావణ్యమున్
గని విభ్రాంతి సుఖంపఁగోరుచుఁ బతం ♦ గంబుం బలెం జచ్చెడిన్. 12

వ. రూపవిలాసవిషయంబునఁ బతంగంబువోలె నరుండును నశించునని యెఱిం
గితి నీకఁ దుమ్మెద యనియుఁ దేనెటీఁగ యనియు మధుకృత్తు ద్వివిధంబు;
అం దాద్యంబు భృంగంబు గంధవిషయంబున నశించె విను. 13

ఉ. తమ్మిని వాలి యందలి యు ♦ దారసుసౌరభయుఙ్మరందపుం
గమ్మఁగఁ ద్రావు చా స్తమయ ♦ కాలము పువ్వుపల న్ముడుంగ ఘ్రం
గ మ్మట బందియౌ; మునియు ♦ గ్రాసజిఘృక్షు గృహ మ్మొకంట వా
స మ్మొనరింప మోహమున ♦ శమ్మున బద్ధుఁడగు న్నృపాలకా ! 14

ఉ. ఒక్కొక్కపుష్పముం దడసి ♦ యొత్తుదు సేయక కందనీక యొ
క్కొక్కకణంబు తేనెఁ గొను ♦ చుండు ద్విరేఫము నోజ మౌని యొ
క్కొక్కగృహంబుచేరుచు మ ♦ హోగ్రత గేస్తు నలంపఁబోవ కే
యొక్కకణంబొ కొంచుఁ దను ♦ వోమును మాధుకరప్రవృత్తిచే. 15

తే. అనఘ ! యణుమహాశాస్త్రంబు ♦ లరసి యెచట
నెంతసారమున్నను గ్రహి ♦ యింపవలయుఁ
బువ్వు పువ్వున కేగుచుఁ ♦ బొలుచు మధుక
ణమ్ములం గొనియెడి షట్ప ♦ దమ్మురీతి. 16

వ. అని గ్రహించితి నింకం దేనెటీఁగం జెప్పెద 17

కం. భూపా ! పొట్టకుఁ దిన కే, వో పాట్లంబడుచుఁ బువ్వు ♦ పువ్వునఁ దేనెం
జేపట్టి కూడఁబెట్టియు, రో ! పెరతోఁ దేనెటీఁగ♦యుం బొలియుఁగదే 18

కం. చేపడినబువ్వ నవ్వాడె, సావడవలె దోయిటఁగొని ♦ చనవలె లేదే
రేపటికని మాపటికని, యీపాఱుఁడు కూడఁబెట్టు ♦ నేని నశించున్. 19

వ. ఇది తేనెటీఁగరొజ్జవలన నేర్చికొంటి నింక స్పర్శాశక్తి నాశహేతు
వని గజముచెప్పె వినుము.

ఆ. కట్టెబొమ్మయైన ♦ గరితయా నేన్నని, యంఘ్రితోడఁగూడ ♦ నంటరాదు
గడ్డిగప్పియున్న ♦ గర్తంబుపై స్పృష్ట,కరిణి దాఁకిగాదె ♦ గజము సిక్కె. 21

ఆ. ఆత్మమృత్యువైన ♦ యంగన నంటరా, దంటెనేని చచ్చి ♦ నట్లె యాతఁ
డాడుహస్తి వెంట♦ నంటినద్విరదమ్ము, హతముసేయఁ బరబ♦లాఢ్యగజము.

ఉ. పొట్టకు మెక్కఁబోక శ్రమ ♦ ముల్ పడుచున్ మధుమక్షికంబులుం
బెట్టిన తేనెపట్టులు వి ♦ వేకి యుపాయముతో గ్రహించు నా
గుట్టును జూచి భోగముల ♦ కు న్మఱియొకవికిఁగాక వి త్త మే
పట్టున సంచయంబు సలు ♦ వం దగదంచు గ్రహించితి న్నృపా! 23

ఉ. బాగుగఁగూర్చి తేనియల ♦ పట్టుల వానిని ద్రావఁబూను జుం
టీఁగలకన్న మున్న గ్రహి ♦ యించెడి యమ్మధుహారు లట్లు నా
నాగృహిణుల్ శ్రమంపడి పొ ♦ నర్చిన వంటకముల్ గ్రహింతు రీ
యోగులు వారికంటె మును ♦ యోగులుగారటె యగ్రపూజితుల్. 24

వ. ఇట్లు మత్స్యము రసాహిత్యంబునను భోగము సంభవించుచున్నదని తెలియ
హరించు [illegible] నేర్చితి. 25

తే. యతివరుఁడు భగవద్గీత ♦ నాలకింప
వలయు గ్రామ్యగీతంబులఁ ♦ జెలఁగ రాదు
మృగయు గీతికామోహంబు ♦ సొగియఁగాదె?
మృగము బంధింపఁబడెడిని ♦ నృపవరేణ్య! 26

తే. సుందరుల నృత్తవాదిత్ర ♦ సురుచి గీత
ములను వివిధరాగాలాప ♦ ములను ఋశ్య
శృంగుఁడు మృగీసుతుఁడు విని ♦ చెడియెఁ గాన
వాని తెరవునకుం జన ♦ వలవ దెపుడు. 27

వ. ఇట్లు మృగశిక్షిత మెఱింగించితి నింక మీనశిక్షితము నుడివెద నది రస
విషయకము. విను. 28

తే. రసనకును క్షోభపెట్టు దు ♦ ర్జయ కదయ్య;
పరుఁ డసమృద్ధియై దాని ♦ మరగనేని
యెఱకు నాసించి దిగమ్రింగి ♦ మృత్యుముఖముఁ
జొచ్చినట్టి మీనమువోలెఁ ♦ జచ్చు నితఁడు 29

తే. ఋషివరుల్ నిరాహారులై ♦ యింద్రియముల
గెలిచెదరుగాని జిహ్వను ♦ గెలువలేర
యట్టియెడ జైహ్వ్యచాపల్య ♦ మధికమగును
దీని గెల్చిననే జితేం ♦ ద్రియత వరఁగు. 30

కం. ఎందాఁక రసన గెల్వఁడొ, యందాఁక జితేంద్రియుం డ ♦ టంచనరా దా
మందుని, దీని గెలుచునే, నందిక నన్నింటి గెల్చి ♦ నట్లె నృపాలా! 31

## -* పింగళాగీతము *-

వ. పింగళ నైరాశ్యము నేర్పినది.

కం. పింగళ యను పేరిటి వారాంగన యొకతె మును జనకు ♦ నసువమవురమం
దుంగలద, దానిహాయలె, స్నంగసహస్రముఃఖుఁడుకఫ ♦ ణంబులు వాల్చెన్.

సీ. నెఱిగొప్పు వెుఱుగొప్పు ♦ తెలుఁగువ్పతిల్లఁగా, విరవాజిపువ్వుల ♦ సరులు దుఱిమి
నునుఁదమ్ములను జిమ్ము ♦ ననయమ్ము నామీఱు, ముద్దుమోమున బొట్టు ♦ దిద్దితీర్చి
మీనగల్వలను గెల్వఁ ♦ గను బిల్వఁగలకన్నుఁ, గవఁ గజ్జలంబురు ♦ గలయఁ జమిరి
బలుమించు కొలమంచు ♦ లలి నెంచఁదగు మేనఁ, దొమ్మిదిరతనాల ♦ సొమ్ములూని

తే. పొలుప మొలికెడి కలపము ♦ లొలఁగు నలఁది
హొన్ను సరిగపూల దుకూల ♦ మెఱవు నెఱప
గోటు నీలంపు అపికడా ♦ ల్నీటుమీటు
వీధి నిలుచుండు జగజంత ♦ వేశ్యకాంత. 34

సీ పగడాల బరిణలో ♦ మగరాల తళుకునాఁ, గెంబెదవుల నవ్వు ♦ క్రేళ్లువాఱ
నీలాలగని కాంతి ♦ లీలాలహరినాఁగఁ, గంటిక్రేవల చూపు ♦ కళుకు లొలుక
ఉమ్మెత్తపూ గోము ♦ దుమ్మెత్తఁగలచీర, కుచ్చెళ్ళు పాదాలఁ ♦ గ్రుమ్మలాడఁ
బైఁటకుఁగా లోఁగక ♦ బైటకుం ద్రుళ్ళుచు, వల జక్కవలన గు ♦ బ్బలు నటింప

గీ స్తనభరంబున సోలియు ♦ ఘనకితంబ
మాడుకొన నిల్చి నెన్నడు ♦ మేదొ యనఁగ
గ్రొవ్వ మంజీర ఝుళఝుళం ♦ ఝుళరవంబు
మెఱయఁ బింగళ వీధిలోఁ ♦ దిరుగుచుండు. 35

కం. తలవాకిట మోఁగుచుఁ జెం, తల వాడలఁ గోడెకాండ్రు ♦ తమ వలపులఁజేఁ
తల వాఁడినావ వెలకాం, తల వాసిం గనియె రూపు ♦ నం బ్రాయమునన్.

వ. అంత నప్పింగళ నల్లనం డాసి, 37

తే. ఒకఁడు రూకలు పదియను ♦ నొకఁడు రెండు
పదులను మఱొక్కఁ డేఁబది ♦ పలుకు నొకఁడు
వందయను నేకతమ వీరి ♦ వారి నేఁటి
గాదనుచు నంతకెక్కుడు ♦ కాంక్ష సేయు. 38

సీ. కొనగోళ్ళ నెఱులంటు ♦ కోను బైఁటజాతి గు
బ్బల యుబ్బు మొదలంటు ♦ వెలికిఁ బర్వ
సెలవి లోఁక్రేళ్ళింఁబల్ ♦ సిగ నొక్కవట్టను
గమ్మోవి సిగసిగల్ ♦ గ్రుమ్మరిల్ల
నటు నిటు నడయాడు ♦ ననుముగా నూఁగ శ్రో
ణీచక్ర మురల నం ♦ దియలు మ్రోఁగ
చిటిక వేయుచు క్రేఁత ♦ జల్లుజావళిఁ బాడు
నది నిజోద్దేశమం ♦ చెదురు నమ్మ

తే. కతము లేకయె యడబాల ♦ గసరుకొనును
బయటిగుమ్మము సిరుగేలఁ బట్టి నిలుచు
బాటసారులఁ గనుగొట్టి ♦ పలుకరించు
నందుకై వేచియున్న య ♦ య్యన్నుమిన్న. 39

ఉ. కాళులు సాఁచి యందియలు ♦ ఘల్లుల లాడఁగఁ జేయు, జంఘఁ గై
వ్రేళుల నొయ్యన న్నిమురు ♦ బింకపుఁ జన్గవ పొంగ నాభికా
గోళము గానరా సరవ ♦ కోమలజృంభణ మాచరించుఁ బె
న్గోళవిధాన విప్పఁగనుఁ ♦ గోనల ముంగిట సన్నివిష్టయై. 40

చం. చనుకుదు రక్కులం బసఁ బ ♦ సందుగఁ బయ్యెదఁ జెక్కఁ గంటఁబొ
ల్చు వగపుకోడ నోడు గఱ ♦ చున్ బెఱఁజూచుచుఁ జేతఁ బావురం
బును గొని పెంటి యల్లదిగో ♦ పొమ్మని వ్రేలిసి జూపు నెందుకా
కినుక లటంచుఁ బంజరము ♦ కిం బలుకు న్నిలుచుండి వాకిటన్. 41

ఉ. తెల్లనిచీర వెన్నొరసి ♦ దీర్ఘవినీలిమ వేణి త్రాఁచు నా
నల్లలనాడ, జాజిన వ ♦ యంట చెఱంగు స్మరధ్వజంబునాఁ
గ్రేల్లుఱుకన్ దరస్మితము ♦ గీల్కొను మోమొకయోర చేసి యా
హల్లకపాణి గ్రుమ్మరు గృ ♦ హాంగణమం దొరుచూడ్కి పైఁబడన్. 42

తే. మఱఁది! రా కూడుకొండ మీ ♦ వెఱుఁగవేని
నేరి పెదళే క్షణంబులోఁ ♦ గూరుచుండు
మదిగొ కూటిలోఁ జీట్లపే ♦ కండికొనుము
కలదె గురుదక్షిణకును రొ ♦ క్కంబు కొంత 43

మ. వ్యవసాయం బది సాఁగుచున్నయదె బా ♦ వా! యెవ్వ డీదారిఁ బ
ట్టవు పోవుచుక్కకు న్నాగ్రహం బొదవకుం ♦ డన్ సంచరింపం దలం
తువు గాఁబోలును మీపొలంబునను గ ♦ ద్దో గుత్తివంకాయ చె
ప్పవులే చెప్పినఁ దెచ్చి పెట్టుమని ని ♦ ర్బంధింతు నంచెంతువో? 44

ఉ. మామకు మేము గన్పడుదు ♦ మా యని నవ్వుచు నిష్ఠురోక్తులం
గీముసఁ జేర్చి జుట్టుముడి ♦ కిం బువుదండలు సుట్టి యుత్తరం
బ్రాముచు నీకు నేమికొద ♦ వల్ రతియన్నదె యొద్ద లేదు గా
నీ మదనుండవే యనెడు ♦ సిట్టలు మీసలు వట్టి యూఁపుచున్. 45

వ. ఇవ్విధంబున నవ్వేశ్యాలలామ. 46

సీ. ఒకనిసిఁ జూచు నిం ♦ కొకనిని బిల్చు వేఁ,డొకనితోఁ బల్కు మ ♦ ఱొకనితోడ
నవ్వు సింకొకనిఁ గ ♦ న్సన్నలు సేయు నొం,డొకని గేలిసే ♦ యును నొకవ్వా
డేమి తెచ్చితి వని ♦ యెగసి జేబుంబట్టు, నింతయే చాల్బాలు ♦ నేఁగుమనును
నసుకుసురసి సెజ్జ ♦ నంగంబు వైచుఁ జ,వ్వాడుగాఁగఁ జవ్వనఁ ♦ బోవు వెలికి

తే. మరల గదిలోసి కేగు వెం ♦ బడిన పీది
కరుగుఁ దబ్బిఁదియును వేయు ♦ నటునిటు గను

నావులించు నిద్దురచేటు ♦ యనును గోరు
ధన మొసఁగువాఁడు లేఁడ యిం ♦ దనుచు గొణఁగు. 47

కం. ఒక రేయి సగము దాఁటువ,ఱకు నొకనాఁ డెల్ల రేయి ♦ శ్రమపడి సూచుఁ
సకియకుఁ గోరినధన మి,చ్చి కవయురాఁ డొక్కఁడైనఁ ♦ జిత్రముగాదే. 48

కం. ఇట్టులఁ గాలము గడవం, బట్టుదలయు హెచ్చి శుల్క ♦ పరిమాణంబున్
నెట్టన మార్పడ; రొకపరిఁ, జెట్టవనికిఁ గడఁగ నేల ♦ ఛీ యని తలఁచున్.

మ. వేయు న్నూటవదాఱు పీని విధపల్ ♦ వీక్షింపఁగా నేల న?
న్నే యొక్కఁడు లభింపఁడేని యదియొం ♦ తే నాకు మేల్గాదె? యీ
కాయం బేల వృథాశ్రమంబులకుఁ బా ♦ ల్గాఁ జేయుటల్? మన్మనం
బో యీశా! నిరతంబు నీస్థిరతమై ♦ నుండం బ్రసాదింపవే. 50

కం. అని తలఁచు నెవ్వఁడే గో,రిన ధన మీరాఁడె? యని ని ♦ రీక్షించును బ్రో
ద్దును బోవుదాఁక హృదయం,బున నాశ యదేల సులభ ♦ ముగఁ దెగటారున్?

ఆ. తోడి చెలులు వచ్చి ♦ చూడమే వంతంబు, నిలుపుకొనఁగ నంత ♦ వలఁతి వెట్టు
లెంత చిక్కితివో గ్ర ♦ హించితివే! చాన, యనఁగ సిగ్గు దీక్ష ♦ యతిశయించి

శా. ఏమే నాడుఁడు కాంతలార! వ్రత మొ ♦ క్కింతైనఁ దగ్గింపఁగా
నేమాత్రంబు సహింప దీహృదయ మం ♦ తేగాద యీదేహముం
గామాగ్నిం బలి సేయరా దనెడి సం ♦ కల్పంబునుం గల్గెఁ బై
నీ మే నెట్టుల నున్న నేమి యని పో ♦ యెన్ లోని కక్కాంతయున్. 53

వ. ఆతోడిచెలులును దమతమ గీములకు నవ్వుకొనుచుం జనిరి. పిమ్మట నొకనాఁడు,

తే. తల్లి ముసలిది చావురుఁ ♦ బిల్లివోలె, నుబ్బరపు రొసరొస తోడ ♦ నొద్దఁజేరి
కూఁతురా! యెవరే నీకు ♦ జాతిరీతి, చెడఁగ నిట్టులు బోధలు ♦ సేసినారు.

ఉ. ఎన్నఁడె నీకు బుద్ధి యుద ♦ యించును మంగను జూడరాదకే
యెన్ని గడించెనో నగల ♦ నెంకియు మేడకు గట్టునంట యీ
తెన్నఁ గొండనెక్కి యిఁక ♦ దిట్టినఁ దిమ్మిన నేను దిగ్గనం
చున్న ధనంబు సేరునటె? ♦ యో యవివేకిని! పాఱఁ జూడవే. 56

కం. వేయు న్నూట పదాఱు లో
కో యొకరాతిరికిఁ? గోటి ♦ కొకడైనఁ గలం
డే యిట్టు లొసఁగు ధనికుం?
డో యమ్మా! యెంత పిచ్చ ♦ యూటైన నీకున్? 57

తే. లలన! చిల్లర శ్రీమహా ♦ లక్ష్మి యనఁగ
వినవె? యింకనైనఁ నీపట్టు ♦ విడిచి యెవ్వఁ
డెంత యిచ్చినఁ గైకొన ♦ వే! యిటేల
కొండకును నాఁగలి దగిల్చి ♦ క్రుమ్ములాడ? 58

కం. అని చెప్పిన కోలఁడిసి న,వ్వనితకుఁ బట్టుదలపైని ♦ వైరాగ్యముగా
డ నొకండు పుట్టెదోడఁగెన్, గన నుచ్చుచు లాగ బిగియుఁ♦గాక సడలునే?

ఉ. ఆది ధనాశ యెంత యధి ♦ కాశ యనంతర మాత్మనిశ్చరా
నాదన మాఁలఁ బట్టుదల ♦ జ, ద్దటుపై విగతాశ మీఁద ని
ర్వేదము పుట్టె సిద్ధి ప్రభ ♦ వించఁగ గాదటె దేహబంధవి
చ్ఛేదము గల్గు నవ్వనిత ♦ చేసిన పున్నమదేమొ తొల్లిటన్. 60

వ. అంత నది యెంతయు నాత్మగతంబునఁ జింతించినదానిఁ బింగళాగీతమును
వినుము. 61

ఉ. ఒక్కఁడొ రెండొ రాత్రులకు ♦ నొవ్వ నటించును బల్కు కారణా
లక్కట! వేరొసంగినను ♦ నయ్యవి యుండక యెందుఁబో యెడిన్
రొక్క మొసంగు మాత్రమున ♦ రూపవిలాసవయోవికాసముల్
దక్కనవాని మాధ్యమునఁ ♦ దాఁకుట ఛీ! గ్రహచారమేగదా. 62

ఉ. హీనకులోద్భవుం డయిన ♦ హేయగుణాశ్రయుఁడైనఁ బాతకుం
డైనఁ గురూపకుం డయిన ♦ వ్యాధితుఁడైన మతింకొకం డెసం
డైన ధనం బొసంగనటె ♦ యాతనికి న్వశురాల నౌట ఛీ!
దీన సుఖింపనెంచి చెడి ♦ తింగదె యిన్నిదినాలనుండియున్. 63

ఉ. ఎంతటి యజ్ఞురాల! నతి ♦ హీనవృత్తికిఁ జొచ్చి విత్తసం
భ్రాంతిని దేహ మమ్మఁ గొనఁ ♦ బాల్పడి దుర్భరరోగవీచికా
సంతతి నుడ్డుకుడ్చుచు న ♦ జస్రము పెక్కు శ్రమంబు లొందితిన్
జింతల డస్సితిన్ బ్రదుకుఁ ♦ జేటుఁ దలంపఁగనైతి నక్కటా! 64

ఆ. కచ్ఛరాళివలనఁ ♦ దుచ్ఛకామావళీ, గుచ్ఛముల నెడంద ♦ నిచ్ఛయించి
స్వచ్ఛమైన స్వేచ్ఛ♦విచ్ఛిన్న మొనరించి, మ్లేచ్ఛనైతిఁ గాయ♦దృచ్ఛ నకట!

కం. ఎదయందే యున్న రతి,ప్రదు విత్తాకలితు నాత్మ ♦ రమణున్ బరమున్
వదలి యకామదుదుఃఖా,స్పదు భయమోహాకరు నరుని♦వలచితిఁ జెడితిన్.

సీ. హస్త పాదాంతర♦స్థాస్థులు స్థూలమ్ము,లగు స్థాణములువో లె♦నమరియుండ
వానిపైని గ శేరు ♦ కానామమ్ము దీ,ర్ఘమైన దూలమ్ము ♦ గ్రమ్మియుండ
అద్దాని కిరుచక్కి ♦ యల స్వల్పపమ్మకల్,వాసమ్ములగుచును ♦ వరలియుండ
దానిపైఁ గప్పుచం♦దానఁ ద్వగ్రోమన,ఖాదులు వ్యాపించి ♦ యణఁగియుండ

తే. ద్వారములు తొమ్మిదింట ని ♦ త్యమ్ముఁ గళ్ళె
లమ్ము వోవుచునుండ మ ♦ లమ్ము మూత్ర
మున్న దేహంబనెడి గేహ ♦ మున్నతమ మని,
యెంచి చెడిపోయితినిగదే ♦ యిన్నినాళ్లు. 67

తే. ఆత్మదుం డైన యచ్యుతు ♦ నవలఁ ద్రోచి
యొకని గాంతునిగాఁ గోరు ♦ చున్న కుబాధు
రాల నీ విదేహపురంబు ♦ నందు నేను
గాక మఱియెవ్వ రిట్టిరు ♦ గానఁబడరు. 68

కం. నెచ్చెలి హితుండు విభుఁడు జ,గచ్చరులకు నాత్మ యగును ♦ గాన నతని కే
నిచ్చి రమించెద నాత్మన్, లచ్చి హరింజేరి సుఖము ♦ లంగన్న యటుల్. 69

కం. ఆదియు నంతముగల కా,మాదులు కాముకులు నరుల ♦ నమరులు కాలా
స్వాదితులు తమక గతి లే,దాదయితల కేమొసర్తు ♦ రధికప్రియముల్? 70

శా. పూర్వం బేభవమందొ యేక్రియనొ నీకున్ ♦ బూజించితిం గాన సం
తర్వాణముల్ గనలేని దుర్ద్రవిణ తృ ♦ ష్ణాపాశవిచ్ఛేదియౌ
నిర్వేదంబు నొసంగుచుం బరమశాం ♦ తిం గూర్చి రక్షించి నా
సర్వార్థంబులు పండఁజేసితి నమ ♦ స్కారమ్ము లక్ష్మీపతీ! 71

ఉ. నీ దయ నావయిం బొలసె ♦ నిక్కము కాక యదృష్టహీన నౌ
చో దురుపద్రవంబులకుఁ ♦ జో టగు క్లేశము నాకు సౌఖ్య సం
పాదక భూరిశాంతి విభ ♦ వప్రద బంధవినాశకారి ని
ర్వేదముఁ గల్గఁజేయునటె? ♦ శ్రీరమణీహృతమానసాంబుజా! 72

కం. నీమే ల్వహించి యాఁదలఁ, గామాశాపాశములను ♦ ఖండించి స్వయో
షామైత్రి వదలి సత్కరు,ణామేయు మహేశు శరణ ♦ మందెద నిన్నున్ 73

కం. ధన మాసింపక లభియిం,చిన దానం దృప్తిపడుచుఁ ♦ జిత్తంబున నీ
శుని బరమాత్మను రమణున్, గని క్రీడించెదను సౌఖ్య ♦ కలనాసక్తిన్ 74

కం. సంసారాంధువునఁ బడి నృ,శంసవిషయములకుఁ జిక్కి ♦ జ్ఞాన మెడలిఘో
రాంసల కాలభుజంగము, హింసింపఁగ విభుఁడు గాక ♦ యెవఁడేలునన్

వ. అని యప్పింగళ దలంచె నని యవధూత మఱియు యదువుతో నిట్లనియె

ఆ. సర్వజగము కాలసర్పపీడిత మంచు, నాత్మయొకఁడ గాచు ♦ నాత్మ నంచు
నరసి యప్రమత్తుఁ ♦ డయి సర్వమందు ని,ర్వేదపడిన వాని విభుఁడ యేలు

కం. కాంతామణి యీవిధమునఁ, జింత సలిపి నిశ్చయంబు ♦ సేసికొని మదిన్
శాంతదురాశ విడిచి హృ,చ్ఛాంతి వడసి నిరుపమాన ♦ సౌఖ్యములొందెన్

కం. ఆశాపాశ సమూలఛి, దా శౌండ నిశాతఖడ్గ ♦ ధారఁగదే భూ
మీశా! నిర్వేద మ్మది, వేశంబున వేశ్యయెడఁద ♦ వెలిఁగెను వింటే. 79

కం. ఆశయె దుఃఖోత్తరము ని, రాశయె నిరవధికసౌఖ్య ♦ మడిగిన ధవ మీ
నీశుఁడు నరుం డోదవమి ని, రాశఁ గని విటాశ విడిచి ♦ యామె సుఖించెన్.

వ. యయాతినందనా! పింగళవలన నాశదుఃఖకరంబనియు నైరాశ్యము సౌఖ్యకరంబనియు గ్రహించితి నని యవధూత నుడివెనని కృష్ణుండు పలికినట్లు శుకమహర్షి వచించెను. 81

ఇది యష్టమాధ్యాయము సమాప్తము

---

## నవమాధ్యాయము

కం. ఒకఁడవగుటఁ దోఁపక నీ, వికటమునకు మమ్ముఁ దోశా ♦ ని చనక బహురూ
పకుఁడవయి వచ్చి కలిపెదొ, యకలంకాధ్యాత్మవిద్య ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపు మవ్వల శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. 2

తే. అంత శ్రీకృష్ణపరమాత్మ ♦ యాత్మశిష్యుఁ
డైన యుద్ధవుతో నిట్టు ♦ లనియెఁ బుత్త్ర!
యదుమహీమహేంద్రుని జూచి ♦ యాదరమునఁ
బలికె నవధూత పీయూష ♦ భాషణముల. 3

### *_ అవధూత యదువునకుఁ గురరార్భక శిక్షిత మెఱిఁగించుట *_

వ. యదురాజా! కురరమువలన నా నేర్చినది వినుము. 4

కం. లకుముకి నోట న్మాంసపు, శకలముఁ గని బలయుతస్వీ ♦ జం బొం డద్దా
నికిఁ గీడుసేయ రాఁగొం, జక మాంసము విడిచి పిట్ట ♦ సౌఖ్యము పొందెన్.

కం. ఒరులకుఁ బ్రియతమ మగుచుం, బరఁగిన వస్తువు గ్రహింప ♦ వాని కదియ దు
ర్భరదుఃఖ మిడెడిఁగావునఁ, బరిగ్రహామువిడిచి సుఖము ♦ వడయఁగవలయున్.

కం. అని కురరమువలన గ్రహించితిఁ నిఁక నర్భక శిక్షితము విను. 7

తే. ఒకరు తిట్టిరి భూషించి ♦ రొకరటంచుఁ
దలఁప దారపుత్త్రాది చిం ♦ తలును లేవ
యాత్మరతియు నాత్మక్రీడ ♦ యలరుచుండ
బాలువోలెఁ దిరుగుచుందు ♦ వసుధయందు. 8

(1) ఈ యధ్యాయ ప్రారంభము 22-5-1946,

—* అవదూత కన్యకానిరీక్షిత మెఱిఁగించుట *—

చం. కల దొక చిన్నగ్రామమునఁ ♦ గన్యక యొక్త్రది తల్లిదండ్రులుం
బొలియుట బాల్యమందకడ ♦ పుం దనకాలముఁ గష్టవృత్తి బం
దులగృహమందు; నావెనుకఁ ♦ దొట్టుకతంబునఁ బెండ్లిప్రాయ మ
ప్పొలఁతి వెలుంగఁగాఁదొడఁగె ♦ మొవ్వ వెలార్చు నసంటిబోదెనా. 9

సీ. పరిచితి గలిగిన ♦ పురుషుఁడే గనుపడ్డ, మొగమటుత్రిప్పి యొ♦త్తగిలిచనును
ఇచ్చవచ్చిన వస్తు♦వే తెప్పలెత్తిచూడక కడగంట ప♦డ్డముగఁ జూచు
తొందరపనియేని ♦తొఁతొర వోపక, యలసయానంబుకో ♦ నడుగులూన్చు
అనుఁగులకడనేని ♦ యాకారగుప్తికిఁ, దెలియొల్లె సారెకుఁ ♦ దిగియనిమురు

తే. నగ వెగయుచున్నఁ గనులలో ♦ నని మరల్చుఁ
బలు కెలయుచున్నఁ బెదవుల ♦ పైకె తెమ్చు
బాలభావ మెల్ల వెనుక ♦ వట్టె మొలక
జవ్వన మ్మటు తలయెత్తఁ ♦ బువ్వుఁబోఁడి. 10

సీ. సిబ్బితిదొంతర ♦ లుబ్బి యొక్కమ్మడి
దుకుదుకుచూపులలోన ♦ నుడివడంగ
వలరాజు చేమించు ♦ నఁటువిల్ రెండుకో
వులు విప్పుటురమునఁ ♦ బొడవుసూప
తలఁపులలోని సు ♦ ధామాధురీసార
విభవమ్ము మోవిపైఁ ♦ బేరికొనఁగ
ప్రాయంపురాజ్య మే ♦ ర్పడి పిఱుందులకడ
నెల్లలొత్తుచు విస్త ♦ రిల్లసాఁగ

తే. కనుల నొకగరువపు రేక♦ కాలువెట్ట, నాననమ్మున నొకవింత ♦ హాయువుదొట్ట
సల్లపనమున నొకవింత♦ చవులువుట్ట, లేఁతలావణ్య మొడలిపైఁ♦బూఁతపూచె.

కం. ఆ వెలఁది జూడఁ గొండొక, కోవాఁ డెఱిఁగి తనుబంధు♦గులఁ దోకొని య
చ్చోవచ్చెఁ బిల్లనడుగుట, కై వేడుకపోఁడుములు మొ♦గంబుఁ గులుకఁగ. 12

చం. మొగమువసందుఁ జెక్కిళుల ♦ పొంకము నాసిక తీరు సోగక
న్నుఁగవ మిటారము న్నుదుటి ♦ నున్నను బెంపలకట్టుపోఁడిమిన్
బిగితవుమేనిపొందుబడిఁ ♦ బెంపెసలారుచు నొత్తివచ్చు సో
యగ మిరుక్రేవలందుఁ గని ♦ యంది రెడంపల నంద మందఱున్. 13

ఆ. మనువు మాటలాడఁ ♦ జనుదెంచియున్న పె, ద్దలకుఁ బిల్లవంట ♦ నలుపవలసి
వచ్చెఁ గాఁపురంబు ♦ విచ్చినదగుట న, త్తఱిన వడ్లుదెచ్చి ♦ దంపఁబూని

చం. పరికిణిచెంగుల న్మడఁచి ♦ ప్రక్కవి యొల్లెచెఱంగుఁ ద్రిప్పి ముం
దఱిబరి దోఁపి యొంటరిగఁ ♦ ద న్నవరుం గనకుండ దొడ్డిలో
బిరబిర వడ్లు దంచునెడ ♦ వీనులు చిల్లులువోవ ముంగయిం
బొరలుచు సంకు బెంగడియ♦ముల్ వినడించె ఘలంఘలార్భటిన్. 15

కం, ఈరవ మింటికి వచ్చిన, వారలు విని తమ్మునెట్లు ♦భావింతురొ? యం
చారసి యెడలో సిబ్బితి, గూరి వగుల నడఁచెఁ గన్నె ♦కొన్నికడెమ్ముల్. 16

వ. భిన్నంబులుగాక తక్కినవి రెండు రెండు మాత్రము చేతికి నుండ; నారెండుంగూడ వడ్లుదంచు నెడఁ బరస్పరసమ్మర్దంబున సించుక శబ్దించుచుండ నబ్బాలిక యదియు జుగుప్సావహంబని యందొక్కొక్కదానిఁ బగులంగొట్టి చేతికొక్క కడియమునే మిగిల్చి తనపనిం దీర్చికొనె. రాజా! యొక్కకడియము మొరయఁజాలదుగదా! నేను లోకతత్త్వవివిత్సచే నల్లెడలం ద్రిమ్మరుచు నక్కుమారివలన యోగికి సమ్మర్దంబు గూడదని కఱచితి. 17

కం. పెక్కండ్రు గూడియుండిన నక్కడు కలహంబులొదవు ♦నిర్వురె యైనం
ద్రిక్కదు ముచ్చట కావున, నొక్కండ కడియమట్టు♦లుండంగఁదగున్ 18

—♦ అవదూత శరకారసర్ప శిక్షితముల నుడువుట ♦—

వ. మఱియుఁ జిత్తైకాగ్ర్యాద్వైతస్ఫూర్తుల నమ్ములకుం జిల్లవేయుచు నున్న వానివలన నేర్చితి విను. 19

సీ. వైరాగ్య సక్రమా♦భ్యాస యోగమున జి, తాసనుండును జిత♦శ్వాసుఁడైన
మది కదలక నిల్చు;♦నది యతంద్రితుఁడయి, భగవంతుపైని సి♦ల్పంగఁ గర్మ
వాసనలెల్లను ♦వదలిపోవును మెల్ల, మెల్లఁగా; సత్వంబు ♦మేలు కొలిపి
యారజస్తమముల ♦నణఁపఁగా విలయవి, క్షేపమ్ములాఱిన♦చిత్తవృత్తి
తే. బహుళ గుణకార్యరహిత ని♦ర్వాణపదము
నంటు; నట్టిచో మాని బా♦హ్యాంతరంబు
లెఱుఁగఁ డిషుకారుఁ డిషుగత♦హృదయుఁడగుచు
నెదుట భేరీధ్వనుల నేగు ♦నృపునిఁ గనునె? 20

వ. ఇఁక సర్పశిక్షితము జనసంగత్యాగము విను. 21

కం. ముని యహివలె నొకఁడ దిరుగు, చనికేతనుఁ డప్రవచనుఁ♦డగుచును నాచా
రనియతిఁ దెలియఁగనీయక, యనవరత మ్మప్రమత్తుఁ♦ డై యుండఁదగున్.

కం. నిలయారంభము దుఃఖా,కలితము విఫల మ్మనిత్య♦కాయమునకుఁ జీ
మలుపెట్టిన పుట్టలఁ బా,ములు చొరఁబడి జరపు సౌఖ్య♦ముగఁ గాలంబున్.

## ఊర్ణనాభి శిక్షితము

వ. ఊర్ణనాభివలన లయోత్పత్తుల తెఱం గెఱింగితి నెట్లన, 24

కం. నారాయణుఁ డొకఁడ స్వామీ, యా రచితైతజ్జగమ్ము నఖిలముఁ గాలా
పరమ్మగు శక్తిని సంహారము గావించుఁ గల్పమంతం బగుచున్. 25

వ. ఆత్మానుభావంబైన కాలంబుచేఁ గారణభూతంబులగు సత్త్వాదిశక్తులు సామ్యావస్థం బొందు. ఆగుణసామ్యంబ ప్రధానంబు. ఆప్రధానమ్మే పురుషున కుపాధి యగు. ఈప్రధానపురుషులకు నీశ్వరుండును బ్రహ్మాదులకును ముక్తజీవులకును బ్రాప్యుండును గైవల్యసంజ్ఞితుండును సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యుండును నఖిలాశ్రయుండును నాత్మాధారుండును నై బ్రహ్మ మొక్కండయుండు. మరల నక్కేవలానుభవానందసందోహుండును స్వప్రకాశుండును నిరుపాధికుండు నగునతండు కేవలాత్మానుభావకాలంబున సిసృక్షచేఁ ద్రిగుణాత్మిక యయిన మాయను సంక్షోభమొందించి దానిచే మొదటఁ గ్రియాశక్తిప్రధానమైన సూత్రముం జేసె. ఆ సూత్రము జీవసంసారహేతుభూతమైనది. ఆసూత్రముగదా నానావిధంబైన త్రిగుణాత్మకంబైన విశ్వమును నహంకారద్వారమున సృజించినది, కారణభూతంబును సమష్టిరూపంబును నైన సూత్రమం దీవిశ్వంబు గ్రథితంబై యున్నది. మఱియు వాయ్వాత్మప్రాణరూపంబైన యద్దానిచేతనే జీవుండు సంసారమునఁ జరించుచున్నాఁడు. అక్కతనఁ ద్రిగుణకార్యంబునకు సూత్రసంజ్ఞ యేర్పడియె. 26

తే. సాలెపురువు నోటం దంతుచయము వెల్వ
రించి యొకయిల్లుకట్టి క్రీడించి యవల
దంతువులఁ దానె మ్రింగు చందమున జగము
సర్చి క్రీడించి యీశుఁ డంత మొనరించు. 27

మ. జనుఁ డెద్దాని దృఢంబుగా హృదయమున్ సంధించునో భీతినై
నను స్నేహంబుననైన ద్వేషముననైనన్ దత్స్వరూపత్వ మొం
దును; భృంగం బొకపుర్వుఁ దెచ్చి తొలియం దు న్నిల్వ నప్పుర్వు బీ
తున వీక్షించుచుఁ దేటిరూపమున పొందుం దొంటికాయంబుతోన్. 28

వ. రాజా! దీనినే భ్రమరకీటన్యాయ మందురు. కీటమునకు స్వదేహముననే యన్యసారూప్యము గోచరించుచుండ నిఁక ధ్యాతలకు దేహాంతరమున సారూప్యముక్తి యొదవుటకు సందియం బేమి? ఏనిదియు కీటంబువలన నెఱింగితి. నరపాలా! నా గురువుల నా నేర్చిన చదువుల హేయోపాదేయంబుల నెఱింగించితి. ఇఁక స్వదేహశిక్షితము వినుము. 29

## -* స్వదేహశిక్షితము *-

కం. అనిశార్త్యుదర్కమనియును, జననమరణకలితమనియు ♦ శ్వసృగాలస్వ
మ్మనియుఁ దెలిసి గాఢవిర, క్తి నసంగముఁడనయి యుండుఁ ♦ దేహంబునయిన్.

వ. ఇట్లు తత్త్వవిమర్శనవివేకంబునకు వైరాగ్యంబునకు నుపకరణంబైన యీ శరీ
రంబు నాకు గురువు 31

సీ. దేహభోగార్థంబు ♦ గేహ జాయా పశు,భృత్యవిత్తాదులఁ ♦ బెంచుకొనుచు
నావల దేహాంత ♦ రారంభకంబగు కర్మబీజంబు వృ ♦ క్షంబువోలెఁ
గల్పించుకొని మృతిఁ ♦ గాంచును దేహి దుః,ఖంబేమి చెప్ప!నొక్క యెడజిహ్వ
యొక్కచో శిశ్న మిం ♦ కొక్కచో శ్రవణ మింకొక దెస ఘ్రాణ మిం ♦ కొకట దృష్టి

తే. యొకట చర్మ మింకొకయిక్క ♦ నుదర మింక
నొక్కదిక్క కర్మేంద్రియా ♦ లుక్కు మిగిలి
పట్టి యీడ్చుచు సవతుల ♦ వగిది దేహి
నలజడిం బెట్టెదరు గంటె ♦ వా ? నరేంద్ర ! 32

సీ. అజుఁ డాత్మశక్తిచే ♦ నఖిలవృక్ష సరీసృ,పద్విజ పశువంశ ♦ వనచరమత్స్య
లాదిగా నానావి ♦ ధాంగముల్ నిర్మించి, వానిచే సంతుష్టి ♦ వడయఁ బోక
బ్రహ్మావలోకన ♦ పరు నిదంపురుషుని, సృజియించె దుర్లభ ♦ మీ శరీర
మెన్ని జన్మములకో ♦ నృశరీర మేతెంచె, నిది యనిత్యంబయ్యు ♦ నెల్లపూరు

తే. షార్థములకును సాధన ♦ మ్మగుట మృత్యు
ముఖము సారకమున్నె మోక్ష ♦ మునకు వేగ
గడఁగవలయును విషయసౌ ♦ ఖ్యమ్ము లెల్ల
దేహములు పొందు నవియేల ♦ దేవులాడ ! 33

ఉ. ఎట్టులొ ! యేభవంబునకొ ! ♦ యేలవమో ! సుకృతంబు సేయఁ గ
న్పట్టె నృదేహ మద్ది చని ♦ నన్ వృథగా మఱి భావికాలమం
దొట్టు మనుష్యదేహ మన ♦ నొప్పునె ? కావున దీపమున్న య
ప్పట్టున దేవులాడు మను ♦ పల్కు నెఱింగి హరిన్ భజింపుమా ! 34

కం. ఈ రీతి నెఱింగి యహం, కారమడఁచి సంగములను ♦ గడఁద్రోచి వివే
కారూఢమానసుఁడనై, వైరాగ్యముఁ బూని యాత్మ ♦ వరతఁ జరింతున్. 35

ఆ. ఒక్క గురువువలనఁ ♦ జిక్కించుకొన్న జ్ఞా,నంబు స్థిరము పుష్కలంబు గాద
అనుపమానమద్వ ♦ యంబు బ్రహ్మజ్ఞాన, మెన్నొగతులమాను ♦ లెన్నుచుంద్రు

వ. అని యవధూత సెప్పెనని కృష్ణుండు మఱియు నిట్లనియె. ఉద్ధవా ? యిట్లవ
ధూత బోధింప హైహయనృపసతీర్థ్యుండైన యదుమహారాజేంద్రుం

డత్యంతసంతుష్టుండై పూజింప నయ్యవధూత యెందే నరిగె. అంత నస్మత్పూర్వుండు యదునరేంద్రుండు సర్వసంగ విసర్మ్ముక్తుండు సమ చిత్తుండు నైయుండె నని శ్రీకృష్ణభగవానుండు బోధించెను. 37

ఇది నవమాధ్యాయము సమాప్తము

---

## దశమాధ్యాయము

కం. ఒకఁడవె గదరా యొక్కఁడని, లోకగతి వేఱొకనికి న్మ ♦ లోకగతి నీవే
టికిఁ గానఁబడెదో త్వన్మాయకు వశ్యుల మగుటనొక్కొ? హరిహరనాథా! 1

-: శ్రీకృష్ణుఁ డుద్ధవునికి నాత్మప్రాప్తిసాధనములఁ జెప్పుట :-

వ. [1]దేవా! యవధరింపు మవ్వల శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె నట్లు శ్రీకృష్ణుం డుద్ధవున కవధూతోక్తులు వినిచి వత్సా! శ్రేయోభిలాషి 2

తే. నే నుడివిన వైష్ణవధర్మ ♦ నిచయ మెఱిఁగి
యప్రమత్తుఁడై నన్నె తా ♦ నాశ్రయించి
ఫలమునం దభిలాషను ♦ బాఱఁద్రోలి
సలుపవలయు వర్ణాశ్రమా ♦ చారములను. 3

తే. అఖిలవిషయంబులందు స ♦ త్యత్వబుద్ధి
నుంచి విషయాత్ము లొనరించు ♦ చుండు సర్వ
యత్నములు ఫలవైపరీ ♦ త్యంబు గనుట
నమలబుద్ధి విమర్శింప ♦ నగును జూవె. 4

సీ. సుప్తుఁడై కలలోనఁ ♦ జూచెడి విషయముల్
యోచించువానికి నొదవు తలఁపు
లన్ని యైంద్రియకమ్మ ♦ లగుట నానావిధ
మ్ములుగ నుండును ఫలమ్ములును ♦ హుళిక్కి
యట్టులె సృష్టియం ♦ దమరమనుష్యాది
భేదముల్ వివిధము ♦ ల్వెలయు నింద్రి
యమ్ములకవ్వి య ♦ ర్థార్థముల్ గావయ్యు
పురుషార్థ మిందునఁ ♦ బొరయఁబోదు.

తే. మత్పరులు కామ్యకర్మము ♦ ల్మాని సల్ప
వలయు నిత్యనైమిత్తిక ♦ మ్ములనె శ్రద్ధ

1 ప్రారంభము 25-5-1946.

నాత్మజిజ్ఞాసకుఁ దొడంగు ♦ నాతఁ డిట్టి
తెఱఁగు కర్మంబులందు వ ♦ ర్తింపరాదు. 5

సీ. ఎల్లయెడల నొక్కఁ ♦ డే యాత్ముఁ డుంట సా
ఖ్యమ్ము తుల్యమ్ముగా ♦ నమరుఁగాన
దారాదుల న్మమ ♦ త్వం బేల? యని వారి
పైని నౌదాసీన్య ♦ భావ ముంచి
యవ్యగ్రుఁడును దక్షుఁ ♦ డర్థజిజ్ఞాసు వ
వ్యర్థవచనుఁ డనసూ ♦ యారహితుఁడు
నిర్మత్సరుం డమా ♦ నియు నగుచును నహిం
సాది యమమ్ముల నాదరించి

తే. ఆత్మశక్తికొలంది శౌ ♦ చాది నియమ
ములను బూని సద్గురుభక్తి ♦ పొదలుచుండ
మహిత శాంతుని మదభిజ్ఞు ♦ మత్స్వరూపు
గురువరేణ్యు శుశ్రూషచేఁ ♦ గొలువవలయు. 6

వ. అగ్ని దాహకుఁడు, ప్రకాశకుఁడు నగు; దారువు దాహ్యము ప్రకాశ్యము నగు. కావున నగ్నికంటె దారువు విలక్షణమైనదిగదా. అట్లే యాత్మ ద్రష్ట, స్వయం ప్రకాశకుఁడునగు. దేహము, దృశ్యము, జడము నగు. ద్రష్టృ దృశ్యము లొక్కటియెట్లగు? కాన నాత్మ స్థూలాదిదేహముల కంటె విలక్షణమైనది 7

తే. దారుగతమైన యగ్ని త ♦ ద్దారుగుణము
లందునట్లు పరుం డైన ♦ యాత్మ దేహ
సంగతుం డయి జన్మనా ♦ శబృహదాది
వివిధదేహధర్మములఁగా ♦ న్పించుచుండు. 8

తే. అనఘ! యీశ్వర మాయాగు ♦ ణాళిచేత
స్థూల సూక్ష్మ శరీరముల్ ♦ గ్రాలుచుండు
జీవునకుఁ దదధ్యాస సం ♦ సృతి చెలంగు
నాత్మవిద్యచేఁ నదియు ల ♦ యంబు నొందు. 9

తే. కాన నాత్మజిజ్ఞాసచేఁ ♦ గాయమందు
వెలుఁగు నాత్మనిఁ బరముఁ గే ♦ వలు నెఱింగి
స్థూలసూక్ష్మక్రమమున దే ♦ హాళియందు
వాస్తవిక బుద్ధిని ద్యజింప ♦ వలయుఁ జుమ్మి. 10

కం. గురుఁడై యధరారణి, యు, త్తరారణియు శిష్యుఁడై, మ♦థన కార్య మ్మ
త్తఱిని నుపదేశంబై, పరఁగ విద్యాగ్ని పుట్టుఁ ♦బరమసుఖదమై.

చం. గురు నుపదేశశక్తి నన♦ఘుండయి చట్టు, విశుద్ధ బుద్ధి దు
స్తరమగు మాయతోడి పటు♦సంసృతి హేతు గుణాళి సర్వముం
బొరి జ్వలనుండు కాష్ఠచయ♦ముంబలెఁ గాలిచి వైచి శాంతుఁడై
నిరుపమ నిర్వికార నిజ♦నిత్య సుఖాకృతి నిల్చుఁ గడన్. 12

-: శ్రీకృష్ణుఁడు ప్రవృత్తిమార్గఖండనము గఱపుట :-

వ. అట్టి శాంతింబొందిన వాఁడ యానందస్వరూపుండు ఉద్ధవా! ఇచట జైమినీయులు "అహంప్రత్యయ విజ్ఞేయుఁడే యాత్ముఁడు. వాఁడుకర్మంబుల ననుష్ఠించుచుఁ గర్తృరూపంబునను, దదీయసుఖదుఃఖముల ననుభవించుచు భోక్తృరూపంబునను బ్రతిశరీరంబున వేఱ్వేఱుగా నుండును. ఇట్లు జీవులు పెక్కండ్రు. వీ రుండులోకంబులును వీరిభోగకాలంబులును వీరికిఁ గర్మసాధనోపదేశకంబులగు నాగమంబులును నానాత్వనిత్యత్వంబులం జెంది యున్నవి. స్రక్చందనాది సర్వభావస్థితి ప్రవాహరూపమున నిత్యమే యగుఁగాన దాని కొకకర్త యీశ్వరుండేటికి? అట్టి జగము మాయామయముం గాదు. బుద్ధి ఘటపటాద్యాకారమున జనించుచున్నది, భేదించుచున్నది. ఆత్మ నిత్యజ్ఞానరూపము కాదు. జ్ఞానపరిణామవంతముమాత్ర మగును. అది పరిణామనికారి యైనంతమాత్రమున ననిత్యత్వ ప్రసంగము లేదు సుమీ. ఇట్లంతయు నిత్యమైనపుడు వైరాగ్యోత్పత్తికి నవకాశ మెక్కడ! కానఁ బ్రవృత్తియే శ్రేయస్కరమ"ని యందురు. ఈ వాదము విచారింతము. ప్రవృత్తిమార్గ మనర్థహేతు వెట్లో క్రమముగా వివరింతు. 13

తే. ఉద్ధవా! వినుసర్వదే♦హులకుదేహ
సంగమున వత్సరాదిక ♦ సమయమునను
జననమరణాదిభావముల్ ♦ సంభవించు
నన్నియేని పర్యాయంబు ♦ లిద్దినిజము. 14

వ. కర్మములు సేయుటకు ననుభవించుటకు వీఁడు స్వతంత్రుఁడుగాఁడు. 15

ఉ॥ ఒక్కఁడుఁ గర్త నేనయని ♦ యొక్కఁడు భోక్తను నేనయంచుఁ బెం
పెక్క స్వతంత్రతాగరిమ ♦ మించుక లేకయె యంకె వైచుఁబో
యొక్కఁడు నూరియున్ సుఖము♦లొందఁ, డొకం డతిమాత్రుఁడయ్యును
న్నక్కను దుఃఖ; మెందుకొ వృ♦థా దురహంకరణంబు వీరికిన్? 16

కం. ఎవఁడైన దుఃఖములఁ బొంద వరించునె? సౌఖ్యములన ♦ దలఁగఁ దలఁచునే
వివశుండు గానిచో పీఁ, డవిరెం జేయిటికి లోక ♦ మందు వసించున్? 17

కం. పోని మొన్మష్టిప మవిరెం, జీవునకు వశ్యములని ♦ యింతటి ధీరుం
డౌనెడలఁ దాను మృత్యువు, నానసమున వెరవిడిచుయు ♦ యణఁగఁగ నేలా?

ఉ. పుట్టుకతోడ మృత్యువును ♦ బుట్టి మొగంబును విప్పి వెంట నె
ప్పట్టునయుండు నట్టియెడ ♦ వాంఛలు వ్యర్థము లేమిసౌఖ్యము
గ్గట్టెడిపీని? కన్నము న ♦ లంత్రతు లేవియుఁ దుష్టి నిచ్చునే?
పట్టి వధార్థ మీడ్వఁబడు ♦ వధ్యునకు న్మదిలోన నుద్ధవా! 19

మ. పరలోకంబుననైన సౌఖ్యముల సం ♦ పాదింతమా? యన్న నీ
ధరయందుంబలె నయ్యెడం గలవు స్ప ♦ ర్ధానాశనాసూయ; లా
కరముల్ సర్వవిఘాంతరాయములకుం ♦ గామంబు లచ్చోట ను
ర్వరలో సేద్యమువోలె; నుద్ధవ! ఫల ♦ ప్రాప్తుల్ విసర్గాకృతుల్. 20

కం. ఘనుఁడై స్వధర్మమును వి,ఘ్ననిహన్యుఁడుగాక దీక్ష ♦ గ ననుష్ఠింపన్
బనువడు నాకర్మనను, ననుత్తమ స్థాన సుఖ వి ♦ హార విధంబుల్. 21

ఉ. జన్నము లాచరించి దివి ♦ షత్తతిఁ దృప్తులఁజేసి యాజ్ఞికుల్
క్రన్న దివంబు సేరి యమ ♦ ర ప్రతిరూపముల న్వహించి యా
ద్యన్నిజ దివ్యభోగ సము ♦ దాయముల న్భుజియింత్రు హృష్టులై
పున్నెము లంత గడింప నవి ♦ వోవున రిత్తగ నెందు నుద్ధవా! 22

వ. ఈ కర్మజీవుండు తన మనోహర దేహంబున

చం. సురుచిర రత్నహారములు ♦ శోభిల హేమ సరోజ సౌరభ
స్ఫురదురుదామముల్ చెలఁగఁ ♦ బుష్పిత కల్పవిశీర్ణసుందరాం
బరములు గ్రాలఁ గామగవి ♦ మానిత గంధము లొప్పచుండ ని
ర్భరతర హర్షసంజనిత ♦ బాష్ప ముఖుండయి పుచ్చుఁగాలమున్. 24

చం. విలసిత పుష్పదామ పరి ♦ వేష్టిత ముజ్జ్వల హైమకింకిణీ
కలరవ సంభృతంబు నిజ ♦ కామగ దీప్ర విమానమెక్కి క్రే
వలఁ గలశాంబురాశిభవ ♦ వారిజనేత్రలు భర్మచామరా
వళిఁ బరిచర్యలన్ సలుప ♦ వాంఛమెయి న్విహరించుచుండెడిన్. 25

ఉ. ప్రాకట కల్పవృక్ష వన ♦ వాటికలన్ సురనిమ్నగా తటీ
సైకతసీమలన్ మణిభృ ♦ త్ప్రియ మేరుగుహాముఖంబులన్
నాకవిలాసినీ జన స ♦ మావృతుఁడై బహుదివ్యభోగముల్
గైకొనుచున్ బ్రమోదములఁ ♦ గాంచు నెఱుంగఁ డుదర్క ముద్ధవా! 26

శా. ఇష్టాపూర్తము లందు పత్రము చిరం ♦ బొప్పించునే? యంత పు
ణ్యా మార్జించెనో యంతకాలమెనుమీ ♦ నాకంబునన్ భోగభా
గ్యమ్ముల్ గాంచెడి నాపై న స్వసుకృత ♦ క్షీణత్వంబునన్ స్వర్గపా
తమ్మున్ బొందును గాలగంచలితుఁడై ♦ తద్ధార్ఢ్యహీనం బుద్ధవా! 27

వ. ద్వివిధంబైన ప్రవృత్తిలో నిది విధ్యనుసారి కామ్యకర్మ ప్రవృత్తిగతి. ఇంక నధర్మప్రవృత్తిగతి వినుము. ఎట్లనిన 28

శా. ధర్మార్థంబును దాఁటి కాపురుషుఁడై ♦ తత్త్వంబునం బొల్చి దు
ష్కర్ముండై యజితేంద్రియుండయి సదా ♦ కామాత్ముఁడై దీనుఁడై
దుర్మోహుండయి లుబ్ధుఁడై చపలుఁడై ♦ స్తబ్ధుండై వధకారుఁడై
దుర్మార్గుండయి ఘాతుకుండయి మదాం ♦ ధుండై దయాశూన్యుఁడై 29

తే. అవిధిగాఁ బశువులఁ జంపి ♦ యామిషమునఁ
బ్రేతభూతగణముల న ♦ ర్చించువాఁడు
ఖలుఁడు వివశుఁడై నరకలో ♦ కమునఁ గూలి
యవల బహుళతమస్స్థాన ♦ రంగమొందు. 30

కం. ఈతనువున దుఃఖప్రద, కాతత కర్మము లొనర్చి ♦ యనిత్యగత తనువులం
దేతనువో కాంచు, మరల ని, జేతః కైన సుఖమేమి ♦ యౌ నుద్ధవకా! 31

కం. చేతలచే జాతుఁడగున్, జాతుండగు చేతలం బో ♦ నర్చుఁ బ్రవృత్తిన్
శాతమ్ము లేదు స్థిరముగ, నీతిరుగుడు సుడిఁబడి తపి ♦ యింపఁగనేలా? 32

తే. కల్పమున్నంతపట్టును ♦ గ్రాలు లోక
తతికి లోకపాలురకు నా ♦ ద్యయము కలద
యులరు మద్భీతి ద్విపరార్థ ♦ మాయువెసఁగు
ధాతకుం గూడఁ బెరవారిఁ ♦ దడవనేల? 33

వ. కానఁ బ్రవృత్తిమార్గం బనర్థపరంపరల కాలయంబగు నని విమర్శించి తెలిసికొని విరక్తిం బూని తత్ప్రవృత్తినుండి తొలంగవలయు. ఉద్ధవా! కర్తృభోక్తృరూపుండే యాత్మ యని జైమినీయులు పలుకు పొసఁగదు. ఎట్లనిన సత్త్వాదిగుణము లింద్రియములఁ బ్రవర్తింపఁ జేయుచున్నవి. ఇంద్రియములు గర్మముల సృజించుచున్నవి. అంతియకాని యాత్మయే యింద్రియములఁ బ్రవర్తింపంజేయుచుఁ గర్మములఁ జేయుచు నుంట లేదు. కనుక నాత్మకుఁ గర్తృత్వము లేదు. అహంకారవంతుఁడై జీవుఁడు గుణేంద్రియంబులతోడంగూడి కర్మఫలముల ననుభవించుచున్నాఁడు. కనుక నాత్మ కుపాధివశంబున భోక్తృత్వంబు గలదు కాని వాస్తవంబున లేదు. ఇంక నాత్మకు నానాత్వంబును నహంకారాది కార్యరూపంబు నేదైనది కాన, నానాత్వంబును నుపాధిజన్యంబ. 34

తే. ఈ గుణంబుల వైషమ్య ♦ మెంతవఱకొ ?
యంతవఱకును నానాత్వ ♦ మాత్మకుండు
నెంతవఱకు నీనానాత్వ ♦ మెసఁగు నాత్మ
కంతవఱకును బారతం ♦ త్ర్యమ్ము నుండు. 35

తే. ఆత్మకుం బారతంత్ర్యము ♦ న్నంతవఱకుఁ, గలదు దానికి నీశ్వరు♦వలన భీతి
యనుముఖ్యాహంకారకర్త్రాభోగానుభవము, లందు వారికి శోకమోహంబు లుండు.

వ. ఇవియెల్ల వాస్తవములని యుపదేశము గ్రహించితివిగా ఉద్ధవా! యివ్వాను లో
కాను లనిత్యంబు లని తెలిపితిని. కావునే వానిని మాయామయంబు లనుట.
మాయయన గుణవ్యతికరంబే సుమీ. 37

కం. ఘనమాయావిక్షోభం
బునఁ గల్గిన జగము కాల ♦ ముగు జీవుఁడు వే
దని కామయుతస్వభావం
బును ధర్మము మత్స్వరూప♦ములై యుండు బుధుల్.

వ. ఉద్ధవా! తెలిసినదా! జగమన స్వర్గాదికము. కాలమన భోగకాలము. జీవుఁడు భోక్త. వేదము భోగోపాయబోధకము. స్వభావము దేవత్వాది పరిణామహేతువు ధర్మము భోగకారణము నని యెఱుంగుము. ఆత్మ యొక్కండు. దానికి గుణకార్యదేహసంబంధమువలన సంసారము చుట్టుకొన్నది. దాని నాత్మజ్ఞానంబుచేఁ గాయువలయు. కావున నివృత్తియే ముక్తిహేతువు. జైమినీయు లనునట్లు ప్రవృత్తి కాదు. మఱియు వాగీశ్వరుఁడు లేఁడనుట యజ్ఞానవిలసితంబని నీ విప్పటికే గ్రహించియుందు వన నుద్ధవుం డిట్లనె. 39

తే. దేహజగుణంబులందు వ ♦ ర్తించు జీవుఁ
డీగుణాళిచేతనె బద్ధుఁ ♦ డేలగాఁ డ
నావృతుండౌట లేదు బం ♦ ధమ్ము నెదనొ ?
యపుడు ముక్తిమాత్రం బెట్టు ♦ లలరునయ్య ! 40

కం. కలవయ్యా రెండంచుం, బలికెదవే నవ్వు డెట్లు ♦ బద్ధులు ముక్తుల్
మెలఁగుదురో! యేలక్షణ,ములచే వారి నెఱుఁగంగఁ ♦ బోలునో చెపుమా!

వ. వారి కుడుపు విడుపు లెట్టివి? వారు శయనాసనగమనాదు లెట్లు లొనర్తురు? స్వామీ! ఒక్కఁడే యాత్మ్యుండనియు నతం డనాదిగుణసంబంధమువలన నిత్యబద్ధుండనియుఁ దోఁచు. మరల ముక్తి జన్యము గావి నిత్యంబగుట నతండు నిత్యముక్తుండనియుఁ దోఁచు. ఇది యెట్లు? ఈ భ్రమము నివారింపుమని యుద్ధవుం డడిగెనని శుకమహర్షి నుడివెను. 42

ఇది దశమాధ్యాయము సమాప్తము

# ఏకాదశాధ్యాయము

కం. ఘట్టంబుల దాఁటించుచుఁ, బట్టు సడలనీక విఘ్న ♦ వర్గం బెడనో
నెట్టుచుఁ గాచుచు వచ్చెద, వట్టి నిను స్మఱతు నెట్లు ♦ హరిహరనాథా! 1

వ.[1] దేవా! యవధరింపుము శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో
నిట్లనియె. అట్లుద్ధవుం డడుగ శ్రీకృష్ణుం డిట్లనియె. 2

♦— శ్రీకృష్ణుం డుద్ధవునకు బద్ధముక్తలక్షణము లెఱింగించుట ♦—

సీ. అస్మదధీన స ♦ త్త్వాది గుణోపాధి, వలననే జీవుండు ♦ బద్ధుఁడన్న
ముక్తుఁడన్నను: నిజం ♦ బుగను మాయామూల, కమ్ములు గాన గు ♦ ణమ్ములెల్ల
నాకు మోక్షములు బం ♦ ధమ్ములు లేవురా, మాయకు నే నియా ♦ మకుఁడఁగాదె!
స్వప్నంబు బుద్ధివి ♦ వర్తమై మిథ్యయౌ, నట్టులు శోక మో ♦ హసుఖదుఃఖ

తే. కాయయోగవియోగముల్ ♦ మాయవలనఁ
గల్పితమ్ములు వాస్తవి ♦ కములు గావు
ప్రబల మాయాగుణములు కా ♦ రణగుణమ్ము
లింకఁ గార్యసంసృతి మాయ ♦ యెట్లుగాదు! 3

వ. కాఁబట్టి బద్ధునకు ముక్తునకు వస్తుభేదము లేదు. ఇద్దరొక్కఁడే. 4

తే. ఉద్ధవా! విద్యయు నవిద్య ♦ యును మదీయ
శక్తు లమ్మాయచే విసృ ♦ ష్టములు మున్నె
యాద్యములవి దేహులకు న ♦ ల్లవుడు మోక్ష
బంధములను గల్పించుచుఁ ♦ బరిఢవిల్లు 5

సీ. అర్కుఁ డొక్కనికె జ ♦ లాద్యుపాధుల చేత
వెలయు బింబప్రతి ♦ బింబరూప
భేదముల్; జలకృత ♦ వివిధకంపాదులు
ప్రతిబింబమునకె బిం ♦ బమునకుండ
వేజలకుంభంబు ♦ నెపుడు భగ్నమొనర్తు
మప్పుడా జలకుంభ ♦ మందు నున్న
ప్రతిబింబ మొక్కండె ♦ పడయుబింబైక్యంబు
నన్యంబు లెప్పటి ♦ యట్ల యుండు.

తే. అవ్విధమున సుధీవర్య! యు ♦ పాద్యవిద్యయందుఁ బ్రతిబింబితుఁడగుమ ♦ దంశభూత
జీవునికి నొక్కనికిబంధ ♦ మావహిల్లు విద్యచేతను మోక్షంబు ♦ వెలయుచుండు.

---

1 ప్రారంభము 30-5-1946

వ. ఇట్లు జీవభావం బుపాధిచే వచ్చినదనుమీ. ఇంక బద్ధముక్తు లెట్లు మెలంగుదురన్న వైలక్షణ్యప్రశ్నమునకు వత్తము. అది ద్వివిధము. మొదటిది జీవేశ్వర వైలక్షణ్యము. రెండవది జీవులలో వైలక్షణ్యము. నాయనా! మొదటిది వినుము. ఒకే శరీరమందు శోకానందము లను విరుద్ధధర్మములు గలవారై నియమ్యనియంతలుగా నీ బద్ధముక్తులగు జీవేశ్వరు లుందురు. 7

సీ. వృక్షంబునం దొకటఁ ♦ బక్షులు రెండును
పట్టులు దేహంబు ♦ నందు హృదయ
మీను జీవేశ్వరుల్ ♦ చేరియుండుదు రిద్ద
రును సముల్ జ్ఞానస్వ ♦ రూపులగుటఁ;
జెలు లవియు నేక ♦ చిత్తులగుటఁ; నందొ
కండు జీవుం డశ్వత్థ ♦ కర్మఫలము
భుజియించు; మఱొకఁడే ♦ భుక్తియు లేక ని
జానందతృప్తుఁడై ♦ జ్ఞానశక్తి

తే. నత్యధికుఁ డౌచు నాత్మ న ♦ న్యంబు నెఱిఁగి
నెగడు; విద్యామయుండౌట ♦ నిత్యముక్తుఁ
డై విరాజిల్లు; జీవుఁ డ ♦ నాద్యవిద్య
వలన నిత్యబద్ధుండగుఁ ♦ దెలియఁడేదియు. 8

వ. ఇట్లు జీవేశ్వరుల నెఱింగికొను, మింక జీవులందబద్ధముక్తభేద మునకిది రెండవ వైలక్షణ్యము. దానిం జెప్పెద ముక్తజీవుండగు విద్వాంసుండు సుప్తోత్థితుండుంబోలె దేహాగత సుఖదుఃఖాదుల నెనయండు. కాన నా జీవన్ముక్తుండు సంస్కారవశమున దేహస్థుండయ్యును దేహస్థుండు గానట్లె యుండు నని యెఱుంగుము. ఏతద్భిన్నంబుగా బద్ధజీవుండగు నవిద్వాంసుండుండును. ఇతండు స్వదేహాగతునివలె దేహనిమిత్తసుఖదుఃఖముల ననుభవించుచు దేహస్థుండ ననుకొని బద్ధుండగు. ఈ దేహమును స్వప్నదేహమువలె మిథ్యాభూతమన్న యెఱుక వీనికి లేదు.

తే. ఇంద్రియమ్ము లర్థముల గ్ర ♦ హించు నెడల
గుణములె గుణమ్ములం గయి ♦ కొనె ననంచు
ధీరవరుఁ డహంకార వి ♦ కారములను
బొందఁబోక తటస్థుఁడై ♦ పొదలుచుండు. 10

కం. తన తొల్లిటి కర్మంబుల, కనుగుణమగు తనువుఁబొంది ♦ యజ్ఞుఁడు గుణముల్
పొనరించు కర్మముల కెల్లను నేఁ గర్తననుచు న్మో ♦ లఁగ బంధమగున్. 11

వ. ఇట్లు బుధుండు ముక్తుండు దుఃఖశూన్యుండై నిరభిమానుండై దేహమున వర్తించును. తద్వ్యతిరేకముగా బద్ధుండు వర్తించును. ఇంద్రియములోనరుచు కర్మము నన్ను బంధించుచున్నదే! యని యెఱింగి విరక్తుండై విద్వాంసుండు శయనాసనాటన మజ్జన దర్శన స్పర్శన ఘ్రాణభోజన శ్రవణాదుల లగ్నచిత్తుండుగాక యటనట నింద్రియములు విషయముల భుజించుచున్నను దానికి సాక్షిభావము వహించి గగనము సర్వత్ర వ్యాపించినను రవి జలములం బ్రతిబింబించినను వాయు వెల్లెడలం బ్రసరించినను దత్సంగదోషముం గాంచని తెఱంగున మెలంగుచు నిశాతగాఢనైరాగ్యశస్త్రధారంబున సంశయములఁ జ్ఛేదించి దేహాదుల నివర్తించి నిస్సంగుండై విహరించు. 12

కం. ఎవనికి బుద్ధీంద్రియ చి, త్తవృత్తులు నైకగతులఁ ♦ దనరారవో? వాఁ
డవలంబించియు దేహముఁ, దవులక తద్దేహగుణవి ♦ తతి విహరించున్. 13

వ. దీనికి విపర్యయంబుగా బద్ధుండు విహరించు. ఉద్ధవా! బద్ధముక్తు లెట్లు మెలంగుదురో నుడివితి నివి యన్నియు స్వసంవేద్యవైలక్షణ్యంబులు, మఱియు వారేలక్షణంబులఁ దెలియంబడుదు రంటివి కాన నింక బరసంవేద్య వైలక్షణ్యము నుడివెద. 14

కం. తన దేహంబును ఘాతుక, జనములు హింసించుచున్న ♦ సత్పురుషులు ...
జన మొనరించుచు నున్న, న్మనమున నేవిక్రియ లేక ♦ మసలు బుధుండున్.

కం. ఒరులు తనకు బాగోగులు, గఱపిన నెఱపినను దాఁ ... ♦ గపక తెగడక తా
వ్వరికించుచు గుణదోష ని, కరముల్ సమదృష్టియగుచు ♦ గ్రాలు బుధుండున్.

కం. బాగోగు లసఁడు చేయఁడు, లోఁగూడఁ దలంపఁ డిట్టు ♦ లు జడుంబలె నే
దో గమకించుం గాలముఁ, బోఁగడపఁగ నాత్మని ... దనఘాత్మా!

వ. ఏతల్లక్షణంబులంబట్టి ముముక్షువుల నెఱుంగవచ్చు. 18

క. సుమతి! పరబ్రహ్మానుభ, వము గాంచనివాని వేద ♦ పఠనము వ్యర్థ
మ్మమితశ్రమాకరము క్షీ, రములొసఁగని బఱ్ఱ యనుల ♦ రక్షణపోలెన్. 19

ఉ. శీలము లేని యంగనను, ♦ క్షీరము లీయని గోవు, నిత్యదుః
ఖాలయమైన దేహమును ♦ నర్థావు టీవికిఁ గాని విత్తమున్,
గూళతనంబునోల్చెడి త ♦ నూజుని, నన్నుతిసేయకుండు వా
క్కేళిని, గాచు వానికిని ♦ గీల్కొను దుఃఖముమీఁద దుఃఖముల్. 20

మ. జగదుత్పత్తిలయస్థితుల్ సలుపు న ♦ స్మత్పూతకర్మంబులన్;
సుగమున్ నిర్మలధర్మకర్మనిరతుల్ ♦ శోకంబు దుర్మార్గు, లొం

దఁగ నేఁ దాల్చిన యీ వతారవృథుగా ♦ ధాలిలలక్; భ క్తి గు
ల్కఁగఁ గొండాడని మానవాథముల నా♦ ల్కల్ తాటిమొల్కల్ గదా. 21

శా. ఓ నారాయణ ! యో దయావితరణా ! ♦ యో భ క్తసంరక్షణా !
యో నీ రేజదళాక్ష ! యో నరహరీ ! ♦ యో కృష్ణ ! యంచీవిధిన్
నా నామామృతసార పానకలనా ♦ నందంబునం జెంద కే
లా సౌఖ్యం బలుకంగఁజెల్లునుర రస ♦ జ్ఞాభిఖ్యతో నుద్ధవా ! 22

వ. ఇట్లు ధీయుండు విచారించి యాత్మయందు నానాత్వభ్రాంతిని విసర్జించి సర్వ
గతుండనైన నాయందు నిర్మలమనంబు నిల్పి యుపరమించెడిని. అట్లు
సేయంజాలనివాఁడు సర్వకర్మముల నాకు సమర్పించి నిరపేక్షుండై
యుండునది. 23

చం. అనుపమ లోకపావన శు ♦ భాకర మత్కథ లాదరంబునన్
వినుచును బాడుచున్ హృదయ ♦ వీధిఁ దలంచుచుఁ గూర్మి పెంపుమై
ననుకరణాం బొనర్చుచు మ ♦ దర్థము సేయుచుఁ దత్త్రివర్గమున్
నను భజియించు వానికిఁ ద ♦ నర్చును సుస్థిరభ క్తి యుద్ధవా ! 24

ఆ. సాధుసంగ లబ్ధ ♦ సద్భ క్తి నన్నుపా, సించి మత్పదంబుఁ ♦ జెందఁగలఁడు
భ క్తపరుఁ డటంచుఁ ♦ బలుకంగ నుద్ధవుం,డంజలించి యిట్టు లనియె నవుడు 25

వ. దేవా ! నీ కిష్టుండైన సాధు వెట్టివాఁడు ? అట్టిసాధువు నినుం జేర నాద
రించు భ క్తి యెట్టిది ? 26

కం. పురుషాధ్యక్షా ! నీ వం,బురు మట్టు లనంగఁజను సు ♦ మూ; ప్రకృతికినిం
బరుఁడవయి స్వేచ్ఛనే యీ, పరిమితరూపంబుఁ గంటి ♦ వచ్చి ధరణికిన్. 27

వ. నన్ను నీ కృపాకటాక్షంబునఁ దేల్పు మన్న భగవంతుం డిట్లనియె. 28

♦— శ్రీకృష్ణుం డుద్ధవునకు సాధులక్షణము లెఱింగించుట ♦—

సీ. సత్యసారుఁడు కృపా ♦ శాలి తితిక్షువ
ద్రోహుండ డనసూయాది ♦ దోషరహితుఁ
డఖిలోపకారకుఁ ♦ డకళివాత్ముఁడు శుచి
సమ సుఖదుఃఖుండు ♦ శాంతుఁడు మన
నస్వభావుఁడు మితా♦న్నభుజుం డకామచి
త్తుండు దాంతుఁడు నిష్కి ♦ యుండు నిర్వి
కారుండు మైత్రుండు ♦ కారుణికుఁడు జ్ఞాని
మానప్రదుఁడు ధృతి ♦ మంతుఁ డప్ర

తే. మత్తుఁ డపరిగ్రహుఁడు దమాని ♦ మచ్ఛరణుఁడు
శోకమోహ జరామృతి ♦ క్షుత్పిపాస
లను జయించిన వాఁడు బో ♦ ధనసమర్థుఁ
డాత్మధర్మస్థిరుఁడు సాధు ♦ వనఁగఁబరఁగు. 29

తే. స్వీయధర్మముల్ సలుపుచేఁ ♦ జిత్తశుద్ధి
వరలు; సల్పఁడయేఁ బ్రత్య ♦ వాయ మడరు
ననుచు మత్ప్రోక్తి నెఱిఁగియు ♦ నఖిలధర్మ
సమితి విడిచి నన్ను భజించు ♦ సాధువరుఁడు. 30

తే. ఎవఁడనో? యెంతవాఁడనో? ♦ యెట్టివాఁడ
నో? యెఱిఁగియో! యెఱుఁగకో? య ♦ నూనభక్తిఁ
బెఱతలఁపు మాని నన్ను సే ♦ వించువాఁడు
సాధువరుఁ డని తెలియుమా ♦ స్వాంతమందు. 31

❊ భక్తిలక్షణములు ❊

వ. ఈ త్రింశల్లక్షణముల సాధువు నెఱుంగు మింక భక్తిలక్షణముల వినుము. మత్ప్రతిమాదులను భక్తులను సందర్శించుట, స్పృశించుట, పాదసంవాహనాది పరిచర్యల నలరించుట, పొగడుట, నమస్కరించుటయుఁ, దద్గుణకీర్తనంబుఁ గావించుటయు, మత్కథాశ్రవణంబున శ్రద్ధ కల్గియుండుటయు, నన్ను ధ్యానించుటయు, శరీరసమేతంబుగాఁ దన సర్వస్వము నాకర్పించుటయు, మజ్జన్మకర్మముల విన్పించుటయు, నస్మజ్జన్మాష్టమ్యాది పర్వముల నుత్సవంబులు సేయుటయు, గీతతాండవ వాద్యత్రగోష్ఠులచే మదాలయోత్సవంబు లొనర్చుటయుఁ, జాతుర్మాస్యైకాదశ్యాదుల యాత్రా బలివిధానంబు లాచరించుటయు, వైదిక తాంత్రికదీక్షలు గైకొనుటయు, మద్వ్రతము లనుష్ఠించుటయు, మామకార్చా విగ్రహస్థాపనముల శ్రద్ధాళువగుటయు, నాకై పుష్పప్రధానోద్యానంబులను ఫలప్రధానోపవనంబులను దేవాలయంబులను నెలకొల్పుటయుఁ, దత్తత్కార్యంబులం దోడ్పడుటయు, మద్గృహము నూడ్చుట జలము చల్లుట యలుకుట ముగ్గులు వెట్టుట మున్నగు నాలయశుశ్రూషణమ్ములం దాసునివలె నిష్కపటంబుగాఁ బొనర్చుటయు, దురహంకార దంభోక్తులు లేకుండుటయు, స్వోపకారకృత్యంబులఁ జాటకుంటయు నాదిగాఁ గలయవి భక్తిలక్షణములు. మఱియు, 32

కం. పరుసైనం దానైనన్, గరిమ న్నాకిడిన దీపి ♦ కాద్యుతి వింజా
మరగా ద్పుతగదునుమియే, పరులన్ దనకును వదోగ ♦ పఱుచుకొనుటయున్

క. ఎది తన కిష్టతమంబో?, యెది తనకుఁ బ్రియంబో? యయ్య ♦ దే నాకును నొ
ప్పిదముగ నర్పించినచో, నది యక్షయ్యఫలదాయి ♦ యగు నాతనికిన్. 34

తే. తరణి వహ్ని విప్రుఁడు గోవు ♦ దాసవరుఁడు
గగన మనిలమ్ము నీరమ్ము ♦ క్ష్మాతలమ్ము
ప్రాణికోటి నిజాత్మ యీ ♦ పదునొకొండు
నన్నుఁ బూజింపఁదగిన స్థానములు భద్ర! 35

వ. తత్తత్పూజాసాధనమ్ములు విను. 36

సీ. సూర్యునందును సౌర ♦ సూక్తమంత్రములచే, నగ్నియందును హవి ♦ రాదికముల
ద్విజవర్యునందు నా ♦ తిథ్యంబుచే గోవు,లందుఁ దృణాది వి ♦ హాపికముల
భక్తునియందును ♦ బంధుమర్యాదచే నమల హృన్నభమందు ♦ ధ్యాననిష్ఠ
ననిలంబునందు ము ♦ ఖ్యాసుభావనముచే, జలమందు గంధపు ♦ ష్పముఖములను

తే. స్థండిలావనియందు మం ♦ త్రహృదయములఁ,
గృత్స్నభూతమ్ములను సమ ♦ దృష్టిచేత
నాత్మయందవిరుద్ధ భో ♦ గాళి చేతఁ
నన్ను క్షేత్రజ్ఞు యజన మ్మొ ♦ నర్పవలయు. 37

సీ. గొప్పకన్నులవాఁడు ♦ కుండలీంద్రాభోగ, భోగాభచ్ఛాయఁ ♦ బొల్చువాఁడు
కప్పుదేహమువాఁడు ♦ కమ్రపీతాంబర, భ్రాజితాంగద్యుతుల్ ♦ గ్రాలువాఁడు
తెప్పవాలనివాఁడు ♦ శ్రీరమాకేళీకృ.తాయితోరస్థలి ♦ యలరువాఁడు
విశ్వరూపమువాఁడు ♦ విక్రమాటోపపిం,డీకృతోగ్రాసురుల్ ♦ నెగడువాఁడు

తే. ఒప్పుకూరిమివాఁడు ప ♦ యోజశంఖ
చక్రశార్ఙ్గబాహా చతు ♦ ష్టయమువాఁడు
శాంతమూర్తి యేతత్ప్రదే ♦ శముల నుండు
నంచు నన్ను ధ్యానింపఁగా ♦ నగును భక్తి. 38

క. ఇష్టాపూర్తంబుల సం
తుష్టిగ నన్నుఁ బూజసేయఁ ♦ దొడరుక హృదయా
భీష్టమగుభక్తి యీ యు
త్కృష్టాస్మత్స్మృతి లభించు ♦ వృద్ధులసేవన్. 39

ఆ. సాధుసంగమునను ♦ సమకూరు భక్తియో, గమ్మదిక్క సాధ ♦ నమ్మొకండు.
నన్నుఁ జేర లేద ♦ నాయనా! యేఁ బ్రకృష్టాశ్రయంబు సజ్జ ♦ నాళికెపుడు 40

ఆ. యదుకుమారవర్య! ♦ యధిక రహస్యవృ,త్తాంత మొండుగలద ♦ యాలకింపు
గోప్యమైన నది స ♦ ఖుండవు భృత్యుండ, వమలమతివి గాన ♦ దమి వచింతు. 41

వ. అని శ్రీకృష్ణుండు సాదరంబునఁ బలికెనని శుకమహర్షి వచించెను. 42

ఇది యేకాదశాధ్యాయము

సమాప్తము

---

## ద్వాదశాధ్యాయము

కం. మఱపు నయితమ్ము మాకొక, వరమే పెక్కు-వగవులను ♦ బాయుదుమగుట
న్నరులకు నీయిచ్చినయవి, యరయఁగ వ్యర్థమ్ములగునె! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అట్లు శ్రీకృష్ణుం డుద్ధవునకు రహస్యము నుడువంబూని యిట్లనె. 2

— శ్రీకృష్ణుం డుద్ధవునకు సాధుసంగమహిమము నుడువుట —

మ. యమమున్ యోగము సాంఖ్యమున్ దవము స్వా♦ధ్యాయంబు ధర్మంబు య
జ్ఞము సన్న్యాసము తీర్థము న్నియమము ♦ ష్టాపూర్తముల్ గుహ్యమం
త్రములున్ దక్షిణలున్ వ్రతంబులు ననున్ ♦ బంధింప లే వన్యసం
గ మలాపఘ్న వికాసి సాధుజన సం ♦ గంబుం బలెన్ యాదవా! 3

మ. తరుణుల్ వైశ్యులు శూద్రు లంత్యజులు గం ♦ ధర్వాప్సరోనాగ కి
న్నర విద్యాధర సిద్ధ చారణ సుధాం ♦ ధర్క్షేణు లింద్రద్విషే
శ్వరులున్ బక్షులు సత్వముల్ సను మహా ♦ భక్తి న్మదిం గొల్చి చెం
దిరి యాయా యుగకాలమం దురుశుభా ♦ నీకం బశోకంబుగన్. 4

మ. హనుమంతుండు జటాయువుం గజముఁ బ్ర ♦ హ్లాదుండు మార్తండనం
దనుఁడున్ వృత్రుఁడు జాంబవంతుఁడుఁ దులా ♦ ధారుండు బ్రహ్లాదున
న్మనుమండున్ వృషపర్వుఁడున్ మయుఁడు ధ ♦ ర్మవ్యాధుఁడుం గైకసీ
తనయుం డుగ్రుఁడు బాణుఁడుం గసిరి స ♦ త్సంగంబునన్ భద్రముల్. 5

కం వ్రజగోపికలుం గుబ్జయు, యజమానాంగనలుఁ దవము♦నతులవ్రత మా
ఱజపుఁజదువుఁ గనకయు న, ద్భజనమున నె గాదె నన్నుఁ ♦ బడసిరి వత్సా!

కం. మద్దులుమృగములుపాములు, నెద్దులు మొదలైన మూఢ♦హృదయగణమ్మో
యద్దియ విద్దియ బుద్ధియు, నుద్ధవిడిం గనక నన్ను ♦ నొందె నెఱుఁగవే! 7

వ. మద్భక్తయోగంబుగాని భక్తభక్తయోగంబుగాని కలిగినం జాలుఁ దవ స్వాధ్యాయ బ్రహ్మచర్యాదులకు దుర్లభంబైన మత్పదం బేస్థావరజంగమంబులైన ననాయాసంబునం బొందు. 8

---

1. అధ్యాయప్రారంభము 2-6-1946

ఉ. కాందినిపట్టి వచ్చి కడఁ • క న్మధురాపురి కన్నతోడ న
న్నుం దొడికొంచుఁ బోవఁగ మ • నోభవ గాఢతరానురాగ మె
ట్లుం దిగఁద్రోవ నేరక వ • ట్టుప్రబలాధివియోగబాధలం
గుందుచు నన్నుఁగా కొరుని • గోరర సౌఖ్యముకై వ్రజాంగనల్. 9

ఉ॥ బృందఁ గళిందజా పులిన • వీధుల హృత్ప్రియుఁ డంచు గోపికా
బృందము నన్నుఁగూడి విహ • రించి క్షణంబులుఁబోలెఁ బుచ్చి రా
నందనుతోడ రేల; నఘ • నాతపకాలమునందు నేను లే
మిఁ దిగులొంది పుచ్చెద ర • మేయయుగంబులుఁబోలె యామినుల్. 10

చం. మునులు సమాధినిష్ఠులయి • పుణ్యనదుల్ జలరాశి చేరియుం
గనఁ దమనామరూపములఁ • గానని యట్టులు గోపకామినీ
జన మతిగాఢరాగమున • స్వాంతము నాపయి నిల్పి సంతతిం
దనువును నద్ది యిద్ది యని • తాము నెఱుంగకయుందు రుద్ధవా! 11

కం. నాభావం బెఱుఁగక నను, జారుఁడు రమణుఁ డని తలఁచి•స్వాంతము నాపైఁ
జేర్చి సంగమ్మున యను,వీర! పరబ్రహ్మము, నను•బెరసిరి వ్రేతల్! 12

కం. అనఘ! శ్రుతము శ్రోతవ్యం,బు నివృత్తంబుం బ్రవృత్తి•ము త్రయీహిత మె
ల్లను వీడి శరణమొందుము, నను నీ వఖిలాత్మభావ•నన్ శుభ మొదవున్.

— • కర్మత్యాగవ్యవస్థ • —

కం. అన నుద్ధవుం డిట్లనియె. యోగేశ్వరేశ్వరా! ఇప్పుడు కర్మముల నుజ్జగింపు మంటివి [1]ఇంతకుమున్నె కర్మముల నాచరింపుమంటివి. నేనిప్పు డేమి చేయవలయును? కర్మముల మానుదునా? చేయుదునా! యీ సంశయముఁబాపు మన్న భగవానుం డిట్లనియె. ఈశ్వరుండు స్వమాయా వశంబునఁ బ్రపంచస్వరూపుఁడై యున్నాఁడు. తత్ప్రపంచాధ్యాస వహించి జీవుండనాద్యవిద్యచేఁ గర్తృత్వాదికముఁ బైని వేసికొన్నాఁడు. అందువలన విధినిషేధంబులఁ బాటించి కర్మముల ననుష్ఠింపవలసివచ్చినది. కనుక నింతకు మున్ను చిత్తశుద్ధ్యర్థము కర్మములు సలుపుమంటిని. చిత్తశుద్ధ్యనంతరము భక్తివిక్షేపకంబగు కర్మాచరణముఁ ద్యజించి దృఢవిశ్వాసంబున నన్ను శరణ మొందవలయు నని యిపుడు నుడివితిని. జ్ఞానోత్పత్త్యనంతరము కర్తవ్య మించుకయు నుండదు. ఉద్ధవా! పిదప విను, మీశ్వరునివలన వాగాదీంద్రియద్వారమున జీవసంసృతికారణభూతంబైన ప్రపంచ మెట్లుద్గమించెనో వచింతు. 14

1 దశమాధ్యాయము 3 వ పద్యము.

## వాగాద్యభివ్యక్తిక్రమము

సీ. అగ్ని కాష్ఠచ్ఛిద్ర ♦ మందు నవ్యక్తోష్మ, రూపుఁడై పిదప వా ♦ యువు మథింప
గాలితోడను స్ఫులింగస్వరూపుఁడయి ప్రజాతుఁడై హవిరాది ♦ సంప్రవృద్ధుఁ
డౌ; నట్టులీశ్వరుం ♦ డాదిఁ బరాభిఖ్య, నాదంబుతోడ ప్రా ♦ ణమ్ముఁ గూడి
యాధారచక్రరం ♦ ధ్రావిష్టుఁడై యంత మణిపూరకమున నా ♦ మయుఁడగుచును

గీ. తోచ్చి పశ్యంతి పేర వి♦శుద్ధచక్ర మవ్వలం జొరఁబడి మధ్య♦మాహ్వయమునఁ
దనరి వైఖరిరూపున ♦ స్థూలత గని, వెడలు నోట వర్ణాకృతి ♦ వివిధగతుల. 15

వ. స్థవిష్ఠంబైన [1] యీ వర్ణంబె నానా వేదశాఖాత్మకం బగుచున్నది. ఇది
మదీయ వాగభివ్యక్తి ప్రకారంబు ఇతరంబు నిట్లు. 16

సీ. వాగ్వచనంబులఁ ♦ బాణికర్మము లుప
స్థము దాలఁ బాయువి ♦ సర్గములును
బద్గమనములఁ ద్వ ♦ క్స్పర్శముల్, నాసికా
ఘ్రాణముల్, నేత్రవీ ♦ క్షలును శ్రుతుల
శ్రవణముల్, జిహ్వర ♦ సాల్, మనస్సంకల్ప
ములు బుద్ధినిశ్చయం ♦ బులును జిత్త
ధారణంబులు నహం ♦ కారాభిమాన గు
ణములు ప్రధానసూ ♦ త్రములు పాటిఁ

ఆ. త్రిగుణజన్యమైన ♦ దేహాది బహువికా, రౌఘమెల్ల నాదు ♦ వ్యక్తియ సుమి
యేను గాని యట్టి ♦ దింతయు లేదయ్య! దేవభాగపుత్ర! ధీరమిత్ర! 17

వ. అని శ్రీకృష్ణుఁడు మఱియు నిట్లనియె. 18

తే. ఆది నీశ్వరుం డొకఁడ య♦వ్యక్తరూపుఁ
డవఁ ద్రిగుణాళిఁ బూని మాయాబలమున
వివిధరూపాల జగముగా ♦ వెలుఁగు బీజ
మవనిఁబడి పూలఁ బండ్ల ప్రూకైనయట్లు. 19

వ. మఱియు నీజీవుండ త్రివృత్తు నబ్జయోనియు నవ్యక్తుండు నద్వితీయుండు
వయస్సుచే నాద్యుండు విశ్లిష్టశక్తియునై బీజంబు యోనిం బొంది
యెట్లో యట్లు బహురూపములఁ బ్రకాశించుచున్నాఁడు. ఉద్ధవా!
తెలియలేదా? విను. 20

1 కౌస్తుభమునఁ జతుర్థాహ్నికమున — అ ఇ ఉ ఋ నాలుగు హ్రస్వదీర్ఘప్లుతభేదమున 12 అగును. ఌ ఒక్కటియే. ఏ ఐ ఓ ఔ దీర్ఘప్లుతభేదమున 8 అగు. ఇట్లు స్వరములు 21. కాదిస్పర్శములు 25. అంతస్థోష్మములు 8. యమములు 4. అనుస్వారవిసర్గము. జిహ్వామూలీయోపధ్మానీయములు 4. అని "ముఖనాసికా" .... సూత్రముకడఁ గలదు. ఈ పరిగణనమున మతభేదములు గలవు.

తే. పేక పడుగుచేత ♦ విలసిల్లు వస్త్రము, ట్లయ్యవిద్యచేత ♦ నాత్మయందు
వ్యష్టియు సమష్టి ♦ యగు విశ్వ మధ్యస్త, మగుచునుండు జూ మ్మా ♦ నాదినుండి.

సీ. సంసృతితరువు, బీ ♦ జమ్ములు పుణ్యపా, పములు ప్రేళు లమిత ♦ వాసనాళి
నాళమ్ములం ద్రిగు ♦ ణమ్ములు శాఖ లే, కాదశేంద్రియములు ♦ స్కంధములును
బంచమహాభూత ♦ పాళి వల్కలములు, వాతపిత్తశ్లేష్మ ♦ ధాతువ క్తి
జీవు డీశ్వరుడు ప ♦ క్షి యుగంబు, వీనికి, వసియించు గూడు హృ ♦ ద్వారిజంబు

తే. విటులు శబ్దరూపాదిక ♦ విషయసమితి
ఫలములు సుఖదుఃఖమ్ములు ♦ వసనివాపి
హంసలకిసుఖ ఫలము గృ ♦ హస్థగృధ్ర
ములును దుఃఖఫలమ్మ నీ ♦ మ్ములు భుజింత్రు. 22

కం. ఘనకర్మాత్మకము పురా, తనమగు సంసారనామ ♦ తరు వారవి ప్రో
దిని గాంచి యందు రవిఛే, దనమునc బైకేగువారిc ♦ దవు వే మెనయుణా! 23

వ. ఉద్ధవా! ఇట్లు పరమాత్మ యొకండే మాయామయుండై బహురూపములం దోcచు నని యెఱింగినవాcడే యాత్మవేత్త.

ఉ. శ్రీనిధియైన సద్గురు న ♦ తిస్థిరభక్తిని గొల్చి తత్కృపా
త్తానుపమాన విద్యయను ♦ ప్రాప్తవరశ్వథ తీక్ష్ణధారచేc
బూనికc ద్రుంచి జీవగృహ ♦ ముం ద్రిగుణాత్మకలింగదేహ; మా
పైనc బరాత్పరుం గలిసి ♦ పాయుము సాధనముణా యడూద్వహా! 25

వ. అన నుద్ధవుండు నిమీలితాక్షుండై హరిధ్యాన మొనరించెనని శుకమహర్షి వచించెను.

ఇది ద్వాదశాధ్యాయము సమాప్తము

---

## త్ర యో ద శా ధ్యా య ము

కం. శ్రీవాఙ్మనసార్చాకేళీ వైశారద్య యోగ ♦ లీన పరీవ్రా
డ్భావాంతస్సాక్షాత్కా, రావేశాత్మస్వరూప ! హరిహరనాథా !

వ. [1] దేవా! యవధరింపుము శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అంత హర్షవిస్ఫారిత నయనుండైన యుద్ధవునిం జూచి కృష్ణుం డిట్లనియె. 2

1. అధ్యాయప్రారంభము 10-6-1946

—*శ్రీకృష్ణుం డుద్ధవునికి జ్ఞానోదయక్రమ మెఱింగించుట*—

కం. ప్రకృతికె యీ త్రిగుణములా
త్మకు నుండవు సత్వమునను ♦ దమము రజమ్ము
న్బెకలించి, పై నసకలమా
త్మక సత్వమ్మునను త్రుంపు ♦ తత్సత్వమునన్. 3

ఆ. శుద్ధసత్వమునఁ బ్రసిద్ధ మద్భక్తిరూ,ప మగు ధర్మ మొకటఁ ♦ బ్రభవ మొందు
నగును సాత్వికవుఁ బ ♦ దార్థసేవలను స,త్వప్రవృద్ధి [2]దాన ♦ ధర్మవృద్ధి. 4

ఆ. భవ్యసత్వజన్య ♦ భక్తి లక్షణ ధర్మ, మా రజస్తమోగు♦ణాళిఁ ద్రుంచుఁ
దద్యుగము నశింపఁ ♦ దన్మూలమగు నధ,ర్మమ్ము తత్క్షణంబు ♦ మాడిపోవు. 5

కం. అనుపమ శాస్త్రముఁ తీర్థ
మ్మును సంస్కృతి దేశకాల♦ములుఁ బ్రజ కర్మ
మ్మును ధ్యాన జనన మంత్రము
లనుపదియు గుణత్రయమున ♦ కగుఁ గారణముల్. 6

కం. ఎది పెద్దలు నిందింతురొ!, యది తామస, మేది మెత్తు ♦ రది సాత్విక మిం
మెయ్యదియుం జేయ కుపేక్షిం,చెద రది రాజస మటంచుఁ ♦ జెప్పఁగనొప్పున్. 7

సీ. సతము నివృత్తిశా♦స్త్రములఁ బఠించుచు, గంగాదితీర్థముల్ ♦ గాంచఁ జనుచు
నాత్మసంశోధకం♦ బగుచు వివిక్తదే,శములఁ బ్రాహ్మముహూర్త♦సమయములను
నీశు భక్తిని భజి♦యించుచు సద్భక్త, జనులనే కూడుచు ♦ ననవరతము
నిష్కామకర్మముల్ ♦ నెఱపుచుఁ బ్రణవాది, సంసేవ సేయుచు ♦ సాత్వికములఁ

తే. గొనవలయు సత్వవృద్ధి కం ♦ దున నె ధర్మ
మొదవుఁ దద్ధర్మమున జ్ఞాన ♦ ముదయమందు
నదియు దేహద్వయము వాని ♦ కాకరమగు
గుణచయము నశించెడి వఱ ♦ కు న్వెలుంగు. 8

వ. అదియనుమీ యాత్మాపరోక్షజ్ఞానము. 9

తే. వేణుసంఘర్షమున నుద్భ ♦ విల్లి వహ్ని
యువ్వనము నె మంటఁ గాల్చి ♦ యాఱిపోవు
నట్టు లీగుణక్షోభజం ♦ బైన తనువె
త్రిగుణతతి విద్యచేఁ గాల్చి ♦ తీఱిపోవు. 10

వ. అనిన నుద్ధవుండు స్వామీ!, శుని మొఱుఁగుచున్నను గర్దభి తన్నుచున్నను శ్వానఖరంబులు వెంటంబడునట్లు యథార్థము తన్నంగొంపోవుచున్నను

2. దాన = దానిచేత

ఛాగము ఛాగివెంటంబడునట్లు లీమర్త్యులు విషయము లాపదలకు నెలవు
లని యెఱింగియు నేల వానినే తగులుచున్నా రనిన భగవంతుం డిట్లనియె.

సీ. అజ్ఞానునకు స్వదే ♦ హమ్మునై నహమాత్మ
కమగు మిథ్యాబుద్ధి ♦ కలుగు నెడఁద
దానిచే సత్త్వప్ర ♦ ధానమైన మనంబు
నలము దుఃఖాకరం ♦ బైన రజము
ఆశ్రయితమనం ♦ బందుసంకల్పవి
కల్పముల్ వొడమున ♦ కృతన భోగ్య
గుణములఁ దలఁపంగఁ ♦ గోఱలును గామంబు
దుర్ధరంబగుచు నా ♦ దుర్మతికిని

తే. ఇట్లు కామవశుండయి ♦ యింద్రియముల
గెలువలేక దుఃఖోదర్క ♦ ముల నెఱిఁగియు
నారజోవేగ మోహితుం ♦ డగుటఁ జూవె
కర్మములఁ జేయుచుండు నె ♦ క్కాలమందు. 12

ఆ. బుద్ధి నీ రజస్త ♦ మోగుణంబు లలంచు, చుండఁగాక తెలివి ♦ యున్న క్షేమఁ
డలుపు లేక మనము ♦ నరికట్టి గట్టిగాఁ, బాదుత్రోవ వంకఁ ♦ బాఱకుండు. 13

కం. అలసత్వప్రమత్తతం బోఁ, దలఁగి, విషయములను దోష ♦ తతిఁగనుచుఁ, శ్వా
సల గెల్చి జితాసనుఁడై, యెలమిన్నాయందె హృదయ ♦ మెలయింపవలెన్.

వ. హృదయము నన్నింటినుండి మరల్చి నాయందే చేర్చియుండు నీసమాధిని
బూర్వము సనకాదిశిష్యుల కుపదేశించితి ననన నుద్ధవుండు విస్మితాంతః
కరణుండై దేవా! సనకాదిమహామునీంద్రుల కేరూపంబున నెట్లుపదేశించి
తివో యది యానతీఁ గోరుచున్నాఁడ ననఁ గృష్ణుం డిట్లనియె. 15

— హంససనకాది సంవాదము —

కం. సనకాదు లజునిమానస, తనయులు పూర్వమొకనాఁడు ♦ తండ్రినడిగి రొ
య్యన దుర్జ్ఞేయంబై యొప్పిన యోగశ్రేష్ఠగతి న ♦ వినయము దోఁపన్. 16

కం. తాతా! రాగవశంబునఁ, జేతము విషయములఁ జొచ్చుఁ, ♦ జేతము విషయ
వ్రాతములు వాసనాకృతి, చేతం జొచ్చునిఁక వీని ♦ నెక్కుమె దాఁటన్. 17

వ. అనిన ముముక్షువు దాఁటందలంచిన నెట్లన నా మహాదేవుండు స్వయం
భువు భూతస్రష్ట యయ్యును గర్మవిక్షిప్తచిత్తుండగుట నెంత విచారిం
చియుఁ బ్రశ్నబీజంబు నెఱుంగనేరక న న్నడంద నిలిపి

## నాగబంధము

చం. సరసిజనాభ ఘోరఖలసాలవరశ్వధ శ్రీరమామనో
హర సుగుణావళీరత దయాదర వజ్రిభవైరిదారణా
కరిధరణాతిధీర ఘనగానరవప్రవణా జనావనా
వరమకళాధరా రిపుజభంజన మన్నతి నొందుదేవరా! 19

ఉ. నవ్వుమొగంబువాఁడు కరుణ స్వగచల్లెడి చూపువాఁడు హా
స్యమ్మవ్వపు పల్కువాఁడు వన ♦ మాల విరాజిలు బొజ్జవాఁడు పెం
జివ్వలగెల్చువాఁ డెడ భ ♦ జించెడివారికిఁ బున్నెపుఁగనుల్
ద్రవ్వియొసంగువాఁడు హరి ♦ తత్త్వము మాకు ననుగ్రహించుతన్. 20

శ్లో. నమో హంసాయ శాంతాయ, మునీనాం మానసౌకసే।
చక్రాంగాయ ద్విజేశాయ, పరిశుద్ధాత్మనే నమః॥ 21

వ. అని పెక్కు తెఱంగుల ధ్యానింప నేను హంసరూపమ్మున డాయ సనకాది
మునీంద్రులు బ్రహ్మపురస్సరులై హస్తమ్ములు జోడించి 22

చం. ఎవఁడవు నీవు స్వామి! కడు ♦ నింపగు తెల్లనిమేను పాదచం
చువు లతిలోహితంబులు వి ♦ శుద్ధకటాక్షము మందయానముం
జవు లొలికించు నాదము ప్ర ♦ సన్నముఖం బెవో మాటలాడను
న్నవిధము తోఁచె నిన్నుఁగని ♦ నస్మయుఁగావఁగ వచ్చితోఁగదే! 23

ఉ. నెమ్మది సంస్మరింపఁగ న ♦ నీ వరుదెంచితి కన్నతండ్రి! వే
కొమ్ము నమస్కృతుల్ వినయ ♦ కోటి నదర్ విభజించి క్షీరనీ
రమ్ములువోలెఁ జూపుటకుఁ ♦ గ్రన్నన వచ్చితొ రాజహంసరూ
పమ్మున నీ ప్రభావములు ♦ వర్ణన సేయఁగ నేరమచ్యుతా! 24

వ. నాపుడు నేను ధాతృసనకాదులంజూచి దేహాది వివిక్తాత్మజ్ఞానంబుకల్గినచో
మనోరాగాదులు తమంతతామ విశ్లేషించు నని చెప్పుటకు మున్నుగా
"నెవడవునీ"వన్న ప్రశ్నఖండనమిషచే నాత్మానాత్మజ్ఞానంబుఁ గఱపం
దలంచి యిట్లంటి. 25

కం. అవనీసురవరులారా!, ఎవఁడవునీవం చడిగితి ♦ రీప్రశ్నం బా
త్మవిషయకంబో? మఱి దే,హవిషయకంబో? యెదేని ♦ యుబ్బర మొదవున్.

తే. ఆత్మవిషయకమనఁబర ♦ మార్థమందుఁ
బెక్కురున్నఁగదా భవ ♦ త్పృచ్ఛ యుక్త
మగుగునాతఁ డుత్తరమిచ్చు ♦ నాతఁ డొకఁడ
నిర్విశేషాత్మఁగూర్చి ప్ర ♦ శ్నించుటెట్లు?

వ. జాతిద్రవ్యలింగాదిరహితుండై యవిశేషుండై యొక్కండ యున్న యాత్మను నీవెవండవని యడుగుటకు యవసరము లేదు. పోనీ! తనుపాధిభూత సంఘాత విషయం బందమా! అదియువాక్యమునకరంబ 28

తే. దేవమానవాది సకల ♦ దేహములును
బంచభూతాత్మకంబులె ♦ వరముకార
ణమ్ము వీని కేనొకండఁ గా ♦ న నిటు భేద
శూన్యదేహంబు నెవండవం ♦ చు నడుగుదురె ?

కం మనమునను వాక్కునను దృష్టిని నితరేంద్రియచయంబు♦చేతగ్రహింతుం
డనునేన, నేను గాకుం, డిన దెదిలేదని గ్రహింపుఁ♦డీ బుధులారా! 30

వ ఇంక మీకుఁ గలిగిన సందియంబు నడంచెదను. 31



ఎ గుణములం జిత్తమ్ము ♦ గుణములు చిత్తాబ్జ
మునఁ జేరు; నీయుగ ♦ మ్ము స్వదాత్ముఁ
డైన జీవునకు న ♦ ధ్యస్తమైన శరీర
మేకాని నిజదేహ ♦ మిద్ది గాదు
సారెసారెకు గుణ ♦ చయము సేవించుట
వలనఁ జిత్తము గుణం ♦ బులను జొచ్చు
వాసనారూపమ్ము ♦ వలనను విషయవ
ర్గము చిత్తమందును ♦ బ్రభవమొందుఁ

ఆ. గానఁ జిత్తవిషయ ♦ గణమును మంచునా
విరియఁజేయఁ దలఁపు ♦ వఱలువాఁడు
కోటిసూర్యరుచులఁ ♦ గోటరంబును బెట్టు
మత్స్వరూపుఁ డగుచు ♦ మలయువలయు. 32

సీ. సత్త్వరజస్తమో ♦ జన్యముల్ జాగర,స్వప్నసుషుప్తులై ♦ వఱలు; బుద్ధి
వృత్తులియ్యవి; వీని♦కె త్తఱిని విలక్షణుండుసాక్షియయి యా♦త్ముండెసంగు
బుద్ధికృతంబైన ♦ పురుబంధ మాత్మునకుం గుణవృత్తులఁ ♦ గూర్చుచుండు
నగుటఁ దురీయుండ♦నగునన్నుఁజొచ్చి యీ,బంధంబువ్రక్కలిం♦పవలెనపుడ

తే. మఱియు గుణము లన్యోన్యముఁ ♦ బ్రిదిలిపోవుఁ
దద్జ్ఞుఁ డయ్యహంకార కృ ♦ తంబు బంధ
మాత్మకు ననర్థకరమని ♦ యరసి తుర్యుఁ
గలిసి యభిమాన భోగచిం ♦ తలఁ ద్యజించు. 33

వ. సురనరతిర్యగాది నానార్థబుద్ధిని సముచితయుక్తులచే నెంతదనుకఁ దొలఁ గించుకొనఁడో యంతదనుక నీయజ్ఞుఁడు కర్మము లొనర్చుచు జాగ్ర

ద్దశలో నున్నను స్వప్నదశలో నున్నట్లే. స్వప్నావస్థలో మేల్కొన్నవానికిని నానార్థబుద్ధితో జాగ్రదవస్థలో నున్నవానికిని నింతయు భేదము లేదని యెఱుంగుము. బాల్యత్వ బ్రాహ్మణత్వ మనుష్యత్వాది దేహాశ్రిత భేదంబులు తత్కృతకర్మంబులు తత్ఫలంబులగు స్వర్గసౌఖ్యాదులు నన్నియు స్వప్నంబునం దోఁచువానివలె మిథ్యలే కాని యథార్థంబులు కావు. ఇవి యెవ్వియు నాత్మకు లేవు. క్షణక్షణముం బరిణామము నొందుచుండు బాల్య తారుణ్యాది ధర్మవంతములైన బాహిరంబులగు స్థూలదేహార్థములను జక్షురాదీంద్రియంబులచే జాగ్రద్దశయం దనుభవించువాఁడును, జాగరదృష్టసదృశంబులై వాసనామయంబులగు విషయంబులను హృదయమందు స్వప్నదశలో ననుభవించువాఁడును, నేతత్స్థూలసూక్ష్మార్థంబుల సుషుప్తిదశలో నుపసంహరించువాఁడును, నొక్కండె కాని భిన్నులం గారు. ఒక్కండే జాగ్రత్స్వప్న సుషుప్తులలో నుపాధిభేదంబున విశ్వ తైజస ప్రాజ్ఞ నామములం ధరించి యింద్రియేశుండై సర్వావస్థాద్రష్టయై ప్రత్యగాత్మ యున్నాఁ డని సర్వావస్థాస్మృతిసమన్వయంబున నెఱుంగునది. బాల్య యౌవన వార్థకదశలలో నొనర్చినచేష్ట లొక్కండగుటంగాదె దశాంతరంబునను స్మృతిందగిలెడిని. 34

ఉ. ఇట్టులు చర్చచేసి దశ ♦ లెల్లను నాయెడ నా యవిద్యచేఁ
బుట్టినవం చెఱింగి యహ ♦ ముం బహుసంశయమూఁకము న్విడం
గొట్టి సదుక్తిఖడ్గమును ♦ గొంచు ననూనవివేకధారచేఁ;
నెట్టనఁ గొల్వఁగావలయు ♦ నిర్మలమానససంస్థితు న్ననున్. 35

కం. కొఱవింగొని చీఁకటిలో, బిఱబిఱఁ ద్రిప్పంగఁ దోఁచు ♦ వెలుఁగుంగల్లీ
పరిదృశ్యమాన జగ మె,త్తెఱి భ్రమమూలకము కల్పి ♦ తం బెద చేతన్. 36

చం. ఎడఁదను గోర్కులం దుడిచి ♦ దృశ్యమునుండి స్వదృష్టిఁ ద్రిప్పి యె
య్యెడలఁ గ్రియావళిన్ సలుప ♦ కెంతయు నాత్మసుఖానుభూతి నం
దెడునది దేహధారణ ఘ ♦ టింపఁగ భ్రాంతి యొకప్డు కల్గినన్
బొడవడఁగున్ క్షణంబున నె ♦ పూర్వ మవస్తుత వుట్టియుండుటన్. 37

కం. అంతియ కాని పునర్దే,హాంతరలబ్ధికిని హేతు ♦ వై యుండదు త
ద్భ్రాంతి; యది వానికి శరీ,రాంతము దాఁక స్మృతిమాత్ర ♦ మై యట్లుండున్.

ఉ. ఈవిధి యోగసిద్ధవరుఁ ♦ డీతను వుత్థితమో? యనుత్థితం
బో? వచియింపలేఁ డవుడు ♦ పుక్కిటిబంటిగ మద్యపాయియై
పోవునరుండు మేనిపయిఁ ♦ బొల్చెనొ? వస్త్రము జాఱిపోయెనో?
దైవవశంబున న్మదిని ♦ దా నెఱుఁగండుగదే బుధాగ్రణుల్

శా. ప్రారబ్ధంబగు కర్మ ముండువఱకున్ ♦ బ్రాణేంద్రియోపేతమై
మీఱుం దైవవశంబు గాఁగదను ; వే ♦ మేల్ దీని స్వాప్నంబుగాఁ
బాఱంజూచుఁ బ్రబుద్ధవస్తువయి; యె ♦ వ్వట్లన్ సమాధ్యంతయో
గారూఢుండగు సిద్ధపుంగవుఁడు నె ♦ య్యంబుంచునే మేనిపై! 40

మ. పరమార్థంబగు ధర్మసారము వచిం ♦ పం జూప్వే యియ్యోగ సాం
ఖ్య రహస్యంబులు మీకుఁ జెప్పితిని నే ♦ హంబునే? యోగసాం
ఖ్య ఋతశ్రీదమ సత్యకీర్తి వృథు తే ♦ జోనన్యుఁడన్, దివ్య భూ
సురులారా! శితరక్షణవ్రతవిలా ♦ సుండన్ దయోల్లాసుఁడన్. 41

కం. నను నిర్గుణు నిరపేక్షకు
ననుపముఁ బ్రియు సుహృదు నాత్మ ♦ నఖిలగుణంబుల్
సనుదెంచి యెలమి సేవిం
చును, నిత్యము లగుటనవి యు ♦ శోధనులారా!

వ. అని చెప్పి శ్రీకృష్ణుం డుద్ధవుం జూచి 43

తే. ఇట్లు హంసాంగమున వచి ♦ యింప నేను
ఛిన్నసందేహులై ముని ♦ శ్రేష్ఠు లెల్లఁ
బరమభక్తిఁ బూజించి స్త ♦ వంబు సలుప
నజుఁడు గనుచుండ నిజపురి ♦ కరిగినాఁడ. 44

వ. అని శ్రీకృష్ణుం డానతిచ్చె నని శుకమహర్షి వచించెను.

ఇది త్రయోదశాధ్యాయము సమాప్తము.

---

## చతుర్దశాధ్యాయము

కం. ఏకడఁగల పదమునకో, ప్రాకించి వను వ్రచింపఁ ♦ బంచెను కాదే
నాకవిత నాకె శ్రోత్రగ, నై కానంబడు నె యవల? ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో
నిట్లనియె. అట్లు శ్రీకృష్ణుండు బోధింప నుద్ధవుండు నమస్కరించి
యిట్లనియె. 2

ఉ॥ శ్రేయముఁ గూర్చు సాధనవి ♦ శేషము లెన్నియొ యున్నవంచు వి
ద్యాయుతులైన బ్రహ్మవిదు ♦ లాడెద రేటికి? సర్వసంగముల్

1. ఈ యధ్యాయప్రారంభము 13-6-1946

పాయుచు నావయి స్మదిని ♦ బట్టు మటంచును భక్తియోగ మీ
వే యెడఁబల్కుచుండు విధి ♦ యేటికిఁ వీఁకఁ బ్రధాన మెద్దియో? 3

వ. అనిన శ్రీకృష్ణుం డిట్లనియె.

—♦ శ్రీకృష్ణుఁ డుద్ధవునకు శాస్త్రవైవిధ్యముం గూర్చి చెప్పుట ♦—

చం. ప్రలయమున న్మదాత్మకము ♦ ప్రాఁజనువు ల్నశియింప వెండియుక్
జలరుహసూతికి న్నుడిపి ♦ నాఁడతఁ సర్గము నాదియం దతం
డలఘుమనంబున న్మనువు ♦ నగ్రసుతుం జదివించె నాతఁ డి
మ్ముల భృగుముఖ్య సప్తఋషి ♦ పుంగవపాళికిఁ జెప్పె నాత్రయుక్ 5

వ. భృగుమరీచ్యత్ర్యంగిరః పులస్త్యపులహక్రతునామకులగు నా సప్తమహర్షులు తమ నందనులైన దేవదానవగుహ్యక మనుష్యసిద్ధగంధర్వ విద్యాధర చారణకిందేవ కిన్నర నాగరక్షః కింపురుషాదులఁ బెక్కండ్ర నా వేదముల నధ్యయనము చేయించిరి

ఉ. ఇట్టు లనేక లీలయి గ్ర ♦ హించిరి సత్త్వరజస్తమంబులం
బట్టె స్వభావముల్ వివిధ ♦ భంగులు దాన మతంబు లెన్నియేఁ
బుట్టును దానివెంటఁ బొడ ♦ ముం బహురీతుల వ్యాఖ్యలర్థముల్
కట్టకడం జనించె నన ♦ ఘా! నిగమార్థవిరుద్ధపద్ధతుల్. 7

ఆ. దీనివలన నన్ను ♦ దీయ మాయామోహి
తాత్ములగుచుఁ గొంద ♦ ఱభిరుచికిని
గర్మమునకుఁ దగిన ♦ గతిని శ్రేయంబది
బహువిధం బటంచుఁ ♦ బలుకుచుంద్రు. 8

సీ. గౌతమీయులు ధర్మ ♦ కర్మంబు, వాత్స్యాయ
నాదులు కామంబు, ♦ నర్థశాస్త్ర
వేత్త లైశ్వర్యంబు, ♦ విమలయశంబు నా
లంకారికులు, భోగ ♦ లాలసతను
సర్వలింగులు, సత్య ♦ శమదమంబుల యోగ
నిష్ఠులు, కొందఱు ♦ నియమదాన
వ్రత తపముల్ ♦ సుఖము లిచ్చెడి పురు
షార్థంబులని యందు; ♦ ఇద్దికాద

తే. అనఘ! యివి యిచ్ఛఫలము లా ♦ ద్యంతవంత
ములు వ్యథోదర్కములు భ్రమా ♦ పూరితమ్ము
లల్పతరసమ్మసకరమ్ము ♦ లని యెఱుంగు
మనుపమసుఖమ్ము విషయాత్ము ♦ లందఁగలరె! 9

—* శ్రీకృష్ణుఁ డుద్ధవునకు భక్తియోగ ప్రాధాన్యము నుగ్గడించుట *—

కం. అలఘుగుణాధారులు శాం,తులు సమమానసు లకించ♦నులు దాంతులు కో
ర్కులు లేనివారు నా భ,క్తులు వారల కెల్లకడలఁ ♦ గూరు సుఖంబుల్. 10

తే. ధాతృపదము మహేంద్రప♦దము రసాత,లాధిపత్యము సార్వభౌ♦మాధికార
మధికయోగసిద్ధులఁ దుద♦కల్లమోక్ష,మైనఁ గోరరు మదిని నా♦యందె నిలిపి.

వ. ఉద్ధవా! పరమభక్తుండవైన నిన్నుం జూచి యుబ్బుదును. 12

కం. తనువైన, మదీయాత్ముఁడ,యిన శంకరుఁ, డగ్రజుండ♦యిన రాముఁడు, నం
దనుఁడైన ధాత, భార్యయయినసిరి, నీయట్లుగార♦మ్మత్ప్రియతములున్. 13

కం. ముని నిర్వైరుని నిరపే,క్షుని సమదర్శనుని శాంతుఁ ♦ గోరి యనుసరిం
తును నిత్యముఁ దత్పదరజ,మున నాలోని జగములను♦బూతము సేయన్.

చం. ఇతరులఁగాక నన్నె భజి ♦ యించుచు మద్గతభక్తిభావదీ
పితుఁడయి శాంతుఁడై కరుణ ♦ వెల్గఁ గనుంగొను చెల్లజీవసం
తతులను వాంఛ లెవ్వియును ♦ దావునఁజేరఁగనీక పొల్చుభ
క్తతతికిఁ గల్గు సౌఖ్య మెఱుఁ ♦ గం దరమానజు లేరికేనియున్ ? 15

వ. ఇట్లుత్తమభక్తుండే గాక ప్రాకృతభక్తుండును గృతార్థుండ. 16

తే. ఘోరరాక్షసులంబలెఁ ♦ గూడముట్టి,
యుగ్రవిషయముల్ బాధించు ♦ చున్నఁగూడ
నింతయేని చలింపక ♦ యిద్ధభక్తి,
వఱలి విషయాళిఁ బరిభవిం ♦ పంబడండు. 17

కం. అస్మత్పాదాంబుజ యు,గ్మస్మరణము ఘోరపాత ♦ క సమూహంబుల్
భాస్మనముం బొనరించును, విస్మయముగ వహ్ని కాష్ఠ♦ వితతింబోలెన్. 18

కం. నమ్మిమ యార్జితభక్తివి,ధమ్మైన సాంఖ్యమ్ము తపము ♦ ధర్మము స్వాధ్యా
యమ్మును యోగమ్మును త్యా,గమ్మును సాధింపలేవు♦గదె నన్ననఘా! 19

కం. సుగుణులకుఁ బ్రియుఁడ నాత్ముఁడ,నగు నేనొకభక్తికే సు♦మా గ్రాహ్యుఁడ వే
ఱుగ నుండెడి చాండాలుం,డుగూడ మద్భక్తిఁ బావ♦నుఁడగు సకులుఁడై. 20

కం. నాపైని భక్తియుండని, యాపురుషుఁ బవిత్రుఁజేయు ♦ టరిదిసుమీ తపో
దీపిత విద్యయు సత్యద,యోపేతంబైన ధర్మ ♦ ముద్ధవ! వింటే. 21

చం. పులకలు మేనఁ బుట్టవలెఁ♦బొంగి మనంబు ద్రవింపఁగావలెన్
గొలుకులనుండి హర్షమునఁ ♦ గొల్లఁగ బాష్పము లూరఁగావలెన్
బలుకుల గద్గదస్వరము ♦ భాసిలఁగావలె భక్తుఁడన్న న
య్యలఘుచరిత్రుఁడే యతని ♦ యాశయమే పరిశుద్ధ ముద్ధవా! 22

ఉ. నిక్కపుబత్తి నాయెడల ♦ నిల్చినవాఁ డటులుండి సిగ్గులే
కొక్కెడ నృత్యముల్ సలుపు ♦ నొక్కెడ బిగ్గరఁ బాడుచుండు వే
ఱొక్కెడ నవ్వుచుండు మఱి ♦ యొక్కెడ నేడ్చుచునుండు వాఁడసూ
దృక్కుల స్పర్శనాదులను ♦ దృశ్యజగంబును జేయుఁ బూతముల్. 23

కం. అనలధ్మాతంబై కాంచన మంతర్మలముఁ దొరఁగి ♦ స్వచ్ఛతఁగను న
య్యనువున మద్భక్తిస్ఫూర్తినిఁ గర్మాశయముఁ బాసి ♦ హృదయము
వెలుఁగున్. 24

కం. నాపుణ్యకథాశ్రవణా,లాపము ల న్జిత్తము విమ ♦ లంబగు కొలఁదిన్
జూపట్టు సూక్ష్మవస్తువు, దీపితమై యంజనాక్త ♦ దృక్కులకుబలెన్. 25

కం. విషయాకృతి వహియించున్
విషయములనె తలఁచుచున్న ♦ వెడహృదయంబున్
దృషదీఱ స్మరించిన నను
హృషీకపతి మత్స్వరూప ♦ మొనయు మనంబున్. 26

కం. కాన న్స్వప్నేచ్ఛలచం, దానన్ మృషయంచు నెంచి ♦ త దసద్విషయ
ధ్యానమ్ము మాని మది నా,పై నిల్పి సతంబుఁగొల్వ ♦ వలయు న్నన్నున్.

కం. విట యోషిజ్జనముల ము,చ్చటలవలనఁ గల్గిన ట్లై ♦ సంగవు క్లేశో
త్కట బంధమ్ములు తదితర, పటుసంగమువలన నుద్ధ ♦ వా! వింటెగదా. 28

కం. నారుల స్త్రీకాముకులం, దూరమునఁ ద్యజించి దిటము ♦ తో నిర్భయుఁడే
కారామమున విజనమునఁ, జేరి సమాసీనుఁడై భ ♦ జింపవలె నన్నున్. 29

—♦ ధ్యాన యోగాభ్యాసక్రమము ♦—

వ. అనిన నుద్ధవుం డరవిందాక్షా! ముముక్షు వేస్వరూపుండవైన ని న్నెట్లు
ధ్యానింపవలయు నానతిమ్మన భగవంతుం డిట్లనియె. 30

సీ. అత్యుచ్ఛ్రితాతినీ ♦ చాసనంబునఁగాక
సమతలంబున యథా ♦ సౌఖ్యముగను
నుపవిష్టుఁడై కాయ ♦ ముంచి సమమ్ముగా
నుత్సంగమునఁ జేతు ♦ లుంచి నాసి
కాగ్రంబుపై దృష్టి ♦ నడరించి పూరకా
దిగఁగాని రేచకా ♦ ది గనుగాని
యభ్యసించుచును బ్రా ♦ ణాయామమును దదీ
యాధ్వంబు శోధింప ♦ నగును నిష్ఠ

ఆ. నిర్జితేంద్రియుఁడయి ♦ నిత్యంబు ముప్పొద్దు
తడవఁ బదిసారు ♦ లడరిచేయు
చుండ మాసమునకె♦యుద్ధవా! వాఁడు జి
తానిలుఁ డగు సంది ♦ యంబు లేదు. 31

వ. ఈ ప్రాణాయామం బగర్భంబు సగర్భంబు నాద్వివిధంబు మంత్రరహితమగ ర్భము మంత్రసహితముసగర్భము. అందు సగర్భంబ శ్రేషంబు అది విను. దొంతులుగా నున్న మూలాధార స్వాధిష్ఠానమణిపూర కానాహతవిశుద్ధాజ్ఞా చక్రంబులనునాళంబి నడిమి త్రోవ ననుసంధించి బిసమాత్ర మాత్రచ్ఛిద్రంబు పోలుచు అనాహతచక్రముగల హృదయాబ్జము దవిచ్ఛిన్నంబుగా నోంకా రము మ్రోఁగుచుండును. దీని నీ సాధకుండు ప్రాణవాయువుచే నాధారము వఱకుంగొంపోయి మరల నూర్ధ్వము మూర్ధాంతపర్యంతము దెచ్చి మరల హృదయమునం జేర్చి ఘంటానాదంబువలె నుదాత్తధ్వనియిచ్చుచుండ స్థిరముగా నిలుపవలె. ఇట్లు ప్రణవసంయుక్త ప్రాణాయామము గురువు చెప్పిన చొప్పున నభ్యసించి వాయువుకు లోఁగొనవలయు. ఉద్ధవా! ఇది ధ్యానాంగ మింక ధ్యేయము వినుము దేహము లోపల నూర్ధ్వనాళంబు నధోముఖంబు ముకుళితంబు నగు హృత్పుండరీక మరటి పూమొగ్గవలె వ్రేలాడుచుండును. దాని నధోనాళంబు నూర్ధ్వముఖంబు వికసితంబు నష్ట దళశోభితంబు సకర్ణికంబుగాఁ దలంచి యాకర్ణికపైఁ గ్రమంబుగా సూర్యచంద్రాగ్నుల భావించి యయ్యగ్నిమధ్యంబుననున్నట్టి 32

సీ. జానుస్పృగాపీన ♦ చారుచతుర్బాహు, నీలాభ్రసమకమ ♦ నీయదేహు
మానోజ్జ్వలస్ఫుర ♦ న్మకరకుండలకర్ణుఁ, దురగమాయితబలో ♦ ద్ధురసువర్ణు
నిందిరాసుందరీ ♦ మందిరాయితవక్షు, నక్షయకరుణాక ♦ టాక్షవీక్షుఁ
బీతాంబరప్రభా♦న్వితసూక్ష్మతరమధ్యు, నవిరళానూన భ♦క్త్యధ్వసాధ్యు

తే. సుందరకపోలు శ్రీవత్స ♦ సురుచిజాలు, శిష్టజనపరిపన్యు శు ♦ చిస్మితాస్యు
విస్తృతలలాటు నవరత్న ♦ భృతకిరీటు, నీరరుహనేత్రు వేదవ ♦ ర్ణితచరిత్రు

సీ. మకరకుండలహారు ♦ మర్దితచాణూరు, మధుసుధాప్రతిమేయ ♦ మహితధీరు
మథితమాంసాహారు♦ మంథానగిరిధారు. మంగళాకారు మ ♦ న్మథకుమారు
మందరధరధీరు ♦ మతిదయాంకూపారు, మధువరాజ్యాధారు ♦ మంజులోరు
మధురాపురవిహారు ♦ మనుజపమందారు, మతిహితకేదారు ♦ మానసారు

తే. మానితోదారు మదనకో♦మలశరీరు, మత్స్యపావతారు మనో♦భ్రమణవిదారు
మధురశుచితరస్మేరు మా♦మానచోరు, మసృణరత్నకోటీరు మ♦మతవిదూరు

వ. మఱియు ధ్యానభ్రమని ననుదూపావయవోన్నదుని నతిరమ్యభావుని సుందరగ్రీవుని ఘనశ్యాముని శ్రీవత్సేందిరాధాముని శంఖచక్రగదాపద్మ వనమాలా ద్యుమత్కిరీట కటకకటిసూత్రాంగదాదిభూషుని కౌస్తుభమణి ప్రభాన్వితవేషుని సర్వాంగసుందర శుభలక్షణుని ప్రసాదసుముఖేక్షణుని సుకుమారుని కుమారకుమారుని నన్ను సర్వాంగముల హృదయము నిలిపి ధ్యానింపవలయు. ఉద్ధవా! యే స్వరూపము ధ్యానింపవలయునో తెలిసెనా? విను. 35

తే. విషయములపైకిఁ బోకుండ ♦ వేగ నింద్రి
యమ్ముల మనస్సుతో లాగి ♦ యామనసును
బుద్ధితోడ సాకర్షించి ♦ శ్రద్ధగలిగి
నిలుకడగ మదాకృతివయి ♦ నిలుపవలయు. 36

కం. కనుమూసినఁ, గనుదెఱచినఁ గనంబడెడువఱకు మన్మూ ♦ ఖము ధారణచే
సినపిదప మఱొక తుంగముఁ,గనవలెఁ దొల్లింటివానిఁ ♦ గలిపికొనుచెదరన్.

కం. ఈవిధమున మదిలోపల, భావింపఁగ నన్నియవయ ♦ వంబులు దుదకో
యీవత్స! మత్స్వరూపం, బావిర్భవమగును దేని ♦ నరయుచునున్నన్.

తే. అనఘ! మత్స్మితాస్యము స్థిర ♦ మైన పిదప
నఖిలకారణాకాశమం ♦ దాత్మ నిలిపి
యదియు విడిచి శుద్ధబ్రహ్మ ♦ మైన నాయె
డ న్నమారాధుఁ డగుచునుం ♦ డవలెఁజుమ్మి. 39

కం. అప్పుడు ధ్యాతృ ధ్యేయము, లుప్పతిలవు జ్యోతిలోన ♦ జ్యోతియఁబోలెన్
దెప్పునఁ గనుచుండు నతఁడు,దప్పక నాలోనఁ దన్నుఁ ♦ దనలోనన్నున్. 40

వ. ఇట్టి సమాధ్యంత ధ్యానమున ద్రవ్యజ్ఞానక్రియాభ్రమంబు నివర్తించు నని శ్రీకృష్ణుండు పలికినట్లు శుకమహర్షి వచించెను. 41

ఇది చతుర్దశాధ్యాయము సమాప్తము

---

## పంచదశాధ్యాయము

కం. శ్రీధ్యేయచరణ! విద్వ, న్మధ్యేహృదయావతరణ! ♦ మత్తారిభృ
త్సాధ్యేతరశరణా! సా,మాధ్యేప్సితవితరణ! ♦ హరిహరనాథా! 1

వ. [1]దేవా! యవధరింపుము శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అట్లు భగవంతుం డుద్ధవునకు ధ్యానయోగము నుడివి 2

[1] అధ్యాయప్రారంభము 16-6-1946.

కం. అనఘ! జితేంద్రియుఁడయి శ్వా,సనియామకుఁడగుచు హృదయ ♦ జలజమునా పై
నునిచిన స్థిరముగ నతనికి, ననుపమసిద్ధులు జనించు ♦ నన నుద్ధవుఁడున్ 3

కం. ఓస్వామీ ! యేధారణ, నేసిద్ధి యెటుల్ జనించు ? ♦ నెన్ని యొసిద్ధుల్ ?
దాసునకుఁ దెల్పు యోగా, ధ్యాసులకున్ సిద్ధులొసఁగు ♦ వాఁడవు కృష్ణా! 4

* శ్రీకృష్ణుం డుద్ధవునకు ధారణానుగతసిద్ధులం జెప్పుట *

వ. అనవుడు శ్రీకృష్ణుం డుద్ధవునితో నిట్లనియె. 5

తే. ధారణలు సిద్ధులును యోగ ♦ పారదృశులు,
పదియు నెనిమిది యంచును ♦ బలుకుచుంద్రు
వానిలో నెనిమిది మత్ప్ర ♦ ధానములగు
లాఁతి వెల్ల సత్త్వోత్కర్ష ♦ హేతుకములు. 6

సీ. అంగ మణువయిన ♦ నణిమ గొప్పదియైన, మహిమ, తేలికయైన ♦ మఱి లఘిమము
ప్రాణేంద్రియాధిదే ♦ వతలతోఁగూడి యి, ష్టార్థముల్ పొందినఁ బ్రాప్తిసిద్ధి
విన్నకన్నవి యెట ♦ నున్నను వాని భో, గ్యముఁ జేసికొన్నఁ బ్రా ♦ కాశ్యసిద్ధి ;
విమలశక్తిఁ బ్రేర ♦ ణమున సామర్థ్యముం, డిన నీశితాసిద్ధి ; ♦ నిఖిలవిషయ

తే. భోగముల నసంగుం డౌచుఁ ♦ బొందుచున్న
వశితయగును; గోరినసర్వ ♦ వాంఛితముల
నెనయఁగల్గినఁ [1] బ్రాకామ్య ; ♦ మీ యెనిమిది
యోగికి స్వభావసిద్ధమ్ము ♦ లుత్తమములు. 7

సీ. ఊర్మిరాహిత్యమ్ము, ♦ నుద్యన్మనోవేగ, గమనమ్ము, కామితా ♦ కారయుక్తి
దూరశ్రవణమును, ♦ దూరదర్శనమును, నన్యకాయప్రవే ♦ శానువృత్తి
యమరాప్సరక్రీడ ♦ నాలోకనమ్ము, సంకల్పానురూపాధి ♦ గమ, మకుంఠి
తాజ్ఞ, స్వేచ్ఛామృత్యు ♦ వనువది సిద్ధులు, నిద్ధగుణోత్కర్ష ♦ హేతుకములు

తే. అన్యచిత్తాద్యభిజ్ఞత ♦ యఖిలకాల
వేత్తృతయుఁ బరాజయము ప్రా ♦ ప్తింప కునికి,
ద్వంద్వములకుఁ గీడ్పడమి, పా ♦ వకజలార్క,
విషముఖస్తంభనముక్షుద్ర ♦ విభవములగు 8

వ. ఈ సిద్ధు లేనింటి నుద్దేశంబుంబట్టి నుడివితి నీకు నేసిద్ధు లేధారణచే నెట్లు
కలుగునో విన్పింతు వినుము. 9

1. కొందఱు ప్రాకాశ్య ప్రాకామ్యముల నొకటిగనే భావించి గరిమము నష్టసిద్ధులలో గణింతురు. దేహము బరువగుట గరిమము.

సీ. భూతసూక్ష్మోపాధి ♦ పోల్చు నాపయిని ద
న్మాత్రమనము నిల్ప ♦ వలయు నణిమ ;
జ్ఞానశక్త్యాత్మకం ♦ బైన మహత్తత్త్వ
మది యుపాధి యగు నా ♦ యందునట్టి
మది నిల్ప మహిమమ్ము ♦ పొసఁగు ; నట్లె గగ
నాది భూతోపాధి ♦ యైననన్నుఁ
దలఁచి మనము నిల్పఁ ♦ దత్తన్మహాభూత
మహిమమ్ము లతనికి ♦ రహిఁ లభించు ,

తే. భూతపరమాణురూపు న ♦ న్బుద్ధి నిలువ
లఘిమ కాలసూక్ష్మార్థత ♦ లలిఁ జెలంగు ;
దలఁప వైకారికుని నహం ♦ తత్త్వ నన్ను
నింద్రియాత్మత్వ మను ప్రాప్తి ♦ నెనయఁగలఁడు. 10

వ. ఉద్ధవా ! ఇంద్రియాత్మత్వమన సర్వప్రాణీంద్రియాధిష్ఠాతృత్వమని గ్రహించి తివిగదా. మఱి విను. స్థూలమహాభూతోపాధికుఁడ నగు నాపై మది నిలువ గరిమ లభించు. 11

సీ. సూత్ర మవ్యక్తప్ర ♦ సువు క్రియాశక్తి ప్ర
ధానమ్మయిన మహ ♦ త్తత్త్వ మది యు
పాధిగాఁగల నన్ను ♦ భావింపఁ బారమే
ష్ఠ్యంబైన [2] ప్రాకాశ్య ♦ మందఁగలఁడు
త్రిగుణమాయాధీశు ♦ దిక్కాల విగ్రహు
విష్ణు నాపై మది ♦ వెలయఁజేయ
జీవదేహప్రేర ♦ ణావహమైన యీ
శిత్వమ్ము వానికిఁ ♦ జెందఁగలదు

తే. ఆత్మ: నారాయణుని విరా ♦ డాఖ్యలకును
బరుఁడయిన తురీయుని భగ ♦ వంతు నిలువ
వశిత దొడరు; నిర్గుణపర ♦ బ్రహ్మ మొడఁద
నిలువఁగాఁ బరమానంద ♦ నిలయుఁడగును. 12

వ. ఇదియ సర్వకామసమాప్తిస్థానంబు. ఉద్ధవా ! కడమ గుణహేతుక సిద్ధిధారణల నాలింపుము. 13

---

2 ప్రాకాశ్యం పారమేష్ఠ్యంమే — అని బొంబై. ప్రాకామ్యం పారమేష్ఠ్యంమే అని వావిళ్ల ప్రతి.

సీ. ధర్మమయుండు శ్వేత♦ద్వీపపతి శుద్ధుఁ,డైన నాయెడ హృద♦యంబు నిలుపు
పురుషుండు శుద్ధరూ♦పుండగుచు ననూర్మి,మత్త్వసిద్ధిం గాంచు;♦మాన్యచరిత!
మఱి గగనాత్మ స ♦ మష్టిరూపుం బ్రాణు, నన్నెద నిల్పి త♦న్నాదదృష్టి
వహియింప దూరశ్ర♦వణము లభించుఁ జు,మ్మక్షియం దర్కుని ♦ నర్కునందు

తే. నక్షి భావించి నన్ ధ్యాన ♦ మాచరింప
దూరదృష్టి కల్గు; మనంబు ♦ తోడఁ బ్రాణ
తనువులం జేర్చి నాయెడ ♦ ధారణం బొ
నర్పఁగా మనోవేగయా♦ నమ్ము వొడము. 14

సీ. తద్జ్ఞుఁడై మది నుపా ♦ దానకారణముగాఁ
గొని యేస్వరూపంబ ♦ గుటకుఁ దలఁచు
నాస్వరూపముఁ గాంచు ♦ నాయోగి మద్యోగ
ధారణాబలముచే ♦ సూరివర్య!
యొకపువ్వునుండి వే ♦ ఱొక పువ్వునకు నేగు
భృంగంబు పోలిక ♦ నితరదేహ
మునఁ బ్రవివిక్షువై ♦ మనమున దాని భా
వించి స్వదేహంబు విడిచి ప్రాణ

తే. ముఖ్యలింగదేహోపాధిఁ ♦ బూని బాహ్య
వాయుమార్గంబునం బర ♦ కాయ మొందు;
గుదము పార్ష్ణిచేఁ బీడించి ♦ హృదయవక్ష
కంఠ మూర్ధమ్ములం బ్రాణ ♦ గతిని జేర్చి. 15

సీ బ్రహ్మరంధ్రమ్ము మా ♦ ర్గమునఁ దనుత్యాగ
మొనరించి తనయిచ్ఛఁ ♦ దనరు లోక
ము లకుఁ బోవంగలం; ♦ డెలమి మద్గతశుద్ధ
సత్వమ్ము ధారణ ♦ సలుపువాఁడు
సత్వాంశజాప్సర ♦ స్సంఘసంక్రీడలం
గాంచును, సత్యసం ♦ కల్పు నన్నుఁ
జిత్తంబునం జొన్పి ♦ సేవింప నొదవు సం
కల్పానురూపంబు ♦ గా ఫలంబు ;

తే. అఖిలయంత స్వతంత్రుండ ♦ నైన మత్స్వ
భావ మొడఁద ధారణ చేయు ♦ వాఁడు ప్రతిహ
తంబు గాని యాజ్ఞాసిద్ధిఁ ♦ దాను బడయు
గుణములంబట్టి ఫలములు ♦ గొరలుగాదె! 16

తే. ఉద్ధవా! నాదుభక్తిచే ♦ శుద్ధచిత్తుఁ డుదితధారణావిదుఁడైన ♦ యోగివరున
కెలమి నిజజన్మమృత్యుత్యావ♦బృంహితమగు,నట్టిత్రైకాలికజ్ఞాన♦మలరఁగలదు.

తే. ప్రకృతిగుణవృత్తులకు సాక్షి ♦ భావమున నె
సంగు నను ధారణ యొనర్చు ♦ జనుఁడు ద్వంద్వ
ములకుఁ బరిభవ మొందఁడు, ♦ భూతహృత్స్థు
నను దలంపంగ నన్యమా ♦ నసవిదుఁడగు. 18

కం. యాదస్సులు జలములచే,బాదం గననట్లు నీర ♦ వహ్న్యాదుల నే
బాదఁ గనఁడు మద్యోగస, మాదృతచిత్తుండు యోగ♦మయదేహుండై. 19

కం. శ్రీవత్స శంఖ చక్ర గ,దా వనమాలాసిరత్న ♦ ధనురాదియుతున్
దేవాగ్రణి ననుఁదలఁచిన,చో వాఁడు పరాజయములఁ♦జూడం డెందున్. 20

కం. దాంతుం డింద్రియవర్గని,యంత జితశ్వాసుఁ డగుమ ♦ హాయోగి నిజ
స్వాంతంబున మద్ధారణ, నెంతయుఁ గావింప వాని ♦ కెది దుర్లభమా! 21

కం. ముంగలి వచ్చిసిరులుడ,క్కంగడమవి నన్నుఁబొందఁ♦గఁ దలంచెడి యో
గిం గొంత కాలయాపన,ముం గావించి యిటు విఘ్న♦ములచేఁ గలఁచున్.

వ. కాన నీయుత్త్యుత్తమయోగమును గారడివిద్దెల నుపయోగించి రిత్తపుచ్చ
రాదు. జలచరములకు జలస్తంభనముఁ బక్షులకు ఖేచరత్వము దేవళ్ళకుఁ
గామరూపత్వాదికము నీవిధంబున జన్మౌషధితపోమంత్రములచేఁ గొన్ని
యోగసిద్ధు లొదవుం గాని మదీయ సాలోక్యాదిసిద్ధులుమాత్ర
మేయితరోపాయలభ్యంబులు కావని యెఱుంగుము. 23

ఆ. సర్వసిద్ధులకును ♦ సాంఖ్యంబునకు యోగ,మునకు విమలధర్మ♦మునకు బ్రహ్మ
వాదులకును నేన♦పాలకుండను హేతు, భూతుఁడను బ్రభుండఁ♦బూజ్యచరిత!

తే. భూతములు చతుర్విధభూత♦ములకుఁ బోలె
నాత్మనగు నేను బ్రాణి చ ♦ యమున కెల్ల
నుందు బాహ్యాంతరంబుల ♦ నొకటఁగూడ
నావృతుండనుగాక వి ♦ ద్యాలవాల! 25

వ. అని శ్రీకృష్ణుండు యోగసిద్ధుల నుపదేశించె నని శుకమహర్షి వచించెను.

ఇది పంచదశాధ్యాయము సమాప్తము

## షోడశాధ్యాయము

కం. మంచి తమరులను సిరిగొ,మ్మంచితరుల దైత్యవరుల ♦ నణఁచితి వెలికిన్
మంచితనము సూపుచునె స,మంచిత భావమిదియెట్లొ ♦ హరిహాసనాథా ! 1

వ. [1] దేవా! యవధరింపుము. శ్రీ శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అట్లు శ్రీకృష్ణుం డుపదేశింప నుద్ధవుండు కేలుమోడ్పెఁదల ఘటించి 2

కం. దేవ ! పరబ్రహ్మవు నీ, కావరణము లేద లేప ♦ యాద్యంతంబుల్
నీవాదికారణుఁడవు, భావస్థిత్యవ్యయోద్భ ♦ వముల శభవా ! 3

కం. ఉచ్చావచభూతములం, దచ్చెనటులు చూడఁజాల ♦ రరసి త్రయీ వి
ద్వచ్ఛయము నిన్నుఁగొల్చు భ,వచ్చరిత మెఱుంగుఁ గానఁ ♦ బద్మదళాక్షా!

వ. వరమర్షు లేయేభావంబుల నిన్నుపాసించి సిద్ధిఁగాంతు రయ్యది వచింపుము.

కం. భూతాత్మ! భూతభావన!, భూతచయము నీదుమాయ ♦ మోహితమై ని
న్నేతఱిఁ గనుఁగొననేరదు, భూతములకు గూఢుఁడవయి ♦ పొల్చెదవీశా! 6

కం. నీతీర్థపదపదాంభో,జాతములకు వందనములు ♦ జగములుమూఁటన్
ఖ్యాతిగ వెలిఁగెడి నీదు వి,భూతుల నెఱిఁగింపు నాకుఁ ♦ బురుషవరేణ్యా! 7

—♦ శ్రీకృష్ణుం డుద్ధవున కాత్మవిభూతుల నెఱిఁగించుట ♦—

వ. అనిన శ్రీకృష్ణుం డిట్లనియె. ఉద్ధవా ! 8

చం. అవనికిఁ గాఁగ నొండొరువు ♦ లాగ్రహ మూని యుయుత్సులౌచుఁ బాం
డవులును గౌరవుల్ వినశ ♦ నంబునఁ జేరిన కాలమందు నా
ల్గువలఁకులం గనుంగొని య ♦ కుంఠితశౌర్యుఁడు పార్థుఁ డాత్మబం
ధువు లనుఁగుంజెలుల్ గురులు ♦ తోడన కంటఁబడం బ్రముగ్ధుఁడై 9

చం. కనుఁగవ నిండి బాష్పములు ♦ క్రమకపోలములందు డిగ్గఁగాఁ
దనకెడి కేల్వ్రేల్బిగువు ♦ దప్పి శరాసన మట్టెమొగ్గఁగాఁ
దనువు చెమర్పఁగా నిలుచు ♦ దానికిఁ జాలక పాండురాజనం
దనుఁ డటు వాలిపోయె నర ♦ దంబువయిం బెడకేలియూఁతమై. 10

వ. అవ్వలఁ గొంతవడికిఁ దెప్పరిలి నన్నుం జూచి 11

ఉ. స్వార్థపరుండనై పితల ♦ నన్నలఁ దమ్ములఁ జంపుకొంటకే
స్వర్థపహించి కౌరవుల ♦ వర్గముతో విలువిద్య నేర్చితిన్
బార్థివధర్మ మిట్టిదటె? ♦ పాడవు నెత్తురుకూడు మెక్కి న
త్యర్థము కోరు చేమివురు ♦ పార్థము? యాదవవంశవర్ధనా! 12

1 అధ్యాయ ప్రారంభము 18-6-1946.

ఉ. బాలిశవృత్తి గొగ్గి పడి ◆ వచ్చితి బింకము లాడుకొంచుఁ గ
య్యాళి నొనరింప బాంధవ స ◆ ఖాప్త సహాయుఁడ నౌచుఁ బున్నెపు
న్నేలను గంటినో గదె జ ◆ నించను ధర్మవిశుద్ధబుద్ధి యేఁ
జాల ననిం బొనర్ప మురశాసన! పాదము గొంపసేరఁగన్.

ఉ. ఇమ్మహిఁ గ్షద్దింతుము ఔ ◆ యిష్టుల జ్ఞాతుల? నెంత పావకా
ర్యమ్మని కట్ట! పెద్ద లెవ ◆ రైనను విన్న నధర్మ్యమంచు గ
ర్హ్యమ్మును జాడిపోయరె? జ ◆ నార్దన! పూరుని గన్న శుద్ధవం
శమ్ము కళంకితమ్మగును ◆ మావలనన్ రథ మింకఁ ద్రిప్పుమా!

చం. అనవిని నేను నవ్వి పని ◆ నాఁగఁగఁ జేయఁగ నీవ కర్తవా!
నిను నియమించువాఁ డొకఁడు ◆ నిత్యుఁడు లేఁడె? యిటేల మోహముం
గనెద వటంచు నెన్నియొ ప్ర ◆ కారములం బరమార్థవిద్యఁ జె
ప్పిన విని యప్డు నీవలెనె ◆ పృచ్ఛ యొనర్చెను మద్విభూతులన్. 15

వ. అప్పుడు కిరీటికిం జెప్పితి నిప్పుడు నీకుఁ జెప్పెద వినుము. 16

కం. భూతములకు నేనాత్ముఁడ, నేతను నెచ్చెలిని; నేన ◆ నిఖిలప్రాణుల్
భూతమ్ముల స్థితిలయములు, జాతమ్ములు నేన; యేల ◆ సంశయపడఁగన్. 17

సీ. గతిమంతులం గల ◆ గతి నేన మఱి పళీ
కర్వాణులందును ◆ గొరలు కాల
మును నేన, గుణచయం ◆ బుల సామ్యమును నేన,
గుణుల యౌత్పత్తిక ◆ గుణము నేన
ఘనగుణులం దాది ◆ కార్యమ్మయిన సూత్ర
మేన, మహాత్ముల ◆ నెసఁగు నమ్మ
హత్తత్త్వ మేన య ◆ త్యంత సూక్ష్మంబులం
దుం జీవుఁడను నేన, ◆ దుర్జయముల

తే. స్వాంత మేన, వేదముల న ◆ ధ్యాపకుం డ
యిన హిరణ్యగర్భుఁడు, నేన ◆ యెల్ల మంత్ర
రాజి వర్ణత్రయాత్మక ◆ ప్రణవ మేన
యక్షరములలోన నకార ◆ మగుదు నేన 18

సీ. ఛందస్సులందుం ద్రి ◆ చరణగాయత్రి నే, నమరులందును హరి ◆ హయుఁడ నేన
ఆదిత్యులందు వి ◆ ష్ణ్వాహ్వయుండను నేను, వసువులలో హవ్య ◆ వహుఁడు నేను
బ్రహ్మర్షులందు వి ◆ రాజిలు భృగువేను, వినుత రాజర్షుల ◆ మనువు నేను
దేవర్షులందు వ ◆ ర్తిలు నారదుఁడ నేను, ధేనువులం గామ ◆ ధేను వేను

తే. పుడమి సిద్ధులందుం గపి ♦ లుఁడను, రుద్రు
లందు నీలలోహితుఁడ నే, ♦ నండజముల
యందు గరుఁడుండ నేను, బి ♦ త్రాళి నర్య
ముఁడఁ బ్రజాపతులందు ద ♦ క్షుఁడను నేను 19

సీ. అసురులయందుఁ బ్ర♦హ్లాదుండ నేను, న,క్షత్రౌషధుల క్షపా ♦ కరుఁడ నేను
యక్షరక్షస్సుల ♦ యం దర్థపతి నేను, దంతులందైరావ ♦ తమ్ము నేను
యాదఃప్రభువులందు ♦ నంబుధీశుఁడ నేను, సుకుచిప్రతాపులఁ ♦ దరణి నేను
నరులలో వసుమతీ ♦ నాయకుండను నేను, వాజులం దుచ్చైశ్శ్ర ♦ వంబు నేను

తే. ధాతువులఁ గాంచనము నేను, ♦ దండకారు
లందు యముఁడను నేను, స ♦ ర్పాళియందు
వాసుకిని నేను, నాగేంద్ర ♦ పాళియందు
శేషుఁడను, శృంగిదంష్ట్రిల ♦ సింహమేను, 20

సీ. ఆశ్రమమ్ములను స ♦ న్న్యాసంబు నేన వ, ర్ణావళిలోన బ్రా♦హ్మణుఁడ నేన
తీర్థప్రవాహాలఁ ♦ ద్రిపథగ నేన స్థి,రోదకాశయములం ♦ దుదధి నేన
దివ్యధానుష్కులం ♦ ద్రిపురవైరిని నేన, శస్త్రమ్ములఁ శరా ♦ సనము నేన
అతిదుర్గమముల హి♦మాలయంబును నేన, నివసనమ్ములను మే♦రువును నేన

తే. ధాన్యముల యవలును బురో ♦ ధసులలో వ
సిష్ఠమౌనియు నేన బ్ర ♦ హ్మిష్ఠులఁ బృ
హస్పతియు సర్వసేనాను ♦ లందు బర్హి
వాహనుఁడు వనస్పతుల న ♦ శ్వత్థ మేన. 12

ఆ. చారుశీల! వినుము ♦ సత్ప్రవర్తకులందుఁ, బూజ్యుఁడౌ స్వాయంభు♦వుండ నేన
యజ్ఞములను బ్రహ్మ♦యజ్ఞంబు నేన వ్ర,తంబులం దహింస♦నంబు నేన. 22

వ. మార్జన తక్షణ ఘర్షణాది శుచిసమూహంబుల వాయు వహ్ని సూర్య జలరూపుండైన శోధకుండు నేన. అష్టాంగయోగంబులలో నాత్మసంరోధంబు నేన. విజిగీషుసాధనంబులలో మంత్రంబు నేన. వివేకాది నైపుణ్యంబులలో నాత్మానాత్మవివేకవిద్య నేన. అఖ్యాత్యన్యథాఖ్యాతి శూన్యఖ్యాత్యసత్ఖ్యాత్యనిర్వచనీయఖ్యాతివాదులలో నదియా! యిదియా! యనెడి దురంతవికల్పంబు నేన. 23

తే. అంగనలయందు శతరూప ♦ నవుదు నేన
పురుషవరులందు స్వాయంభు ♦ వుండ నేన
మునులయందు నారాయణుం ♦ డను సనత్కు
మారుఁడను నేన నూ బ్రహ్మ ♦ చారులందు. 24

సీ. అఖిలధర్మములస ♦ న్న్యాసంబునేన క్షే, మాళి నంతర్నిష్ఠ ♦ యగుదు నేన
అతిగుహ్యములను సూ♦నృతహానములు నేన, మిథునంబులం బర♦మేష్ఠినేన
అప్రమత్తులయందు♦హాయనంబది యేన, ఋతువులందువసంత♦ఋతువునేన
మాసంబులందును♦మార్గశీర్షము నేన, యుగములలోఁ గృత♦యుగము నేన

తే. తారలం దభిజిత్తార, ♦ ధీరులందు
నసితుఁడను దేవలుఁడు నేన, ♦ వ్యాసులందు
ఘనుఁడు ద్వైపాయనుఁడు నేన, ♦ కవుల
యందుఁ భార్గవుండను నేన కృ♦పాస్వభావ!

కం. పరభక్తులలో నుద్ధవ!, యరయంగా నీవునేన ♦ యనుపమవిద్యా
ధరులఁ సుదర్శనుఁడు కిం, పురుషులయం దాంజనేయ ♦ మూర్తియు నేనే.

కం. రతనములఁ బద్మరాగం, బతిసుందరములను దమ్మి ♦ యరవిరి భగవ
త్తతి వాసుదేవుఁడను గో, ఘృతము హవిస్సులను శివ ♦ కీర్తితచరితా! 27

కం. కితవుల ద్యూతము నేనే, తితిక్షులతితిక్ష నేనె ♦ తృణజాతుల సం
తతిఁ గుశము నేన సత్త్వో, న్నతుల నుసత్త్వంబు నేన ♦ నమ్ము కుమారా! 28

కం. బలియురబలదీప్తులు, ని, చ్చలు వ్యవసాయులను బొలుచు ♦ సంపద, గంధ
ర్వులవిశ్వావసుఁడును, భ, క్తుల సత్కర్మంబు నేన ♦ కోవిదవర్యా! 29

వ మఱియు భక్తులు పూజించు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ
నారాయణ హయగ్రీవ వరాహ నృసింహ బ్రహ్మాఖ్య నవమూర్తులలో
వాసుదేవుండను నేన. 30

తే. అచ్చరలఁ బూర్వచిత్తిని, ♦ నద్రులఁగల
స్థైర్యమును, ధరా గంధమ్ము ♦ దక మధుర్ద్ర
వంబు, తేజిష్ఠులను విభా ♦ వసుఁడు నేన
రవిహిమాంశు నక్షత్రాల ♦ ప్రభలు నేన. 31

తే. అర్జునుఁడ వీరులందు, బ్ర ♦ హ్మణ్యులందు
బలిని, గగన వరాఖ్యశ ♦ బ్దంబు నేన
ప్రాణులభవంబు స్థితి ప్రల ♦ యంబు, నింద్రి
యముల యర్థగ్రహణశక్తి ♦ యనఘ! నేన. 32

వ. ఉద్ధవా! మద్విభూతులెఱింగితివా! మఱియు వినుము. మహదహంకార
పంచతన్మాత్రలను సప్తప్రకృతివికృతులును బంచమహాభూతైకాదశేంద్రి
యంబులనుషోడశవికారంబులును నేన పురుషాఖ్యుండయిన జీవుండును
నేన. అవ్యక్తంబైన మూలప్రకృతియు నేన, ప్రకృతిగుణంబులైన సత్త్వ
రజస్తమంబులు నేన. పరబ్రహ్మంబు నేన. 33

తే. వీనిపరిగణనము నేన ♦ వీనితత్త్వ,
సిశ్చయోదిత జ్ఞానంబు ♦ నేన యీశ్వ
రుండు జీవుండు సర్వాత్మ ♦ కుండు గుణియు
గుణము నగు నన్నువిడిచి యొ ♦ క్కొండు లేద. 34

మ. ధరణీరేణువులం గణించుట కన ♦ స్తంబైన కాలంబునం
దరమా నేమొ మదీయబుద్ధి; కటులై ♦ నగ మత్కృతాండావళీ
పరిసంఖ్యానమె కష్ట · మందలి యన ♦ ల్పంబైన మద్భూతులం
బొరి లెక్కింపఁగ నేనె నేర; నిఁక న ♦ ల్పం జెప్పఁగా నేటికిన్? 35

తే. బలము త్యాగమ్ము కీర్తి యై ♦ శ్వర్యములును
శ్రీ ప్రభావ విజ్ఞానముల్ ♦ హ్రీ తితిక్ష
లును మనో నయనాహ్లాద ♦ జనకములును
గలుగు తావు లెల్ల మదంశ ♦ కములు వత్స! 36

చం కఱపితి నీకు సంగ్రహము ♦ గా నిట నాదువిభూతులెల్లఁ బెం
పఱి యివియే గదయ్య పర ♦ మార్థము లంచుఁ దలంతువే మొ? యా
తెఱఁగునఁబోకు మిథ్యవి మ ♦ దిం గలిగించును దుర్వికారముల్
మఱి గగనప్రసూనముల ♦ మాడ్కిని మాటలలోన తోఁచెడిన్. 37

తే. కాన వాక్కును నరికట్టు; ♦ మానసంబు
నిలుపు; ప్రాణంబుగెలుము; నిం ♦ ద్రియములను య
మింపు; సాత్త్వికబుద్ధి ద ♦ మింపు బుద్ధి;
నింక నెట్టులు సంసార ♦ మేర్పడిన్ను? 38

కం. మనమును వాక్కును నియమిం,పని మునిచేసెడితపంబు♦వ్రతమును దానం
బును నామకుంభనీరం,బును బోలెం దుదకు మిగులఁ♦బోదెయ్యదియున్. 39

కం. కనుక మనోవాక్ప్రాణము,లను నియమించి మదిలోఁ దలంచుచు నన్నున్
ఘనభక్తియుక్తబుద్ధిం, దనరిన నుద్ధవ! కృతార్థ ♦ తమఁడవుగావే? 40

వ. అని శ్రీకృష్ణుండు బోధించెనని శుకమహర్షి వచించెను. 41

ఇది షోడశాధ్యాయము సమాప్తము.

---

## స ప్త ద శా ధ్యా య ము

కం. శ్రీరమ్య! గరుడవృషభాం,సారోహాకళాతిసామ్య ♦ హాస్తేకృతమా
గారీహృదయాక్రమ్య! ♦ ప్రారూఢజ్ఞానగమ్య! హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అట్లు కృష్ణుండు తనవిభూతులం దెలుప నుద్ధవుం డంజలి ఘటించి 'స్వామీ! [2] భక్తుల సత్కర్మంబు నేన' యంటివి. మఱియు నచ్చట నచ్చట. 2

తే. భవ్య వర్ణాశ్రమాచార ♦ వంతుఁ డకును
దద్విహీనాఖిలమనుష్య♦తతికి నీవు
భక్తిసాధనమ్మగు ధర్మ♦పథము గ్రాహ్య
మంచుఁ జెప్పితిగదె తొల్లి ♦ యంబుజాక్ష! 3

కం. నరులెల్ల రెట్లు ధర్మాచరణమ్మున మెలఁగ నడఁద ♦ సద్భక్తి భవ
చ్చరణములపైని బుట్టునొ? యరవిందదళాయతాక్ష! ♦ యానతియీవే!

చం. పరమసుఖప్రదంబయిన ♦ పావనధర్మము తొల్లి చెప్పి తా
దరమున హంసరూపమున ♦ ధాత్రముఖుల్ విన; నిప్పు డెంతయో
జరుగఁగఁగాల, మయ్యది ప్ర ♦ చారమునం గనుపింప దింక నె
వ్వరు నుడువంగలారు ముర ♦ భంజన! నీ వవనిం దొలంగఁగన్. 5

ఉ. మూర్తులు దాల్చి వేదములు ♦ పొల్చెడి బ్రహ్మసభాంతరంబునన్
వర్తిలువారలందుఁ గను ♦ పట్టఁ డొకండును నీవలెం గలా
మూర్తి! తదీయధర్మచయ ♦ మున్నుడువ న్నడపన్ సృజింపఁగన్
గర్తవు నీవుగా కొరులు ♦ గారుగదా! యగదా! గదాగ్రజా! 6

తే. కాన సర్వధర్మజ్ఞుండ ♦ వైన నీవు, భక్తిలక్షణ ధర్మత ♦ త్త్వము వచింపు
మెవని కేచందమున విధి♦యింపఁబడెనొ! నందనందన! గోవింద! ♦ నందకంద!

—* శ్రీకృష్ణుం డుద్ధవునికి వర్ణాశ్రమధర్మాదులు నుడువుట *—

వ. అని యిట్లు స్వభృత్యముఖ్యుండైన యుద్ధవుం డడుగ భగవంతుఁడైన శ్రీకృష్ణుండు సంప్రీతుండై మర్త్యుల క్షేమంబునకై సనాతనధర్మముల నిట్లు చెప్పందొడంగె. 8

కం. రమణీయచరణ! నీప్రశ్నము ధర్మ్యమ్ము త్తరంబొ ♦ సంగెద విను; శ్ర
ద్ధమెయిం దాన్నినివిన శ్రేయముఁ బొందుట కేమిసంది♦యము లే దనఘా! 9

తే. అనఘ! కల్పాదికృతయుగ ♦ మందు నరుల
కలరు వర్ణంబు హంసాహ్వ ♦ యమున నపుడు
జనులు కృతకృత్యులైరి నా ♦ జాతిమాత్ర
మున నె కానసే కృతయుగం ♦ బనుట దాని. 10

(1) అధ్యాయప్రారంభము 20—6—1496 (2) 16 వ అధ్యాయమున 29 వ పద్యము

తే. ప్రణవమే తొల్లి వేదమ్ము ♦ వత్స! నాల్గు
పాదముల ధర్మమును వృష ♦ భస్వరూప
ధరుఁడ నగునేన; యనఘు లు ♦ త్తములు మునులు
హంసరూపు నన్గొల్తు రే ♦ కాగ్రమతిని. 11

వ. అప్పుడు ధర్మము మనోవిషయమ్ముగా నుండెఁ; గ్రియావిషయం బగు యజ్ఞాదికము లేదు. పిదపఁ ద్రేతాయుగప్రవేశమందు మద్వైరాజరూప ప్రాణనిమిత్తంబువలన హృదయసకాశమునుండి ఋగ్యజుస్సామరూపవేద ముదయించె దాన యజ్ఞంబు వొడమె. హోత్రాధ్వర్యవోద్గాత్రమ్ములచేఁ ద్రిరూపమగు నయ్యజ్ఞంబు నేనైతిని. 12

కం. వైరాజపురుష ముఖ బా,హూరు పదమ్ములను జనన ♦ మొందిరి విప్ర
క్ష్మారమణ వైశ్య శూద్రులు, వేఱుగ నాచారములను ♦ వెలుఁగొందంగన్.

తే. మజ్జఘనములను గృహాశ్ర ♦ మంబు; హృదయ
మునను బ్రహ్మచర్యము; వక్షు ♦ మున వనస్థ
తయు; శిరమున సన్న్యాస ము ♦ ద్భవములయ్యె
నివ్వి నాలు గాశ్రమము ల ♦ హీనకీర్తి. 14

తే. వర్ణముల కాశ్రమముల క ♦ త్పత్తి భూమి
ననుసరించి యుత్తమ మధ్య ♦ మాధమాది
భేదములు జనియించె నీ ♦ పృథివిమీఁదఁ
బ్రకృతి నెవ్వారు శాసింప ♦ వలఁతు లనఘ! 15

కం. శమమును దమమును సంతో
షముఁ దప మార్జవము భక్తి ♦ శౌచము క్షమ స
త్యము దయయును నీవది శు
భమనీషా! బ్రాహ్మణస్వ ♦ భావమ్ము లగున్. 16

కం. ధైర్యము తేజము బలమౌ,దార్యము యత్నము తితిక్ష ♦ స్థైర్యము వరమై
శ్వర్యము బ్రహ్మణ్యత్వము,శౌర్యము నను నీవదియును ♦ క్షత్రప్రకృతుల్.

ఆ. దాతృతావ్రతం బ ♦ దంభ మాస్తిక్యంబు, విప్రసేవనంబు ♦ విత్తవృద్ధి
సలుపు కార్యములను ♦ సంతుష్టిలేమియు, వైశ్యజనులకుండు ♦ ప్రకృతులనఘ 18

వ. నిష్కపటంబైన గోబ్రాహ్మణ దేవశుశ్రూషయు యథాలబ్ధసంతోషము శూద్రప్రకృతులు. 19

ఆ. అనృతభాషణంబు ♦ నాస్తికత్వము తృష్ణ
శుష్కవిగ్రహంబు ♦ శుచిత లేమి
క్రోధకామములు ని ♦ గూఢచౌర్యంబు నం
త్యజుల ప్రకృతు లంచు ♦ నరయు మనఘ !

తే. ప్రాణికోటికిఁ బ్రియహితం♦బైన చింత, సత్యమాడుటభూతహిం♦సనము లేమి
క్రోధలోభ కామ స్తేయ♦రోధనంబు, సార్వవర్ణిక ధర్మసం♦చయము వత్స !

—♦ శ్రీ కృష్ణుం డుద్ధవునికి బ్రహ్మచారిధర్మము లుపదేశించుట ♦—

వ, ఉద్ధవా ! ద్వివిధబ్రహ్మచారులలోఁ బ్రథముండైన యుపకుర్వాణుని లక్షణ
ముల వినుము. 22

తే. అనుపూర్వ్యంబుగా ద్వితీ ♦ యజననంబు
నుపనయనము పొంది ద్విజుం డ ♦ నుత్తమగురు
కులమున వసించి దాంతిసం ♦ కలితుఁ డగుచు
వాగ్యతుండయి త్రయిని నే ♦ ర్వంగవలయు. 23

సీ. అక్షమాలా మేఖ♦లాజినంబులు కమం
డలువు జందెమ్ము దం ♦ డము ధరించి
యభ్యంగనాది శౌ ♦ న్యత జాతజటుఁడయి
విమలంబులగు పవి ♦ త్రములు దాల్చి
ధౌత దద్వాసో వి ♦ ధానుండుగాక ర
క్తాసనంబుల వజ్జ ♦ కరుగఁబోక
స్నానభోజనహోమ ♦ జపముల నూర్మాత్రమ
లోత్సర్గములయెడ ♦ నుక్తు లుడిగి

తే. మసలవలయుఁ గక్షోరు రో ♦ మ నఖ ఖండ
నంబు దగదు రేతో విస ♦ ర్గంబు గూడ
దవశత ఘటిల్లినఁ స్నాతుఁ ♦ డగుచుఁ ద్రిపది
జపము సేయంగవగుఁ బ్రాణ ♦ సంయమమున. 24

కం. ఇరుసందెలందు వాఙ్నియ, మరతుండయి జపమొనర్చి♦మఱియు ననల భా
స్కర గోవిప్రాచార్యుల, గురువృద్ధుల సురల భక్తిఁ♦గొల్వఁగవలయున్. 25

కం. తనయాచార్యుని నను గాఁ, గనుఁగొనవలెఁ బరిభవింపఁగా ♦ దెందు; నరుం
డనుకొని యసూయపడరా, దనఘ! గురుఁడు సకలదేవ♦తాత్ముఁడునుమ్మీ.

కం. ప్రాత స్సాయంకాలా,నీతము భైక్షాన్నము గురు ♦ ని కొసంగెడిమేల్
చేఁతయు నతఁడనుమతియిడఁ, బ్రీతిగఁగుడుచుటయు వర్ణి♦విధులుకుమారా!

1 అగ్న్యర్కాచార్య గోవిప్ర గురువృద్ధసురాన్ ........ 25

మ. గురువర్యుం డరుగం బిఱుందఁ జనుచున్ ♦ గూర్చుండఁగా డాపునం
ధరఁ గూర్చుండుచుఁ బండఁగా జరణప ♦ ద్మం బొత్తుచున్ నిల్వఁగాఁ
గరముల్ మోడ్చి నతాంగుఁడై నిలుచుచున్ ♦ గష్టించి వేదంబు నీ
వరుసన్ సాంతము నేర్వఁగా గురుకులా ♦ వాసంబు సేయందగున్. 28

వ. ఇట్లఖండవ్రతంబుం బూని భోగవివర్జితుండై విద్యాసమాప్తిపర్యంతంబు గురుకులవాసం బుపకుర్వాణుండు సేయు. ఉద్ధవా! యిఁక ద్వితీయుండగు నైష్ఠికవర్ణి విశేషధర్మముల నాలింపుము. 29

కం ఈవర్ణి నిఖిల నిగమక, ళావాసము బ్రహ్మలోక ♦ మందఁ దలఁచుచోఁ
దా వేదాధ్యయనంబున, కై వరగురు వశము సేయుఁ ♦ గావలెఁ దనువున్. 30

కం. తనయందు భూతములయం, దనలమునందు గురునందు ♦ నపృథగ్మతితో
ననుఁ బరము నుపాసింపం, జను నఘుఁడు బ్రహ్మవర్చ ♦ సము పెంపారన్.

కం. వెలఁదులఁ జూచుట తాకుట, వలుకుట పరియాచకముగఁ ♦ బదరుట విడువన్
వలె మిథునీభూత ప్రాణులసైతము చూడరాద ♦ నూనవ్రతుఁడై. 32

వ. మఱియు,

తే. స్నాన మాచమనంబు శౌ ♦ చంబు తపము, నాదుపూజ సంధ్యోపాస ♦ నంబు తీర్థ
సేవ త్రికరణసంయమ ♦ భావ మఖిలభూతకోటి మద్భావంబు ♦ పొందు సేఁత 33

వ. అస్పృశ్యాభక్ష్యాసంభాష్య వర్జనంబు ననునివి సర్వాశ్రమప్రయుక్త నియమంబులు. ఇట్లు బ్రహ్మవ్రతధరుండైన నైష్ఠికబ్రాహ్మణుండు తీవ్ర తపంబునఁ గర్మాశయముల నెల్ల దగ్ధంబొనర్చి నిర్మలుండై మద్భక్తియొసంగ వహ్నివలెఁ బ్రకాశించుచుండును. వీఁడు గార్హస్థ్యము స్వీకరింపఁడు. ఉపకుర్వాణుం డట్లుగాక, 34

కం. వావిరిఁ గృతాధ్యయనుఁడై, యావలియాశ్రమ వివృత్స ♦ నాచార్యుఋణం
బే వలనుననో తీర్చి స, మావర్తన మాచరించు ♦ నది గుర్వాజ్ఞన్ 35

కం తనయిచ్ఛకొలఁది గృహమునొ?
వనమునొ? న్యాసమునొ? పొంద ♦ వలయును లేకుం
డినఁ గ్రమముగ నాశ్రమములఁ
గనునది యెద్దియును లేక ♦ క్రాలఁ జనదిలన్. 36

కం. కాముకత గృహియగుం జే, తోమలతాకాంక్షవలన ♦ నారణ్యకుఁడౌ
భూమీసురుండు శుద్ధమ, నోమహితుఁడు ప్రవ్రజితత ♦ నూల్కొల్పు నదన్.

— శ్రీకృష్ణుఁ డుద్ధవునకు చాతుర్వర్ణ్య ధర్మముల నుపదేశించుట —

కం. అనవద్యచరితను సవర్ణను శుభలక్షణసమేతఁ ♦ బ్రన్ననిమే నొ
ప్పినదానిం బినదానిన్, ఘనగుణఁ గన్యకను బెండ్లి ♦ గాఁ దగు ననఘా! 38

తే. యజన దానాధ్యయనములు ♦ ద్విజులకెల్ల
ముఖ్యధర్మంబు లందును, భూసురులకు
నాత్మవృత్తికై యాజనా ♦ ధ్యాపన ప్ర
తిగ్రహంబులు గూడ నా ♦ దేయములగు. 39

సీ. యజమానుఁడు ప్రతిగ్ర ♦ హంబునం గీర్తిత
వస్తేజములు డిందఁ ♦ బాఱునంచుఁ
దలఁచుచో యాజనా ♦ ధ్యాపనంబుల వృత్తి
గొననగు నయ్యవి ♦ గూడఁ గృపణ
తాదిదోషాక్తము ♦ లని యెంచునెడల శి
లోంఛవృత్తులఁ గాంచు ♦ టొప్పుచుండు
బ్రాహ్మణతనువు తుచ్ఛ ♦ ద్రమగు కామార్థంబు
గాద, యిచ్చోటఁ గృ ♦ చ్ఛ్రాది ధర్మ

తే. సాధనంబుల, కట దివ్య ♦ సౌఖ్యములకు;
భక్తుఁడు శిలోంఛవృత్తులఁ ♦ బ్రముదమొందు
చాతిథేయాది ధర్మకా ♦ ర్యములు ఫలము
విడిచి సల్పుచు గృహమందె ♦ పడయు శాంతి. 40

కం దారిద్ర్యాంభోరాశిం, బారము గన కిడుమ గుడుచు ♦ భక్తుని విప్రుం
జేరి దయ నుద్ధరించెడి, వారి విపజ్జలధి నావ ♦ వలె దాటింతున్. 41

చం. ప్రజలను దండ్రివోలె నర♦పాలుఁడు దుర్వ్యసనాళినుండి ప్రో
వఁజనును దన్ను నన్యులను ♦ బాలనసేయఁగ నాగజంబులన్
గజపతివోలె, నట్లయినఁ ♦ గల్మషరాశిని బాసి యర్కదీ
ప్తిఁజెనయు నభ్రయానమున ♦ వెళ్లి దివంబున సౌఖ్యమందెడిన్. 42

చం. వెర వొండేమియు లేమి జీవికకునై ♦ విక్రేతమే యమ్మిరో?
కరవాలంబును బూనిరో! తన విప ♦ త్కాలంబు నెబ్బంగి నే
జిఱుపం గావలెఁగాక నీచజనతా ♦ సంసేవలం జొచ్చి యీ
ధరణీదేవుఁడు బాధ లొందఁదగ దా ♦ త్మన్ యాదవగ్రామణీ! 43

ఆ. నృపుఁడు వేటనో! వ♦ణిగ్వృత్తివలననో! విప్రరూపముననో! ♦ వెడలద్రోయు
వలయుఁ దనకు రా వి♦పత్కాల ; మంతియు, కాని నీచసేవఁ♦గాదుగాదు. 44

ఆ. విట్కులుండు శూద్ర♦వృత్తిని శూద్రుండు, బురుడముఖులవృత్తిఁ♦బూని యెట్లొ
తమకుఁ దమకొదవిన♦తద్విపత్కాలముల్, గడపుకొనఁగవలయుఁ♦గడఁకతోడ

వ. వర్ణాంతరవృత్తి నవలంబించినవారు తమ యాపత్కాలానంతర మవశ్య మాత్మవృత్తిస్వీకార మొనరింపవలయు. ఉద్ధవా! గృహస్థున కావశ్యకములైన పంచయజ్ఞముల వినుము. 46

సీ. వేదాధ్యయనము స♦ల్పిన బ్రహ్మయజ్ఞము, దానఋషిఋణంబు ♦ తరలిపోవు
యాగీయవహ్ని స్వా♦హాకారమున వేల్వ, దేవఋణం బెల్లఁ ♦ దీఱిపోవు
పిత్రాదులక్ స్వధా♦కారమ్ముగఁ బితాళ్ళ, కిడినఁ బితౄణంబు ♦ కెడసిపోవు
తన యింటి కేఁగుదెం♦చినవారలకు శక్తి, కొలఁదియన్నోదకా♦దులిడవలయు

ఆ. అద్దియే మనుష్య ♦ యజ్ఞంబు ; మఱిభూత
ములకు బలినొసంగ ♦ వలయు నిదియె
భూతయజ్ఞ ; మిట్టి ♦ పొలుపునఁ బంచ య
జ్ఞములు నిత్యము నొ ♦ నర్పవలయు. 47

కం. తనకులవృత్తి యదృచ్ఛం, బొనరిన న్యాయ్య శుచి విత్తమునఁ బోష్యులపీ
డన మొదవకుండఁ గ్రతువుల, నొనర్చి నను బూజసేయ♦నొప్పుఁ గేస్తున్.

ఆ. బహుకుటుంబ భార ♦ వహుఁడయ్యుఁ దత్కుటుం
బమున సక్తుఁ డగుచు ♦ మసలరాదు
గృహమునందు దేహ ♦ మీశ్వరునందు స్వాం
తమ్ము నిలిపి మెలఁగఁ ♦ దగుఁ గుమార! 49

కం. దృష్టమగు విశ్వమట్టు ల, దృష్టమగు త్రివిష్టపము స♦యిత ముద్ధవ! వి
భ్రష్టమగు నంచు నెద వి,స్పష్టమ్ముగ నెఱిఁగి మెలఁగు ♦ వగ నుండ నగున్.

ఉ. నిద్దురలోనఁ దోఁచు తరు ♦ ణీ జననీ ధన నీవృదాదు లా
నిద్దురవాయఁ దోఁచునటె ? ♦ నిత్య మెఱుంగమె దీని ! నట్లె జా
గ్రద్దశఁ దోఁచు సర్వమును ♦ గాయముపాయఁ దొలంగు నంచుఁ దా
బుద్ధి నెఱింగి వీనిపయిఁ ♦ బుట్టఁగనీయఁగరాదు మక్కువన్. 51

మ కలలో నిత్యముఁ గ్రొత్తగ్రొత్తగ సుతా ♦ గారాంగనా తాతమా
తలు గన్పట్టుచు నుందు రెంతయును జి ♦ త్రంబొ నిదేరీతిఁ బ్రా
ణుల కుండుం బ్రతిజన్మమందును విభి ♦ న్నల్ పెక్కు రాత్మోద్భవా
దు లటుల్ గాన మమత్వమేటికి? గృహ♦స్థుం డొందుటల్ యాదవా! 52

ఉ. ఎండలఁబోవుచుం బెడవు ♦ లెండిపిపాసఁ బ్రపాగృహంబు నెం
దుండియొ చేరవచ్చు పథి ♦ కోత్కరమట్లు ఋణానుబంధ మొం
డొండఁ గలంపఁ గర్మవశ ♦ మూని సతీసుతబాంధవాదు లి
ట్లుండిరి గీముసేరి యను ♦ నూహమునై విడనౌ మమత్వమున్. 53

ఆ. ఒక్కపూట నిలిచి ♦ యొదవిన గంజియో
కలిసెం ద్రావి ముదముఁ ♦ గాంచుసట్టి
యతిథిమాడ్కి గృహము ♦ నందహంకారమ్ము
మమత విడిచి గేస్తు ♦ మనుటయొప్పు. 54

కం గృహమేధీయము కర్మవి, పహమున ననుఁ బూజసేసి ♦ వరలుటయొప్పున్
గృహమందో! వనమునందో!, స్పృహాలెల్లం బాసి యత్తు♦రీయమునందో!

ఆ. ఇషణములకు మారాటి ♦ కెదలోనఁ జోటిచ్చి
యహము మమత రెంటి ♦ నాదరించి
గేహమందె మివుల ♦ మోహచిత్తుండగు
వాఁడు బద్ధుఁ డుద్ధ ♦ వా! నిజంబు 56

ఉ. పిల్లలతల్లి యెన్నఁడిలు ♦ వీడి యెఱుంగదు నేఁటికాలవుం
గల్లలుఁ గార్లు నేర్చినది ♦ గా, డిటువా రటువారు నాదుకో
నిల్లె; కుమారుఁ డొక్కనికి ♦ నీడునురాద గృహంబుదిద్ద; హా!
చల్లఁగ నేనుదాఁటఁ గొన ♦ సాగుట యెట్టులో! కాఁపురంబిఁకన్! 57

చం. కడి యిసుమంతవోని స్థితి ♦ కాలము డాయుచునుండె మంచవుం
దొడుగఱలై యిలంబడినఁ ♦ దోఁపర, వృద్ధులు చీకు చింతలం
బడలిరి, కట్టువూనికయుఁ ♦ బాసెను నీళ్ళిడువాఁడ నేన యం
చెడఁదఁ దలంతు రీపితల ♦ నే నెటువాసెద నివ్వ డక్కటా! 58

చం. అభము శుభ మ్మెఱుంగ రెవ ♦ రాప్తులొ శత్రులొ కాన, లొంటినుం
డే భయము నెంచుచుండుదు రె ♦ డందలఁ, దాఁకుట తప్పుటల్ కటుం
బభరము పూనుటల్ దెలియ ♦ వారలుగా, రిటువంటి సంతు నీ
విభవము నక్కటా! యెటుల ♦ వీడి చనంగలవాఁడ నింకిటన్. 59

ఉ. ఇచ్చిన యప్పు లేమగునొ? ♦ వృద్ధి వివాదము లేక తిన్నఁగా
వచ్చునె! రొడ్ల చేఁ బడక ♦ పండినవంట గృహమ్ము సేగునే?
ఎచ్చిరిలంగఁ జూడరట ♦ భృత్యులు కావులు? నింటిగౌరవం
బాచ్చెము సేయఁజూతురొ? య ♦ యో! యధికాదులం నేను బాసినన్.

కం. అని యివ్విధమున గృహవా,సనా నిహిత మూఢహృదయ♦చాంచల్యండై
తనవారలఁ జింతించుచుఁ, జనువాఁ డతితామసో(గ ♦ జన్మము వొందున్.

వ. అని కృష్ణుండు నుడివె నని శుకమహర్షి వచించెను. 62

ఇది సప్తదశాధ్యాయము సమాప్తము



## అష్టాదశాధ్యాయము

కం. దేవా! శబ్దమె ముఖ్య,మొ్కో? విషయమ్మె ప్రధాన•మో! తెలిసికొనం
గా విజ్ఞత నీవీవ,య్యా! వరకరుణాసనాథ! హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. శ్రీకృష్ణుం డట్లుద్ధవునికి గార్హస్థ్యధర్మములు నుడివి వానప్రస్థ ధర్మముల వాకొనం దొడంగె.

-* శ్రీకృష్ణుం డుద్ధవునికి వానప్రస్థధర్మముల నుడువుట *-

కం. తన యాలిని విజ్ఞులయిన, తనయాలికడ నిలిపియొ! • తనవెంటం దో
కొనియొ వనవివిక్షువు వన, మున కరిగి ప్రశాంతచిత్త • మున నుండఁదగున్.

వ. ఇట్లాయు స్తృతీయభాగము వంచన ప్రతివర్షపర్యంతం బుండవలయు 4

ఆ. వ్రాతవన్యకంద • మూల ఫలంబుల,వృత్తిసేసికొనియుఁ•దృణచయములో?
వల్కలములో! లేక•పర్ణాజినంబులో?, మొలకుఁజుట్టుకొనఁగవలయుఁజువ్వో.

కం. తల గడుగరాదు ముప్ప్రొద్దులు నీళ్ళ న్మునుఁగవలయుఁ • దోముట మాన
న్వలెరదముల,ఁ గూడదు కుం తల రోమ శ్మశ్రు దీర్ఘ • నఖఖండనముల్.

తే. స్థండిలమ్మున శయనింపఁ • దగును; గ్రీష్మ
మందుఁబంచాగ్నిమధ్యమ్ము • నందు భూరి
వర్షధారలఁగోర్చుచుఁ • బ్రావృషలను;
గంఠదఘ్నాంబువుల శీత • కాలమందు. 7

చం. నిలిచి తపమ్ము సేయవలె • నివ్వరి ధాన్యము తెచ్చి యయ్యలూ
ఖలముననో! శిలాతల ము • ఖంబుననో! మఱి దంతపఙ్క్తినో!
పులుముచుఁ బొట్టువావవలెఁ, • బోలు భుజింపఁగ నగ్నిపక్వముల్;
ఫలముఖ కాలపక్వముల • వాడఁగవచ్చు వనస్థుఁ డెంతయున్. 8

చం. తనభుజియింప నెంచినది • తాఁ జని తెచ్చికొనంగఁజెల్లు; నొ
డ్లను నియమింపఁగూడదు; బ • లంబును దేశముఁ గాలముం గ్రహిం
చి నిలువచేయరా, దెదియు • శ్రేష్ఠము శ్రోత్రది, ప్రాఁకవానినిం
గొనుట పొసంగ దెవ్వడును, • గూడదు సంచయ మిట్టివారికిన్. 9

తే. చరు పురోడాశములు వన • సంభవములు
గాఁగ శారదాగ్రయణాది • కాలచోది
తక్రతువు లొనర్పవలె, శ్రౌ • త పశుబంధ
నము వనాశ్రమములకును నిం • ద్యము కుమార! 10

1. అధ్యాయప్రారంభము 26-6-1946

వ. ఇట్లు వన్యద్రవ్యంబులచే దర్శపూర్ణమాసములను నగ్నిహోత్రంబులను
చాతుర్మాస్యంబులను వనాశ్రమి యాచరింపవలయు నని నైగమవచన
మ్ములు గలవు. 11

కం. ఈమాడ్కిఁ దపముచేసి త,పోమయుఁ డను గొల్చునట్టి ♦ ముని కృశదేహుం
డామకొను నన్ను; విఘ్నము,ప్రామినఁ గ్రమము ఋషిభు♦వనములవలనన్.

కం. ఎమ్మెలప్రోవులు మిగులఁగ, నిమ్మెయిఁ దప మాచరించి ♦ యెలమిని గైవ
ల్యమ్మును బొందక యల్పి,యమ్మగు కామమ్ముఁ గోరు ♦ నజ్ఞుఁడు గలఁడే? 13

చం. శ్రవణము శబ్దముం గొనదు ♦ చక్షువు దృష్టి యడంగిపోవు స్నా
యువుల సిరాముఖాదులఁ గ ♦ దుష్ణ బృహ ద్రుధిరప్రవాహముల్
సవగనరాశి వట్టుఁ, జెలు ♦ చర్మము లంగము నిండు, నక్కటా!
యువయువపాటవం బెడలు ♦ నన్ని బలా లుడుగుం జరాదశన్. 14

చం. తడఁబడు నంఘ్రినాళములు ♦ తావులు దప్పెడు దంతపంక్తులున్
వడకెడు నంగుళుల్ ముడుత ♦ వాలు నసృగ్వర, కుత్తుకం దగు
ల్వాడెడు నెలుంగు, గల్గు ముది ♦ వగ్గగుటం బలమేది యాత్మలో
నిడుకొని పావనాగ్ని స్మరి ♦ యించుచు నన్ ముని వహ్నిఁ దూరనౌ. 15

— శ్రీకృష్ణుఁ డుద్ధవునకు సన్న్యాసి ధర్మములు నుడువుట —

తే. బ్రహ్మలోక పర్యంత భు ♦ వనము లెల్లఁ
గర్మఫలరూపముల్ దుఃఖ ♦ కారణమ్ము
లని విరక్తి వహించి న్య ♦ స్తాగ్ని యగుచు
నతఁడు సన్న్యసింపంగనౌ ♦ నద్ది వినుము. 16

కం. రాజ బ్రాఢ్ద్యాష్టక యు,క్ప్రాజాపత్యేష్టి మత్స ♦ పర్య సలిపి ని
ర్వ్యాజత సర్వము ఋత్విగ్రాజి కొసఁగి, యగ్ను లెల్లఁ ♦ బ్రాణోపాధిన్. 17

కం. ఆరోపణ మొనరించి స,మారూఢ విరాగితా చ ♦ లాత్ముం డగుచున్
దారాది విఘ్నతతి నటు,పాఱనడఁచి స్వీకరింప ♦ వలెఁ బ్రవ్రజ్యన్. 18

వ. అట్టి సమయంబులనే 19

కం. ఈవిప్రుఁడు మాపదముం,బోపీడునె! పరమపదము ♦ పొందునె? యనుచున్
దేవళ్ళు విఘ్నవితతిం,గావింతు రసూయఁ బెక్కుఁ ♦ గతులఁ గుమారా!

వ. కానఁ గావితాల్ప్ప జాగరూకుండై మెలంగవలయు. ఇఁకఁ దద్ధర్మముల
వినుము. 21

సీ. ముని ధరింపఁగఁ దలం ♦ చిన సమాచ్ఛాదనా
ర్థమ్ము కౌపీనమ్ము ♦ తాల్పవలయు
ననఘ! ప్రేషోచ్చార ♦ ణానంతరము దండ
పాత్రలు దక్కఁ దా ♦ ల్పంగరా, ద
నావవలం దిత ♦ రార్థముల్; ముందుగా
నీక్షించి శుద్ధత ♦ నెఱిఁగి కాలు
పెట్టవలయు, వడి ♦ గట్టిన జలమును
ద్రాగంగవలయు, స ♦ త్యమునఁ బూత
తే. మైన వచనంబు నెవుడుమా ♦ టాడవలయు;
స్వాంతపూత కార్యంబులు ♦ సలుపవలయు
మనమున ననిలాయామమ్ము ♦ తనువునకును
గామ్యకర్మపరిత్యాగ ♦ కలన మఱియు 22

తే. వాక్కునకు నభాషణమును ♦ బ్రౌఢమైన
దండములుసుమ్ము యేతదం ♦ తర్నిగూఢ
దండములు లేక బాహ్యము ♦ ద్దండవేణు
దండమును ధరించిననే త్రి ♦ దండి గాఁడు. 23

సీ. అశ్వస్తనికులు త్ర్యై ♦ హైహికుల్ కుంభిధా
న్యకులు కుసూలధా ♦ న్యకులు నాఁగ
నలరు వారలలోన ♦ నభిశస్త పతితుల
వర్జించి కడమ వి ♦ ప్రగృహములకు
మున్నుగా నియమితం ♦ బులు సేసికొనక తా
నేకింటి కరిగి యె ♦ య్యేది లభించ
నద్దాన సంతుష్టుఁ ♦ డగుచు బహిర్జలా
శయమున కరిగి యా ♦ చమన మాచ
తే. రించి మౌనియై జలము ప్రో ♦ క్షించి శైక్ష
మును హరిబ్రహ్మరవిభూత ♦ ములకుఁ బంచి
కడమ యన్నమంతయును మె ♦ క్కంగవలయుఁ
జాలకున్నచో మరల భై ♦ క్షంబు తగదు. 24

కం. ఆత్మరతుఁడు నిస్సంగుం, డాత్మక్రీడుండు సంయ ♦ తాఖిలగుణుఁ డ
ద్ధాత్మబలుఁడు సమదర్శనుఁ, డాత్మైకసహాయుఁడగుచు ♦ నటఁదిరుగవలెన్.

కం. త్రాసం బొదవని విజనా,వాసంబున విశ్రమింప ♦ వలయు నెడఁద నా
పై సారించి యభేదో,పాసనమును సలుపుచుండ ♦ వలయు సతంబున్. 26

క. ఇంద్రియములవిక్షేపము, సాంద్రంబగు బంధమనియు ♦ సంయమవిధి ని
స్తంద్రవిముక్తి యనియు ముని, చంద్రుఁడు జ్ఞానైకనిష్ఠఁ ♦ జర్చింపఁదగున్. 27

క. షడ్వర్గము గెల్చి యఖిల, తృడ్వైరాగ్యము వహించి ♦ యెదయం దమర
ద్విడ్వైరి నన్ను నిలిపి ము, నీడ్వందితుఁ డాత్మసౌఖ్య ♦ మింతయుఁ గాంచున్.

ఉ. తీర్థములం బవిత్ర వన ♦ దేశముల న్మునిభూములన్ స్వభి
క్షార్థము గ్రుమ్మరం దొడఁగు ♦ చల్లన గ్రామపురవ్రజంబులన్
సార్థములం జొరంజను శి ♦ లాదిసువృత్తివిశిష్టభక్తమ
త్యర్థమనోవిశుద్ధికర ♦ మాట వనాశ్రమి భిక్షుయే యుటుల్. 29

క. విశ్వంబు దృశ్య మఖిలము, నశ్వరమం చిహపరభువ ♦ న సుఖార్థశ్రుతిన్
విశ్వాస ముడిగి భిక్షువు, శశ్వదశక్తతను నిత్య ♦ సౌఖ్యము గాంచున్. 30

క. మమతాస్పద మేతద్విశ్వ; మహంతాస్పదము తనువు ♦ సర్వము మాయా
భ్రమణమని స్వప్నదృష్టాం, తమునం దర్కించి మరలఁ ♦ దవులక డాసిన్ 31

వ. ఆత్మనిష్ఠుండై యుండు నని శ్రీకృష్ణుండు నుడివి మరల నిట్లనియె నుద్ధవా! ఇవి బహూదకాదిధర్మములు. ఇంకం బరమహంసాదిధర్మముల నుడివెద విను. జ్ఞాననిష్ఠుండై విరక్తుండై గాని మద్భక్తుండై యనపేక్షకుండై గాని త్రిదండాదిసహితాశ్రమ సద్ధర్మములయందలి యాసక్తిని విడిచి యథోచితధర్మముల ననుష్ఠించుచు నవిధిగోచరుండై పరమహంసచరించు. 32

సీ. జ్ఞానియయ్యును బిల్ల ♦ వానివలెఁ జరించు
మానావమానముల్ ♦ మదిని గొనక
నిపుణుఁడయ్యును జడు ♦ నింబోలె దిరుగు ఫ
లాభిసంధికిఁ బ్రాఁకు ♦ లాడఁబోక
విద్వాంసుఁడయ్యును ♦ బిచ్చివానివలె మె
లఁగు జనరంజనా ♦ లాప ముడిగి
బహువేదనిధియయ్యుఁ ♦ బామరునట్లు గ్రు
మ్మరు సదాచారమ్ము ♦ మంటఁగలిపి

ఆ. స్నాన మాచమనము ♦ శౌచంబు నాదిగా
గలవి విధి యటంచు ♦ సల్పఁబోఁడు
పరమహంసచర్య ♦ లరుదుగాఁ గనఁబడు
దేవభాగపుత్రి! ♦ దీరమిత్ర! 33

సీ. కర్మకాండము నెవ్యా ♦ ఖ్యానించు వేదవా, దరతుండుగా రాదు ♦ తచ్ఛ్రుతిస్మృ
తులకు విరుద్ధంపుఁ ♦ ద్రోవను బోవుపా, షండుండుగా రాదు ♦ సతము తర్క

నిష్ఠల హైతుక ♦ నేతయుఁ గారాదు, నిష్ప్రయోజనగోష్ఠి ♦ నిలిచి వాద
ములలోననొకపక్ష ♦ మునుబూని వాదింప, రాదన్యులకుఁజంక ♦ రాదుమఱియు

తే. జనుల భక్తుఁ బెట్టరాదు శి ♦ ష్యులను విగ్ర
హింపరా, దెరిని బరాభ ♦ వింపరాదు
పశువువలె మేనికై పగఁ ♦ బట్టి యితర
జనముఁ బీడింపఁ దొడఁగరా ♦ దనఘచరిత !

కం. ఇందుం డుదపాత్రంబుల, యందుంబలె భూతచయము ♦ లందుం దనయం
దుం దోఁచు నొక్కయాత్మయె, యింతటిభూతంబులెల్ల ♦ నేకాత్మకముల్ 35

వ. అని పరివ్రాజకోత్తముండు విచారింపవలయు. మఱియు 36

కం. తనకుం దఱి కన్నము దొర, కిన మోదము దొరకకున్న ♦ ఖేదము వొరయం
జన దుభయమ్మును దైవం, బు నధీనంబంచు శాంతి ♦ వొందఁగవలయున్ 37

వ. అట్టులేని భిక్షాప్రయత్న మేలయందువో ! 38

కం. ఆహారమ్మును గొన్నం, దేహము నిల్చు, నది నిలువ ♦ ధృతిమై తత్త్వ
వ్యూహము భేదించును, నది, గాహ్యాద్వయజ్ఞానమొసవి ♦ కల్గు శుభంబుల్. 39

కం. అనఘ! యదృచ్ఛగలభియుం, చిన యన్నం బెట్టిదైనఁ ♦ జేకొనవలయున్
మునివర్యుఁ డక్లె శయ్యా, సన వస్త్రాదుల గ్రహింపఁ ♦ జనుఁ బ్రాప్తింపన్. 40

తే ఏను లీలగా నటు చరి ♦ యించు చుంటి
నట్టె జ్ఞానియుఁ జరియింప ♦ నగునుగాని
యాచమనము స్నానము శౌచ ♦ మన్యనియమ
ములను విధియించు మాత్రము ♦ నలుపరాదు. 41

కం. భేదప్రతీతి ముని కు
త్పాదిల్లద యవ్వడష్టా ♦ దవునే మద్వి
షాద్వృతి నది వెంటనె హత
మా దేహాంతమునమాత్ర ♦ మతఁ డెనయు నను౯. 42

వ. ఉద్ధవా ! ఇవి విరక్తుండగు నపరోక్షజ్ఞానవంతుని ధర్మములు ఇఁకఁ గేవల
వైరాగ్యవంతుండైన వివిదుషుయతింగూర్చి నుడివెద విను. 43

తే. నమ్మి కామముల్ దుఃఖోత్త ♦ రమ్ములని వ
హించి నిర్వేదమును, సన్న్య ♦ సించి యస్మ
దీయ ధర్మజిజ్ఞాసమై ♦ ధీరుగురుని
డాసి సేవింపవలయు గా ♦ ఢతరనిష్ఠ. 44

కం. ఎంతవఱకు బ్రహ్మ మెఱుఁగు, నంతవఱకు మత్స్వరూపుఁ ♦ డగుగురు శ్రద్ధా
వంతుఁ డనసూయకుఁడు ధీ,మంతుం డై కొలువవలయు♦మాన్యచరిత్రా! 45

వ. ఇంక ననధికారి విషయంబు వినుము. 46

మ. అరిషడ్వర్గము గెల్వఁజాలక ప్రచం ♦ డాత్మేంద్రియశ్రేణి దు
స్తరదర్పంబు నడంపఁజాలక ప్రబల ♦ జ్ఞానోరువైరాగ్యభా
సురచిత్తుండును గాక ప్రవ్రజితుఁడౌ ♦ చో జీవికార్థం బిలన్
సురలం దన్నును నాత్మసంస్థితుని న ♦ న్నున్ మోస గావింపఁడే? 47

కం. ఎవఁ డవ్రతలేకయె కై,తవమున సన్న్యాసివేష ♦ ధారియగునో? యా
యవివేకపాయుం డు,ద్ధవ! యిహాపరలోకములకు ♦ దప్పి చెడెడిన్. 48

వ. మఱియుం జతురాశ్రముల ప్రధానధర్మంబులు విను చెప్పెద. 49

చం. శమము నహింస ప్రవ్రజిత ♦ సత్తము ధర్మము; వీక్షయుం దపః
క్రమము వనస్థధర్మములు; ♦ ప్రాణిచయంబులరక్ష పంచయ
జ్ఞములు గృహస్థధర్మములు; ♦ సద్గురుసేవయె బ్రహ్మచారి ధ
ర్మము; లివిగాక గేస్తునకు ♦ రాజిలు ధర్మము లాలకింపుమా! 50

కం. ప్రమదము భూతసుహృద్భా,వము శౌచము తపము బ్రహ్మ♦వర్తిత్వ ముత్త
మచరితా! ఋతుగామి,త్వమును గృహస్థునకు విహిత♦ధర్మమ్ములగున్.

వ. ఉద్ధవా! యీ నాలుగాశ్రమములవారికి మదుపాసనము ప్రధానధర్మంబని
యెఱుంగుము. 52

ఆ. ఎవ్వఁ డనన్యభక్తి ♦ హృదయుఁడై స్వీయధ
ర్మమ్ముచే భజించు ♦ మత్పదమ్మ
నఖిలభూతములు మ ♦ దాత్మకంబు లటంచుఁ
దలఁచు నతని కొదవు ♦ నలఘుభక్తి. 53

కం. అనపాయిని యగుభక్తి, న్నను సర్వోత్పత్త్యవన వి ♦ నాశకు లోకే
శుని బ్రహ్మకారణుని బొం,దు నవశ్యము వాఁడు సర్వ ♦ తోవృతకీర్తి 54

తే. జ్ఞాన విజ్ఞానయుతుఁడు, వి ♦ జ్ఞాతమద్వి
భూతి, నిజధర్మశుద్ధ స ♦ త్త్వుండు, ఘోర
సంసరణ విరక్తుండు, ని ♦ స్సంశయముగ
నన్నుఁ బొందును యాదవా ♦ న్వయవతంస! 55

వ. వర్ణాశ్రమవంతులకు సదాచారలక్షణంబైన యీ ధర్మము మద్భక్తి యుక్తం
బైనచో నిశ్శ్రేయసకరంబగు. ఓసాధుచరితా! స్వధర్మసంయుక్తుండు కాఁగా

భక్తుండగు. భక్తుండైనచో నన్నుం బొందు నని నీ ప్రశ్నమునకు నుత్తరంబుగాఁ దెలియు మని కృష్ణుండు బోధించె నని శుకమహర్షి వక్కాణించెను. 56

ఇది యష్టాదశాధ్యాయము సమాప్తము.

---

## ఏ కో న విం శా ధ్యా య ము.

కం. అలతియలఁతిపదములతోఁ, గలభావంబెల్లఁ దెల్పఁ ♦ గల తీరుని వ
ల్లులతో రసముట్టి పడెను, నలఘురచన నాకొసంగు ♦ హరిహరనాథా! 1

—♦ శ్రీకృష్ణుండు జ్ఞానవిజ్ఞానములంగూర్చి బోధించుట ♦—

వ. [1] దేవా! యవధరింపుము శ్రీ శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రుని కిట్లనియె అట్లు శ్రీకృష్ణుం డుద్ధవునకు బోధించుచు మఱియు నిట్లనియె. ఉద్ధవా! విద్యాశ్రుతసంపన్నత్వంబున నాత్మతత్త్వంబెఱింగి శ్రుత్యనుకూలతర్కంబున నిర్ణీతార్థుండై కేవలాపరోక్షవిజ్ఞానవిలసితుండైన మహాత్ముం డీద్వైతంబంతయు మాయామాత్రంబని తలంచి తత్సాధనంబైన జ్ఞానంబు నాయందు సన్న్యసించు నియ్యది విద్వత్సన్న్యాసంబు. 2

కం. జ్ఞానికి నిష్టమ్మాత్మ ఫల, మ్మానే, హితసాధనమ్మ ♦ నేనే, స్వర్గం
బే నపవర్గంబేనియుఁ, గానము నాకంటెఁబ్రియము ♦ కం డాతనికిన్. 3

కం. జ్ఞానమున నన్నుఁదాల్చుట, జ్ఞానియె నాకుఁబ్రియతముఁడు ♦ జ్ఞానము మఱివి
జ్ఞానముగలవారలె మ,త్స్థానము క్షేమమని యెఱుఁగఁ ♦ జాలుదు రనఘా! 4

కం. తపముం దీర్థము దానము, జప మితరపవిత్రకర్మ ♦ చయమెద్దియు శు
ద్ధిపరీతుఁ జేయఁజాలద,యెవ్వుడున్ జ్ఞానలవమట్లు ♦ లిద్ధచరిత్రా! 5

వ. కావున నుద్ధవా! జ్ఞానముఁ గలుగువఱకు స్వాత్మని నన్నుఁదెలిసికొని యుపలక్ష్యంబువదలి జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడవై భక్తిభావంబున నన్ను భజింపుము.

తే. జ్ఞాన విజ్ఞానభవ్యయ ♦ జ్ఞమ్మచేత
నన్ను నాత్మని నాత్మలో ♦ నన్ భజించి
సంయమీంద్రులు సర్వయ ♦ జ్ఞపతినైన
నన్నుఁబొందిరి యాదవా ♦ వ్యయులలామ! 7

సీ. అనఘాత్మ! యాధ్యాత్మి ♦ కాదిత్రివిధ వికా
రంబైన యీశరీరంబు మొదలఁ
దుది లేక నడుమను ♦ దోతెంచి నన్నాశ్రి
యించె నియ్యది మాయ ♦ యంచుఁ దలఁపు

---

1 ఈ యధ్యాయప్రారంభము 30—6—1946

కాన దేహమునకుఁ ♦ గల్గు జన్మమ్ము మృ
త్యువు నధిష్ఠానభూ ♦ తుండవైన
నీకు బ్రహ్మమునకు ♦ లేకుండు రజ్జుస
ర్పంబుదృష్టాంత మి ♦ ప్పట్టునందు ;

తే. భ్రమమునకును బూర్వాపరా ♦ నములఁ గాము
లేదు భ్రాంతిచేఁ ద్రాఁటఁగ ♦ ల్పితము నడుమ ;
బొల్చును భ్రమాదిమధ్యాంత ♦ ములను రజ్జు ;
వల్లె నిర్వికారబ్రహ్మ ♦ మలరు సతము. 8

తే. అనిన నుద్ధవుం డిట్లనె ♦ ననఘ ! శుద్ధ
మతులవైరాగ్య విజ్ఞాన ♦ యుతము విపుల
మతిపురాణమౌ జ్ఞానమ్ము ♦ నబ్జజాది
మృగ్యమౌ భక్తియోగమ్ము ♦ నెఱుఁగనిమ్ము. 9

శా, ఘోరాపార భవాధ్వగామి నగుచున్ ♦ క్లేదిష్ఠతాపత్రయ
స్ఫారాఘాత పరంపరాహతుఁడనై ♦ సంతప్యమానుండనై
నీరేజాక్ష ! కృశించి నేను భవదు ♦ న్నిద్రానుకంపామృతా
సారంబున్ బ్రియతాంఘ్రియుగ్మ వనజ ♦ చ్ఛత్రంబు వాంఛించెదన్. 10

తే పుర్వగాధసంసారాంధు ♦ వునను బడితి
గాలసర్పదష్టుఁడనైతిఁ ♦ క్షణికవిషయ
సుఖవిషాక్తుఁడనైతిఁ ద్వ ♦ చ్ఛుభకరోక్తి
సుధను జల్కి నాపైఁ గూర్మిఁ ♦ జూడు దేవ ! 11

చం. అనభగవంతుఁడిట్లనియె ♦ యాదవవర్య ! వచింతు విన్ము ము
న్ననుపమ భారతాజి నఖి ♦ లాప్తసుహృద్గురు బాంధవావళిన్
దునిమి యుధిష్ఠిరుం డెడఁదఁ ♦ దోషముఁజెందక దోషమంటునం
చును బరితాపమొంది శ్రుతి ♦ సూరిని భీష్ముని శత్రుభీష్మునిన్ 12

ఉ. అమ్ములసెజ్జ్రవాలి విష ♦ యవ్రజదృష్టినిద్రోలి యింద్రియై
శ్యమ్మునఁగ్రాలి సాయకచ ♦ యవ్యథమాలి యనూనభక్తిభా
వమ్మునఁదేలి యాత్మరతి ♦ భవ్యసుఖమ్మునుగ్రోలి ధ్యానయో
గమ్మునఁ గేళిసల్పు బుధ ♦ గణ్యుని శంతనుభూవరేణ్యునిన్ 13

కం. చేరం జని భక్తి నమస్కారము గావించి యనుజ ♦ సహితుండగుచున్
గోరి యడిగి ధర్మములిం,పారఁగ నన్నేని వినియె ♦ ననఘచరిత్రా ! 14

వ. అట్లు కొన్ని దినంబులు విని యొక్కనాఁడు 15

కం. ఏను వినుచుండఁ బాండుక్ష్మానాథుని యగ్రజుం డ ♦ జాతరిపుఁడున్ గం
గానందనుఁ బ్రశ్నించె న,నూనంబగుమోక్షధర్మ ♦ మూర్జితభక్తిన్. 16

ఉ. దానికి ధర్మపారగుఁ డు ♦ దారుఁడు భీష్ముఁడు హృష్టమానసుం
డై నను జూచి మ్రొక్కి యమ ♦ జాదుల కాదృతిఁజెప్పె జ్ఞానవి
జ్ఞానములు న్విరాగితయు ♦ శ్రద్ధయు భక్తియుఁగల్గు ధర్మము
ద్దానిని విన్న నే నుడివె ♦ దన్ విను ముద్ధవ! తత్త్వవిద్ధవా!

వ. పురుష ప్రకృతి మహ దహంకార పంచతన్మాత్రములు లనుతొమ్మిదియు, మహాభూతంబులైదును, మనంబుతోడియింద్రియంబులు పదునొకండును, గుణంబులుమూఁడును, నెన్న నష్టావింశతితత్త్వములగు. వీనివలనబ్రహ్మాది స్థావరాంతభూతము లేర్పడుననియు, నీతత్త్వంబులందుఁ బరమాత్మం డొక్కండే యనుగతుండగు ననియు దేనఁ దెలిసికొనుచున్నారో యదియే జ్ఞానము. నావుడు నుద్ధవుండు కార్యకారణాత్మకంబైన యీజగంబు పరమ కారణాత్మకమేగాని తద్భిన్నము కాదని దేనఁ దెలిసికొనుచున్నారో యదియే గదా జ్ఞాన మనిన శ్రీకృష్ణుం డగు నది యట్టిద వినుము. జ్ఞానమున నారోపితజగ మంతయు నేకాత్మకమని భావింతురు కాని దాని ననుభవింపలేరు. విజ్ఞానమున నయ్యధిష్ఠానరూపమగు నేకాత్మతత్త్వము ననుభవింతురు. ఇట్లు జ్ఞానవిజ్ఞానశబ్దములచేఁ బరోక్షాపరోక్షజ్ఞానములు చెప్పఁబడెను. జ్ఞానమే యవ్వల విజ్ఞానమయ్యె. ఈ విజ్ఞానవంతుఁడే జీవన్ముక్తుఁడు. ఇతఁ డొకవేళ సంస్కారశేషమునఁ జూచుచున్నను జూడనట్లే యని యెఱుంగుము. ఉద్ధవా! యీ యిరువది యెనిమిది భావములు త్రిగుణాత్మకము లగుటచే సావయవములు. అందువలన నుత్పత్తిస్థితిలయములు వీనికిం గలవు. వీని యాదిమధ్యావసానంబులందును, గార్యము నుండి యేర్పడు కార్యాంతరమునందును ననుగతంబై యుండునదియుఁ, బ్రతిప్రలయానంతరము శేషించి యుండునదియు సత్తని యెఱుంగుము. ఇట్లొకదానినుండి మఱొకటి సృజ్యంబగుట నన్నిభావములకు నేకాత్మత్వ మిథ్యాత్వమ్ములు గలవని యెఱుంగుము. 'నేహ నానాస్తి కించన' ఇత్యాదిగాఁ గలది శ్రుతిప్రమాణము. 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' అని యీ విధముగా వ్యాసాదులు బోధించినది యైతిహ్యప్రమాణము. శుక్తియందు రజతజ్ఞాన ముదయించి తుదకది మిథ్యయగునట్లే బ్రహ్మమునందు జగము తోఁచి మిథ్యకావచ్చునని యూహించుట యనుమానప్రమాణము. బ్రహ్మకారణముగా నేర్పడిన జగము బ్రహ్మముకంటె వేఱుగాదు. తంతువులు కారణముగా నేర్పడినపటము తంతువులకంటె భిన్నముగామి మనము నిత్యము చూచుచునేయున్నాము. ఇది ప్రత్యక్షప్రమాణము. ఇట్లే

ప్రమాణ చతుష్టయమువలన జగము సత్యముగా దసత్యమనియు సర్వానుగతంబైన యాత్మతత్త్వమే సత్యము నిత్యమైనదనియు లెస్సగాఁ జర్చించి యెఱింగి విరక్తుండు గావలయును. 18

తే. కర్మములు పరిణామాత్మ ♦ కములు, వీనఁ
గలుగు నానత్యలోకసౌ ♦ఖ్యము లమంగ
ళములు, దృష్టమ్ములట్లదృ ♦ష్టములు గూడ
నశ్వరములని విబుధుఁడె ♦ న్నంగవలయు. 19

కం. అనఘాత్మ! భక్తియోగం,బును జెప్పితిగాదె నీకుఁ ♦ బూర్వ, మ్మైనన్
వినుపారు నీకు దానివ,యిని ప్రేముడి గాన దాని ♦ నే విను మరలన్. 20

సీ. అస్మత్కథాశ్రవ ♦ణాభిలాషమ్ము మ, న్నామకీర్తనము మ ♦ త్సేవనబుద్ధి
మత్సేవర్యానిష్ఠ ♦ మత్పరిచర్యా ప్ర, వణ మఖిలాంగాభి ♦ వందనంబు
నాప్రియు భక్తగ ♦ ణంబు సేవించుట, భూతాళి మన్మతిఁ ♦బొందు సేఁయు
టఖిలాంగిక క్రియ ♦ లస్మదర్థంబుగా! బలుకులు మద్గుణ ♦ వచనములుగ

తే. నెడఁద నాకునర్పితముగా ♦ నెలమిగనుట;
యఖిల కామవర్జనము నా ♦ యంఘ్రిభజన
కంతరాయమ్ములగు విఖ ♦ లార్థములను
విడుచుటయు భోగసుఖముల ♦ నడరమియును 21

కం. దానము యాగము హోమము
బోనమిడుట తపము, వ్రతస ♦ మూహము నాకై
తా నాచరించుటయు ని
వ్వానివలన మానవునకు ♦ భక్తి జనించున్. 22

కం. శాంతము సత్త్వభృతమునగు, స్వాంతము నాకర్పణమ్ము ♦సలుప, విభూతుల్
సంతత ధర్మము జ్ఞాన, మ్మెంతయు వైరాగ్య మతని ♦ కెలయుఁ గుమారా!

వ. భక్తులకుం బడయరానివి కలవే ? అట్లుగాక 24

కం. స్వాంతము దేహగృహాదుల, పొంతం దగిలింప గుణస ♦ మూహవశంబై
గంతులిడు చసన్నిష్ఠా, వంతంబై చెడి యభద్ర ♦ ఫలము లొసంగున్. 25

తే. అస్మదీయ భక్తిప్రదం ♦ బగును ధర్మ
మనుప మైకాత్మదర్శనం ♦ బగును జ్ఞాన,
మణిమముఖ్యక మైశ్వర్య♦మగును, గుణము
లం దసంగంబు వైరాగ్య ♦ మగును వత్స! 26

—* శ్రీకృష్ణుండు యమనియమాదిలక్షణముల నిరూపించుట *—

వ. అట్లు శ్రీకృష్ణుండు నుడువ నుద్ధవుండు మదిలో నించుక యోచించి మహా జనప్రసిద్ధంబులైన ధర్మంబు లన్యథావ్యాఖ్యాతంబు లగుటకు విస్మిత చిత్తుండై యమాదులకును నిట్లే సంఖ్యాస్వరూపంబుల వైలక్షణ్య ముండు నేమో యని శంకించి విశేషజిజ్ఞాసువై భగవాను నిట్లు ప్రశ్నించె. దేవా! యమనియమంబు లెన్నిచందంబులు? సెలవిమ్మన భగవంతుం డిట్లనియె.

సీ. సత్య మస్తేయ మ ♦ సంగ మహింసన
మాస్తిక్యము సనంచ ♦ యంబు హ్రీయు
బ్రహ్మచర్యమ్ము స్థై ♦ ర్య క్షమా మానాభ
యమ్ములు పండ్రెడు ♦ యమములగును.
జప తపో హోమ ద్వి ♦ శౌచమ్ము లాతిథ్య
మస్మదర్చనము తీర్థాటనమ్ము
నొజ్జలసేవ ప ♦ రోపకారమ్ము శ్ర
ద్ధయుఁ దుష్టి పండ్రెండు ♦ నియమములగు

తే. యమములు ముముక్షువునకు ము ♦ ఖ్యంబులగు స
కాముసకు నియమములు ము ♦ ఖ్యంబులగును
భువి నివృత్త ప్రవృత్తుల ♦ కివి యుపాసి
తంబులై యపవర్గాభ్యు ♦ దయము లొసఁగు. 28

వ. అనిన నుత్తరుండు దేవా! నా ప్రశ్నంబుల కన్వయవ్యతిరేకంబుల నుత్తరం బొసంగుచు సంశయచ్ఛేదమొనర్ప వేఁడెద. 29

తే. శమదమంబు లెట్టివి? యన ♦ శార్ఙ్గియనియె
శమము మన్నిష్ఠతాబుద్ధి ♦ శాంతియొకఁడ
కాదు; దమము బాహ్యేంద్రియా ♦ గ్ర్యం బడఁచుట
కాని తస్కరాదిదమంబు ♦ గాదువత్స! 30

చం. అనినఁ దితిక్షయెట్టి? దన, ♦ నాతఁడనెన్ బహుదుఃఖముల్ సహిం
ప నగుఁ దితిక్ష, భారములు ♦ పైకొన సైచుటగా దునా; ధృతి
న్ననియెద నెట్టి? దంచనఁగ ♦ నీరజనాభుఁడు మిట్టిపాటులే
కనికియ గాదు జిహ్వానుస్మ ♦ రోశముఁగెల్వఁగ నౌ నటంచనెన్. 31

కం. దానంబెట్టిది? యన,భూఁతాసీక ద్రోహాకర మ ♦ హాదండము నెం
తేని విసర్జించుటయే, కాని ధనాద్యర్పణంబు ♦ గాదనె హరియున్. 32

కం. స్వామీ! తపమెట్టిది? యనఁ, గామత్యాగముగుఁ, గాదు♦గదె కృచ్ఛ్రాది
స్తోమంబని ప్రేమంబున,దామోదరుఁ డాడె నమ్మ ♦ దం బలరారన్. 33

తే. శౌర్యమెట్టిది? నాఁగ, వా ♦ సనలగెల్చు
కాని శత్రులగెల్చుట ♦ కాదని హరి;
సత్యమేది? నా, బ్రహ్మద ♦ ర్శనమె కాని
యుద్ధవ! యథార్థభాషణం ♦ బొకఁడగాదు. 34

చం. అని హరిపల్కె నేదియశ ♦ మం చడుగన్, గనుఁగొన్న దానికిన్
గనిన విధంబునం బలుకఁ ♦ గావగు, నింపుగఁబల్కుచుంట గా
దని హరి; శౌచమేది! యన ♦ ఘా! యనఁ గర్మములం దసంగమం
బునఁ దనరారు స్నానములఁ ♦ బుట్టదటంచనెఁ గృష్ణుఁ డాదృతిన్. 35

తే. త్యాగమెయ్యది? యనఁగ, స ♦ న్న్యాసమనియె;
నిష్టధనమేదినా, ధర్మ ♦ మేసుమీ గృ
హాదికమ్ముగాదని; శ్రేష్ఠమైన బలము
నాడు మనఁగఁ బ్రాణాయామ ♦ మనియె శౌరి. 36

చం. మఱియు నుద్ధవుం డెఱిఁగి ♦ మాధవ! యజ్ఞసుదక్షిణాశ్రమం
బెఱుఁగఁగఁ జెప్పు మన్న హరి ♦ యిట్లను నాయన! యజ్ఞమన్న నీ
శ్వరుఁడగు నేన యంచెఱుఁగు, ♦ జ్ఞానము మర్త్యుల కాదరంబునన్
గఱపుటెసుమ్మి దక్షిణయు ♦ నన్, ధనమిచ్చుటగాద తెంపుమై. 37

సీ. అన నుద్ధవుండు వి ♦ ద్యయనంగ నేది? స్వా
మీ! చెప్పుమన హరి ♦ యిట్టులనియె
నాత్మనియందు భే ♦ దాధ్యాస లేమి వి
ద్యయగును; జ్ఞానమా ♦ త్రంబుగా; ద
నంగ హ్రీ యననేమి? ♦ నా నకర్మముల రో
యుటెగాని సిగ్గిలు ♦ చుంటగాదు;
మండనంబులు తెల్పు ♦ మా? యన నైరపే
క్ష్యాదిగుణములె హా ♦ రాదికములు

తే. కావనియె; సుఖంబెద్ది? నాఁ ♦ గ సుఖదుఃఖ
గణము నంటమిసుమ్మి, భో ♦ గమ్ముగాదు
దుఃఖమెదినాఁగ విషయసం ♦ దోహభోగ
మాససేయుటే, యగ్నిదా ♦ హాదిగాదు. 38

వ. అంత నుద్ధవుండు 39

తే. స్వర్గనరకమ్ములుం బథో ♦ త్పథములుం గృ
హమ్ము లెట్టివి? యనఁ గృష్ణుఁ ♦ డనియె నిట్లు

సత్వగుణసమృద్ధియు యగు ♦ స్వర్గ; మింద్ర
లోకమెంతయుఁగాదు సు ♦ శ్లోకచరిత ! 40

కం. అమిత తమోగుణమే నర,కము తామిస్రాదికంబు ♦ గా; దస్మత్ప్రా
ప్తి మొకయఁజేయునదే మా,ర్గము పదుగురుచనెడిరోడ్డు♦గా దనఘాత్మా!

కం. చిత్తమునకు విక్షేపం,బెత్తించు ప్రవృత్తిమార్గ ♦ మే యుత్పథ; ము
ద్వృత్తస్కారాది పీడా,యత్తంబౌ నడవిగాద ♦ హరిగుణాఢ్యా ! 42

మ. తనువే గేహము; కాదుసంజననసౌ ♦ ధక్ష్మాముఖ్యం బటం
చనఁగా నుద్ధవుఁ డెంతయుక్ హృదఁకుమం ♦ దానందముం బొంది యి
ట్లనియెన్, బండితమూర్ఖ బాంధవ దరి ♦ ద్రాఢ్యేశ లోభుల్ గనుం
గొన నేచందమువారొ ♦ తెల్పవలె నా ♦ కిక్ భక్తహృన్మందిరా ! 43

వ. అనిన శ్రీకృష్ణుం డిట్లనియె. 44

కం. మనమున బంధము మోక్షం,బు నెఱింగిన వాఁడ విబుధ♦ముఖ్యుఁడు,సాహి
త్యనిబంధనంబు దనరా,రిన మాత్రంబుననె గాదు ♦ కృతపుణ్యామణీ ! 45

తే. కడునహంకారమును మమ ♦ కారమును శ
రీరగేహాదులందుఁ జే ♦ ర్చినను మూర్ఖుఁ
డవు వథాదులంగాఁడు; బం ♦ ధువన మత్స్వ
రూపుఁడైన యాచార్యవ ♦ ర్యుండె వత్స ! 46

వ. అంతియకాని భ్రాతాదులు బంధువులుగారు పిదప వినుు. 47

మ. తనివింజెందనివాఁడ పేద, ధనసం ♦ తానంబు లేకున్నఁగా;
డనఘా ! మేలిగొనంబు లున్నతఁడె సు ♦ మ్మాఢ్యుండు, రాజ్యాదులుం
డినఁగాఁ; డింద్రియవర్గముం గెలువఁడే ♦ ని న్వాఁడెపో ట్స్వుదుఁ; డె
ట్లును దీనుండునుగాఁడు ! దుర్విషయులో ♦ లుండే యనీశుం డిలన్. 48

వ. గుణములం దసక్తబుద్ధి యగువాఁడె యీశుండు. రాజుగాఁడునుమీ;
ఉద్ధవా! నీ ప్రశ్నలెల్ల లెస్సగా నిరూపితంబులయ్యె. ఏల పెక్కుమాటలు?
విషయ సుఖముల గుణములుగాను దుఃఖముల దోషములుగాను నిట్లు
గుణదోషముల రెంటెం జూచుటయు దోషమే. కాన గుణదోషవర్జనమే
గుణ మంచెఱుంగు మని శ్రీకృష్ణుండు బోధించెనని శుకమహర్షి వచించె. 49

ఇది యేకోనవింశాధ్యాయము సమాప్తము.

---

## వింశాధ్యాయము

కం. దేవా! యమేయవిలస,ద్భావా! యమితప్రభావ! ♦ భక్తప్రియసే
వా! విశ్వరక్షణకేళీ. వ్యావృతమృదులస్వభావ! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. ఉద్ధవుండు శ్రద్ధగా మాధవుబోధసుధం ద్రావి యంజలి ఘటించి యిట్లనె. 2

తే. స్వామి! నీయాజ్ఞలుగదె ప్రాఁ ♦ జదువులెల్ల
నవి విధిప్రతిషేధరూ ♦ పాంచితమ్ము
లై విధేయనిషేధ్య క ♦ ర్మాళివలన
నొదవఁజేయవె గుణదోష ♦ యోగములను. 3

మ. అనఘా! యీగుణదోషమేగద వృషాం ♦ హస్సంహతిం గూర్చు, దా
ననగా దే సురలోకము న్నరకము ♦ న్గాలంబు దేశంబు ద్ర
వ్యనికాయంబు వయస్సు నాశ్రమములు ♦ న్వర్ణప్రభేదంబు ల
య్యనులోమ ప్రతిలోమజాదికము నం ♦ ప్రాప్తించు మర్త్యాళికిన్. 4

వ. మఱినీవు [2] గుణదోషదర్శనము దోషమంటివి కృష్ణా! ఇది యెట్లు? 5

కం. గుణదోషభిదాదృష్టిం గణింపమేన్ విధినిషేధ ♦ కాండోజ్జ్వలల
క్షణమైన తావకవచో, గణము నరులకెట్లు ముక్తిఁ ♦ గల్గించెడినో! 6

కం. పితృసుమనః పంచజన, ప్రతతి కనుపలబ్ధ నాక ♦ పదమోక్షాదుల్
వెతకునది సాధ్యసాధన, గతియగునది నీదుశ్రుతియె ♦ గదె కన్నుహరీ! 7

కం. భావత్కాజ్ఞారూపం, బౌ వేదమె దోషగుణ న ♦ మాలోకనముం
గావించుట మాన్పించుట, యేవడువున రెండుసేయు ♦ నిదివింతగదే! 8

వ. అనిన శ్రీకృష్ణుం డిట్లనియె దేవభాగాత్మజా! భక్తిజ్ఞానకర్మంబు లను మూఁడుయోగంబుల నుడువనే! 9

—♦ శ్రీకృష్ణుం డుద్ధవునకు కర్మయోగము నుపదేశించుట ♦—

మ. ఫలకాముల్ వహియింత్రు కర్మపథమున్, ♦ ప్రస్ఫీతవైరాగ్య వం
తులు జ్ఞానాధ్వముఁగంద్రు, కర్మఫలసం ♦ దోహంబు వర్జించి; యి
ట్టులు నిర్వేదము నట్లుకర్మఫలదృ ♦ ష్టుల్ బిట్టుగైకోని వా
రలు యాదృచ్ఛికమత్కథారతి యొల ♦ ర్పన్ గొంద్రు భక్త్యధ్వమున్. 10

---

1 అధ్యాయప్రారంభము 8–7–1948 2. 19 వ అధ్యాయమున 49 వచనము

తే. అంతవఱకుఁ గర్మములు చే ♦ యంగవలయు
నెంతవఱకుఁ గర్మవిరక్తి ♦ యెలయఁబోవ
దెంతవఱకు మత్సుగుణ వి ♦ స్తృత కథాను
కీర్తన శ్రవణాదులఁ ♦ గెరలదెలమి ; 11

మ. తనధర్మంబున సుస్థిరుండయి సము ♦ త్సాహాతిరేకంబు పొ
ల్పున యాగంబులొనర్పుఁ గాని ఫలలో ♦ లుం డెంతయుంగామి నా
కనివాసుండునుగాఁ; డతం డనఘుఁడై ♦ కాంక్షింపఁబోవం డధ
ర్మనిషిద్ధక్రియ లట్లుగాన యమస ♦ ద్మంబుం గనం డుద్ధవా ! 12

కం. విను మిట్టి స్వధర్మస్థుం, డనఘుండు యదృచ్ఛఁ బొందు ♦ ననుపమమద్భ
క్తినయిన, నత్యంత విశుద్ధ నిరాఘజ్ఞానమైన ♦ దా నీమేనన్. 13

కం. నిరయులయిన స్వర్గులయిన, నరలోకంబునకు రా మ ♦ నంబులఁ గాంక్షిం
తురు జ్ఞానభక్తిసాధక, మరయఁ బుడమిగాన;ఁ గావ♦యవి యట్లనఘా! 14

కం. నరుఁడు నరకమ్మునవలె గో,పురమునయిత మొదఁదఁగోరఁ♦బోలదు మఱియీ
నర దేహమ్ము ప్రమాదా,కరమగుట నృలోకముం ద ♦ గదు కాంక్షింపన్.

కం. మఱి యీ కళేబరము న,శ్వరమైనం బూరుషార్థ ♦ సాధకమగుటం
బరికించి ముక్తికొఱకై, నరుఁడు గడఁగవలయు మేను♦నలఁగకమున్నే. 16

చం. నెన రెదలేని కూళలు స్వ ♦ నీడయుతాగముఁ దున్మఁచుండఁ జూ
చిన ఖగ మొండుతావునకుఁ ♦ జేరి సుఖించెడునట్లు, రేఁబవ
ళ్ళనిశము నాయువుం దినుచు ♦ నాడుట యారసి ముక్తసంగుఁడై
మొనరి నిరీహుఁడై వరముఁ ♦ బొంది నరుం డుపశాంతి గాంచనా. 17

మ. నరదేహం బతిదుర్లభం, బెటులొ పొం ♦ దం గన్నవాఁ డీకళే
బరమే నావగ, నానుకూల్యపవనద ♦ క్షస్పృష్టి నేఁగా, మహా
గురుఁడే ధూర్వహకర్ణధారుఁడుగ నీ, ♦ ఘోరోరుసంసారసా
గరముం దాఁటని వానికంటె నెవఁ ♦ డింక న్మూఢుఁ డార్యాగ్రణీ ! 18

వ. అట్టివాని నాత్మఘాతకుం డనవలదే! ఇంతవఱకు నవిరక్తునకు వైరాగ్య ద్వారమున జ్ఞానభక్తిసాధకంబైన కర్మయోగము నుడివితి నింక విరక్తుని జ్ఞానయోగము వినుము.

## —* శ్రీకృష్ణుఁడు జ్ఞానయోగ ముపదేశించుట *—

మ. సమకర్మంబులరోసి తత్ఫలవిలా ♦ సశ్రేణిపై రాగభా
వము వర్జించి, హృషీక సంచయము ద ♦ ర్పంబు న్విదారించి ని

త్వము నాత్మాభ్యసనంబుమై స్థిరతర ♦ త్వప్రౌఢి భాసిల్లఁ జి
త్తముచాంచల్య మడంచి నిల్పవలయుం ♦ దత్త్వజ్ఞుఁ డార్యోత్తమా! 20

చం. మొదటనె ధారణాపటిమ ♦ పూన నశక్యము సూ, పరిభ్రమా
స్పదనము మానసప్రకృతి, ♦ సంభ్రమ మింతయు లేక నేర్పుమైఁ
దదనుగుణంబుగాఁ జనుచు ♦ దాని వశంబొనరించుకోఁదగున్
వదలఁగరాద యభ్యసన ♦ పాటవశాలి కసాధ్యమున్నదే? 21

కం. అనువుల హృషీకచయముల, విసువక కణఁచిపెట్టి సత్త్వ ♦ విస్ఫురద్బుద్ధ్యు
ల్లసనమ్ము చేతఁజామి కై, వశముం జేసికొనవలయు ♦ స్వాంతము ననఘా! 22

ఉ. గంతులు వేయుచు న్వశము ♦ గాని జవాశ్వము నెట్లు పట్టి రే
వంతుఁడు తద్గతిం జనుచు ♦ వావిరి వాగెల బిగ్గపట్టి తా
నెంతయు లోను జేసికొను ♦ నీక్రియ నేతదనుప్రవర్తనన్
స్వాంతము నిగ్రహింపవలెఁ ♦ జక్కని యోగ మిదే కుమారకా! 23

తే. అఖిలభావమ్ములును మహ ♦ దాది విగ్ర
హాంత మనులోమమునఁ బుట్టు ♦ నంచుఁ బుడమి
మొదలు ప్రతిలోమమున లయం ♦ బు గనునంచు
సాంఖ్యదృష్టిఁగన్న మనంబు ♦ చలన ముడుగు. 24

కం. కడునిర్విణ్ణుండు విరక్తుఁడు నగు పురుషోత్తముండు ♦ గురు నుపదేశం
బొడికముగ విచారించిన, నొడలిపయి న్మమత యుడిగి ♦ యుల్ల మెలర్చున్.

తే. యమము మొదలగు యోగమా ♦ ర్గములచేత, నైన నాన్వీక్షకీవిద్య ♦ నైన నస్మ
దర్చనోపాసనాదుల ♦ నైన నన్నుఁ, బొందవచ్చు నన్యోపాయ ♦ ములను గాదు.

వ. ఉద్ధవా! ఇట్టిచెయ్వులచే మనమ్ము విషయాసక్తిం దొఱంగెడిని. 27

కం. యోగీశ్వరుఁడు ప్రమాదము, చే గర్హితకర్మములను ♦ జేసినచో నా
యోగమ దహించుఁ గల్మష, పూగముఁ గృచ్ఛ్రాదు లేల ♦ పొనరింపవలెన్?

కం. పూరుషులకుఁ దమతమ యధి, కారము పైనిష్ఠ గుణము ♦ గా నెఱుఁగుమ యా
తీరునకు విపర్యయమే, భూరితరంబైన దోష ♦ ము యదుప్రవరా! 29

వ. ఇయ్యది గుణదోష వినిశ్చయప్రకారంబు. ఉద్ధవా! యుత్పత్తిచేతనే యపరిశుద్ధములైన యీకర్మముల ననుష్ఠింపక యుజ్జగించుటకై యీగుణదోష విధానముచే నియమము చేయఁబడినది. అధికారిభేద ముంటచే నొక్కసారియే నివృత్తిని నిర్ణయింపక యిది చేయఁదగు నిదిచేయఁదగదని స్వాభావిక ప్రవృత్తి సంకోచద్వారమున నివృత్తినే వేదము తిన్నగా బోధించెడిని. కానఁ గర్మాచరణము యోగులకు ముఖ్యంబు గాదు.

లేమించే వారికిఁ బ్రాయశ్చిత్తాది విధిగోచరత్వంబును లేదు. ఇంక భక్త్యధి
కారికి భక్తియోగము నుడివెద. 30

—* శ్రీకృష్ణుఁడు భక్తియోగము నుపదేశించుట *—

మ. అనఘా! భక్తుఁడు మత్కథావళులయం ♦ దాసక్తి పెంపారఁగా
మనుచున్ భావిని దుఃఖమిచ్చెడిని గ ♦ ర్మశ్రేణి యంచాత్మఁగ
న్గొనియున్, దత్ఫలముల్ త్యజింపఁగ నశ ♦ క్తుండై క్రియల్సల్పుచున్
వనుసేవించుచు నుండెడి న్నిరుపమా ♦ న శ్రద్ధమై నుద్ధవా! 31

కం. బలవ ద్ధృషీకవర్గ,మ్ముల కడలుచు వానిఁ దిట్టి ♦ పోయుచు విషయ
మ్ముల జుట్టుకొనుచు నన్నె,ట్టులు విడువఁగ లేక కొల్చె ♦దున్ దృఢభక్తిన్.

ఉ. ఇట్టులు గొంత కాలమది ♦ యేగ హృషీకచయంబు నెవ్వఁడుం
దిట్టుటచేఁ గ్రమంబుగ మ ♦ దిం బొడసూపి విరక్తి పెంపుమైఁ
దొట్టు; ననారతంబు నను ♦ దూఁకొని కొల్చుటచే మనంబునం
బట్టుగ నున్న కామములు ♦ పాయుఁ దమంతటతామె యుద్ధవా! 33

కం. అచ్చెరువేలా? యెవ్వఁడు, చొచ్చితినో భక్తహృదయ ♦ శుద్ధగృహమ్మున్
దొచ్చెపుఁగామములవ్వడ, విచ్చి చనున్ రవికి సిరులఁ♦ బ్రిదిలిన భంగిన్. 34

ఉ. ఎన్నఁడు మానసోపగతు ♦ నీశ్వరు నన్నొకఁగాంచు నప్పుడే
భిన్నమగుంజుమీ హృదయ ♦ వీధి నహంకృతి; దానివెంట వి
చ్ఛిన్నమగుం జిరంతనవి ♦ సృత్వర సంశయసంచయంబు; నా
ముస్నె సమస్త కర్మగుణ ♦ ము న్నశియించును భక్తకోటికిన్. 35

ఉ. కాన మదాత్ముఁడౌ సుగుణ ♦ గణ్యుఁడు భక్తున కుద్ధవా! తపో
జ్ఞాన విరాగతా వితర ♦ ణ వ్రత యోగ వితానకర్మ సం
తానములన్ లభింపని యు ♦ దార శుభార్థములెల్ల భక్తియో
గాన లభించు నశ్రమము ♦ గా నపవర్గ దివమ్ము లేనియున్. 36

శా. ఏకాంతుల్ మదధీనచిత్తులు సదా ♦ హృష్టాత్ము లేనేగి కొం
డా కైవల్యమటన్నగూడఁ గొనరె ♦ ద్ద వ్మద్గుణాస్వాదనాం
గీకారమ్ము వహించి, శ్రేయములఁ గ ♦ ల్గించు న్నిరాశత్వమే
యాకాంక్షా రహితాంతరంగులకె ను ♦ మ్మా భక్తి భాసిల్లెడిన్. 37

కం. నిరపేక్షత్వము యుత్తమ:పురుషార్థోపకరణమని ♦ బుధులందురొకం
దిరియనినిష్కామండౌ, పురుష శ్రేష్ఠుండు లోక ♦ పూజ్యుఁడు తండ్రీ! 38

తే. సాధులగు భక్తులకు సమ ♦ స్వాంతులకును
బుద్ధికిం బరు నీశుని ♦ బొందియున్న

వారలకుగుణదోషోద్భ ♦ వములు పుణ్య
పాపములు లేవు యాదవా ♦ న్వయవతంస ! 39

తే. ఇట్లు నేను బోధించిన ♦ యీమదీయ
మార్గములఁ బోవుచుండెడి ♦ మానవులకుఁ
గాలమాయాదిరహితమ్ము ♦ ఘనతరమ్ము
మత్పరమపదమ్ము లభించు ♦ మానితమ్ము. 40

వ. అని శ్రీకృష్ణుండానతిచ్చెనని శుకమహర్షి నుడివెను. 41

ఇది వింశాధ్యాయము సమాప్తము

---

## ఏ క విం శా ధ్యా య ము

కం. ఎంతసుకృతమ్ముగల గుణ, వంతులొ గాదె తత్త్వవిద్య వాంఛించుట యు
శ్రాంతము వినఁగల్గుట వి, స్వాంత యనుభవమునఁ గనుట ♦ హరిహరనాథా!

♦– శ్రీకృష్ణుం డుద్ధవునికి ద్రవ్యాది గుణదోషముల వివరించుట –♦

వ.[1] దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె నావల శ్రీకృష్ణుం డుద్ధవుని ప్రశ్నంబు స్మరించి యిట్లనియె. ఉద్ధవ! గుణదోషవ్యవస్థార్థము యోగత్రయ ముపదేశించితి. అందు జ్ఞానభక్తిసిద్ధుల కెట్టి గుణదోషమ్ములు నుండవు. ఇంక సాధకుల వినుము. నివృత్తకర్మనిష్ఠులగు సాధకులు ప్రథమంబున నిత్య నైమిత్తిక కర్మముల యథాశక్తి నాచరించినచో సత్త్వశుద్ధి సిద్ధించుం గాన నది వారికి గుణము. తదకరణమ్మును నిషిద్ధకరణమ్మును దోషమ్ము. తన్నివర్తకమ్మగుటఁ బ్రాయశ్చిత్తముగుణమ్ము. మఱియు విశుద్ధసత్త్వులగు జ్ఞాననిష్ఠులకు జ్ఞానాభ్యాసమే సిద్ధిహేతువగుటచే నదియ వారికి గుణము, తద్విరుద్ధము దోషము. ఇంక భక్తినిష్ఠులకుఁ బునఃపునః శ్రవణ కీర్తనాది భక్తియే గుణము. తదన్యంబు సర్వంబు దోషంబు సిద్ధుల సాధకులఁ జెప్పితినిగదా. ఇటమీఁద మూఁడవ తెగవారిం జెప్పెదవినుము వారు కేవలము కామ్య కర్మప్రధానులగుట వారికి సకలగుణదోషములుంగలవు. అవి వినుము. 2

కం. స్వయమున భక్తిజ్ఞాన, క్రియాత్మ శాస్త్రత్పథముఁ ♦ గ్రేడించి ముద
ర్థియయియధమభోగములిం, ద్రియములఁగొనువాఁడుసంస్మృ ♦ తిందిరుగాడున్

కం. పూరుషులకుఁ దమతమయధి, కారము పైనిష్ఠ గుణము ♦ గా నెఱుఁగుమ, యా
తీరునకు విపర్యయమే, భూరితరంబైన దోష ♦ ము యదుప్రవరా! 4

---

[1] 14-7-1946 తేదీ నీ యధ్యాయము ప్రారంభము.

వ. ఇది గుణదోషవ్యవస్థ యని మున్ను నొడివితి. ఈ గుణదోషమ్ము లధికారి
భేదంబునఁ గల్పితంబులు గాని వస్తునిష్ఠంబులుగావు. 6

తే. అఖిలవస్తువుల్ పంచభూ ♦ తాత్మకంబు
లగుట నన్నియుఁ దుల్యంబు ♦ లైనఁగాని
యందుయోగ్యమెయ్యదియో ! యె ♦ య్యదియుఁగాదో,
యనెడు విచికిత్స దీర్పుట ♦ కై కడంగి 6

తే. సుభగధర్మార్థమై శుద్ధ్య ♦ శుద్ధులు, వ్యవ
హారమునకయి గుణదోష ♦ వారము, తను
యాత్రకై శుభాశుభము లే ♦ నలరిచితిని
గర్మజడులకు మనువు ము ♦ ఖమున వత్స ! 7

ఉ. ధాతనుదొట్టి దృశ్యమగు ♦ స్థావరవర్గముదాఁక దేహసం
ఘాతము పంచభూతవరి ♦ కల్పిత మాట సమంబ; యాత్మలుం
బ్రాఁతిగఁదుల్య; లట్లయినఁ ♦ బ్రాణులకుం బురుషార్థసిద్ధి కా
మ్నాతము నామరూపవిష ♦ మత్వము వేదమునన్ యదూద్వహా! 8

కం. తనువులకె గాదు వస్తువు,లనఘా! దేశంబు కాల ♦ మధికారి ఫలం
బు నిమిత్త మన్నిటికిఁ గ,ర్మనియమ మలర గుణదోష♦రాజి యొసంగున్. 9

తే. కృష్ణసారసంచారరా♦హిత్యదేశ, మశుచి; బ్రాహ్మణభక్తిశూ♦న్యమగు దేశ
మెంత యేనశుద్ధము; కృష్ణ♦మృగరమేత, మయ్యునశుచిసజ్జనులుండ♦ నట్టినేల.

కం. కీకటదేశ మశుద్ధం; బాకటిలమ్లేచ్ఛబహుళ ♦ మగుదేశమ్మా
పాకలితదేశమశుచి; యి,టే కాలమ్మునుగుణించి♦యెఱుఁగు కుమారా ! 11

సీ. కలితపూర్వాహ్ణాది♦క స్వతస్సిద్ధినే.ద్రవ్యర్థినేని క ♦ ర్మణ్యమైన
కాలంబుశుద్ధ; ము♦ద్వేల విత్తాలాభ, రాష్ట్రడింబాది కా ♦ రణములొదవఁ
గర్మముల్ సలుప శ♦క్యంబుగాదౌట న,క్కాల మశుద్ధంబు ♦ శీలవర్య !
బ్రాహ్మణోక్తులనైన ♦ వార్యాది వస్తుయో,గమ్ములనైన సం ♦ స్కారవశత

తే. నైనఁ గాలమహత్త్వాల్ప♦తాదినైన, వస్తులకు శుద్ధ్యశుద్ధులు ♦ వరలుచుండు
బుద్ధులన్ శక్త్యశక్తిస♦మృద్ధుల న్వి,శుద్ధ్యశుద్ధులు సంభవిం ♦ చుం గుమార!

వ. ఎట్లన, ద్రవ్యములకుఁ దోయాదిని శుద్ధి, మూత్రాది నశుద్ధి; పుష్పాదు
లకుఁ బ్రోక్షణాదిని శుద్ధి, యవఘ్రాణాది నశుద్ధి; నవోదకాదులకు దశా
హాదికమున శుద్ధి, విపరీతంబున నశుద్ధి, యంత్యజాద్యుపహతంబైన
తటాకాద్యుదకంబునకు మహత్త్వంబున శుద్ధి, యల్పత్వంబున నశుద్ధి;
పుత్త్రజన్మాదికమందు దశాహము గడచెననుబుద్ధిచే శుద్ధియుఁ, గడవలేదను

బుద్ధిచే నశుద్ధియుఁ గలుగును. గ్రహణాదికాలములలో శక్తునకు భోజనా
దుల నశుద్ధి, అశక్తులైన బాలవృద్ధాతురాదులకు శుద్ధి; జీర్ణమలినవస్త్రా
దులు సంపన్నున కశుద్ధి, దరిద్రునకు శుద్ధి; యివ్విధంబున ద్రవ్యాశుద్ధులు
దేశావస్థానుసారంబునఁ బాపము గావించును. ఉద్ధవా! గుణదోషంబు
లిట్లెఱుంగునది. మఱియు, 13

సీ. కొలుచు కాలాతపా ♦ దులను, దారువు మృజ్జలాదుల, ద్విరదదం ♦ తాదికీక
సమ్ము లత్యంతశో ♦ షణములఁ, దంతువు, లంబులఁ, దైలఘృ ♦ తాదిరసము
లౌష్ణ్యంబుచే, పాట ♦ కాది తైజసములు, వహ్నిచేఁ జర్మమ్ము ♦ వారిమృత్తి
కాదులచే శుద్ధ ♦ మగుఁ; బార్థివముల కి,తరపదార్థ యుతాయు ♦ తముల నివ్వి

తే. కలుగఁ, గాకాంత్యజాద్యుప ♦ ఘాతములకు
దేశకాలాదులంబట్టి ♦ తెలియవలయుఁ
పాత్ర, పీఠ, వస్త్రా, ద్యప ♦ విత్రతచను,
నాఘ్లికాంబు, తక్షణ, సలి ♦ లాదికముల. 14

చం. అనఘ! యమేధ్య లిప్తమగు ♦ నట్టి పదార్థములెల్ల గంధలే
పనము లడంగి స్వప్రకృతి ♦ భాసిలునంతకు క్షాలనాదికం
బొనరుప శుద్ధిపొందు; నివి ♦ యుజ్జ్వల మానసులైన పెద్దలం
గనుఁగొని యానుపూర్వికము ♦ గాఁ దెలియందగు దేవభాగజా! 15

కం. దానమ్ముల సంస్కృతిక, ర్మానీక స్నానబలత ♦ పోవస్థల మ
ద్ధ్యానమున నాత్మశౌచం, బౌ నావల ద్విజులు సేయ ♦ నగుఁ గర్మంబుల్. 16

తే. మహిత గురుబోధచేతనే ♦ మంత్రశుద్ధి
యస్మదర్పణమ్మునసె క ♦ ర్మాళిశుద్ధి
దేశకాల సద్ద్రవ్య క ♦ ర్తృ మను కర్మ
శుద్ధి గలది ధర్మము; కాని ♦ చో నితరము. 17

కం. ఒక్కెడదోషంబె గుణ, మొక్కెయెడం గుణమె దోష ♦ మగు శాస్త్రవిధిఁ
నిక్కము గుణదోష నియమ, ఫక్కి విషయభేదములను ♦ బాధించు నిటుల్.

వ. ఎట్లనఁ బ్రతిగ్రహ మాపదలందు గుణము, ననాపదలందు దోషము; పర
ధర్మము తనకుదోషము, పరునకు గుణము; కుటుంబత్యాగము విరక్తునకు
గుణము, నవిరక్తునకు దోషము. ఇట్లెఱుంగునది. 19

చం. క్షితిని సమానకర్మముల ♦ చే గుణదోషము తేర్పడుఁ; సురా
పతితుఁడు పాతముం గనఁడు, ♦ పావనుఁడే కను; సంగమంబుచే
యతివరుఁడొందుఁ బాతము, గృ ♦ హస్థుఁడు పొందఁడ; మ్రాఁకు నెక్కియు
న్నతఁడె పడున్ ధరాశయను ♦ డౌనతఁ డేమిపడుం గుమారకా! 20

కం. ఎందెందు నివృత్తి కలుగు, నందందు విముక్తుఁ డగుట ♦ యావశ్యక మీ
చందమగు ధర్మము శుభం, బుందార్చున్ శోకమోహ♦ములఁ దెగటార్చున్

చం. జనుఁ డెడలోవల న్విషయ ♦ జాల గుణస్మరణం బొనర్చినన్
బొనరును సంగ, మక్కతనఁ ♦ బుట్టును గామము, దానిచేత వ
చ్చును గలహంబు, దానఁ బొడ ♦ సూపును గ్రోధము, దాన మోహముం
గొనలిడు దానమంచిచెడు ♦ గల్ గ్రహియించు వివేకమారెడిన్. 22

కం. మతి విరహిత జంతువు మూ,ర్ఛిత మృతకల్పుండసూ వె♦వృష్ణికులశశీ !
యతనికిఁ బురుషార్థంబులు, వెతకినఁ గనరావ, యేల ♦ వేయువచింపన్? 23

చం. అనవరతంబు దుష్టవిష ♦ యాభినివేశముచేత నాత్మనుం
గనుఁగొనలేఁడు లాఁతులను ♦ గానఁడు భూరుహ జీవికానువృ
త్తిని దను వోముచుం గొలిమి ♦ తిత్తివలెం బవనాభిపూరణం
బొనరుచుచున్ మెలంగు జనుఁ ♦ డుద్ధవ! స్వార్థవిఘాతకుండెగా. 24

* కర్మనిరాసము *

ఉ. ఇమ్ముగఁ గర్మముల్ సలుప ♦ నేచు ఫలమ్ములటంచు వేదమం
త్రమ్ములు వల్కుచుంట యమృ ♦ త స్ఫుటమార్గమునందుఁ జొన్పఁజా
కమ్మని ఖండశర్కరను ♦ గ్రైనిడు లేటికిఁ? దండ్రి పుత్త్రర
త్నమ్మగదంబు మ్రింగనెక ♦ దా, రుచి సూపఁ బ్రవృత్తి కల్గెడిన్. 25

ఆ. జగతి సుఖముకన్న ♦ స్వర్గసుఖముమిన్న, దానికన్న మిన్న ♦ తదపవర్గ
సౌఖ్య మంచుఁ జెప్ప♦జాలున స్వర్గాదిఫలము సెప్పఁబడియెఁ♦బ్రాఁబలుకుల

మ. జనిమాత్రంబుననే యనర్థచయముల్ ♦ సంధించు కామంబు లం
దును బ్రాణంబులయందు స్వీయజనులం ♦ దున్ లిప్స లేపారఁగా,
మనమందెంచక స్వార్థముల్, బహుళసం ♦ సారాంబుధిం గూలి యు
న్న నరుం గ్రమ్మఱ నందె కూలుమని యా♦మ్నాయంబు బోధించునే? 27

తే. ఘోరసంసృతి మార్గాలఁ ♦ గుమిలికమిలి
బిట్టువాపోవువారలఁ ♦ జెట్టవట్టి
పెరిమఁ గాపాడు నాప్తమ్ము ♦ వేదమనఁగ
నద్ది హితము సెప్పును బ్రియ ♦ మాడఁబోదు. 28

మ. శ్రుతితాత్పర్య మెఱుంగలేకసుమి య ♦ జ్ఞుల్ గొండ ఱీమధ్యసం
గతమౌనట్టి ఫలంబ భాసురపరా ♦ కాష్ఠాభ్రమన్ వహ్నిసం
యత కర్మాభినివేశసక్తులయి ధూ ♦ మాధ్వంబు శ్రేష్ఠం బటం
చతిమాత్రంబు నుతింత్రు, వేదవిదు లీ ♦ యర్థంబు గర్హింపరే? 29

కం. పువ్వులఁ గని తరులిచ్చున, వివ్వె ఫలంబులని ద్విజము ♦ లెంచెడు పగిదిం
జువ్వె ఫలశ్రుతులం గని, యివ్వియె పురుషార్థములని ♦ యెంచుట జడులుఁ గా.

ఆ. ఇట్టి కాముకులును ♦ గృపణులు లుబ్ధులు, ధూమమార్గమంద ♦ ప్రేమముంచి
యాత్మతత్త్వ మెఱుఁగ ♦ కజ్ఞులై చరియింత్రు, కర్మజడులు వీర ♦ కారటయ్య?

శా. ప్రాలేయావృత లోచనంబులు సమీ ♦ పద్రవ్య రూపవ్రజం
బాలోకింపఁగ లేని చందమునఁ బ్రా ♦ ణాళ్యైక సంతర్పణ
వ్యాలోలాత్మకు లుక్థశస్త్రిలు స్వకీ ♦ య స్వాంతసంస్థున్ జగ
త్పాలుం గారణు నన్నెఱుంగ రిది స ♦ త్యం బాత్మవిద్గ్రామణీ! 32

కం. అతులము పరోక్షమగునా, మత మెఱుఁగక విషయగృధ్నులై ♦ మత్తులై పశుసం
తతిఁ జంపువారు మృతులై, ప్రతిహింసం గంద్రు వాని ♦ వలనఁ గుమారా!

మ. అనురాగం బొక వేళ హింసపయి ను ♦ న్నట్లైన యజ్ఞంబులం
దునె సుమ్మాగమ మభ్యనుజ్ఞ యిడె సం ♦ దుం జోదనార్థంబు లే
దనివార్యంబుగ; దీనినిం గనిన స ♦ త్యం బేహా లేపారఁ బో
వనఘా! కర్మతతిన్; విరాగులకుఁ గృ ♦ త్యం బున్నదే యింతయున్? 34

కం. స్వసుఖాభిలాష చేత నె, పసులం జంపి పితృభూత ♦ పతులం గడు సం
తసపెట్టుచుండుదు రభీ,ష్ట సవంబుల హింస్రకర్మ ♦ సంధితమతులై. 35

సీ. ఒక్క వణిక్కు తా ♦ నెక్కుడు రొక్కమ్ము
నార్జింపఁ దలఁచి ద్ర ♦ వ్యముల చేత
నావ నింపుకొని సం ♦ ద్రము దాఁటుచుండ మ
ధ్యేజలనిధి నావ ♦ త్రెవ్వ, లాభ
మట్లుండఁ బూర్వధ ♦ నాళి యెల్ల నశించె
నట్ల శ్రీపతిప్రియ ♦ మైనస్వర్గ
సౌఖ్యమ్ము గడియింప ♦ స్వాంతమం దెంచి మూ
ఢాత్ముఁ డీతండు క ♦ ర్మాళిసలుపు

తే. చుండఁగా నవి నడుమ బ్ర ♦ త్యూహములను
బొలియ నైహికాముష్మికం ♦ బులకుఁ బాసి
రెంటికిం జెడ్డ రేవని ♦ రీతిఁ జెడును
గష్టనష్టముల్ దక్కు న ♦ క్కర్మఠునకు. 36

వ. ఇమ్మానవుఁడు సత్త్వరజస్తమోనిష్ఠుఁడై తత్తద్గుణానురూపంబుగా నింద్రాది దేవతలను భేదదృష్టి నుపాసించుచున్నాఁడు కాని వారును మదంశస్వరూపులే యని యభేదోపాసన మొనర్చుట లేదు. మఱియు నాకర్మఠుఁడు 37

ఉ. జన్మము లాచరింతు దివి ♦ వద్గణముల్ యజియింతు స్వర్గమం
దెన్నియొ సౌఖ్యముల్ గనుదు ♦ హృష్టుడనై పిదపన్ హిరణ్యాసం
పన్న మహోత్తమాన్వయ భ ♦ వత్వము నొంది సుఖింతు నంచు నీ
తెన్నున దత్ఫలశ్రుతులఁ ♦ దేరి కనుంగొని పొంగిపోయెడిన్. 38

తే. ఈప్రరోచనా శ్రుతులయం ♦ దెలసిన పర
మార్థ మెఱుఁగక స్తబ్ధుల ♦ హింయువులయి
నాదు వార్తలు చెవిఁబడి ♦ న సహింప ;
రేది విక్షిప్తచిత్తుల ♦ కించునయ్య. 39

వ. కర్మ, బ్రహ్మ, దేవతా, కాండవిషయములైన వేదములను బ్రహ్మాత్మ విషయములుగా సమన్వయించుకొనవలయు ; నిందలిమంత్రంబు లన్నియు నతీంద్రియార్థప్రతిపాదన పరంబు లగుటం బరోక్షవాదంబులునుమీ. పరోక్షమ నాకం ప్రియతమంబు. ఏలన? శుద్ధాంతఃకరణులకే మద్వేదంబు బోద్ధవ్యంబు. తదితరానధికారులకుఁగాదు. అనధికారులు వృథాకర్మ త్యాగంబున భ్రష్టులయ్యెదరుగదే. కాన వేదార్థంబు గూఢంబుగానుండు. 40

— ✻ శ బ్ద బ్ర హ్మ ని రూ ప ణ ము ✻ —

కం. విమలంబగు శబ్దబ్రహ్మము రూపంబందు నర్థ ♦ మందుం దుర్బో
ధముసుమి యది సూక్ష్మస్థూలము లనద్వివిధంబుగాఁ జె♦లంగుఁ గుమారా!

వ. అందు సూక్ష్మరూపంబు దుర్విజ్ఞేయ మెట్లన 42

తే. అద్య మది ప్రాణమయము ప ♦ రాఖ్యమనఘ !
యావల మనోమయంబు ప ♦ శ్యంత్యభిఖ్య
మవల నింద్రియమయము మ♦ధ్యమసమాఖ్య
మిదియు వాగ్వ్యంజకమ్మయి ♦ యెసఁగు నిచట 43

వ శబ్దబ్రహ్మం బిది దేశకాలపరిచ్ఛేద శూన్యంబగుట ననంతపారంబై నిగూఢార్థంబగుట గంభీరంబై మతిప్రవేశానర్హంబగుట దుర్విగాహ్యంబై సముద్రంబు చందంబునం దనరారును. మఱియు నది బ్రహ్మము భూమంబును ననంతశక్తియు నంతర్యామియు నగునాచే నుపబృంహితంబై తామరకాడ లోని దారమువలె సూక్ష్మరూపంబై భూతంబులందు ఘోషరూపంబున మనీషులకు లక్షింపనయ్యెడిని. ఇఁక దాని స్థూలరూపము విను. 44

సీ. సాలెపురుగు హృద ♦ యాలవాలమునందుఁ
గల యూర్ణములను ము ♦ ఖంబునుండి
వెలికి వెలువరించు ♦ విధమున ఛందోమ
యుండును నమృతమ ♦ యుండుఁబ్రభువు

ప్రాణ ముపాధిగాఁ ♦ బరగు హిరణ్యగ
ర్భుఁడు రవోపాదాన ♦ ముగను వర్ణ
ములను సంకల్పించు ♦ నలఘు మనంబు ని
మిత్తకారణముగా ♦ వృత్తియుంచ

తే. సమితసూక్ష్మమై హృదయ గో ♦ శమున సతము
గొరలు నోంకృతినుండి వ ♦ క్త్రోగశాది
సంగమున వ్యంజితమ్మయి ♦ స్వరహలాఖ్య
వర్ణముల నొప్పు వైఖరీ ♦ వాక్కు సేసె. 45

వ. మఱియు విచిత్ర వైదిక లౌకిక భాషావితతయు, స్వర స్పర్శాంతస్థోష్మ భూషితయు నుత్తరోత్తరంబు నాలుగునాలుఁగువర్ణమ్ము లధికమ్ముగాఁ గలిగిన యుక్త్యాది చ్ఛందోజాలోపలక్షితయు బహుమార్గయు నై యొప్పు బృహత్త్వముగల వైఖరీవాక్కును హిరణ్యగర్భుండనైన యేన నాయుపాధి యగు ప్రాణంబుననుండి సృజించుచు స్వయముగా నుపసంహరించుచు నుందు. ఉక్త యత్యుక్త గాయత్రి యుష్ణి కనుష్టుప్పు బృహతి పఙ్క్తి త్రిష్టుప్పు జగతి మున్నగు నిర్వాదియాఱు ఛందస్సులు గలవు. ఇట్లు బృహతి యగు వైఖరీవాక్కు స్థూలస్వరూపమున నున్నను దుర్జ్ఞేయమే యగుచుండు. ఉద్ధవా! శబ్దము నాదమ్ముచే సూక్ష్మరూపమ్మునను వర్ణమ్ముచే స్థూలరూపమ్మునను వెలుఁగుంజుమీ. ఇఁక వేదార్థంబు దురవగాహంబని వచింపవలయునే? 46

సీ. అటు వైఖరీరూప ♦ మైన వేదము కర్మ,కాండమున విధివా ♦ క్యములచేత
దేనిని విధియించు? ♦ దేవతా కాండమ్ము,నందురు మంత్ర వా ♦ క్యములచేతఁ
జాటు నే వేల్పుల? ♦ జ్ఞాన కాండమ్మున, దేని ననువదించి ♦ దృఢతరోక్తు
లను నిషేధమొనర్పఁ ♦ గను వికల్పించు? నీ, శ్రుతిభావ మెనుగా ♦ కితరు డెవ్వఁ

తే. డెఱుఁగు! విధివాక్యతతి విధి ♦ యించునయ్య
యజ్ఞరూపుండ నగునన్నె ♦ యతులమంత్ర
తతియు నన్నె తత్తద్దేవ ♦ తా స్వరూపు
నొడువు జ్ఞానకాండమ్మును ♦ గడమ వినుమ. 47

వ. ఆకాశాది ప్రపంచజాతము [1] వికల్పించి యామీఁదఁ దదపవాద పూర్వకంబుగా జ్ఞానకాండము నన్నే ప్రతిపాదించును. మదన్యం బొండును లేదు. తెలిసెనా? మరల వినుము. శబ్దము పరమార్థరూపుండనగు నన్నాశ్రయించి

1. శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః. పాతంజలయోగశాస్త్రము 1 అధ్యా 9 సూత్ర. వస్తువు లేకున్నను శబ్దమువలనఁ గలిగిన యర్థజ్ఞానముచే నున్నదనుకొనుట వికల్పజ్ఞానము. గగనకుసుమము శశవిషాణము.

భేదము మాయామాత్రంబని యనువదించి నానాత్వంబు లేదని ప్రతి షేధించి చివరకు నివృత్తవ్యాపారంబై ప్రసన్నంబగుచున్నది. ఇదియు సర్వవేదతాత్పర్యము. ఉద్ధవా! అంకురమందున్న రసంబే తద్విస్తారభూత నానాకాండ శాఖలం దుండునట్లు ప్రణవమునకున్న వరమేశ్వరార్థమే తద్వి స్తారభూత సర్వవేద శాఖా కాండముల కుండునని యెఱుంగుము. ఇట్లు కర్మ దేవతా జ్ఞానకాండములు తుదకు నన్నే ప్రతిపాదించు నన్నరహస్యము మఱువకుము. అని కృష్ణుండు బోధించెనని శుకమహర్షి వక్కాణించెను.

ఇది యేకవింశాధ్యాయము సమాప్తము

---

## ద్వా విం శా ధ్యా య ము

కం. నిర్జరమందారా! రిపు,దుర్జయమన్మథకుమార! ♦ దోర్యుగకాంత న్యూన్ఫర్జదహీనాభరణా, యర్జున కీర్తికరకరణ! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అట్లు భగవంతుం డుపదేశింప నుద్ధవుండు తత్త్వజిజ్ఞాసువై యిట్లనియె. 2

♦ శ్రీకృష్ణుం డుద్ధవప్రశ్నంబు విని తత్త్వసంఖ్యానిర్ణయ మొనర్చుట ♦

కం. ఓయీశా! తత్త్వములెన్నో? యిరువదియెనిమిదియను ♦ చుందువు నీ వా మ్నాయజ్ఞులుకొందఱుబుధు,లోయిరువదియాఱనెదరు♦యోగ్యఫణితులన్ 3

చం. కరివరదాయకా! పదునొ ♦ కండని కొందఱు, తొమ్మిదంచుఁ గొం ద, ఱిరువదేను కొండఱును, ♦ నాల్గని కొందఱు, కొందఱేడు, కొం దఱు పదునేడు, కొందఱెడఁ ♦ దం బదునాఱును, గొందఱాఱు, కొం దఱు పదుమూఁడటంచిటులు ♦ తత్త్వము లెంచెద రేల మాధవా! 4

ఆ.వె. ఏప్రయోజనం బ ♦ పేక్షించి ఋషివరు, లివ్విధంబుగా న ♦ నేకభంగు లను వచింపసాగి♦రనఘ! తత్త్వమ్ముల, సత్యమేదియిందు? ♦ నిత్యమూర్తి! 5

వ. అనిన శ్రీకృష్ణుం డిట్లనియె. 6

కం. మునులు వివక్షాభేదం,బున నెన్నివిధముల తత్త్వ ♦ ములనేఁ గల్పిం చి నిరూపింతురు మన్మా,యను గైకొని పల్కువారి ♦ కది దుర్ఘటమే! 7

వ. వారి పరిగణన మంతయు యుక్తము. వాని కన్నింటికి సమాధానము సావ ధానముగా వినుము. అప్పుడు నీ సంశయ ముడుగు. నాయనా! యంతః

---

(1) అధ్యాయప్రారంభము 26–7–1946.

కరణవృత్తి విశేషరూపంబునఁ బరిణతములైన మదీయ దురతిక్రమ
సత్త్వాదిశక్తులే యీ భేదవివాదంబులకు హేతువు. 8

కం. సుమతీ! యీశక్తులక్షోభమువలననె యిట్టి భిన్న ♦ పథములు పొడమెన్
శమదమములొదవుచో భేదము మడఁగు న్వాదమడఁగు ♦ దర్పమ్ముడుగున్.

తే. కార్యకారణ తత్త్వసం ♦ ఘము పరస్ప
రము ప్రవేశించి యుండు కా ♦ రణముచేత
వక్త తత్త్వము లెన్నిగా ♦ వాకొనినను
యుక్తిచే సమర్థింపఁగా ♦ నొప్పుఁజూవె 10

తే. మట్టియందు ఘటంబున్న ♦ మాడ్కిఁ గార
ణమునఁ గార్యతత్త్వంబు సూ ♦ క్ష్మముగనుండు
ఘటమునందు మృత్తుండిన ♦ కరణిఁ గార్య
మందుఁ గారణ మనుగతం ♦ బై వసించు. 11

కం. ఇక్కతమునఁ దత్త్వమ్ముల, నెక్కువ తక్కువగ వక్త ♦ యిచ్ఛకొలందిన్
వక్కాణించిన నే నా, ఫక్కి ననుమతింతు నుద్ధ ♦ వా! యెట్లన్నన్ 12

కం. పురుషుం డనాద్యవిద్యా, పరివృతుం డగుటవలన ♦ స్వయముగ నాత్మ
స్ఫురవేదనమ్మొదవ దీ, శ్వరుఁడో జ్ఞానప్రదుండు ♦ సర్వజ్ఞుండున్. 13

కం. కావున జీవేశ్వరభిదఁ, గావించిన నిరువదాఱుఁ ♦ గనఁ జిద్రూపుల్
గావున నభేదమనుచో, దైవాఱెడు నిరువదేను ♦ తత్త్వము లనఘా! 14

వ. అనిన నుద్ధవుం డీశ్వరుండు జ్ఞానప్రదుం డంటివి. మఱి జ్ఞానము తత్త్వాంతర
మేలకా దనిన శ్రీకృష్ణుం డిట్లనియె. 15

కం. తమ కీశ్వరుం డొసఁగు జ్ఞా, నము సాత్త్వికవృత్తియే క ♦ నంగా నాజ్ఞా
నము సత్త్వగుణాంతర్భా, తమ యదియుం బ్రకృతిలోన ♦ దాఁగుఁగుమారా!

కం. ప్రకృతియనఁగ గుణసామ్యమె, ప్రకృతివె స్థిత్యవ్యయోద్భ ♦ వ నిదానములో
ప్రకటత్రిగుణము; లనఘా!, యకర్తృతం గన్న యాత్మ ♦ నంటునె గుణముల్?

తే. ధీనిధాన! సత్త్వమయమ్ము ♦ జ్ఞానమును ర
జోమయమ్ము కర్మమ్ము, త ♦ మోమయమ్ము
తెలివిలేమి; యియ్యవియెల్లఁ ♦ బొలుచుఁ బ్రకృతి
యంద యంతర్గతంబులై ♦ యనవరతము. 18

కం. ఈశుఁడు గుణములఁ గలఁపఁ బ్ర, కాశించుం గాల మట్టి ♦ కారణమున నా
యీశుండె కాలమని విబు, ధాళియ మది మఱొకధాతు ♦ వగుటె ట్లనఘా!

వ. ఉద్ధవా! స్వభావమ్మును సూత్రనామక మహత్తత్త్వములోఁ జేరును. అది సర్వశక్తియుతముగదా. ఇట్లు జ్ఞానాజ్ఞాన కర్మ కాలస్వభావము లాయా తత్త్వములలోఁ జేరునుగానఁ దత్త్వాంతరములు గావు. పురుష ప్రకృతి మహ దహంకారములు నాలుగు, గగనాదిమహాభూతంబు లైదు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనంబులు పదునొకండు, శబ్దస్పర్శాద్యర్థము లైదు, మొత్తము పంచవింశతి తత్త్వములు. ఇవియ తక్కిన షడ్వింశ త్యష్టావింశతి పక్షసాధారణంబులు. మన్మతంబున నీ పంచవింశతితో సత్త్వరజస్తమంబులు మూఁడుంగలిసి యిరువదియెనిమిది తత్త్వంబులు ఈ గుణంబు లాగమాపాయులగుటం జేసి ప్రకృతికంటె భిన్నంబుగా నెంచితిమి పంచవింశతిలో భిన్నుండగు నీశ్వరుం గలుపకున్న నిర్వాదాఱగు నంటెంగదా. ఈ పక్షత్రయంబును వచన దాన గమన విసర్గ నానందములు కర్మేంద్రియ ఫలంబుల కాన నివి తదంతర్భూతములే కాని తత్త్వాంతరములు కావనును. ఇఁక నేమి ప్రయోజన మపేక్షించి ఋషు లిట్లు పలికిరో చెప్పెద వినుము.

సీ. మహదహంకార త♦న్మాత్ర లనెడు సప్త
కారణమ్ములతోడఁ ♦ గార్యములయి
యొనఁగు భూతైకాద ♦ శేంద్రియంబులతోడ
నాకారముం గన్న ♦ యట్టి ప్రకృతి
సర్గాదిలో గుణ ♦ సాంగత్యమునను సృ
జ్యత్వాద్యవస్థల ♦ నవధరించుఁ;
బురుషుఁ డవ్యక్తుం డ ♦ పరిణామియు నిమిత్త
భూతుఁడై చూచుచుఁ ♦ బొదలియుండు.

ఆ. బ్రకృతియోగతంబుఁ♦బరిణామ మొందు ని,య్యిరువు రెపుడుభిన్ను♦లీక దయ్యు
యీప్రకారమేసు♦మీ సృష్టి జరిగెడి, వినుము మనము నిలిపి ♦ వృష్ణివంశ్య!

తే. ప్రకృతిభవ మహదాదిక ♦ వ్యక్తధాతు
వితతి పురుషేక్షణంబున ♦ వీర్యవంత
మై ప్రకృతిబలంబునన య♦న్యోన్యమొనసి
వికృతి నెంది బ్రహ్మాండంబు ♦ వెలయఁజేయు. 22

వ. అనిన నుద్ధవుండు స్వామీ! యేయేతత్త్వపరిగణనంబునఁ గడమపక్షంబు లేర్పడినవో యనఁ గృష్ణుం డిట్లనియె. 23

తే. ద్రష్ట్ర దృశ్యంబులకును నా♦ధారమైన
యాత్మ జీవుండు పంచభూ♦తాళికలిసి
సప్తతత్త్వపక్షం; బందె ♦ జన్యములగు
ప్రాణదేహేంద్రియంబు ల♦న్యములు గావు 24

తే. ఆత్మ భూతపంచకమున ♦ నగును ధాతు
షట్కపక్ష ; మిందాత్ముండు ♦ జగముసేసి
యాత్మభవ తత్త్వములతోడ ♦ నందుఁజేరె
నాత్మునకు జీవునకు భేద ♦ మలరదిందు. 25

కం. రాజిలును జతుఃపక్షము, తేజోబన్నాత్మలన్ను ♦ ధీజనగేయా!
యీజగ మాతత్త్వమ్ముల, చే జనియించె నని వారు ♦ చెప్పుదు రెపుడున్ 26

వ. వీరు తక్కిన యాకాశవాయువులు తేజోబన్నాంతర్గతములందురు. 27

కం. భూతేంద్రియ తన్మాత్ర, వ్రాతము పదునైదు, నాత్మ♦స్వాంతము కలియం
జాతమగు సప్తదశసం, ఖ్యాతోజ్జ్వల ధాతుపక్ష ♦ మనఘచరిత్రా! 28

వ. ఇందుఁ గర్మేంద్రియములు జ్ఞానేంద్రియాంతర్గతము లని యూహ్యము. సప్తదశపక్షమునం దాత్మయే మనంబని యొకటిగా లెక్కించినచో షోడశ తత్త్వ పక్షం బేర్పడు. తన్మాత్రములతో నేకీకృతంబైన భూతపంచకము దత్ప్రకాశకము లింద్రియములైదు, నింద్రియాధిష్ఠాతయైన మనంబొకండు జీవుండు, నాత్మ, యని లెక్కించినఁ ద్రయోదశపక్షంబేర్పడు. 29

తే. ఐదుభూతంబులును నింద్రి ♦ యంబులైదు,
మానసోపేతజీవుఁ డీ ♦ మూడ్కగణనఁ
దా మొనర్చి యేకాదశ ♦ ధాతుపక్ష
మేర్పఱించిరి కొందఱు ♦ ఋషులువత్స! 30

తే. ప్రకృతి మహ దహంకారముల్ ♦ పంచసూక్ష్మ
భూతములు పురుషుండు నీ ♦ రీతిగణన
సేయు నవతత్త్వపక్షంబు ♦ చెలఁగు ; నెల్ల
కడల నుక్తంబులం దను ♦ క్తమ్ము లణఁగు. 31

వ. ఉద్ధవా! ఋషిప్రోక్తంబులైనయీ మతంబు లన్నియు యుక్తిమంతంబులు న్యాయ్యంబులు వివక్ష్వధీనంబు లనిగ్రహించితి. ప్రకృతి పురుష భేద జ్ఞాపనమున కిట్లు వాకొనవలసె నన నుద్ధవుం డిట్లనియె. 32

చం. ప్రకృతియుఁ బూరుషుండును స్వ ♦ భావముచేత జడాజడంబులే,
నొకటి మఱొక్కటి న్విడిచి ♦ యుండమి భేదము గోచరింపదున్;
బ్రకృతిజమైన దేహమున ♦ భాసిలునాత్మ తదాత్మయందు నా
ప్రకృతియుఁ దోఁచు నెట్లుగని ♦ పట్టుదు వీరలభేద! మచ్యుతా! 33

శా. ఈ నాసంశయబంధముం దునుమస్వా♦మీ సర్వవేత్తృత్వ వా
చా నైపుణ్యము లొల్కు నీవొకఁడవే ♦ శక్తుండ ; వీ దేహికిన్
జ్ఞానంబేర్పడు నీకృపాగరిమ, న ♦ జ్ఞానంబు తోఁతెంచు మా
యానైష్ఠుర్యముచేతఁ, గాన ప్రముక్తిదను దా ♦ సోహమ్మటం చీశ్వరా!

తే. ఆత్మ భూతపంచకమున ♦ నగును ధాతు
షట్కపక్ష ; మిందాత్ముండు ♦ జగముసేసి
యాత్మభవ తత్త్వములతోడ ♦ నందుఁజేరి
నాత్మునకు జీవునకు భేద ♦ మలరడిందు. 25

కం. రాజిలును జతుష్పక్షము, తేజోబన్నాత్మలకను ♦ ధీజనగేయా!
యీజగ మాతత్త్వమ్ముల, చే జనియించె నని వారు ♦ చెప్పుదురెప్పుడున్ 26

వ. వీరు తక్కిన యాకాశవాయువులు తేజోబన్నాంతర్గతములందురు. 27

కం. భూతేంద్రియ తన్మాత్ర, వ్రాతము పదునైదు, నాత్మ♦స్వాంతము కలియం
జాతమగు సప్తదశసం, ఖ్యాతోజ్జ్వల ధాతుపక్ష ♦ మనఘచరిత్రా! 28

వ. ఇందుఁ గర్మేంద్రియములు జ్ఞానేంద్రియాంతర్గతము లని యూహ్యము. సప్తదశపక్షమునం దాత్మయే మనంబని యొకటిగా లెక్కించినచో షోడశ తత్త్వ పక్షం బేర్పడు. తన్మాత్రము లతో నేకీకృతంబైన భూతపంచకము దత్ప్రకాశకము లింద్రియములైదు, నింద్రియాధిష్ఠాతయైన మనంబొకండు జీవుండు, నాత్మ, యని లెక్కించినఁ ద్రయోదశపక్షంబేర్పడు. 29

తే. ఐదుభూతంబులును నింద్రి ♦ యంబులైదు,
మానసోపేతజీవుఁ డీ ♦ మాడ్కిగణనఁ
దామొనర్చి యేకాదశ ♦ ధాతుపక్ష
మేర్పఱిచిరి కొండఱు ♦ ఋషులువత్స! 30

తే. ప్రకృతి మహ దహంకారముల్ ♦ పంచసూక్ష్మ
భూతములు పురుషుండు నీ ♦ రీతిగణన
సేయు నవతత్త్వపక్షంబు ♦ చెలఁగు ; నెల్ల
కడల నుక్తంబులం దను ♦ క్తమ్ము లణఁగు. 31

వ. ఉద్ధవా! ఋషిప్రోక్తంబులైనయీ మతంబు లన్నియు యుక్తిమంతంబులు న్యాయ్యంబులు వివక్ష్వధీనంబు లనిగ్రహించితి. ప్రకృతి పురుష భేద జ్ఞాపనమున కిట్లు వాకొనవలసె నన నుద్ధవుం డిట్లనియె. 32

చం. ప్రకృతియుఁ బూరుషుండును స్వ ♦ భావముచేత జడాజడంబులే,
నొకటి మఱొక్కటి న్విడిచి ♦ యుండమి భేదము గోచరింపదున్;
బ్రకృతిజమైన దేహమున ♦ భాసిలునాత్మ తదాత్మయందు నా
ప్రకృతియుఁ దోఁచు నెట్లుగని ♦ పట్టుదు వీరలభేద ! మచ్యుతా! 33

శా॥ ఈ నాసంశయబంధముం దునుమస్వా♦మీ సర్వవేత్తృత్వ వా
చానైపుణ్యము లొల్కు నీవొకఁడవే ♦ శక్తుండ ; వీదేహికిన్
జ్ఞానంబేర్పడు నీకృపాగరిమ, న ♦ జ్ఞానంబు తోఁతెంచు మా
యానైష్ఠుర్యముచేతఁ, గాన మ్రొక్కెదను దా ♦ సోహమ్మటం చీశ్వరా!

—♦ శ్రీకృష్ణం డుద్ధవునకుం బ్రకృతి పురుష వివేకము కల్గించుట ♦—

చం. అన భగవంతుఁ డిట్టులను ♦ సాదరదృష్టులఁ జూచి యుద్ధవా !
విను పురుషుండునుం బ్రకృతి ♦ భేదవిశిష్టు లనారతం; బడె
ట్లనఁ బ్రకృతిప్రభావముగ ♦ దా తను, వద్ది వికారవంతమై
గొనముల పెన్గలంత నొన ♦ గూడి చెలంగు ననేకభంగులన్. 35

కం. ఈనా మాయ గుణమయం, బౌను గనుక నద్ది గుణ చ♦యంబులచేతన్
నానావిధముల భేద,జ్ఞానంబులఁ బుట్టఁ జేయు ♦ శాంతినిధానా ! 36

వ. కానఁ బ్రకృతివికారంబైన యహంకారమువలన నేర్పడిన దేహాదిసంఘాత మధ్యాత్మాదులచేఁ ద్రివిధంబగు. 37

తే. అక్షిరూపంబురవియు; జి ♦ హ్వారసములు
వరుణదేవుండు; శ్రవణక ♦ బ్దములు దిశలు,
నాసికయు గంధ మశ్వినీ ♦ నందనులును;
జర్మమును స్పర్శయును నథ ♦ స్వంతుఁడవల. 38

తే. వాక్కువచనంబుజ్వలనుండు, ♦ పాణికర్మ
మింద్రుఁ, డంఘ్రులుగమనము ♦ పేంద్రుఁడనఘ !
పాయువు విసర్గమును మృత్యు, ♦ వా యుపస్థ
సముచితానందకేళి ప్ర ♦ జాపతియును. 39

తే. గళముతుదిమానసమ్ము సం ♦ కల్పముశశి,
యాస్యగతబుద్ధినిశ్చయ ♦ మబ్జభవుఁడు,
నాభినుండు చిత్తము ధార ♦ ణమ్ము జీవుఁ,
డెదయహంకార మభిమాన ♦ మీశ్వరుండు. 40

వ. ఇట్లు నారిది నధ్యాత్మాధిభూతాధిదైవము లుందురు. ఇంద్రియములు దేహమందుండుంగాన నధ్యాత్మములనియు రూపాదులు భూతములం దుండుంగాన నధిభూతములనియు వాని నధిష్ఠించియుండువారు దేవతా రూపులుగాన నధిదైవములనియు నందురు. నేత్ర మధ్యాత్మము. రూప మధిభూతము. నేత్రగోళప్రవిష్టంబైన యార్కాంశ మధిదైవము. ఈ మూఁడింటి పరస్పరసంబంధమునసే రూపజ్ఞానసిద్ధి. కడమవాని నిట్లే యెఱుం గునది. అధిదైవము లుపకారకములు. తదితరము లుపకార్యములు నగుట నుపకార్యోపకారకభావ మి మ్మూంటికి నున్నది. అధిదైవములు స్వయ ముగా సిద్ధులు. అధ్యాత్మాదిత్రయమునకు వ్యతిరిక్తుండు నాద్యుండు నేక రూపుండు నగు నాత్ముండు స్వతస్సిద్ధప్రకాశంబుచే నఖిలసిద్ధులకు సిద్ధి దుండై యుండు. సర్వము చిత్ప్రకాశవిషయంబకదా. ఇట్టి త్రివిధప్రపంచ

వికల్పము ప్రకృతికార్యంబుగా నెఱింగినఁ బ్రకృతిభేదము గోచరించుట
లేదే? తదితరుం బురుషు నెఱుంగనేరవే! 41

తే. కాలము నిమిత్తభూతమై ♦ కాలఁగాఁ బ్ర
ధాన మది యుపాదానమై ♦ తనరఁగా గు
ణములు సామ్యమ్ము వీడి వి ♦ క్రమము నూవఁ
గా నయినమహత్తున కహం ♦ కార మొదవె. 42

తే. మఱియు వైకారికంబు తా ♦ మసము నైంద్రి
యంబు నాఁగ మువ్విధముల ♦ నలరుఁజూవె
ఆయహంకార; మదియె గా ♦ దయ్య మోహ
మయ వికల్పహేతువగును ♦ మానవులకు. 43

తే. దేహమే యాత్మయుంచెన్న మోహమగును
నరసురాది నానాత్వమె ♦ న్నఁగ వికల్ప
మగు; నిదంభేదదృష్టి వో ♦ నహ మడంగు
నహమడంగఁ ద్రివిధసర్గ ♦ మంటియున్నె? 44

కం. భేదంబునవాదం బో, యాదవవర! యర్థనిష్ఠ ♦ యని యెఱుఁగు మెడఁగ
గాదయ్య వస్తునిష్ఠ ప్ర,మాదంపడక యొనరింపు ♦ మనసం బిచట౯. 45

కం. కొందఱు కలఁడని మఱియుం, గొందఱు లేఁడనియు యుక్తి♦కోటులవాదిం
పం దొరకొందురు పరమా,త్మం దెలిసికొనంగ లేక ♦ మాధులుభళిరే. 46

తే. జ్ఞానమయుఁ డాత్మఁడంచును ♦ గానలేక
శుష్క వాదవిలాసాలఁ ♦ జొచ్చి యకట
మత్సరావృత్తబుద్ధులై ♦ మలయుచుంద
రుచ్చనీచదేహముల నీ ♦ పిచ్చివారు. 47

వ ఇట్లు నిపుణమతిం బ్రకృతిపురుష గుణవిమర్శం బొనర్చుకొనమి నీభేదబుద్ధి
వారి నంటియే యుండి యిట్లనర్థంబుం గల్గించెడిని. 48

—* నిత్యునకు జననమరణాదులెట్లో శ్రీకృష్ణుండు చెప్పుట *—

చం అనవుడు నుద్ధవుం డెఱిఁగి ♦ వ్యాపకుఁ డాత్మఁడు వానికెట్లు గం
తనపడు నన్య దేహగమ ♦ నం? బతఁ డెప్పు డకర్తయే, క్రియల్
పొనరుచు టేమి? నిత్యుఁడయి ♦ పొల్చెడి వానికి జన్మమృత్యువుల్
దనరుట యేమి? చిత్రముగ ♦ దా యిదియంతయు లోకరక్షకా! 49

తే. అంబుజాక్ష! బహిర్ముఖు ♦ లందుమాత్ర
మాత్మఁడొక్కండ కాదొకో? ♦ యతనికిట్టి

గతులవేమి ! నీమాయాప్ర ♦ కార మాగ
మజ్ఞులె యెఱుంగ రజ్ఞుల మాటయేల ! 50

వ. అని విని యశోదపట్టి మృదులాధరారుణకాంతులు రుచిర దశన విశద కిరణ ప్రసరణమున వెనుకంజవేయ నుద్ధవా ! లింగశరీరాభ్యాసముచే సర్వము ఘటించు నని యిట్లనియె. 51

కం. మన మింద్రియములు దశకం,బు నహంకారంబు ప్రాణ♦ములునై దివి యె
ల్లను గూడ లింగదేహ,మ్మనగడు పదునేడుతత్త్వ♦ములతో ననఘా! 52

తే. జనుల కర్మమయంబైన ♦ స్వాంత మింద్రి
యోజ్జ్వలంబయి దేహమ్ము ♦ నుండి దేహ
మునకుఁ జనుచుండు నాసూక్ష్మ ♦ తనువుబడిన
కదలు నన్యుఁ డాత్మం డహం ♦ కారమునను. 53

తే. కర్మవాసనా క్తమనంబు ♦ కన్నవిన్న
విషయములను ధ్యానించెడి ♦ వేళఁదత్స్వ
రూపమును గయికొని తొంటి ♦ రూపు విడుచు
డానఁ బూర్వాపరానుసం ♦ ధాన ముడుగు. 54

కం. మన మొకవిషయాకృతి నం
దునపుడు విషయాంతరంబు ♦ తోఁపదుగాడే
కను మియ్యదె విస్మృతియం
చు, నితాంతం బిదియుఁ బుట్టు ♦ చుం జనుచుండున్. 55

వ. అచిరకాలంబునన యొక్కజన్మంబునంద యెన్నేని విస్మృతులు కలుగు చుండ బహుతిథకాలంబున దేహాంతరంబున విస్మృతికలుగుటలో నబ్బురం బేమి ! 56

చం. తనయొనరించుకర్మనము ♦ దాయముచే లభియించు శ్రోత్రదా
తనువుననే స్థిరప్రియతఁ ♦ దాల్చి తద్విషయాళివెంటనే
చనుచును బూర్వదేహమున ♦ సంస్మృతిఁబాయును గొత్రవింతయుం
చును మతిప్రాతరోఁతయును ♦ చుక్ వినుచుందుముగాదె యుద్ధవా! 57

చం. తనకలి యాతనాతనువుఁ ♦ దాల్చి దుర్భరభీతిశోకసం
జననముచేతనైన దివి ♦ మన్ముఖదేహములొంది హర్షత
ర్షనియతిచేతనైనఁ దన ♦ ప్రాప్తనువందు నహంమతిప్రకా
శన మడఁగారు జీవునికిఁ ♦ జావన నిట్టిదయా యదూద్వహా ! 58

కం. తమన వతనువున నాత్మా
భిమాన మెలయించి యెల్ల ♦ విషయమ్ములఁ జి

త్తమునఁ గయికొనుటయే జ
న్మమునాఁ, గలకలను నెన్ని ♦ మా ర్గదయుంబుల్! 59

తే. కలలలోనఁ గొంతెమకోరి ♦ కలలలోన
నప్పటి తనువపూర్వమై ♦ నదిగ నెంచు
నదియుపుట్టుక; పూర్వదే ♦ హమునుమఱచు
నదియెమృతి; యింతపూర్వసి ♦ ద్ధాత్మయుండె. 60

వ. ఉద్ధవా! తెలిసినదా! ఇటులు పూర్వదేహవియోగ దేహాంతర యోగంబులు స్మృతివియోగ, యోగంబులచే సంభవించెడిని. అందువలన దేహికి జావుపుట్టుక లున్నట్లుండుఁగాని నిక్కముసకు లేవు. మఱియు నింద్రియాశ్రయమనంబు దేహాంతరాభినివేశంబున నలువుసృష్టిచేత నసత్తైన యధ్యాత్మాది భేదత్రయము తదభిమానమునంజేసి యాత్మవస్తువునం దున్నట్లు గోచరించెడిని. ఈ జీవుఁడు స్వప్నంబున నసత్తైన యనేక దేహ తతిని సృజించుచుఁ జూచుచు బహురూపుఁడై ప్రకాశించుచున్నట్లుగానే నగాదిబాహ్యవిషయములను సుఖాద్యాంభ్యంతరములను గ్రహించుచు బహిరంతర్భిదా హేతువగుచున్నాఁడు.

కం. వివతులుప్రతిక్షణము దే, హములొదవుచునడఁగుచుండు♦నదియెఱుఁగరుకాల మలక్ష్యవేగమై నూ, క్ష్మమగుటచే వృష్ణివంశ ♦ సాగరచంద్రా! 62

కం. ఫలములు రూపాదుల జ్వా,లలు పరిణామాదికంబు ♦ లగు, స్రోతస్సుల్ చలనాదుల, నోయుద్ధవ! పలుదశలంగాంచుఁ గాల ♦ వశమునఁ గంటే 63

కం. పలకీలికా ప్రవాహం,బుల కరణిం జూవ్వె సర్వ ♦ భూతములు వయో బల కామ దీ ప్త్యవస్థా,దులఁ గనెడిం గాలశక్తి ♦ త్రోచుచునుండగ 64

చం. అనవరతంబుఁ గీల లుద ♦ యంబగు నాశనమొందు వెండియుగ్
జననమువొందు, రూపసదృ ♦ శత్వముచేఁ బరపూర్వభేదముల్
గనుఁగొనలేము. మున్ను పొడ ♦ కట్టిన దీపమె యిద్దియుందు, మా
జనుఁడె యితండటంచుఁ దను ♦ సామ్యముచేతన గుర్తుపట్టుటల్. 65

వ. ప్రవాహమున మునుపటినీటికిఁ బిమ్మటినీటికిఁ బోలిక యుంటం భేదము తెలియక యాజలమే యీజల మనుచున్నాము. కాని యాజలమే యచటనిలుకడగా నున్నదా? ఇదియంతయు భ్రాంతికదా. మఱి యిట్లాత్మ మాఱుచుండునా? 66

మ. తన బీజాత్మక కర్మసంహతులచే ♦ త స్మిందుఁడైనం జనిం
గనఁ, డాపై మృతినెందఁ, డింతయు భ్రమా ♦ జ్ఞానం, బమర్త్యుండు మ్రిం
డు, నజస్సుండు జనించు నంట సెగవా ♦ నో! యాత్మ కీమృత్యువుగ
జననం బుండదు, నిత్యవస్తువది వి ♦ జ్ఞానాబ్ధికుంభోద్భవా! 67

మ. పొరిఁ గల్పాంతముదాఁక నుండెడి మహా ♦ భూతంబు నావహ్ని నం
దురె కాష్ఠాయుతి వెల్గమి న్మృతిఁగనెం ♦ బోయుంచుఁ, గాష్ఠాభిరో
గ రతి న్వహ్నిఁ బుట్టెనంచు; నరరే ♦ కాయంబునుం బుట్టియో
పరమాత్మం బ్రభవావ్యయస్థితులకుం ♦ బాల్సేయుటల్ చూడుమా! 68

వ. దేహోత్పత్తికిం బూర్వము దేహపాతానంతరము నాత్మ వెలుంగుచునే యుండును. ఆత్మకుఁ జావుపుట్టుకలు భ్రాంతిసిద్ధములు గాని స్వాభావికములు గావు. దేహావస్థ లాత్మకున్న వనుకొనుట యజ్ఞానమున నే యనుడు నుద్ధవుండు స్వామీ! దేహావస్థ లానతిండనఁ గృష్ణుం డిట్లనియె. 69

సీ. గర్భప్రవేశమాఁ ♦ గడెనిషేకం బటు, వెనుక గర్భంబున ♦ వృద్ధి జనన
మైదేండ్లవఱకు బా ♦ ల్యంబును నాపోడ, శాబ్దంబు కౌమార ♦ మంతమీఁద
నలుఁబది వత్సరం♦బులవఱకును యౌవ, నంబును నరువదేం ♦ డ్లవఱకును వ
యఃకాలమధ్యంబు ♦ నావయి ముసలిత, నంబు నావల మర ♦ ణంబు నిట్టు

తే. లీయవస్థలు తొమ్మిది ♦ యొసఁగు దేహ
మునకు; వీనిని గుణసంగ ♦ మున వివేక
మెడలి యొక్కఁ డొక్కఁడను గ్ర ♦ హించు నీశ్వ
రునికృప న్వివేకియొకండు ♦ త్రోసివైచు. 70

చం. జనకునిచావు పుత్త్రకుని ♦ జన్మము జూచెడి నౌర్ధ్వదైహికం
బును మఱిజాతకర్మమును ♦ బొల్పుగఁ జేయు టవశ్యమౌటఁ; గా
వునఁ దనదేహ మిట్లె మృతిఁ ♦ బుట్టువు నందు నటంచు నెంచునా
యనఘుఁడు ద్రష్ట యీయుగళ ♦ మంటనివాఁ డగుఁగా యదూద్వహా!

మ. ఫలపాకంబుననాశ, మంకురమునసం ♦ బంధమ్ముచే జన్మముల్
గల భూజంబులఁ గాంచు ద్రష్ట యెటులన్ ♦ త్మాజాళికిన్ భిన్నుఁ, డ
ట్టులు దేహంబున కవ్యయోద్భవము లె ♦ ప్డుం జూచు తాభిన్నుఁ, డి
ట్టులు యోజించెడి సాక్షి కీద్వయమునా ♦ టోపంబు లేపారునే? 72

కం. వింటివె యిటు లాత్మప్రకృతి, కం టొనిలక్షణ మటంచుఁ♦గాంచని మూఢుం
డొంటుకొను న్విషయమ్ముల, వెంటఁ దవిలి సంసృతి న్వి ♦ వేకనిధానా! 73

వ. అందువలన 74

ఉ. సత్త్వముచేత దేవఋషి ♦ జన్మములబ్బు, రజోగుణాన మ
ర్త్యత్వము రాక్షసత్వమును ♦ దాపురమౌను, తమోగుణానుసా
రిత్వముచేఁ బశుక్రిమిశ ♦ రీరము లబ్బెడి, నిట్లు కర్మవ
శ్యత్వ మదెన్నిచందముల ♦ నైనను ద్రిప్పు నరున్ యదూద్వహా! 75

వ. ఇఁక నకర్త్రాత్మకుఁ గర్తృభ్రమణం బెట్లో చెప్పెద వినుము. 76

తే. నృత్తగీతముల్ సలుపువా ♦ రిఁ గని యనుక
రించు బాలునివోలె ని ♦ ర్లిప్తుఁడయ్యు
నాత్ముఁ డల బుద్ధిగుణముల ♦ ననుకరించు
దృశ్యధర్మముల్ ద్రష్టయం ♦ దిటులు దోఁచు. 77

చం. విను జలముం జలింపఁ బ్రతి ♦ బింబము నూఁచి తటస్థభూరుహం
బును జలియించుచుండెనను; ♦ భూతలముం దిరుగాడుచున్న దం
చును దననేత్రముల్ దిరుగ; ♦ నట్టిఁడె మానసకల్పితంబు లా
గొనములు నాత్మకున్న వని ♦ కూసెడివాఁ; డిదియెల్ల నిక్కమే? 78

కం. కలలోనఁ దోఁచునవి వాం
ఛలలోనం దోఁచునవి వి ♦ యము లెటులు మి
థ్యలో? యట్టులె యాత్మనకుం
గలిగెడి విషయానుభవ సు ♦ ఖంబులు మిథ్యల్. 79

వ. అన నుద్ధవుండిట్లనియె. 80

కం. అర్థంబులు మృషలైనన్, వ్యర్థంబుగఁ దన్నివృత్తి ♦ కై మనుజుం డ
త్యర్థము శ్రమపడు టేటికిఁ? బార్థప్రియమిత్ర! జలద ♦ భాసురగాత్రా! 81

వ. అన శ్రీకృష్ణుండిట్లనియె. 82

కం. అనవరతము విషయముల, స్మనమున ధ్యానించుచుండి ♦ నన్ సంసారం
బు నివర్తింపదు జీవా,త్మున కవి మృషలౌనుగాక ♦ పుణ్యచరిత్రా! 83

కం. కలలోఁ దోఁచు నర్థం,బులు మృషలైనన్ భయంబు ♦ పుట్టింపవె! య
ట్టు లసద్విషయము లెల్లం, గలచుం జామి జీవుఁ బెక్కు♦గతులఁ గుమారా!

వ. కాన నసదింద్రియములచే నసద్విషయముల ననుభవింపఁ జూడకుము.
ఈ భేదభ్రమంబెల్ల స్వస్వరూపము నెఱుంగమిచే ఘటిల్లినది. 85

సీ. కాపురుషాళియా ♦ క్షేపించుచున్నను, బరిభవించుచునున్నఁ ♦ బరిహసించు
చున్నను నిడుగడ♦నొందుచునున్నఁ దా,డించుచున్నఁ జెఱఁగ♦లంచుచున్న
వృత్తికి నడ్డగా♦వించుచునున్న బ,హిష్కరించుచునున్న♦నెగసి యుమియు
చున్నను మూత్రించు♦చున్నను నీశ్వర,ధ్యానభంగము సేయఁ♦దారుచున్న

ఆ. నిట్టు లెన్నిగతుల ♦ నేని బాధించుచు, నున్న నెడఁదయందు ♦ నోహటిలక
తనకుఁ దాన కాచు♦కొనుచు శ్రేయస్కాముఁ,డాత్మనిష్ఠ విడువ♦కలరవలయు.

చం. అనవిని యుద్ధవుండు విన ♦ యమ్మున మ్రొక్కి భవత్పదారవిం
[illegible] చిత్తవృత్తులకుఁ ♦ దక్క వశంబె యసద్వ్యతిక్రమం

బును సహియింప నెంత బుధ ♦ పుంగవకోటికి నేర్ స్వభావమో
యనఘ! బలిష్ఠమైనదిగ♦దా! యిదియె త్రెక్కొఁగింపు మింపుగన్. 87

వ. అని యుద్ధవుం డడిగె నని శుకమహర్షి వక్కాణించెను. 88

ఇది ద్వావింశాధ్యాయము సమాప్తము

---

## త్రయోవింశాధ్యాయము

కం. నిలువుగ నడ్డముగా మూఁ,డలుగా నైతుహాలమునఁ బో♦లము దున్నెడు న
ట్టులు గఱపెదె తత్త్వము శి,ష్యులలాములకెన్నొగతుల♦హరిహరనాథా! 1

వ. [1]దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో
నిట్లనియె. అట్లు భాగవతశ్రేష్ఠుండైన యుద్ధవుండు దుర్జనతిరస్కార సహ
నోపాయం బడుగ శ్రవణీయవీర్యుండైన దాశార్హపర్యుండు వాక్చాతు
ర్యంబలర బృహస్పతిశిష్యుండైన యుద్ధవునితో నిట్లనియె 2

కం. లేఁడయ్య యొక్కసాధువు, గూడఁ గఱతలాని కరుసుఁ♦గూటువు జేఁతల్
గాడ నెడఁద నోర్చికొనెడు, వాఁడుఁ శాంతంబుఁ బట్టు♦వఱచెడివాఁడున్.

కం. గొంటుల పరుసని నోడువులు, వెంటనె మర్మములు వచ్చి♦బిట్టేర్చెడు నా
వెంటం గ్రొవ్వాడి ములుకు,లంటి మెయిన్ దుస్సి చనియు♦నలయింపవనా!

వ. నీ ప్రశ్నంబునకుఁ బుణ్యవంతంబైన యొక యితిహాసంబు కలదు. అందు
దుర్జనపరాభూతుండైన యొకానొక భిక్షువు నిజకర్మవిపాకంబును ధైర్య
యుక్తుండై స్మరించుచు నలిపిన గీతంబు సావధానమనస్కుండవై వినిన నీ
సంశయంబుడుగు నని యిట్లనియె. 5

—* అవంతిభూసురులుద్ధత *—

ఉ. కలఁ డవంతి బ్రాహ్మణుం డొ ♦ కండు వాఁడు సేద్యమున్
సలిపి వర్తకంబు సేసి, ♦ చాఁచి కే, లిటున్నిభం
గులనొ వేలకోలఁది ధనముఁ ♦ గూర్చి విత్తవంతుఁడై
కలుకుచుండె నేరి లెక్క ♦ గొనక యాదవాగ్రణీ! 6

చం. కడుపునకుందినం, డతిథి ♦ కొండముఁ జేరఁగనీఁడు, పెండ్లమున్
గొడుకుల మెక్కనీఁడు, సుర ♦ కోటిగణింపఁడు, సేవకాళికిన్
గడపఁడు, ధర్మకార్యము లొ ♦ నర్పఁ, డటుంగిలిచేతఁ గాకిఁదో
లఁడుగదె యాకదర్యుఁడు ♦ లం బడినట్టి ముహూర్తమెట్టిదో? 7

(1) అధ్యాయప్రారంభము 5–8–1946.

చం. చెరచెరలాడు నాత్మజులు ♦ చేరఁగవచ్చిన నింటికెన్నఁడేఁ,
జుఱచుఱఁజూచు నెవ్వఁడయినఁ ♦ జుట్టమువాఁ డగపడ్డ, జ్ఞాతులం
గొరకొరలాడి బిట్టడలఁ ♦ గొట్టును, ధర్మవిహీన సౌన్యమం
దిరమున వాఁడు నిల్చెడిఁగ♦దే యిఁక నాస్మృతి మాట యేమనన్. 8

కం. ఇటు లతిదుశ్శీలుండుం, గుటిలుఁడు తృష్ణాళు వమిత ♦ కోపనుఁడౌ నా
కొటికం దారసుతాదులు, తుటారములు వలికి కలఁవఁ ♦దొడఁగిరి కడఁకన్.

చం. పిలిచినవెంటనే పలికి ♦ ప్రేముడి డాయుచుఁ జెప్పుచేఁతలన్
సలుపదు జీవితేశ్వరి, ప్ర ♦ సన్నముఖంబులఁ బుత్త్రులెవ్వరుం
బలుకరు యీగాసడింత్రు, నిజ ♦ బంధులు దూఱుదు, రూరివారలుం
జులుకనఁ జూతు రాయలుచ ♦ సోబనమే పిసినారిమన్గడన్ ! 10

ఉ. భోగము దానము న్నులుపఁ ♦ బోవక భూరిధనాభిరక్షణో
ద్యోగము గన్నయక్షువలె ♦ నున్న మహీసురు ధర్మకామముల్
భాగతె రెండులోకములు ♦ భ్రష్టములయ్యెను యజ్ఞదేవతా
రాగము మాసె, నింకెటులు ♦ గ్రాలును లక్ష్మి తదాలయంబునన్ ? 11

ఉ. ప్రముచ్చులు పొంచియుండి తఱి ♦ ముట్టి గ్రహించిరి కొంత, చూడఁగా
వచ్చుచుఁ బోవు చెట్లొకని ♦ పట్టి హరించిరి కొంతదాయ, లే
యిచ్చకమాడిరో కొనిరి ♦ యీవలియావలివారుకొంత, జేఁ
డొచ్చము వెట్టి కొంతగొనె,♦ నూడె నిటుల్ ద్విజువిత్తమంతయున్. 12

ఆ.వె. తప్పిదాటియున్న♦ధన మగ్గి నివుఱయ్యెఁ, గాలదైవములను ♦ గలిసెఁగొంత
చెప్ప నేమిగలదు! ♦సెట్టి యొక్కఁడనిల్చె, ధర్మపరిభవమున♦ధనము తెగదె!

కం. బహుకష్టార్జిత ధనమీ, వహిఁ దనకన్నుల యెదుటనె ♦ పాడయిపోఁగా
నహహా! యేమనిచెప్పుదు. మహీసురుని యెడఁదలోన ♦ మలసినచింతన్ ?

——♦ బ్రాహ్మణుఁడు ధననాశమునకు దుఃఖించుట ♦——

తే. కాలుగాలినపిల్లి, తోఁ ♦ కదెగినట్టి
నక్క, చెవులుగోయఁబడిన ♦ కుక్క, కల్లు
ద్రాగి కైపెక్కు క్రోఁతి, పెం♦దయ్యమడరి
పట్టినకుమారి యయ్యెఁబో ♦ బ్రాహ్మణుండు. 15

చం. నిలిచినచోట నిల్వఁడెవ ♦ నిం గనుఁగొన్నను బుల్లగిల్లు మా
టలఁ దడఁబాటు సెందు నొక ♦ టం బదిలంబుగఁ గూరుచుండఁ డాఁ
కలి దగ తేర్చిసం గెడపఁ ♦ గానఁడు కన్గవనుండి బాష్పధా
రలు నిగుడించుఁ గుత్త్రికయు ♦ రాల్పడఁ బెన్గనట న్మనింగెడిన్. 16

వ. అంతట నాదురదృష్టవంతుం డిట్లు తలపోయసాఁగె. 17

మ. ధనమా! పోయితె చెప్పకుండ! సకల ♦ ద్వారాలు బంధించి యె
వ్వని కంటం బడకుండఁ గాచితిని న్వ ♦ ప్రాణాలకు న్మిన్నగాఁ
గనుఁగొన్నాఁడనె చుట్టపక్కములకుం ♦ గంపైతినే నీకతం
బున నన్నీగతి మోసగించి చనితే! ♦ పోతే! యిలుంబాసితే! 18

కం. కనరానివారిఁ గంటిన్, వినరాని దురుక్తులెల్ల ♦ వింటిం గట్టా!
అనరాని పలుకులంటిన్ జనరాని ప్రదేశములకుఁ ♦ జనితిన్నికై. 19

చం. పరిభవముల్ తనువ్యథలు ♦ ప్రాపుకొనం గడియించితింగదే!
స్థిరముగ నీవునిల్తువని ♦ చెన్నటినైన తలపోసితింగదే!
కరి కలభ శ్రవశ్చలము ♦ గా నిను నెంచకపోయితింగదే!
యరరె ధనంబ! యయ్యోధన ♦ మా! యయయో ధనమా! యయో! యయో!

—* నిర్వేదోదయము *—

మ. అనుచుం బెక్కు తెఱంగుల న్వనటపా ♦ లై బిట్టు వాపోవుచుం
డనభార్యం గనలేఁడు పుత్త్రికులచేం ♦ త న్నిల్వ లేఁ డేరితో
దను భాషింపఁగలేఁ డిటుల్ చనుచునుం ♦ డం గొంత కాలంబు గ
ల్గెను నిర్వేదము వాని కేసుకృత మే ♦ లేశం బెటం డాఁగెనో! 21

ఉ. ఆవల భూసురాగ్రణి హృ ♦ దబ్జమునం దిటులెంచసాఁగెఁగ
ష్టావహ ఋక్థసంచయము ♦ నాయస పేటికలందుఁ బోసి వ్య
ర్థావిలబుద్ధినైతి నొకఁ ♦ డైనను ధర్మముసేయనైతిఁ గా
మావళిఁ దీర్పనైతి నక ♦ టా! చెడితింజుమి యన్నిభంగులన్. 22

ఆ. కింపచాన వితతి ♦ కింపుగాఁ గూర్చిన, ధనము సౌఖ్యములకు ♦ దారిదీయ
దకట! యిచట నిచ్చు ♦ నాత్మవతాపంబుఁ, బరజగమున నరక ♦ బాధనిచ్చు

తే. స్వల్పమయ్యును శ్విత్రంబు ♦ సౌకుమార్య, రూపరేఖావిలాసాళి ♦ రూపుమాపు
నొక్కఁడయ్యును లోభంబు ♦ పెక్కు శ్లాఘ,నీయసద్గుణంబుల నెల్ల ♦ నీఱుసేయు.

చం. ధనము గడించునప్పుడును ♦ దానిని బెంచెడునప్డు దానిఁగా
చునపుడు కష్టముల్ గలుగుఁ ♦ జూకురు చేకురు నాశమానడన్.
దనరెడిఁ ద్రాసము న్వ్యయము ♦ నన్ భ్రమమే చెడి భోగకాలమం
దు నరులకెల్ల, నీధనము ♦ తోడ సుఖంపడువాఁడు లేఁడెటన్. 25

కం. అనృతమ్ము హింస దంభం,బును జోరత్వమ్ము క్రోధ ♦ మును గామంబున్
ధనమునను గడింపఁగా సా,ధనము లగుచు బహువిధాప ♦ దల నుడివెట్టున్. 26

కం. ఘనగర్వము స్పర్థయు మద,ము నవిశ్వాసమ్ము వైర ♦ మును భేదంబుల్
వనితా మద్య ద్యూతము,లను వ్యసనము లొదవు సంచి ♦ తార్థమువలనన్

ఆ. కాన నర్థవిషయ ♦ కంబైన యీ మూఁడు, దొమ్మిదిటి ననర్థ ♦ దోషములను
మేలుగోరువాఁడు ♦ వైళమ యుజ్జగిం,పంగవలయుఁ జు మ్మ ♦ వశ్యముగను. 28

కం. తలిదండ్రు లన్నదమ్ములు, చెలులు సతీసుతులు గూర్మి ♦ చే నేకప్రా
ణులెయయ్యుఁ జిల్లిగవ్వకుఁ, గలహింతురు కొంపమునిఁగెఁ ♦ గాయనుకొనుచున్

కం. మచ్చరములు పెచ్చుపెరుగ, విచ్చలవిడి వాదులాడి ♦ విడుతు రసువులం
గ్రచ్చుఱ గడ్డిపరకకు, స్వచ్చియు నేకకుక్షినుండి ♦ వ్రజ వింతగదా! 30

చం. సురలకుఁ బ్రార్థనీయ మగు ♦ చుం బొగడొందు మనుష్యజన్మ, మం
దురుతర పూజనీయమయి ♦ యొప్పు మహీసురజన్మ, మద్దిచే
కుటీయు ధనంబు చిక్కియు ని ♦ గూర్పక పున్నెపుఁ జేఁతకై మనం,
బరరే! వృథాగ వీఁడు పురు ♦ షార్థము వాసి యథోగతిం బడున్. 31

కం. స్వర్గాపవర్గములకు న,నర్గళమార్గమిది దేహ ♦ మది చేపడినన్
దుర్గతి చూపెడి యీధన,వర్గమునం దగుల వెట్టి ♦ వాఁ డనరాదే! 32

కం. దేవర్షి పితృగణమునకు, జీవులకును జ్ఞాతి బంధు ♦ సేవకులకు వి
త్తావళి వినియోగింపని,యా వెంగలి యక్షవిత్తుఁ ♦ డధమగతిఁ జనున్. 33

ఉ. భూరి వివేకచిత్తులకు ♦ మోక్ష మెలర్పఁగ సాధనంబులై
మీఱు వయోబలార్థముల ♦ మేలి దినంబుల స్వాపతేయ కాం
క్షా రుగితప్రలోభుఁ డగు ♦ జాల్ముఁడ నేను వృథాగఁ బుచ్చితిన్
ఘోర జరాధరం బలము ♦ కొన్నది నే నివు డేమిసేయుదున్ ? 34

ఉ. ఇవ్వసుధాతలంబున న ♦ దేల ? మహావిబుధాగ్రగణ్యుఁడున్
నెవ్వగలం గలంగెడి న ♦ నేక విధంబుల సొమ్ముకోసమై
యెవ్వనియేని మాయ యొకఁ ♦ డేర్పడి యుండఁగఁ బోలు నద్దియే
యివ్విధి మోహపెట్టెడి ని ♦ దెంతయు నిక్కమ శంక యేటికిన్ ? 35

చం. అనవరతంబు మృత్యువు భ ♦ యంకర వక్త్రము విచ్చి మ్రింగుచో
ధనములతోడనేమి ? ధన ♦ జాతల నెయ్యముతోడనేమి ? స్త్రీ
జనములతోడనేమి ? విల ♦ సత్పరిభోగముతోడనేమి ? సం
జననములీను కర్మముల ♦ సంఘముతోడఁ బనేమి మాకిఁకన్ ? 36

తే. అఖిల దేవాత్మకుండు శ్రీ ♦ హరి దయామ
యుండు నిర్హేతుకముగ న ♦ న్నోమఁదలఁచెఁ
గానఁ నే యాత్మతరియింపఁ ♦ గలుగునట్లు
భవజలధినౌక నిరేఁడ ♦ మవతరించె. 37

ఉ. ఇప్పటికే మదాయువు క్ష ♦ యించెనుదిత్తగ శేషముండిన
న్దప్పక ధర్మసాధనము ♦ న స్తపియోగ మొనర్తు శ్రద్ధమైఁ
దిప్పలమారి కాయము స ♦ తిస్థిర విద్యఁ గృశింపఁజేసి నా
కిప్పటి గల్గకుండు తెను ♦ వొందెద నింతటనైన నీశ్వరా! 38

కం. ఓఋషులారా! యోబ్రాం, దారకులారా! త్రిలోక ♦ నాయకులారా!
కారుణ్యదృష్టి నాపైఁ, జేరిచి సమ్మతి నొసఁగుఁడి♦ చేతులుమోడ్తున్. 39

కం. ఏలవిచార మ్మాత్మా: పాకలము చాలదని తొల్లి ♦ ఖట్వాంగమహీ
పాలుఁడు ముహూర్తమాత్రము,లోలోఁగొనెఁగాదె బ్రహ్మ♦లోకమునిర్మన్

కం. విను ముద్ధవ! యీచందం,బున విప్రుండెంచి జ్ఞాన♦మున హృదయగ్రం
థిని ద్రెంచి భిక్షుకుండై, మునియై విజితేంద్రియుఁడయి ♦ భువిఁద్రిమ్మరెడిన్

-* భిక్షకుఁడు పరపీడ సహించుట *-

వ. ఇప్పుడప్పాటునకు 42

కం. నగులుడిగిన లోవెలి భగ,భగమండెడి మంటలాఱె ♦ స్వాంతము విశ్రాం
తిఁగనె న్నిర్మలసౌఖ్యం, బగపడె మదిలోనఁగలద ♦ యంతయు సఖుఁడా!

కం. మంచిదనుచుఁ జెడ్డదనుచు, నెంచక యేయూరికైన ♦ నేగి భిక్షముం
గొంచు న్సంగంబును వర్జించి తిరుగు నాత్మనిష్ఠ ♦ హృష్టాత్ముండై. 44

ఉ. ఎవ్వరిఁ దేఱిచూడఁ డెట ♦ కేగెదవన్నఁ బనేమియన్న నీ
వెవ్వఁడవన్నఁ జెప్పఁడిది ♦ యేమిర వెఱ్ఱి! యన స్వనందు తన్
సవ్వఁ దిట్టినం గసరి ♦ నన్ మొగమెత్తఁడు నిర్జనస్థలం
దవ్వులనుండు భిక్షమిడి ♦ నం దిను లేసియెడం బరుండెడిన్. 45

వ. ఇట్టు లవంతిభూసురుండు చరించుచుండ నొక్కెడ, 46

ఉ కొందఱుబాలకుల్ ముసలి♦కోఁతి యిదే కనుఁడన్న నందులోఁ
గొందఱు వాలమేది? యనఁ ♦ గొంద ఱిదే యని కంథలాగఁగాఁ
గొందఱు చీరలాగఁగను ♦ గొందఱు దండము నక్షమాత్రముం
గొందఱు తక్కమండలువు ♦ గొందఱు పీఠములాగి రార్చుచున్. 47

సీ. త్రాలనార్థాఁబువుల్ ♦ గ్రోలెదే? ఛీ! ముట్ట, రాదంచుఁగుండిదూ♦రమున వైచి
రిదిగో తిమ్మన్న! కా♦చెదపే వసువనంచు, యోగదండంబును♦నూఁచియిచ్చి
రొక్కమంత్రము సెప్పు♦ మొసఁగెద మక్షమా,లనటంచుఁ జెవిని ద్రవే♦లంగ వైచి
రీకంతలో డాఁచి♦తే దొంగసొమ్మంచుఁ, గంథను బేలికల్ ♦ గాఁగఁజించి

తే. రిదిగో యాసనం బ ♦ పేక్షింతువే యంచు
నిదిగో చీర కట్టు ♦ మీ యటంచుఁ
బిలిచిచూపి యొండొ ♦ రులు గ్రహించుచు మండ
గీంద్రు కలఁచి రిట్లు ♦ కేకలిడుచు. 48

వ. ఇ ట్లెవరేమి చేసినం దన్నుఁగా దని శాంతమ్మూపేడకయుండి యవ్వల నా
కుగ్రామంబు విడిచి యబ్బోడ యొండు గ్రామంబుచేరి యందుఁ బసాదము
సంపాదించి నదీతటంబునం గుడువఁగూర్చుండ నచ్చటంగూడఁ గొందఱు
తుంటరులు చేరి 49

కం. పిలిచినఁ బలుకవు నియమ మొ?, పలువా! యనిడాసి యూర్మి ♦ వైవఁదలపయిఁ
ఖలుఁడొక్కఁడు, మూత్రించు, న్నిలుచుండి తదన్నమందు ♦ నీచుండొకఁడున్.

వ. ఆవృద్ధుం డింతయు స్వాంతమున వంతగొనక మఱునాటి వేకువ నొండొక
యూరి కరుగ నక్కడం డక్కులాంద్రు పెక్కండ్రుచేరి 51

చం. పలుకవు పిల్చినంత గరు ♦ వం బటరా యని కొట్టునొక్కఁ, డ
న్యులు గనకుండ నొంటరిగ ♦ నుండును వల్లడికాఁడెపేఁడు, తా
క్కులఁ పెడఁద్రిప్పి పట్టుఁడని ♦ కట్టునొకం, డహహా జరాకృశుం
గెలిచితిలేర! శూర! యని ♦ కేరుచు బంధముఁలూడ్చునొక్కఁడున్. 52

వ. అంత నతండు రేపకడ మఱొండు పురి కరుగ నందును గొంద
ఱుగ్రింపశ్యులుచేరి 53

ఊ. కంటిరె వీని లుబ్ధు నతి ♦ కాంక్ష ధనంబును గూడఁబెట్టి యే
వెంట వ్యయంబుసేయమికి ♦ వీని సతీసుతు లిల్లువాప నీ
గొంటరి యిట్టి వేసముసఁ ♦ గూటికిఁ ద్రిమ్మరసాగె నంచు నె
న్నంటి దురుక్తిబాణముల ♦ నాతని గ్రొచ్చిరి కొందఱేడ్తెఱన్. 54

ఉ. ఎండలఁ వెన్నియన్నఁ జలి ♦ యింపఁడు వల్కఁడు రోసగింపఁ డ
ద్రిం దలపింపసాగె నర ♦ రే! యన నొక్కరుఁ, డబ్బురంబు రీ
తిం దృఢ మౌనవృత్తి గడి ♦ దేతఁ నిజేప్సితసిద్ధిఁబొందు నీ
చందము లెస్స దోఁచెడి ని ♦ జంబుగ నం చొకఁడాడు నవ్వుచున్. 55

కం. అడిగినయెడ నంతయె చే,వడు నడుగకయున్న నెల్ల ♦ వచ్చిపడెడి న
క్కడ నేర్చి తీయుపాయము, బడుగా! యని మఱియొకండు ♦ వకవకనవ్వున్.

ఉ. ఇట్టులు జన్నిగట్టెచటి ♦ కేగిన నచ్చట నేమిచిత్రమో?
చుట్టును మూగి దుర్జనులు ♦ సోదెముగాఁ గని గేలివెట్టినన్
గొట్టినఁ దిట్టినం గనుపు ♦ గొట్టిన నెట్టినఁ గేలువట్టినన్
జుట్టిన నేమిసేసినను ♦ క్రోధపడం డెదఁబూనఁ డల్కయున్. 57

వ. మఱియు నాసిద్ధపుంగవుండు 58

తే. దుర్జనకృత పరాభవా ♦ దులను దైహి
కజ్వరాదుల దైవికో ♦ గ్రతరకష్ట
ములఁ సహించి యనుభవింప ♦ వలయుఁ గాఁ బ్రా
ప్తమైనదెల్ల హర్షంబుతో ♦ నంచుఁ నెంచి 59

* భిక్షుగీత *

కం. కుచ్చితులవలన సిలుఁగుల్, వచ్చిన నవి లెక్కగొనక ♦ స్వవిహితధర్మం
బెచ్చిఱి సాత్త్వికధృత్యా, భ్యుచ్చయమే పాటిఁ బాడె ♦ నొకగాథనిటుల్. 60

ఉ. ఆదరణాగ్రహంబుల న ♦ నల్పసుఖవ్యథలీయ హేతువుం
గాదు జనంబు దేవతతి ♦ గాదు నిజాత్మయుఁ గాదు కాలముం
గా దురుకర్మసంచయము ♦ గాదు గ్రహావళి గాదు సంసృతిక్
సోదెముగాఁగఁ ద్రిప్పు మది ♦ సుమ్ము ప్రధాననిదానమారయన్. 61

సీ. అతిబలీయమ్మగు ♦ నంతరంగమ్ము రా,గద్వేషముఖ గుణ ♦ గణముఁ జేయు
నాగుణావళిలోన ♦ నవదాతవర్ణ స,త్త్వమ్మునఁ బుణ్యక ♦ ర్మమ్ము వొడము
దాన దేవత్వ మ్మొ ♦ దవుఁ; గృష్ణవర్ణత,మస్సునఁ బాపక ♦ ర్మమ్ము వొడము
దానఁ దిర్యక్త్వ మ్మొ ♦ దవును; లోహితవర్ణ,రజమున మిశ్రక ♦ ర్మమ్ము వొడము

తే. దాన మానవజన్మమ్ము ♦ దావరించు, నిట్టిజన్మంబులం జని ♦ యించు మనల
స్వాంతములచే గుణమ్ములీ ♦ చందమునను, బరలి సంసారచక్రంబు ♦ దిరుగుచుండు.

వ. సంకల్పవికల్పంబులు సేయుచు మనంబు ప్రవర్తించుచుండఁ దత్క్రియాసంగ రహితుండై జీవసఖుండైన యాత్ముండు విద్యాశక్తిప్రధానుండు గావునం జేసి యతిరోహితజ్ఞానుండై కేవలసాక్షియై చూచుచుండును. జీవుం డట్లు గాదు తనయందు సంసృతిం ద్యోతింపంజేయు మనంబు నాత్మభావంబున స్వీకరించి తద్గుణసంగంబున విషయంబుల భోగించుచుఁ గర్మసంబద్ధుం డగుచున్నాఁడు. ఇట్లవిద్యవలన మనోఽధ్యాసంబుచే జీవునకు సంసారబంధం బొడవుచున్నది. నియంతయగు నీశ్వరుండు మాయాతీతుండగుట నాతనికి సంసారంబు లేదు. 63

తే. దాన నిత్య నైమిత్తిక ♦ ధర్మ నియమ
యమములు వ్రతమ్ము లధ్యయ ♦ నములు నన్య
కర్మము లవెల్ల మదిని ని ♦ గ్రహముసేయఁ
గాఁజుమీ యిదే పరమయో ♦ గమ్ము నిజము. 64

చం. ఎవనిమనంబు కామముఖ ♦ వృత్తులసంతత గాఢశాంతి పై
భవమునఁ గుల్కుచుండెడినొ ♦ వాఁ డలదానతపోముఖంబు లేల చే
యవలయు నింక; నేని హృది ♦ యం బటులుండక యగ్గలిక్కి పా
డవు నిఁక దానమాఖ్యకృతు ♦ లాఘునుఁడుం బొనరింపనేటికిన్ ♦ 65

కం. మన ఇంద్రియంబుఁ గెల్చిన, వనగుచు నితరేంద్రియములు ♦ వశమైయుండున్
మనమట్లులోఁబడదు తక్కిన యింద్రియవర్గములను ♦ గెల్చినఁగూడన్. 66

చం. ఒరులకుఁ దానులోఁబడక ♦ యుండుట హృషీకసురాళి లోఁగొనన్
బర మునిశీఘ్ర మిద్ది బల ♦ వత్తరికంబు బలిష్ఠమైన, దీ
కఱకరి చిత్తదేవతను ♦ గైవస మొవ్వఁడు సేయు వాఁడెగా
వెరవరి దేవదేవుఁడు వ ♦ విత్రుఁడు సర్వహృషీకజేతయున్. 67

ఉ. ఎమ్మెయిఁబుట్టకోఁ జనిన ♦ నేదెసనో పడి పర్విలెత్తు వే
గమ్మగ, నొడ్లమర్మములఁ ♦ గ్రక్కదలించి కలంచివైచుఁ, జి
త్తమ్మను వైరి దుర్జయుఁడు ♦ దా రతనిం గెలువంగలేక క
య్యమ్ము లొనర్తు రేల యరు ♦ లం జోరులం గని మూఢమానవుల్. 68

కం. శత్రులు మిత్రులు సములని, ధాత్రిని గలవారి నెన్నె ♦ దరు తమయంత
శ్శత్రుని దలఁపని తలఁపను, చిత్రంబగు నిట్టి చెనఁటి ♦ చెయ్వుఁగన్నన్. 69

ఉ. మానసమాత్రకల్పితము ♦ మాయికదేహము దీనిపైని నెం
తే నహమున్ మమత్వము వ ♦ హించి ప్రలుబ్ధ విమూఢబుద్ధులై
నేనని లాతివాఁడని య ♦ నేక విధంబుల జిత్తవిభ్రమం
బూని దురంత సంసృతి ప ♦ యోనిధి ద్రొళ్లుదు రీజడుల్ నరుల్. 70

వ. సుఖదుఃఖములకు మనంబే కారణంబు. జనంబుగాదు. ఒకవేళ జనులని యొప్పుకొన్నను పార్థివములైన దేహములఁ బొందిన జనులు పార్థివదేహములకే సుఖదుఃఖములఁ గల్గింపఁగలరు కాని యమూర్త మక్రియమైన యాత్మ నేమిచేయఁగలరు? పోనీ! జనులదేహములు సుఖదుఃఖములఁ గల్గించుచున్నవందువా? జడములైన దేహములు చేయుట యేమి? యనుభవించుట యేమి? మఱి దుఃఖ మాత్మపర్యవసాయి యగుచున్నదిగదా యందువా? అగుటలేదు. పోని యొక్కవిధముగా నగుచున్న దనుకొన్నను స్వపరదేహగతుండు పరమాత్ముం డొకండకదా! ఒకనికే కర్తృత్వ కర్మత్వము లెట్లుపొసంగును! చూడు దంతములు జిహ్వయుఁ దనవే కదా. ఎవ్వఁడైనఁ దనదంతములతోఁ దననాలుకం గొఱికికొని యాబాధ కెవనిం గోపింపవలయు? కాన సుఖదుఃఖహేతువులు జనులుకారు.

పోనీ, దేవతలు సుఖదుఃఖములకు హేతుభూతులా? సూతము. అహంకారమున బుట్టినట్టి దేవతలు వికారులైరి. ఈ దేవతాలింగము నధిష్ఠించి యుండుటను హస్తముచే ముఖము నిహతంబైనను ముఖముచే హస్తము దష్టంబైనను నెవనికి దుఃఖము? తదభిమానులైన యింద్రియములకే. వికారులకే ద్వంద్వము లుండునది. అవిక్రియుండును నిరహంకారుండు నైన యాత్మున కేమి? ఆత్మను హానేమియుఁ జేయలేదు అనియునుగాక స్వదేహముల ముఖాద్యంగములుం బోలె సర్వదేహములందు వహ్న్యాద్యధిదేవత లభిన్నులు. తన్నుఁ దాను బీడించుకొనుట యెందైన నుండునా? కాన నెట్లును దేవతలు దుఃఖహేతువులుగారు. పోనీ సుఖదుఃఖహేతు వాత్మయే యనుకొందము. అనుకొన్న నేమి? అవశ్యంబుగను నాత్మకు సుఖదుఃఖాద్యాకారపరిణామము దాని నిజస్వభావమే యగునాయె. అన్యులు హేతువులు కాకైరి. ఇఁక నన్యులపైఁ గోపించుటెట్లు? అట్లుగాదు. ఆత్మకుఁ దత్పరిణామ మన్యనిమిత్తంబున జరుగుచున్నదందమా? ఆత్మాతిరిక్తం బింతయు లేదే! అదెట్లు పొసంగు? లేకేమి? జగము భాసించుటలేదా? యందమా? ఆభాసించుట యంతయు మృగజలము వలె మృషయే. అవిచారితరమణీయమే. కాన నిమిత్తమే లేనపుడిఁక సుఖమెక్కడ? దుఃఖమెక్కడ? ఎవనిపైఁ గోపము?

పోనీ, గ్రహములు సుఖాదినిమిత్తకములు కాఁగూడదా? అన్నచో నవుదుమాత్రము పుట్టుకలేని యాత్మకేమి! పుట్టుకయున్న దేహములకే జన్మలగ్నాపేక్షచే ద్వాదశాష్టమాది రాశిస్థగ్రహములు దుఃఖాదు లొసంగును. మఱియు గగనస్థగ్రహములకు నిలనున్న గ్రహములచేతనే పాదదృష్ట్యాదిసంబంధమువలన దైవజ్ఞులు పీడాదికము పఠింతురు. తత్సంబంధరహితునికి గ్రహములు కష్టసుఖములఁ గల్గింపలేవు. కాన దేహలగ్న గ్రహముల కందని పురుషుం డెవనిం గోపింపవలయు!

అటులైనఁ గర్మములవలన నాత్మకు సుఖాదు లొదవుచున్నవా? అనిన నది యెట్లు? ఒక్కవస్తువునకే జడాజడత్వంబు లడరినంగదా యది పొసంగెడిని. జడంబైనచో వికారిత్వంబు, నజడంబైనచో హితానుసంధాతృత్వంబు సంభవించు. ఇచట నట్లుగాదే! దేహము జడము నచిత్తు. కాన దానికిఁ బ్రవృత్తి కలుగదు. అందువలనఁ గర్మము లేదు. ఆత్మయో శుద్ధజ్ఞానస్వరూపుఁ డగుటం జేసి కర్మముల నాచరింపఁడు. కాఁగా సుఖదుఃఖమూలభూతంబైన కర్మమే లేదే! ఇఁకఁ గర్మము సుఖాదిహేతు వెట్లగు?

వినఁ గాలము ద్వంద్వహేతువేమో లెస్సగాఁబరికించిన సవితుఁ బ్రభము సరివడునా? ఆత్మ కాలస్వరూపంబె. అగ్నికి స్వాంశజ్వాలాదులవలన దాపంబును దాహము వలననాశంబును గలదా? ఉపాధిభూత కాష్ఠాంశ మున నున్న నుండుఁగాక. హిమశైత్యమునకుఁ దదంశతుషారకణంబు వలన నాశనమున్నదా? యిస్సీ! బ్రహ్మమునకు స్వీయాంశంబైన కాలం బువలన ద్వంద్వం బొదవదు. అంశవిషయ మట్లుండుఁగాక. వాస్తవము నకు నన్నింటికంటెఁ బరుండైన యాత్మునికి ద్వంద్వంబు లెవరు ఘటింప గలరు. 71

తే. కనుక దేనిచే నవ్వాడె ♦ కరణి ద్వంద్వ
బాధ లావరాత్మునకు ♦ వరలఁజాల
వీయహంబె సంసృతిరూపి ♦ యిది యెఱుంగు
వాఁడు భూతాళివలనను ♦ భయవడండు. 72

వ. అని యాబ్రహ్మవిదుం డాత్మగతంబునఁ దర్కించుకొని యాగాథంబాడి 73

ఉ. మున్ను మహర్షిపుంగవులు ♦ వోయిన తెన్ను వరాత్మనిష్ఠ, యా
తెన్నున నేనుబట్టి యతి ♦ దీక్ష గుటుంబ దురంతపార వా
రాన్నిధి నుత్తరింతు నను ♦ రప్రభు ధాతృ మహేశ పూజిత
వ్యోప్నత పాదపద్ముఁ గరు ♦ ణోదయుసద్మ హరిన్ స్మరించుచున్. 74

మ. అని యాపాఱుఁడు గాథ నిశ్చయ మనో ♦ వ్యాపారుఁడై ధీరుఁడై
ఘననిర్వేద గతాత్మభారుఁడయి భి ♦ క్షావృత్తి సంచారుఁడై
మునిగేయాఢ్య విహారుఁడై సహనవ్రా ♦ న్మాతావృజాగ్రేసరుఁడై
యనిదంపూర్వ శమైకసారుఁడయి యొ ♦ ప్పారెంజుమీ యుద్ధవా! 75

కం. నష్టధనుఁడు నిర్వేదా, విష్టంభంబుఁ గ్లమంబుఁ ♦ బాయుచుఁ బ్రవ
జ్యేష్టిం దుష్టి వడసి బహు, కష్టముల స్వధర్మమెడల ♦ శమహిం దిరుగున్.

ఆ. ఎంత లోభియైన ♦ సంతయో యింతయో, శ్రుతులఁ జదివినట్టి ♦ సూరిగాన
నెవ్వఁడో యొకవ్వ ♦ డెంరారె విజ్ఞాన, మెన్నఁడైనఁజదువు ♦ వృథగఁజనునె?

ఆ. సౌఖ్యదుఃఖముల నొ ♦ సంగుసట్టిది మనో, విభ్రమంబ కాదు ♦ వేటొకండు
దానము స్నేహితుం డు ♦ దాసీనుఁ డడరు సం, సారమెల్లయుం డ ♦ మశకృతంబ.

కం. ఉద్ధవ! యెల్లతెఱంగుల, బుద్ధిని మచ్చరణ కమల ♦ ములపై నిడి సం
బద్ధముచేయుము మనముఁ బ్ర,సిద్ధంబగు యోగమిదియ ♦ చెప్పితినీకున్.79

ఆ. ఎవఁడు భిక్షుగీత ♦ నీబ్రహ్మనిష్ఠ స
మాహితుఁడయి వినును ♦ మననముం బొ

నర్చు వినుచు శ్రద్ధ ♦ నరుఁ డతం డెన్నండు
ద్వంద్వములను బరిభ ♦ వంబు గనఁడు. 80

వ. అని శ్రీకృష్ణుం డుపదేశించె నని శుకమహర్షి వచించెను. 81

ఇది త్రయోవింశాధ్యాయము సమాప్తము

---

## చతుర్వింశాధ్యాయము

కం. కడవట్టెడిఁ బొత్తంబని, కడగంటం జూడవేమొ ♦ కద, నాయనువుల్
కడవట్టెడి నీదయలే, కడుగటు పెట్టంగలేను ♦ హరిహరనాథా ! 1

—* శ్రీకృష్ణుం డుద్ధవునకు సాంఖ్యముపదేశించుట *—

వ. [1] దేవా ! యవధరింపుము. శ్రీ శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. శ్రీకృష్ణుం డుద్ధవునింజూచి నాయనా! యద్వితీయ పరబ్రహ్మము నుండి మాయచేఁ బ్రకృతిపురుషద్వారమున సర్వద్వైత ముదయించి యందే లీనమగుచున్న దని గ్రహించిన భ్రమంబు నివర్తించును. 2

కం. ఆదిని నుడివిరిమును కపి, లాదులు సాంఖ్యమను యోగ♦మనువమ మనఘా!
భేదనిమిత్తము సుఖదుఃఖాదిభ్రమ ముడుగుకొఱకు♦నది వినువినుతుఁడ. 3

సీ. అనఘాత్మ ! ప్రళయంబు ♦ నందు సర్వము జ్ఞాన
మను వికల్పము లేక ♦ యలరు బ్రహ్మ
మొకఁడె; తొలికృత ♦ యుగమందును వివేకు
లిట్లు బ్రహ్మైకత్వ ♦ మే గ్రహించి;
రంతం గ్రమముగ బ్ర ♦ హ్మము వాఙ్మనములకం
దెడునట్లు మాయచే ♦ ద్వివిధ మయ్యె;
నందొకండర్థ మ ♦ య్యదె కార్యకారణా
త్మకమును దృశ్యమ్మ ♦ ప్రకృతి యనఘ !

తే. మఱియొకండు జ్ఞానము ద్రష్ట ♦ పురుషుఁ డనఁగఁ
బరగు; నే క్షోభ మొనరింపఁ ♦ బురుషు నను మ
తమునఁ దత్ప్రకృతికిని స ♦ త్వము రజస్సు
తమము నా మూఁడుగుణము లు ♦ ద్భవములయ్యె. 4

---

1 అధ్యాయప్రారంభము 12—8—1946.

వ. ఉద్ధవా ! పురుషు ననుమతంబున నన జీవాదృష్ట ప్రకారమున నని గ్రహిం
పుము. ఆవల విను ఆత్రిగుణములకు మహత్తత్త్వ ముదయించె. ఇదియ
బుద్ధి. ఇదియ ప్రథమ వికారము. ఇది జ్ఞానశక్తియుతమైన మహత్తనియుఁ
గ్రియాశక్తియుతమైన సూత్రమనియు బిలువంబడు. బహుమణులందుఁ
సూత్రముంబలె నెల్ల కార్యములయందు ధారకంబై యునికిం జేసి సూత్రసంజ్ఞ
లబ్ధంబు. జ్ఞానము క్రియాగర్భముగాన మహత్తు సూత్రసమన్వితంబు.
రెంటి కభేదంబు. 5

తే. ఆమహత్తున నుద్భవం ♦ బయ్యె జీవ
గణవిమోహకంబగు నహం ♦ కార మదియుఁ
దామసము తైజసము వైకృ ♦ తమ్ము నాఁగ
మూఁడు విధములచేతను ♦ బొలుపుమీఱు. 6

సీ. ఏతదహంకార ♦ మేనుమీ తన్మాత్ర
ములకు దశేంద్రియం ♦ బులకు మదికి
నధిదేవతలకును ♦ నాదికారణమయి
చిదచిన్మయంబయి ♦ చెలఁగుచుండు
తన్మాత్రములు నిమి ♦ త్తములుగాఁ దామసం
బునఁ బంచభూతముల్ ♦ జననమందెఁ
దైజసాఖ్యంబైన ♦ రాజసంబున నింద్రి
యమ్ములు పది యుద్భ ♦ వమ్ములయ్యె;

తే. విమలవైకారికాఖ్య సా ♦ త్త్వికమువలన
స్వాంతము తదింద్రియాధిదే ♦ వతలు పదునొ
కండ్రు జనియించి; రిట్లహం ♦ కారమున సె
త్రివిధసృష్టి; జీవునకు నం ♦ దిర మహాత్మ. 7

వ. తాతా! పంచమహాభూతము లావరణ స్వభావముగలవి గానఁ దామసంబు
నను, నింద్రియములు ప్రవృత్తిస్వభావము గలవి గాన రాజసంబునను,
నధిదేవతాగణములు ప్రకాశస్వభావము గలవి గాన సాత్త్వికంబునను
జనియించు నని గ్రహించితివా !

కం. ఈభావము లన్నియు మి, శ్రీభూతంబగుచు నాడు ♦ ప్రేరణ నండం
బై భాసిలుచుండు నదే, గా భవనవిశేష మవ్వి ♦ రాట్పురుషునకున్. 9

తే. నేన సుమ్మి వైరాజాఖ్య ♦ నెగడితిం ద
దండమందు నంతర్యామి ♦ నగుచుఁ; దజ్జ
లస్థితాండమం దేను లీ ♦ లాస్వరూప
మలర నారాయణుండనై ♦ వెలసియుండ. 10

కం. మన్నాభిని విశ్వాఖ్య లసన్నీరేజంబునుండి ♦ చతురాస్యుండు
త్పన్నుండయ్యె విరాట్టై, ప్రసన్నన నిటులొందవె భోగ ♦ కలితాకృతియై. 11

కం. వారిజభవుండు తప మవ్వారిగఁగావించి మత్కృ ♦ పాగరిమ రజో
వారితశక్తిం ద్రిజగము, వారిని దత్పాలకులను ♦ వలనుగఁజేసెన్. 12

వ. అనవుడు నుద్ధవుండు స్వామీ! లోకములు పదునాలుగుగదా యన శ్రీకృ
ష్ణుండు దరహాసభాసురాననుండై యగునుద్ధవా! యేను భూమిని దత్సు
షిరగతాతలాదిలోకంబులనుగలిపి భూలోకంబనియు, నంతరిక్షలోకమును
భువర్లోకమనియు, సుఖప్రాధాన్యంబునంజేసి స్వర్గముం దనుపరిమహ
ర్లోకాదులంగలిపి స్వర్లోకంబనియు మూఁడులోకములుగాఁ బరిగణించితి.
అవ్వల విను. 13

ఉ. నాకమునందు నిర్జరగ ♦ ణంబును, భూమి మనుష్యులున్ భువ
ర్లోకమునందు భూతతతు ♦ లున్, భృగుముఖ్యులు సిద్ధు లమ్మహ
ర్లోకమునందు, నాగు లసు ♦ రుల్ ధరక్రింది రసాతలాదులం
దోకముఁ జేసి నిల్వ జల ♦ జోద్భవుఁ డేర్పఱిచెన్ యదూద్వహా! 14

కం. త్రిగుణాత్మక కర్మము లూఁతగ ముజ్జగములని తిరిగె ♦ దరు నరు;లటుపై
నీఁ గల మహాత్తపజనులు, మొగిని దపోన్యాసయోగ ♦ ములనెచనఁగనౌ.

కం. గణనీయ భక్తియోగ, ప్రణయులు గాంతురు మదీయ ♦ వైకుంఠమ్మున్
బ్రణుమ శ్రీకంఠము న, ద్గుణోపకంఠము రమా మ ♦ ధుర కంఠమ్మున్. 16

వ. పరమేశ్వరుండ నగు నేను నిమిత్తమాత్రుండనుగాఁగఁ గాలశక్తివలన
వారివారి కర్మఫలముల కనుగుణముగా నాస్థావరమునీచగతుల, నాసత్య
లోక ముత్తమగతుల, నీవరులొందుచు నీసంసారమున మునిఁగి తేలు
చున్నారు. ఇట్లు మద్గతివ్యతిరిక్తగతులన్నియుఁ జంచలంబులనియెఱుంగుము.

ఆ. అణువునందుఁగాని ♦ యతిబృహద్రూపంబు,నందుఁగాని కృశము ♦ నందుఁగాని
స్థూలమందుఁగాని ♦ సారిదిసర్వమునందుఁ,బ్రకృతిపురుషయుగము ♦ పరిఢవిల్లు.

సీ. కార్యమునకు నేది ♦ కారణంబుగనుండు
నాద్యంతములను మ ♦ ధ్యమునఁగూడ
నదెయుండుఁ; జూడమ ♦ టయ్యె ఘటాద్యంత
దశలందు మృత్తిక ♦ తనరుచుంట;
కనుక నే నడుమ వ ♦ చ్చిన ఘటంబునఁగూడ
నామృత్తికయె చెలు ♦ వారుచుండు
నట్లె నడుమవచ్చి ♦ నట్టి జగమున నా
ద్యంత మధ్యముల బ్ర ♦ హ్మంబె చెలంగు;

తే. పూర్వభావ ముపాదాన ♦ మగును దేనిఁ
బడసి యపర వికారమ్ము ♦ నడరఁ జేయు
నట్టికారణమే సత్య ♦ మైనయది, వి
కారమున గాదిఁ దుదిఁ బోలు ♦ పాఱఁగాన. 19

తే. ఘటమునకును బిండమ్మగుఁ ♦ గారణమ్ము
మఱియు ఘటపిండములకును ♦ బరమకార
ణమగు మృత్తికసత్య, మ ♦ ట్లు మహదహము
లకును బరమకారణమై చె ♦ లంగుఁగాన 20

వ. బ్రహ్మమే సత్యమని యెఱుంగుము. మృత్తునే జలాదానాది వ్యవహా
రార్థము ఘటమన్నట్లు బ్రహ్మమునే వ్యవహారార్థము జగమనుచున్నారము.

తే. కార్యజగతి కుపాదాన ♦ కారణమగు
ప్రకృతి, దాని కాధారుఁడో ♦ వరుఁడు పురుషుఁ,
డల గుణక్షోభమున నభి ♦ వ్యంజకమగు
కాల, మిమ్మూఁడు నేనెనూ ♦ కాదు వేఱు. 22

వ. నాకు శక్తి ప్రకృతియు, నవస్థాభావంబులు పురుషకాలంబులనియుఁ
గొందఱెంతురు. దానికేమి? 23

తే. బహుళమైన యీసర్గప్ర ♦ వాహము పితృ
పుత్త్రపౌత్త్రాదికంబుగాఁ ♦ బొడువుసాఁగు
చుండు నిత్యమై జీవప్ర ♦ యోజనార్థ
మీశుదృష్టిచే స్థిత్యంత ♦ మెసఁగువఱకు. 24

తే. అస్మదీయనిరీక్షణ ♦ మాఁగఁగానె
యఖిలలోకజన్మలయంబు ♦ లహరహంబు
జరగు బ్రహ్మాండమును లోక ♦ సహితముగను
లయ మొసర్చు మద్రూపకా ♦ లమ్మువోలెసి. 25

వ. తత్ప్రకారమ్ము వినుము, 26

—♦ లయప్రకారము ♦—

క. తనువు తన కుపచయంబుం, బొనరుచు నన్నమున, నన్న ♦ ముం బీజమునం
దును, బీజము భూతలమం, దును, భూమియు గంధమందుఁ ♦ దూరిలయించున్

క. పొందుగ గంధము నీర, మ్మందును నీరమ్ము రసము ♦ నం దది తేజం
బందును దేజము రూపము, నందుం గ్రమముగ లయంబు ♦ నందుచునుండున్.

వ. ఉద్ధవా! తెలియుచున్నదా! మరలవినుము. శతవర్షానావృష్టిచే నన్నము క్షీణింప నందు శరీరములు లయించు. అన్నము ధాన్యమునందు బీజమాత్రావశేషంబగు. బీజము క్షేత్రంబున నుప్తమయ్యు మొలవక యుండే లయించుఁ దద్భూమి సంవర్తకాదిత్య శోషితయు సంకర్షణముఖాగ్ని దగ్ధయునై భూతసూక్ష్మ రూపగంధ తన్మాత్రావశేషయగు. గంధము శతవర్షవృష్టిచే జలమందు లయించు. ఇట్లేజలము జ్యోతిశ్శోష్యమాణంబై రసమాత్రావశేషంబగు. రసమగ్నియందు, నగ్నివాయువుచే నభిభూయమానంబై రూపమాత్రంబై పొల్చును. 29

తే. రూప మనిలంబునందుఁ జే ♦ రు ననిలంబు
నస్మదీయ కాలప్రేరి ♦ తాంబరమున
గ్రస్తమై స్పర్శమందును ♦ గలియు స్పర్శ
మంబరంబునయందు ల ♦ యంబుఁ గాంచు. 30

సీ. గగనంబు భూతాది ♦ యగు నహంకృతిభుజ్య
మానమై శబ్దత ♦ న్మాత్రమందు
నణఁగు; శబ్దము తామ ♦ సాహంకృతిని లయ
మైపోవు; రాజసా ♦ హంకృతిని హృ
షీకముల్ లయమును ♦ జెందు; మనం బింద్రి
యాధిదేవతలచ ♦ యమ్ము[1] వైకృ
తాహ్వయాహంకార ♦ మందు లయించును
మూఁడు తెగల యహం ♦ కారమును జ

తే. డాంశమెడలు మహత్త్వత్త్వ ♦ మందు లయము
నందు; జ్ఞానక్రియాయుఙ్మ ♦ హత్తు వాని
వదలి గుణమాత్రరూపమై ♦ పొదలు; నా గు
ణమ్ము లవ్యక్తమందు ల ♦ యమ్మొందు. 31

తే. ఈప్రకృతియును నుపరత ♦ వృత్తియైన
కాలమం దైక్యమగును, ద ♦ త్కాలమును మ
హాపురుషుఁడు మాయామయుం ♦ డైనజీవు
నందు; జీవుఁడాత్ముఁడగు నా ♦ యం దడంగు. 32

తే. ఆత్ముఁ డేమెల్ల; వానికి ♦ నన్యమొండు
లేదు; నిరుపాధికుఁడు వాఁడు ♦ భేదశూన్యుఁ
డక్షరుఁడు వికల్పాపాయ ♦ లక్షణుండు
వానికి లయంబు లేదు ప్ర ♦ జ్ఞానఘనుఁడు. 33

1. వైకృతము = సాత్వికము

కం. ఇట్టులు విమర్శసేసెను, నట్టినరునకు న్వికల్ప ♦ మగు భ్రమ మేలా
పుట్టును! బుట్టినమదిలో, నెట్టునిలుచుఁ దమము నిల్చు♦నే రవియెదుటన్! 34

తే. కంటె సాంఖ్యము సంశయ ♦ గ్రంధిభేది
నొడివితిని బరాపర దర్శ ♦ నుండనుగానఁ
బ్రేమమున; ననులోమవి ♦ లోమముగను
మనన మింకఁ జేసికొమ్ము నె ♦ మ్మనమునందు 35

వ. అని శ్రీకృష్ణుండు బోధించెనని శుకమహర్షి వచించెను. 36

ఇది యేకాదశస్కంధమునఁ జతుర్వింశాధ్యాయము సమాప్తము.

---

## పంచవింశాధ్యాయము

కం. ఒకొక్కరియందుఁ జొచ్చి యొ
కొక్కపనిని సలుపఁజేయు ♦ చుందువు నీవ
వ్యాకారుణ్యము నెఱుఁగము
స్వాకారము నెఱుఁగ మీశ ♦ హరిహరనాథా ! 1

### —* శ్రీకృష్ణుం డుద్ధవునకు గుణవృత్తుల బోధించుట *—

వ. [1]దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అంత శ్రీకృష్ణభగవానుం డుద్ధవునితో నుద్ధవా! ప్రకృతి పురుషులం దెలిసికొన్న జ్ఞానవంతులు నయిత మెంత ప్రయత్నించియు గుణవృత్తులం జయింపనేరరు. అందువలన ద్వంద్వోపశమం బొదవదు. కానఁ దజ్జయోపాయ మాలింపుము. ముందు 2

కం. ఇమ్మనుజుఁ డసమ్మిశ్రగు,ణమ్ములలో నేగుణమ్ము ♦ నన్ యాదృశుఁడై
యిమ్ములఁ జరించు నాచం,దమ్ము వచింతు విను సావ♦ధానమనమునన్, 3

కం. క్షమ కరుణ వివేకము స,త్యము దానమ్ము స్మృతి తుష్టి♦తప మస్పృహాత్యా
గము హ్రీ శ్రద్ధార్జవములు,శమదమ వినయాదికములు ♦ సాత్త్వికవృత్తుల్.

సీ. అభిలాష దర్పమ్ము♦వ్యాపారమును లాభ,మడరియు సంతోష♦మందకునికి
గర్వమ్ము విత్తాది♦కమునకై దేవతా,దుల వేఁడికొనుచుంట♦యలఘుభేద
బుద్ధియువిషయానఁ♦భోగంబు స్తోత్రప్రి,యతమదోత్సాహమ్ము♦హాస్యకలన
స్వప్రభావము బయ♦ల్పఱచుట బలిమిఁజూ,పించుటాదిగ రజో♦వృత్తులగును

---

[1] అధ్యాయప్రారంభము 18—8—1948.

తే. అనృతమును గ్రోధమును లోభ ♦ మార్తి హింస
యాచనము విషాదము కల ♦ హమ్ము దంభ
మాశ శోకము క్లమము మో ♦ హమ్ము నిద్ర
విహ్వలత జడత్వము తమో ♦ వృత్తులగును. 5

వ. ఉద్ధవా! ఇట్లు సత్త్వాదులకుం బ్రత్యేకవృత్తులం గ్రహింపుము. ఇంక నీత్రిగుణమ్ముల సన్నిపాతవృత్తుల నుడివెద వినుము. నేను నాది యనెడు నహంకార మమకారప్రయుక్తబుద్ధి సర్వవృత్తులకు సామానాధికరణ్యం బగుటంజేసి యదిసన్నిపాతజన్యంబ. 6

సీ. నేనుశాంతుండను ♦ నేనుగామిని నేను
క్రోధి నటంచు నా ♦ కుఁ దనరారు
శాంతి కామము క్రోధ ♦ మొంతయుననియిట్లు
గుణయుతివ్యవహార ♦ కోటిజరగు
నేలయందువొ? గుణ ♦ పాళినిగాదె మ
నంబు తన్మాత్రేంద్రి ♦ యంబు లసువు
లేర్పడె; నవి కల ♦ యికఁగన్నఁగాదె యీ
వ్యవహారమంతయు ♦ వరలుచుండు;
తే. అనఘ ధర్మార్థకామంబు♦లందు నిష్ఠ,తత్ఫలమ్ముగ శ్రద్ధయు♦ధనము రతియు
నడరుటయు గుణమిశ్రణం♦బగుటఁజూవె, దేవభాగకుమార! సుధీవిచార! 7

తే. గేస్తు నిత్యనైమిత్తిక ♦ కృత్యములను సలుపుఁ,
గామ్యధర్మంబుల ♦ న్సలుపు, గృహము
నందు సక్తుఁడై మెలఁగు ని ♦ య్యదిగుణత్ర
యాభిమిశ్రణమునన వి ♦ ద్యాలవాల! 8

వ. పురుషుం డేగుణంబుల యాదృశుండై యుండునో వివరింతు. 9

కం. శమముఖగుణములచే స
త్త్వమయుండని వివిధకామ ♦ దర్పాదిక యో
గమున రజోమయుఁడని, క్రో
ధముఖములఁ దమోమయుఁడని ♦ తలఁపనగునరున్. 10

చం. తనకులధర్మకర్మ సము ♦ దాయ మపేక్ష యొకింతయేనియుం
గనక యొనర్చుచు న్నలఁత ♦ గాని పుమాంసుఁడుగాని భక్తిభా
వన వనజాక్షు శ్రీలలిత ♦ వక్షు ననున్ భజియించునేని యా
ఘనమతి సాత్త్వికప్రకృతి ♦ గాఁ గొనియాడఁబడుం గుమారకా! 11

కం. ప్రకటఫలమ్ములు గోరుచు, స్వకర్మముల నన్భజించు ♦ వాఁడగును రజః
ప్రకృతి; మఱిశాత్రవులహిం,సకుఁగానన్గొలుచునేఁడ♦మఃప్రకృతియగుఁగా. 12

కం. మనమందుం బొడమెడు నీ, గొనములుజీవునకెగాని ♦ కొఱలవునా కో
యనఘా! భూతమ్ములకుం,బెనుబంధముగలుగుఁజువ్వె♦వీనికలయికన్. 13

వ. ఇప్పు డేకైకగుణోద్రేక కార్యముల నాలింపు. 14

తే. శాంతమును స్వచ్ఛమును విభా ♦ స్వరము నైన
సత్వ మితరగుణద్వయిం ♦ జంపెనేని
సుఖము ధర్మము జ్ఞానమ్ము ♦ శోభిలంగ
నన్నరుం డేమిటం గొఱంతె ♦ నందఁబోఁడు. 15

తే. సంగ, భేద, ప్రవృత్తుల ♦ సంతరించు
రజ మితరగుణద్వయిపయి ♦ విజయముగొని
ఘనయశశ్శ్రీల, దుఃఖాలఁ, ♦ గర్మజాల
ములను గల్గించుఁజువ్వె మ ♦ ర్త్యులకు వత్స! 16

తే. మూఢము, లయమ్ము, జడమా త ♦ మోగుణ మ్మి
తర గుణద్వయిం గెల్చిన ♦ దైన్యశోక
మోహహింసలు, న్నిద్రలుం, ♦ బొలుచు రి త్త
తలఁపులుం గల్గు నమ్మను ♦ ష్యులకు వత్స! 17

చం. ఎపుడు మనంబు నిర్మలత ♦ నెయ్దునో? యింద్రియసంచయంబు తా
ముపరతి నొందునో విషయ ♦ యోగముమాని, శరీరమందు భీ
తి పరిఢవిల్లకుండునో? మ ♦ తిం దృఢమైన విరక్తిగల్గునో!
యపుడ యెఱుంగు మత్పదము ♦ నందఁగ సత్వము వృద్ధిగన్నటుల్. 18

తే. ఎపుడు కర్మములఁ గలంగి ♦ హృదయ మొగుడు
జ్ఞానవిషయుల కనివృత్తి ♦ జాలువాఱు
గర్మవిషయులకు వికార ♦ గరిమ పెరుగు
నవుడ రజ ముత్కటంబయ్యె ♦ నని యెఱుంగు. 19

తే. ఎప్పుడు తిరోహితంబగు ♦ చెడఁద విషయ
కాండము గ్రహింపలేక సం ♦ కల్పములను
గనక లయమగు; నజ్ఞాన ♦ మును విషాద
మడరు నవుడ తమంబేచె ♦ నని యెఱుఁగు. 20

తే. సత్త్వమున దేవబలము, ర ♦ జమున నసుర
బలము, తమమున రాక్షస ♦ బలము పెరుగు
నాధిదైవికాధ్యాత్మిక ♦ ప్రాధిభౌతి
కముల బలము సత్త్వరజస్త ♦ మములఁ బెరుగు. 21

తే. సత్త్వమున జాగరణము ర ♦ జమున స్వప్న
మును దమమున సుప్తియుఁ ♦ దనరుచుండు
జాగ్రదాద్యవస్థాత్రయ ♦ సాక్షిభూత
మాత్మతత్త్వ మయ్యది తురీ ♦ యమ్ము వత్స ! 22

తే. విదితవేదమార్గులు చని ♦ యెదరు పైకి
సత్యలోకమ్ముదాఁకను ♦ సత్త్వముననుఁ,
దమముచేఁ గ్రింది కాస్థావ ♦ రము చనెదరు,
రజముచే నరులై యంత ♦ రమున నుంద్రు 23

చం. విమలచరిత్ర ! సత్త్వ మభి ♦ వృద్ధిగనున్నపు డీల్గువాఁడు నా
కమునకు, రాజసర్ధి చెలఁ ♦ గఁగ మృతుఁడౌ నతఁ డిమ్మనుష్యలో
కమునకుఁ, దామసోల్బణత ♦ గ్రాల గతించినవాఁడు క్రిందిలో
కమునకు నేగు, నిర్గుణతఁ ♦ గన్నతఁ డొందును నన్ను యుద్ధవా ! 24

మ. ఫలవాంఛా రహితాత్మకుండగుచుఁ ద ♦ ద్బ్రహ్మార్పణమ్మంచు భ
క్తలలాముం డొనరించు కర్మమదియౌఁ ♦ గా సాత్త్వికం, బాత్మలో
ఫలసంకల్పము పూని కర్మము వొన ♦ ర్పఁగ రాజసంబౌను, గే
వల హింసాబహుళక్రియాళి నొనరిం ♦ పం దామసంబయ్యెడిన్. 25

తే. జ్ఞానమును నాత్మవిషయమై ♦ సాత్త్వికమనఁ
గ్రాలు, దేహాదివిషయమై ♦ రాజసమనఁ
దనరుఁ, బ్రాకృతవిషయమై ♦ తామసమన
నెగడుఁ బరమేశవిషయమై ♦ నిర్గుణమగు. 26

తే. కాననావాసమగు సాత్త్వి ♦ కంబు, గ్రామ
వాసమగు రాజసము, ద్యూత ♦ భవనవాస
మగును దామసం బుద్ధవా ! ♦ యస్మదీయ
నిరుపమాలయావాసంబు ♦ నిర్గుణంబు. 27

తే. సంగమెడలి కర్మమ్ములు ♦ సలుపుకర్త
సాత్త్వికుండు, రాగాంధత ♦ సలుపుకర్త
రాజసుఁడు, తామసుఁడు స్మృతి ♦ రహితకర్త
నెమ్మిని మదేకశరణుండు ♦ నిర్గుణుండు. 28

తే. సాత్త్వికం బాత్మవిషయమై ♦ శ్రద్ధయున్న
రాజసము కర్మవిషయమై ♦ శ్రద్ధయున్నఁ
దామస మధర్మవిషయమై ♦ తనరశ్రద్ధ
నిగుడ నాసేవపై శ్రద్ధ ♦ నిర్గుణంబు. 29

వ. మఱియు నాహారంబునకు నీగుణభేదంబు గలదు. 30

ఉ. సారము పూత మశ్రమవ ♦ శంబును బథ్యము నైనసాత్త్వికా
హారము, స్వేంద్రియప్రియక ♦ రామ్లకటూజ్జ్వలమైన రాజసా
హార, మశుభ్రవర్త్యపేత ♦ సార్తిద దగ్ధకమైనఁ దామసా
హారము, మన్నివేదితకు ♦ భాన్నము నిర్గుణమండ్రు కోవిదుల్. 31

తే. సమధికాత్మోత్థిత సుఖమ్ము ♦ సాత్త్వికమ్ము
రమ్యవిషయోత్థితసుఖమ్ము ♦ రాజసమ్ము
దైన్యమోహోత్థిత సుఖమ్ము ♦ తామసమ్ము
నిరత మదుపాశ్రయసుఖమ్ము ♦ నిర్గుణమ్ము. 32

వ. నావుడు బృహస్పతి శిష్యుండు దామోదరు విలోకించి స్వామీ! "ఆత్మోత్థిత" మనియు, మదుపాశ్రయమనియు నిట్లు వేర్వేఱుగాఁ జెప్పుచుంటి వేల! ఆత్మకు నీకు నభేదంబుగదా యన ముకుందుండు మందహాసకందళ రుచిర కాంతిబృందము నయనారవిందములకుఁ గ్రొందళుకు వొందింప నిట్లనియె. మతిమదగ్రేసరా! ఆత్మకు నాకు నభేదంబ. ఇచ్చట నాత్మోత్థితమనఁ ద్వంపదార్థవిషయముగను, మదుపాశ్రయమనఁ దత్పదార్థవిషయముగను గ్రహింపవలయుంజుమీ యని యించుకతడవాగి యావల మఱియు నిట్లనియె. 33

తే. ఇవ్విధంబున నుద్ధవా! ♦ యెఱుఁగుమయ్య
ద్రవ్య దేశ కాలములు క ♦ ర్మములు ఫలము
లాకృతు లవస్థలును శ్రద్ధ ♦ లఖిలనిష్ఠ
లనఘ! త్రిగుణాత్మకమ్ముల ♦ టంచెడంద. 34

కం. శ్రుతమును దృష్టము వ్యాచ్ఛిం,తితము బ్రకృతిపూరుషుమసమ♦ధిష్ఠితభావ
వ్రతతి సమస్తమును గుణ, త్రితయాత్మకమంచు నెమ్మ♦దిం దెలియుమయా!

మ. మనుజుం డీగుణకర్మ బంధమగు సం ♦ సారంబునం గ్రుమ్మరం
గ నిదానంబగు చిత్తజాత గుణసం ♦ ఘాతంబు నిర్జించి పా
వన మత్పాద సరోజయుగ్మ భజనో ♦ పాత్తావ్యయానంద సం
జని తాశ్రోద నమున్నగండఫలక ♦ స్ఫోకుండుగాఁ జెల్లడే? 36

తే. అనఘచరితా! పరోక్షాప ♦ రోక్షములను
జ్ఞానముల పుట్టుకకుఁ గార ♦ ణమ్మయిన శ
రీరము బొంది గుణసంగ ♦ దూరుఁడగుచు
నను భజింపంగ తెలివి యుం ♦ డినఘనుండు. 37

కం. తెలివిగలవాఁడగుచు జి,త్తులమారి దశేంద్రియముల ♦ తోఁ బోరి జయో
జ్జ్వలుడై నిస్సంగుండై, కొలువఁగవలయుం బరాకు ♦ గొనఁబోకననున్. 38

ఉ. ఇమ్మగ సత్త్వదృష్టి ధరి ♦ యించి రజమ్ముఁ దమమ్ముఁ జెండి స
త్త్వమ్మును నైరపేక్ష్యమను ♦ వజ్రముచే విదళించి యాల శాం
తమ్ము వహించి జీవునకుఁ ♦ దావగు లింగశరీర మల్లనం
జిమ్మి యిఁకేమి చెప్పవలె ♦ శిష్య! యతండు మదైక్యమందెడిన్. 39

తే. అట్టు లద్వితీయ బ్రహ్మ ♦ మైన నన్నుఁ
గలిసి యిఁక బహిర్విషయ భో ♦ గములఁగాని
లోనఁ దత్స్మరణమ్మును ♦ గాని లేక
జలము జలములోఁ గలిసిన ♦ ట్టులు చెలంగు. 40

వ. అని శ్రీకృష్ణుండు బోధించెనని శుకమహర్షి నుడివెను. 41

పంచవింశాధ్యాయము సమాప్తము

---

## * షడ్వింశాధ్యాయము *

కం. తొలిమినుకుల తోఁటనడిమి, మలసికఁ గల తైత్తిరీయ ♦ మాకందము కొ
మ్మల రెండవతీవియఁ జెలు, వలరఁ బలుకులొలుకుచిలుక ♦ హరిహరనాథా!

వ. [1] దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో
నిట్లనియె ఆవల శ్రీకృష్ణుం డుద్ధవునిపైఁ బ్రసాద మేదురావలోకనంబులు
వఱపి యుద్ధవా! మత్స్వరూపంబు లక్షింప ననువైన మనుష్యదేహ
మొంది భక్తిలక్షణంబైన మద్ధర్మము నాచరించి తద్భక్తుం డాత్మయంద
నియంతృరూపమున నున్నపరమాత్మ నానందస్వరూపు నన్నొందెడిని. 2

ఉ. అమ్మహితాత్ముఁ డీగుణము ♦ యమ్మగు జీవునుపాధి జ్ఞానయో
గమ్మునఁబాసి యొప్పయినఁ ♦ గానియువస్తువులౌ గుణమ్ములం
గ్రమ్మరఁ జొచ్చిన న్నరశి ♦ భామణి! వానికిఁ దద్గుణానుషం
గమ్ములరార, దగ్నికణి ♦ కం జెకలంటునటయ్య యెన్నఁడున్. 3

---

1. అధ్యాయప్రారంభము 25–8–1946

ఉ. ఏడెటులైనఁగాని పచి ♦ యించెద గట్టిగ నాలకింపు శి
శ్లోదరి తృప్తమూహముల ♦ యొద్దకుఁ జేరుటమాత్ర మేటికిం
గాదు సుమయ్య! యుక్కతనఁ ♦ గల్గు నవశ్యమునర్థ, మంధుఁ డం
ధాద్భుతి వెంటనంటి చన ♦ సంధువునం బడకున్న! యుద్ధవా! 4

-* శ్రీకృష్ణుం డుద్ధవునికిఁ బురూరవోగాథ నుడువుట *-

వ. యోగులకు సంగంబున యోగవిభ్రంశంబగు ననువిషయంబున నైలుం
డగు పురూరవశ్చక్రవర్తిగాథ వక్కాణించెద విను. 5

ఉ. ఆతఁడు సార్వభౌముఁడయి ♦ యూర్వశిఁ బ్రోకుచుఁ గీర్తివల్లికా
ప్రాతిము మోసులెత్తి యుల ♦ రఁగ గనె నొక్కెడ నూర్వశీసరో
జాతమనోజ్ఞపాణి విల ♦ సన్మధురామృతవాణి నీలజీ
మూతసమానవేణి నన ♦ బోణిని సుందరతాప్రధానినిన్. 6

కం. కని సమయపూర్వముగ డా, నిని బడసి మనోజరాజ్య ♦ నిరుపమభోగా
ళిని దేలు చహర్నిశముం, జనుటయు వచ్చుటయు నెఱుఁగఁ ♦ జాలండయ్యెన్ 7

ఉ. చక్కనివారిలో మిగులఁ ♦ జక్కనివారఁట, లేఁత ప్రాయముం
గ్రక్కుచు నున్నవారలఁట ♦ కాదని యూనని పల్కువార లే
దిక్కునఁగాని లేరఁట వ ♦ దింబది రాచతేకంపుఁ బెన్నికిం
జిక్కిన వారలంట మరు ♦ చేవడి కీల్బొమలాట వింతయే? 8

కం. ఇటులుండ నొక్కనాఁడా, కుటిలాలక సమయ మేల ♦ కొల్పటిచితివం
చటువాసి పోవఁ బతి త్రిప్పటపడె వెడఁగెడఁద బోడమ ♦ బడలువడ నోడల్

చం. నిలునిలు పోకుపోకు తరు ♦ ణీ! రమణీ! రమణీయసుస్తనీ!
నిలువఁగ లేను నిన్నొడిచి, ♦ నీఱయిపోయెమనంబు, వేదుఱుం
దలకొను దెంచెఁ బ్రాణసము ♦ దాయము దోకొనిపోయెదే! కటా!
కలుకమిటారి! మోమసుని ♦ క్రొత్తకటారి! జగాతుటారివై. 10

ఉ. ఏటికిఁ గట్టిపెచితివె ♦ యిన్నిదినంబులనుండి నన్ను నీ
గాటపుఁగౌఁగిలింతలను ♦ గ్రాల్గనుఁగోనల వాలుఁజూపులన్
బాటల కోమలాధర క ♦ నన్మధుసార వితీర్ణులన్ నిరా
ఘాట వచశ్చమత్కృతులఁ ♦ గ్రమకుచోరుమహీధరంబులన్. 11

ఉ. సత్యముచెప్పుచుంటి విను ♦ సారసలోచన! యుష్మదీయ సాం
గత్యము నిత్యమం చెడఁద ♦ గట్టిగ నమ్మితి నాకటాక్ష వై
యాత్యము లామనోజ్ఞ దర ♦ హాసము లాప్రణయానురోష పాం
డిత్యము లారహోవచన ♦ నిస్సరణంబులు నూది యక్కటా! 12

ఉ. ముద్దియ నీవుమాత్ర మెటు ♦ ప్రొద్దులు పుచ్చెదు నన్నుఁ బాసి యా
ముద్దులు ముచ్చటల్ మురిపె ♦ ముల్ వలపుల్ మెలపుల్ దలంచినన్
నిద్దురవచ్చునెట్లు ? కడి ♦ నేర్తునె మ్రింగఁగ, నేస్తకత్తియల్
సుద్దులు వల్క విందువటె ? ♦ సుందరి ! కొందల మందకుందువే ? 13

కం. నేమముఁ బాసితివని యా, నేమముఁ బాసి చనఁ దొంటి ♦ నెయ్యము త్రుటిలో
నే మమత బుద్ధిఁ దొలఁగునొ ?, నే మము దిత మతుల మిమ్ము ♦ నీవర్ణనమున్

కం. అరుచుం బెక్కు తెఱంగులఁ
బనవుచు నొడలివయి వలువ ♦ పాయుటయు నెఱుం
గని వనట మునిఁగి దేశము
లను గ్రుమ్మరసాగె తేఁడు ♦ లలనవెదకుచున్. 15

వ. అట్లు క్రుమ్మరువాఁడు కురుక్షేత్రంబునం దానిం గనుంగొని తదనుమతంబున గంధర్వులవేఁడికొని వారనుగ్రహింప నగ్నింబడసి త్రేతయందు మూఁడగ్నుల నెలకొల్పి యజనమాచరించి గంధర్వలోకంబున కరిగి యందయ్యూర్వశితో బహుకాలంబు కామోపభోగంబులం దేలి యవుడు హృదయతాపం బడంగ నావుడమిఱేఁడు విచారించి విషయభోగంబు లనర్థావహంబు లని తెలిసికొని వైరాగ్యోదయంబున దనపూర్వచేష్టల నెల్లం దలంచుకొని యొకగాథంబాడె వినుముచెప్పెద. 16

ఉ. అక్కట ! యెంతపామరుఁడ ♦ నైతిని మన్మథకామకశ్మల
న్యక్కృత బుద్ధినైతి విర ♦ హవ్యథఁ గుందితిఁ గట్టకోకయుం
దక్కట గాననైతి విబు ♦ ధస్తవనీయ యశోవినాశమున్
నిక్క మెఱుంగనైతిఁ దరు ♦ ణీ పరిరబ్ధ గళస్థలుండనై. 17

ఉ. అద్దిర ! కర్మసాక్షి యుద ♦ యాస్తమయంబులఁ గాననైతి ను
ద్యద్దివసత్రియామల గ ♦ తాగత చేష్టలఁ బట్టనైతి న
స్మద్దయితాయు వెంతకడ ♦ చన్నదొ యింత కెఱుంగనైతి న
మ్ముద్దియ గుబ్బచన్నుఁగవ ♦ బోరఁ గదించి కుదించి కించునై. 18

మ. సకలాశాగతరాజమౌళి మకుట ♦ స్వచ్ఛప్రభా రత్నకో
రకిత స్వర్ణ పదాబ్జ పీఠతలు స ♦ మ్రాట్ఛేఖరు న్వందిగా
యక విద్వత్కవి మంత్రిముఖ్య పరివా ♦ రావేష్టితాస్థాన నా
యకరత్నంబును నన్ను నాటమృగము ♦ ట్లాడించెఁ బూఁబోఁడియున్. 19

చం అనుపమ భర్మహర్మ్య వివి ♦ ధాసన రత్న విభూషణానులే
పన సురభిప్రసూన మృదు ♦ వస్త్ర లసచ్ఛయనాదుల న్మణీ
కనక ధనేభ వాజి బహు ♦ గణ్య సఖీముఖ వైభవంబులన్
గనక తృణీకరించి చను ♦ కామిని కేమని ప్రేముడించితిన్ ? 20

మ. నను నాశౌర్యము నాప్రతాపమును నా ♦ నైపుణ్యము న్నావిభూ
తిని నారాజ్యము నాసురూపమును నా ♦ తేజంబు నాధైర్యమున్
మనమందెంచకపోవు నింతిబడి యు ♦ న్మత్తుంబలెన్ రోదనం
బును గావించుచు నగ్నవేషమున నేఁ ♦ బోతిం గటా! యేమనన్. 21

చం. తనకలిమైన రాసభి వ ♦ దంబులఁ దన్నుచు నీసడించు మం
జన వెనుకొన్న రాసభము ♦ చాడ్పున నన్ను నధఃకరించిపో
వు నెలఁత వెంటనంటె చను ♦ బుద్ధివిహీనుఁడ నాకు నింకెటుల్
దనరును దేజమేని ప్రభు ♦ త్వ స్థితియేని ప్రభావమేనియున్. 22

ఉ. యాగము లాచరించి విబు ♦ ధావళిఁ దన్పి గడించుకొన్న దీ
బోగముచాన వట్టె! యగుఁ ♦ బో యదియైన నతంబ! కాదు దుః
ఖాగమ మెట్లుఁ దప్పదు సు ♦ మా సుకృతాంతమునందు భావిలో
నీగతికొగ్గినట్టి ననుఁ ♦ నేమనఁ బండితమాని నిస్సిరో! 23

సీ. పడఁతి పదాలచ ♦ ప్పుడు వినిపింప నా
నిలువెల్ల బులబుల ♦ పులకరించు
మగువ పయ్యంటచె ♦ ఱఁగు గాలికూఁగ నా
గుండెలు తటతట ♦ కొట్టుకొనును
లలన లేనవ్వుఁద ♦ ళ్కులు ప్రసరింప నా
యుల్లంబు జలజల ♦ వెల్లివోవు
నువిద క్రేఁగంటిచూ ♦ పొలయ నాప్రతిరక్త
పుకణంబు బుకబుస ♦ పొంగిపోవు.

తే. రమణి మంజులకంఠస్వ ♦ రమ్ము చెవుల
బడగ నాప్రాణములు లేచి ♦ వచ్చు నంత
వలపుపిచ్చి పట్టికలంచి ♦ వైచె నన్ను!
నక్కటా! యనంగుని గొడ్డు ♦ నైతిఁ జెడితి. 24

సీ. అంచపైఁ గినుక వ ♦ హించి చూచెడి సతి
మోము నాకుంజూడ ♦ ముచ్చటౌను
నడచుచోఁ గాల్తడఁ ♦ బడి ముందుకొఱగ నా
యతివ నాకొయ్యారి ♦ యగుచుఁదోఁచు
చెదరినముంగురుల్ ♦ చెరువఁ గేలెత్తనా
వనిత నాకందాల ♦ బరణివగును
కీలుగంటు ప్రిదిలి ♦ వ్రేలాడుచున్న నా
గరిత ముద్దులమూటఁ ♦ గట్టుచుండు

తే. తనువుసిక్కిన వసనముల్ ♦ దాల్పకున్న
యింతి యెట్లున్న నాకది ♦ యేమి భ్రమమొ
కాని జగదేకసుందరి ♦ గాఁగఁ దోఁచు
నంగజునిచేతఁ గనుఁగ్రుడ్డి ♦ నైతి నకట! 25

కం. కామ మొదవఁ బొడమినచో
భామామణి దోఁచు నమృత ♦ భాండము పగిదిన్
గామ ముడుఁగ నడరినచో
భామిని కనుపట్టు మలిన ♦ భాండము పగిదిన్. 26

చం. ఎవనిమనోంబుజంబు హరి ♦ జేక్షణ లాహరియింతు రట్టిమా
నవుఁడు తపంబు చేసినను ♦ న్యాసమొనర్చిన జ్ఞానకేళిలో
న్దవిలిన వేదముం జదివి ♦ నం బుధివాఙ్మయమంబు వ్రానినన్
నవ గననీక యేకత మొ ♦ నంగిన నేమి ప్రయోజనంబగున్? 27

కం. నాలుగు చెఱఁగుల జలధుల, నేలకు నాథుండనగుచు ♦ నీచఖరగతిన్
స్త్రీలంపటుండ నైతిం, బాలిశుఁడ నెఱుంగనైతి ♦ స్వార్థము చీ! చీ!! 28

ఉ. ఈ తెఱఁ గెందునుం గలదె! ♦ యేతరినైన మొసఁజేర్చి యూర్వశిన్
శీతకరాస్య మత్తి వివ ♦ శీకృత చిత్తుఁడనౌచు జుత్తితిన్
వాతెర జుంటితేనియల ♦ వారిగ నేండ్లుఁబూండ్లు నాహుతి
ద్రాతము గన్నవహ్నివలె ♦ బావురె! తృప్తిని బొందనైతిఁగా. 29

చం. పితరులకంటె క్రేవఁ బ్రభ ♦ వింపఁగ జేగుఱు, బొమ్మవిప్పు దే
వతలకుఁ బుట్ట, బంధుబుధ ♦ వర్గ మొసంగఁ గలంగఁ, బుంశ్చలీ
రతమున కొగ్గిపట్టి నను ♦ గ్రమ్మరఁ ద్రిప్ప నధోక్షజుండు మ
త్పతి వరమేశ్వరుం డొకఁడ ♦ దక్షుఁడు సాలఁడ లాఁతియొవ్వఁడున్. 30

మ. మతిఁ దాత్రీయమె పూరుషార్థమని సం ♦ భావింప, కీస్త్రైణ సం
గతి నాసించిన నొడ్డుఁబట్టవు హ్రాషీ ♦ క శ్రేణి నిర్జింపుమో
క్షితిపా! యంచుఁ బ్రబోధము న్సలిపె రా ♦ జీవాక్షి యీయింద్రియో
ద్ధతి వారింపఁగ లేక యేన వడితి ♦ న్దన్మోహ వారాన్నిధిన్. 31

ఉ. బోటిది తప్పటం చనఁగఁ ♦ బోలునె? యయ్యది యేమిసేసెనో!
త్రాటిని జూచి సర్పమని ♦ భ్రాంతి వహించినఁ ద్రాటితప్పె? య
ప్పాటలగంధిపై వలపు ♦ వాలిచి యాత్మ నిజస్వరూప మె
ప్పాట నెఱుంగలేని ననుఁ ♦ బండితమానిని చీ యనం దగున్. 32

మ. మలమూత్రాస్ర వసాస్థి శుక్ర కఫముల్ ♦ మజ్జా నిదాఘంబులున్
గులుముల్ ఘ్రాణమలాక్షి దూషికలు ప్రో ♦ గుల్ గట్టు దుర్గంధసం

కలితం బీతనువేడ! సౌహార్దగుణౌ ♦ ఘస్ఫీత సౌరభ్యమే
డ! లతాంగిం గని మోసపోయితిని గ ♦ ట్టా! గాఢమోహాంబుధిన్. 33

కం. హేయంబగు కాయము సుఖ
దాయి యనుచు నెడఁదయందుఁ ♦ దలఁచితి నకటా!
పాయని యవిద్యచేతఁగ
దా యధ్యాస మిటు పరఁగెఁ ♦ దప్పితిఁ ద్రోవన్. 34

సీ. ఈశరీరము జని ♦ యింపఁ జేసిరి గానఁ
దల్లిదండ్రులకు సొం ♦ తమనఁదగదె?
సతతంబు భోగసం ♦ తతిఁ గైకొనెడిఁగాన
నర్ధాంగిది యటంచు ♦ నాడఁదగదె?
అంత్యేష్టి నాహర్త ♦ యయ్యెడిం గానఁజి
తాగ్నిహోత్రునిది యం ♦ చనఁగఁదగదె?
శ్వానగృధ్రాది సం ♦ చయమున కెట్టులో
తుదిభక్ష్యమాట వా ♦ ని దనఁదగదె?
తే. ఉపకృతుల్ సేసెదరు వయ ♦ స్యులదిగాదె?
వశ్యమై యున్కిచేత భూ ♦ పతిదిగాదె?
తత్కృత శుభాశుభమ్ము లొం ♦ డఁగఁ డొట
నాత్మునిదిగాదె? యెవరిదీ ♦ యంగమగుచు? 35

వ. ఇట్టి యనిశ్చిత శరీరమ్మున మమత్వకల్పనమ్ము నేమనవలయు! 36

సీ. ఫుల్లారవిందంబె ♦ ముద్దుమోమగుఁ గాని
చో నింత తేనియ ♦ సోనయున్న?
చాంపేయసుమమె నా ♦ సాపుటంబగుఁ గాని
చో నింత సౌరభ ♦ స్ఫూర్తియున్న?
కుందకుట్మలము ల ♦ గుం దంతములుగాని
చో నింత విశదవి ♦ స్ఫురణమున్న?
నవ్య నీలాంబుజ ♦ మ్మంబె నేత్రము గాని
చో నింత మానోజ్ఞ ♦ శోభయున్న?
తే. లలిత పుష్పగుళుచ్ఛంబ ♦ వలుదగుబ్బ
కానిచో నింత వలపు పెం ♦ పూనియున్న?
యువిద పువ్వారుఁబోఁడి కా ♦ కున్న నింత
సుఖము చుబ్బనచూఁజ లి ♦ చుట్టలు సునా? 37

తే. అనుచుఁ దుచ్ఛ మమేధ్యమౌ ♦ నట్టి వారి
జాత్రిఁ గాయంబుఁ జూచి కా ♦ మాతిరేక
మునఁ దలంచుచు నద్దాని ♦ పొందు సేయు
పురుషుఁ డక్కటా! యెంత కా ♦ పురుషుఁ డగును. 38

కం. ద్వాదశముల సంఘాతం బీ దేహము దానిని రమి ♦ యింపఁ దొడఁగు న
స్వాదించుచు నీమోజకుఁ, జేదీ యంతరము కృమికి ♦ నీపురుషునకిన్? 39

కం. కలికి కనుల నోష్ఠపుటం,బులు సేకుం జుంబనార్థ ♦ ము కటా! మశకం
బులు మూఁగు దూషికలపైఁ, గలదే యంతరము? వోఁత ♦ గా దేమిటికిన్? 40

కం. వెతకుచుచు మక్షికాసం,తతి యామిష పిండములను ♦ దవిలినగతి ను
న్నత కుచకలశంబులఁ గుం,చిత హస్తాంగుళులు గప్పఁ ♦ జిత్రంబు గదే. 41

కం. రదనచ్ఛదంబు జలము
న్నది వృత్తిం ద్రావఁగోరు ♦ నరుఁ గన శ్లేష్మా
స్వాదనము సేసెడి ధ్వాంక్షు స
ముదయము స్మృతిపథముఁ దవులుఁ ♦ బో యేమందున్. 42

ఉ. కావున నర్థవిద్వరుఁడు ♦ కాంతలకూటమి నన్నిభంగులన్
ద్రోవవలెం, దదీయులను ♦ దూరమునందె త్యజింపఁగావలెన్
భావము లెవ్వఁడుం గలఁగఁ ♦ బాఱుట తద్విషయాళి యింద్రియ
ప్రావృతమైన యవ్వఁడును ♦ మా యటు గాని యెడం గలంగునే? 43

కం. వినని కనని విషయముల వ
యిని మన మడరదు కలఁతల ♦ నెనయద యెపుడై
నను విషయుల నియమనమున
మనమున శమ మొదవుఁ జలన ♦ మహిమయు నుడుగున్. 44

ఆ. ఇట్లుగాన స్త్రీల ♦ యెడలను స్త్రైణంబు, నెడల సంగములను ♦ విడువవలయుఁ
బండితులను గూడ ♦ వంచించు షడ్వర్గ,మింక మాదృశాళి ♦ నెత్తనేల? 45

కం. లలనావలోకనాదుల, వలనని హృదయంబు కలక ♦ వాఱఁ గనుక వి
జ్ఞులు సర్వయత్నముల ని,చ్చలు తలఁగవలయు నింతి ♦ సామ్ముఖ్యమ్మున్.

మత్త. ఇత్తెఱంగున రాజశేఖరుఁ ♦ డడ్డలోఁ దలపోసి జ్ఞా
నోత్తమాసిని మోహపాశము ♦ లోకపెట్టునఁ ద్రుంచి య
మ్మత్తకోకిలవాణి వీడి ప్ర ♦ మోదమొందక యాత్మసం
వేత్తయై సనుఁబొంది నిర్వృతి ♦ వృష్టిఁ దోఁగెను వింటివే? 47

వ. అని శ్రీకృష్ణుండు పురూరవోగాథ పాడి మఱియు నిట్లనియె. 48

కం. దేవర! దుస్సంగంబుం, బోవిడిచి సుధీంద్ర మైత్త్రి ♦ మునుసల్పఁగ, వా
చా వైభవమున హృద్గత, షా విషయోద్రేక మడఁగు ♦ రాదృతి వారల్.

కం. అలఘు జ్ఞానులు నిర్ద్వం, ద్వులు నిర్మములు సమదర్శ ♦ నులు నిరహంకా
రులు నిష్పరిగ్రహులు శాం, తులు మహాత్మనులు సజ్జ ♦ నులు సుమ్మనఘా!

తే. ఈమహాభాగు లుండిన ♦ యెడ మదీయ
పుణ్యగాథామృతాపగల్ ♦ పొడవునూవు
వానఁ దోఁగువారికిఁ బాప ♦ పాంసుపటల
మట్లు యణఁగి యుండునె? యణఁగారి పోక. 51

ఆ. అస్మదీయ కథల ♦ నధికాదరంబున. వినుచు మత్పరులయి ♦ వినుతిసేసి
కొనుచు శ్రద్ధఁగోడ ♦ ననుమోద మొందుచు, నున్న వారి కెడఁద ♦ నొడవుభక్తి

కం. అమితగుణుండు పరబ్రహ్మము నానందస్వరూపుఁ ♦ డగునన్ను నను
త్తము భక్తిని సాధించిన, యమలమతికి నేడసాధ్య ♦ మగు నిఁకఁజెపుమా!

తే. సురుచి భగవంతుని విభావ ♦ సుని భజింప
శీతము భయమ్ము దమము న ♦ శించినట్టు
లణఁగు సాధుసంసేవఁ గ ♦ ర్మాది జన్య
జాడ్యముఁ గుటుంబభయము న ♦ జ్ఞానబలము. 54

తే. ఘోర సంసారమునఁ జొరఁ ♦ బాఱి యుచ్చ
నీచయోనులం బుట్టుచు ♦ నీల్గుచున్న
వారలకు బ్రహ్మవిద్వరు ♦ ప్రాపు దొరకు
టబ్ధిఁబడ్డవారికి నావ ♦ యబ్బినట్లు. 55

తే. ప్రాణులకుఁ బ్రాణమన్న; మా ♦ ర్తజనములకు
దిక్కు నేను; మృతులకుఁ దో ♦ తెచ్చుకొన్న
ధనము ధర్మంబు; సంసృతి ♦ త్రస్తులైన
వారి కభయదానంబు స ♦ ద్భాషితంబు. 56

కం. జలజహితుం డుదయించుచు
వెలినేత్ర మొకండ యిచ్చు ♦ విషయ మెఱుఁగ; సా
ధులో సగుణనిర్గుణంబుల
తెలువుల కెన్ని నయనములొ ♦ తెలిపింతురయా. 57

వ. సజ్జను లెవ్వరికిని దేవతలు బంధువులు నయి పూజ్యులగుదురు. సజ్జను
లనఁగా నాత్మండనైన యేనసుమీ. వారికి నాకు నభేదంబని యెఱింగి
మెలంగుమని శ్రీకృష్ణభగవానుం డైలగీత నుపదేశించె నని శుకమహర్షి
వక్కాణించెను. 58

ఇది యేకాదశస్కంధమున షడ్వింశాధ్యాయము సమాప్తము

## సప్తవింశాధ్యాయము

కం. హృదయాగ్రపీఠి నిన్నుం, గుదురుగ నోలిపి భక్తిభావ ♦ కుసుమంబుల నీ
పదములఁ బూజించి సముద్యదాత్మనైవేద్య మిడెద ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్ల
నియె. అట్లు భగవానుండు ప్రబోధింప నుద్ధవుం డంజలి ఘటించి, 2

కం. దేవా! సాత్వతపుంగవ, దేవా! యెవ్విధమున యజి ♦ యింతురు యుష్మ
త్పావన పాదమ్ముల నా, కావిధముం జెప్పుమా క్రి ♦ యాయోగమ్మున్.

కం భవదారాధనమిది మా, నవులకు నిశ్శ్రేయసం బ ♦ నల్ప మొసఁగునం
చు వచింతురు పూజ్యులు స, త్యవచస్కులు వ్యాస నారదాంగిరసాదుల్.

తే. త్వన్ముఖాబ్జ వినిస్సృత వాక్సు ♦ ధాస్రవంతిఁ
దోఁగి భగవంతుఁ డజుఁడు పు ♦ త్రులగు భృగుము
ఖులకు దేవదేవుఁడగు భ ♦ ర్గుఁడు భవాని
కెట్టు లుపదేశ మొనరించి ♦ రిది మహాత్మ! 5

ఆ. ఎల్లవర్ణములకు ♦ నెల్లయాశ్రమముల, కెల్ల స్త్రీపురుషుల ♦ కీ యనుత్త
మంపు యోగ మిచ్చు ♦ మహిత నిశ్శ్రేయస, మట్లుగాన నాకు ♦ నానతిమ్ము.

ఆ. కమలపత్రనేత్ర! ♦ కర్మబంధ విమోచ, నమ్ము దీని విన్న ♦ నమ్మకొన్న
నాకు నగ్రశిష్యు ♦ నకు నుపదేశింపు, మనినఁ గృష్ణుఁ డిట్టు ♦ లాడఁదొడఁగె.

♦ శ్రీకృష్ణుం డుద్ధవునికి భగవదారాధనక్రమ మెఱిఁగించుట ♦

ఆ. కర్మకాండమునకుఁ ♦ గలదటే యంత మ్మ
నంతపార మది శు ♦ భాంతరంగ!
అగుట దాని సంగ్ర ♦ హమ్ముగా నీకుఁ జె
ప్పెదను వినుము యాను ♦ పూర్వ్యముగను. 8

కం. ఘనవైదికమ్ము తాంత్రిక, మును మిశ్రమ్మనగ నాదు ♦ పూజాక్రమ ముం
డును ముత్తెఱఁగుల నవ్వా, న నభీష్టంబౌ క్రమంబు ♦ నం గొల్వఁదగున్. 9

కం. ధరణీసురులును క్షత్రియ, వరులును వైశ్యులును స్వీయ ♦ వర్ణాచారా
దరవిధి నుపనీతులగుచుఁ, బరుభక్తి న్నన్నుఁ గొల్చు ♦ పోణిమి వినుమా! 10

తే. ప్రతిమయందు స్థండిలమందు ♦ వహ్నియందు
నినునియందు జలమునందు ♦ హృదయమందు
విప్రునం దాత్మగురుని న ♦ న్విమలభక్తి
ద్రవ్యములఁ గొల్వవలయు ని ♦ ర్వ్యాజముగను. 11

---

[1] అధ్యాయప్రారంభము 1 — 9 — 1946

సీ. ప్రత్యూషమున లేచి ♦ పడి దంతధావనా,దిక కార్యముల నెల్లఁ ♦ దీర్చి శుద్ధి
కై మున్న యార్ద్రాంగుఁ♦డై చువెండియుమృద్వి,ధాదులఁ దాంత్రిక ♦ వైదికమ్ము
లగు మంత్రముల స్నాన ♦ మాడి సంధ్యోపాస,నాది వేదోక్తక ♦ ర్మాళిసేసి
పరమేశ్వర ప్రీతి ♦ కరముగా సంకల్ప,మాచరించి తగు మ ♦ దర్చ సలుప

తే. ననుపమ శిలామయము లోహ ♦ మయము దారు
మయము మృచ్చందనాదిక ♦ మయము లేఖ్య
మయము సికతామయమ్మను ♦ మణిమయమ్ము
స్వాంతమయము నాఁ బ్రతిమ ల ♦ ష్టవిధములగు. 12

సీ. ప్రవిమలాత్మా! భగ♦వత్ప్రతిమలు చలా, చలమన ద్వివిధమై ♦ చెలగుచుండు
నం దచలప్రతి ♦ మార్చల నావాహ,న విసర్జనంబు లో ♦ సర్వరాదు
చలమునం దా రెంట♦వలయు నె డేనొండు, సైకతంబున విస ♦ ర్జన మెసంగుఁ
గాని సాలగ్రామ ♦ మైనచో నుండదు, స్థండిలంబునయందు ♦ రెండునుండు

తే. లేప్య లేఖ్య సైకతము ల ♦ లేదుస్నాన
మలగుమార్జనం; బితరంబు ♦ లందు స్నాన
మడరు; దొరకిన మంచిద్ర ♦ వ్యములచేతఁ
బ్రతిమల యజింపవలయు ని ♦ ర్వ్యాజభక్తి. 13

తే. హృన్మయ ప్రతిమకు భక్తుఁ ♦ డెలమిఁ బూజ
సలుపుచుండు భావద్రవ్య ♦ ములనె భక్తి
స్నానము నలంకరణము శ్రే ♦ ష్ఠములు సుమ్మి
యస్మదారాధనమ్ముల ♦ యందు వత్స! 14

సీ. స్థండిలమందు య♦థాస్థానములఁ బ్రధా, నాంగదేవతల నా♦వాహయించి మంత్ర
ములచేత స్థాపనం♦బుపౌనర్చుట,కృశానుసందాజ్య హోమంబు♦నాచరించు,
టర్కసం దర్ఘ్యాది ♦ నర్పించుట, జలమ్ము,గంధర్పణామలఁ ♦ బొందుసేత,
శ్రేష్ఠంబు, నాకును♦ బ్రియకరం; బుద్ధవా! యలఘు భక్తిశ్రద్ధ♦లలరుచుండ

తే. సాత్వతుఁడు జలమిచ్చినం ♦ జాలుఁ బ్రియము
వడుదు నీక గంధధూప దీ ♦ ప కుసుమాళి
నాదు లొసఁగిన నేమందు! ♦ ననఘ! భక్తి
లేక యేమిచ్చినఁ బ్రియంబు ♦ నాకు లేద. 15

వ. ఉద్ధవా! ఇంకఁ బూజాక్రమంబు వినుము. 16

కం. తొలుత నె పూజాద్రవ్యా, వళి నెల్లం గూరుచుకొని ♦ ప్రాయత్యము చె
న్నలరం బ్రాగగ్ర కుశా, వళి నాసన మేరుపఱిచి ♦ ప్రముదమునొడఁగా. 17

కం. దాసివయిం దూర్పు మొగము,గానో యుత్తరపు మొగము • గానో తా నా
సీనుండై ప్రతిమ కెదురు, గా నర్చింపవలె, లేవఁ • గాదు పొడిఁబొడిగాన్. 18

వ. ఆపూజకుండు గుర్వాది నమస్కార పూర్వకంబుగా ద్వాదశాక్షరంబుననో యష్టాక్షరంబుననో. 19

కం. అంగన్యాస కరన్యా, సాంగీకృత దేహుఁడగుచు • నా ప్రతిమకుఁ గూ
డం గావించుచు న్యాసం, బుం గరమున నంటవలె న • ప్రాజ్యశ్రద్ధన్. 20

తే. ప్రోక్షణాంబు కలశ • మును యథావిధిఁ బుష్ప
చందనాదికముల • సంస్కరించి
యాజలములఁ జల్ల • నగుఁ దనపైని ద్ర
వ్యములపైని దేవ • వసుధపైని. 21

సీ. అనఘ! పాద్యమునకు • నర్ఘ్యమ్మునకును నా
చమనీయమునకుఁ బా • త్రములమూఁటి
నుంచి, ప్రోక్షణ కల • శోదకములు నింపి
మఱి పాద్యపాత్ర శ్యా • మాక పంక
జాతి విష్ణుక్రాంత • శతపర్వికాదుల;
నర్ఘ్యపాత్రమ్మున • నతులగంధ
కుసుమాక్షత యవలఁ • గుశ తిల సర్షప
భార్గవీతతి; నుద • స్పర్శపాత్ర

ఆ. మున లవంగ జాతి • లను నిల్పిపూజించి, హృచ్ఛిర శ్శిఖా స • మిద్ధ మంత్ర
గణముచేత మఱియు • గాయత్రిచేత మంత్రింపవలయు వాని దీక్షతోడ. 22

వ. ఆవలఁ దనయందలి పాపపూరుషు దహింపవలయు, నెట్లన "యం" బీజమును బదునాఱు పర్యాయములు జపముచేయుచు వామనాసాపుటద్వారమున వాయువుం బీల్చి దానిని మనస్సుచే నాభిమండలమునకుం గొనిపోయి యచట నఱువదినాలుగు పర్యాయములు మరల నా "యం" బీజమును జపించుచుఁ గుంభక మొనర్పవలయును. అక్కతన నుత్థితంబైన ధూమ్రవర్ణంబుఁ బరమశోషకంబు నగు వాయువుచేఁ బాపపురుషు శోషింపఁజేయవలయును. పిమ్మట నాగ్నేయంబైన "రం" బీజమును బదునాఱు పర్యాయములు జపముచేయుచు దక్షిణ నాసాపుటద్వారమున వాయువుం బూరించి దానిని మూలాధారమునకుం గొనిపోయి యచట నఱువదినాలుగుసారు లా "రం" బీజమును జపించుచుఁ గుంభక మొనర్పవలయు. దాన నుత్థితంబైన వహ్నిచేఁ బాపపురుషు దగ్ధముచేయవలె. పిదపఁ జాంద్రంబైన "వం" బీజమును బదునాఱుపర్యాయములు చింతించుచు

వామనాసాపుటద్వారమున వాయుపూరణ మొనర్చి దానిని లలాటస్థ చంద్రమండలమునకుం గొనిపోయి యచట మరల వం బీజమును నలువది నాలుగుసారులు జపముచేయుచుఁ గుంభింపవలయును. అప్పుడైందవామృత మ్మూర్ధ్నిస్థితంబగు. తదమృత ప్లావనంబున నమృతమయంబైన దేవ పూజోపయోగి దేహమ్ము పొడమును. అప్పుడు హృదయపద్మస్థితంబై ప్రణవపంచాంశంబుఁగు నకారోకారమకార బిందునాదంబుల యవసానంబున నణుసూక్ష్మంబై సిద్ధపుంగవులచే భావింపంబడుచుండు మదీయజీవకళను శ్రీమన్నారాయణమూర్తిని ధ్యానింపవలయును. 23

తే. అట్టిధ్యానబలంబుచే ♦ నాత్మభూతుఁ
డైన నారాయణుని కళ ♦ యంగమెల్ల
వ్యాపనము సెంది యుత్కటం ♦ బై వెలుంగఁ
జుమ్మి దీపకాంతులచే గృ ♦ హమ్మువోలె. 24

తే. అప్పు డమృతమయాంగకుం ♦ డైన పూజ
కుండు హృదయస్థు నన్ను మి ♦ క్కుటవుఁబేర్మి
మానసోపచారముల నెం ♦ తేని గొలిచి
తన్మయుండయి యంతమీఁ ♦ ద న్గుమార ! 25

తే. అర్చనీయ విగ్ర♦హమ్ములయందు దీప్తాంగు నన్ను నుచిత♦మైన ముద్ర లవధరించి భక్తి ♦ నావాహన మొనర్చి,న్యాసపూర్వకముగ♦నగు భజింప.

వ. ఎట్లన 27

సీ. ఉరు కర్ణికా కేస♦రోజ్జ్వలమ్మగు నష్టదళ విరాజితము ప ♦ ద్మమ్ము నాకు
నాసనమ్ముగఁజేసి ♦ యందు నాగ్నేయాది,కోణ చతుష్టయ ♦ కోటియందు
వరుస ధర్మజ్ఞాన ♦ వైరాగ్య సమధికై,శ్వర్యముల్ నాలుగు♦పాదములుగఁ
బ్రాగాదులం దధ ♦ ర్మమ్ము నజ్ఞాన మ,వైరాగ్యమును ననై♦శ్వర్యము నివి

తే. గాత్రములుగను నడుమ గు♦ణత్రయంబు
పట్టికలుగఁ గల్పించి పూ ♦ ర్వదిశ మొదలు
గాఁగఁ బీఠదేవత లటఁ ♦ గ్రాలుచుండు
నట్లు భావింపవలెఁ బేర్మి ♦ లవధరింపు. 28

వ. విమల, యుత్కర్షిణి, జ్ఞాన, క్రియ, యోగ, [1]ప్రజ్ఞ, సత్య, యీశాన యనెడి యష్టశక్తులు పూర్వాదిదిశలనునడుమ ననుగ్రహ, శక్తియునున్నట్లు భావింపవలయు. కర్ణికా కేసరంబులును సూర్యాచంద్రమస వహ్ని మండలంబులచే నుజ్జ్వలంబులైయుండు నని భావింపవలయు. మఱియు భావ

(1) కొన్నిప్రతుల "ప్రహ్వ" అని కలదు.

బలంబున సుదర్శన పాంచజన్య కౌమోదకీ నందక తూణ శార్ఙ్గ హల ముసలమ్ములను నాయుధమ్ముల నష్టదిక్కులనెక్కొల్పి యాయుధ పూజయుఁ గౌస్తుభ వనమాలా శ్రీవత్సముల నెదఁ బొదిగి యంగ పూజయుఁ, బార్షదులగు నంద, సునంద, ప్రచండ, చండ, మహాబల, బల, కుముద, కుముదేక్షణుల నెనిమిదిదెరలను గరుడుని సభిముఖంబుగను నిలిపి, దుర్గను వినాయకుని వ్యాసుని విష్వక్సేనుని గోణములను, గురుని వామభాగమునను దేవేంద్రాది లోకపాలురఁ బూర్వాదిదిశలను స్థాపించి పరివారపూజయు, యథావిధి నాచరింపవలయు. వేదతంత్రోభయోక్త ప్రకారంబున భుక్తిముక్తులు రెండును లభించుటకై నన్నిట్లు సేవింపవలె,

తే. సార చందనోశీర క ♦ ర్పూర కుంకు
మాగరు ద్రవ్య వాసితా ♦ ర్ణ సలిలముల
స్నాన మొనరింపఁదగుఁ బ్రతి ♦ ష్ఠకును నిత్య
మనఘ ! విభవంబుగొలఁది మం ♦ త్రాళితోడ. 30

వ. ఆస్నానమంత్రముల విను. "సువర్ణంఘర్మంపరివేదనమ్......" ఇత్యాది స్వర్ణఘర్మానువాకంబులచేతను "జితంతే పుండరీకాక్ష - నమస్తే విశ్వ భావన. సుబ్రహ్మణ్య నమస్తేస్తు- మహాపురుష పూర్వజ" యను మహా పురుష విద్యచేతను "సహస్రశీర్షే"త్యాది పురుషసూక్తంబుచేతను "ఇంద్రం నరోనేమధితాహవంతః"......" యనెడి రాజనాది సామంబులచేతను స్నానము చేయింపవలయు. 31

సీ. వస్త్రాభరణములఁ ♦ బత్ర చందనలేప
ములఁ దులసీదళం ♦ బుల లతాంత
మాలికాదులఁ బ్రియ ♦ మానసుండై యలం
కృతి సేయనగు యథో ♦ చితముగాఁగ
శ్రద్ధతోఁ బాద్య మా ♦ చమనీయ గంధపు
ష్పాక్షత ధూప దీ ♦ పాదికముల
నర్పించి గుడ పాయ ♦ సాపూప సూపాది
వృత్తమృష్టాన్న ని ♦ వేదనంబు

తే. సలుపవలయును మఱి విశే ♦ షముగవచ్చు
పర్వములను నభ్యంజనో ♦ ద్వర్తనాభి
షేక తౌర్యత్రికాదుల ♦ చేతఁ గొల్వఁ
దగు విభవ మున్నయెడల ని ♦ త్యంబుగూడ. 32

వ. ఇఁక నగ్నియందుఁ బూజాక్రమంబు వినుము. స్వగృహ్యోక్త విధిప్రకారము మేఖలాగర్తవేత్త లేర్పఱిచిన హోమకుండంబున నగ్నిని స్థాపించి ప్రజ్వలింపంజేసి నల్దెసలం జెదరిన యగ్గిని హస్తతలంబున నొక్కటిగాఁ గలిపి పరిసమూహన మాచరించి దర్భలు పఱిచి ప్రోక్షించి వ్యాహృతులతో నన్వాధాన సంజ్ఞకంబైన సమిత్ప్రక్షేపాదరూప కర్మము నాచరించి వహ్నికి నుత్తరదిశ హోమోపయోగి ద్రవ్యంబుల నిలిపి ప్రోక్షణపాత్రజలంబుచేఁ బ్రోక్షించి యయ్యగ్నియందు నన్నావాహనము సేసి. 33

చం. అతులిత తప్తకాంచన స ♦ మంచితదేహుని దీర్ఘబాహునిన్
నుత వనజాత కేసర మ ♦ నోహరచేలుని; బీలుపాలునిన్
భృత కటిసూత్ర కుండల కి ♦ రీటుని భక్తమనోంబుజాటునిన్
ధృత వరకౌస్తుభాభరణ ♦ దీప్తునిఁ బద్మనికేతనాప్తునిన్ 34

తే. శంఖచక్రగదాబ్జ ల♦స చ్చతుర్భు
జప్రసిద్ధు శ్రీవత్స లాం ♦ ఛన సమిద్ధు
శాంతు వనమాలికాకాంతు ♦ సంయమీంద్ర
హృన్నిశాంతు దయావంతు ♦ హృష్టకంతు 35

వ. నన్ను ధ్యానించుచు నర్చించి "అయంతఇధ్మ..." ఇత్యాది మంత్రంబులతో నాజ్యసంసిక్త శుష్కసమిధల నగ్నియందు వేల్చి యుత్తర దక్షిణ పరిధి సంధులు మొదలుకొని యగ్నిమధ్యంబునుండి పరిధ్యంతమువఱకు ఘృతక్షరణరూపమ్ములైన యాఘారమ్ములఁ "ప్రజాపతయేస్వాహా-ఇంద్రాయ స్వాహా" అనియు, నాజ్యభాగంబులను "నగ్నయేస్వాహా - సోమాయ స్వాహా" అనియు నిల్లుచ్చరించుచు త్యాగము సెప్పుచు నాహుతులువైచి హోమము చేయవలయును. మఱియు మూలమంత్రమగు నష్టాక్షరిచేతను షోడశఋగన్విత పురుషసూక్తంబుచేతను బ్రతిఋక్కునకు నాజ్యప్లుతహవిరాహుతులతో హోమము సలుపవలె నంత స్వాహాంతంబులగు నామ మంత్రంబులచే యథాన్యాయంబుగా శర్మాదులకు హవిస్సు లొసంగి యటుపై "నగ్నయే స్విష్టకృతేస్వాహా" యనుచు స్విష్టకృద్ధోమం బొనర్పవలయును. 36

సీ. పదపడి నగ్ని నా ♦ వాహితుండనయి యం
తర్యామినై యున్న ♦ నన్ను భక్తి
నర్చించి జోతల ♦ నర్పించి నందాది
పార్షదులకు దిశా ♦ భాగములను

బలినొసఁగవలె; నా ♦ వలఁ దత్స్థలమునఁ బీఠి
తనదు పూజాస్థాన ♦ మునకుఁ దెచ్చి
యర్చనార్చావిగ్ర ♦ హమ్మున కభిముఖుం
డై కూర్చుండి బ్ర ♦ హ్మము స్మరించి

తే. అనఘ! నారాయణాత్మకం ♦ బైన మూల
మంత్రమును యథాశక్తి నె ♦ మ్మది జపంబు
సలిపి పిదప దేవునకు భో ♦ జనసమాప్తి
నెమ్మి ధ్యానించి యాచమ ♦ న మొసంగి. 37

తే. అవ్విధమున విష్వక్సేను ♦ నాదరించి
దేవతాశేష మర్పించి ♦ దివ్యసురభి
శంబు వీడ్యంబు నాస్యవా ♦ సంబు దేవు
నకు నొసఁగి పునఃపూజ సే ♦ సికొనవలయు. 38

వ. అంత. 39

కం. వేడుక నా గాథావళి, నాడుచుఁ బాడుచు వినుచు ♦ నాలించుచుఁ గొం
డాడుచు ముహూర్తకాలము, క్రీడింపఁగవలయు బత్తి ♦ కేకెత్తంగన్. 40

వ. పిమ్మట 41

కం. శ్రుతులం బౌరాణప్రా
కృత వివిధస్తోత్రములను ♦ గీర్తించి కృపా
మతిఁ జూడు మనుచు నమ
స్కృతి సాష్టాంగముగఁ దాను ♦ జేయఁగవలయున్. 42

కం. తనశిరమును మత్పాదము, లను జేరిచి రెండుచేతు ♦ లను రెండడుగుల్
గనుకని పట్టి ప్రసన్నుం, డను 'మాంపాహీశ!' యని య♦నందగు నార్తిన్.

మ. ఘోరసంసార మహోగ్రవారినిధిలో ♦ ను వ్వెత్తుగాఁ గూలితిన్
దరిగానంబడ, దీఁదలేనిఁక, భవ ♦ త్పాదాంబుజ ద్వంద్వమే
తరియం జెంతయు నమ్మినాఁడను మదాం ♦ తర్యంబునం దేవ! యి
త్తఱి నన్నెట్టుల నుద్ధరించెదవొ? యా ♦ ర్తత్రాణరక్షవ్రతా! 44

చం. ఒఱఁగితిఁ గాఁపురంపునుయి ♦ నక్కిరిబిక్కిరియైతి, నైతిగా
దొఱకటమునం దొలంగఁ, బెర ♦ యొక్కఁడు నేర్చఁడు లేఁడ, నిన్నె నే
నొరిమిక వేఁడెదం బబువ! ♦ యొత్తిలి పట్టితి నంజదోయినా
యొరిగలచాలు నందుకొని ♦ యొయ్యన నోమఁగదయ్య వేలుపా! 45

కం. ఈయాధుల నీవ్యాధుల, నీయుగ్ర జరాభరముల ♦ నీభీకర దం
ష్ట్రాయుత మృత్యువ్యథలం, బాయుం జేసి నను నేలు ♦ పంకజనాభా! 46

క౦. అని యిట్లు పెక్కుతెఱఁగుల, ననువేఁడి యనంతరంబు ♦ నా యొసఁగిన దం
చును జేకొని నిర్మాల్యం, బును నొడలఁ దాల్పవలయు ♦ మునుకొను ప్రీతిన్

తే. అంత విగ్రహ ముద్వాస్య ♦ మగు నెడలను
దాన న్యస్తమా జ్యోతి నా ♦ త్మ హృదయాంత
వింత మండలి జ్యోతిలో ♦ వెండియుం గ
డంగి యుద్వాసనమ్ము చే ♦ యంగవలయు. 48

క౦. అర్చాదుల దేన నెపు డెలర్చునొ శ్రద్ధ యపుడట వ♦లయు నన్గొలువ
న్నర్చినటుల; సర్వాత్ముఁడ, నర్చకునం దఖిలమందు ♦ నలరుదుఁగాదే?

క౦. ఇటు లవ్వైదిక తాంత్రిక, వటు క్రియాయోగభంగి ♦ భజియించెడివాఁ
డిటునటు నిహపర లోకో, త్కట కామితములను బడయుఁ♦గదె నావలనన్

ఉ. శ్రీలులుచిత్తమందుఁ దమ ♦ బుద్ధము నావలనన్ లభించెనం
చోలి నెఱింగి శాశ్వతము ♦ నుజ్జ్వల మాగమజుష్టమైన దే
వాలయ మేర్పరించి యట ♦ నద్భుతవైభవ మొప్పఁగన్ మద
ర్చా లసమాన విగ్రహవ ♦ రంబుఁ బ్రతిష్ఠ యొనర్పఁగాఁదగున్. 51

క౦. ఎందాక దేవమందిర, మిందుండునొ? యంతకాల ♦ మీకారయితం
బొందును బరసౌఖ్యము లీ, చందమునం బెట్టిసొమ్మొ ♦ సంగునటయ్యా!

ఉ. మొల్లలు గన్నెరుల్ వకుళ ♦ ముల్ విరజాజులు వంజాలంబులున్
మల్లియలుం గురంటములు ♦ మాలతులున్ సురపొన్నలున్ లతల్
సెల్లులు సంపెఁగల్ మొదల ♦ నేక కుజంబుల పూనుతోఁట నా
కెల్లపుడున్ సపర్యలకు ♦ నేర్చిన యాతని పున్న మేమనన్? 53

క౦. వత్సా! యాత్రికులకొ? ని
త్యోత్సవ వర్షోత్సవముల ♦ కో! క్షేత్రాదుల్
సోత్సాహముతో నొసఁగిన
మత్సార్ష్టిత వారి కొంగు ♦ మణి యగుఁజుమ్మా! 54

క౦. నాపూజలకై నాకో, నా పూజారులకొ? పొలమొ? ♦ నల్లిండ్లో? యే
కాపురుషుం డెటులొసఁగిన, శ్రీపతిసమ విభవుఁడగుచుఁ♦ జెలఁగు నఘుఁడై.

తే. నాప్రతిమఁ బ్రతిష్ఠించినన్ ♦ సార్వభౌముఁ
డగును, గుడిని గట్టించినన్ ♦ దిగజగమ్ము
లేలుఁ, బూజాదికమ్మున ♦ నెనయు బ్రహ్మ
జగతి, నిమ్మూఁటిఁజేయు మ ♦ త్సామ్య మొందు, 56

ఉ. ఇట్టులు కామ్యముల్ వదయు ♦ నెంచి ననుం గొలువంగ నెవ్వఁడో
పుట్టు నహైతుకంబయిన ♦ పుష్కలభక్తి, తదీయభక్తిఁ జే
పట్టి ననుం భజింపఁగను ♦ వాఁ డనఘుండయి నన్నుఁ బొందు నే
వట్టున నే నకామయుఁగు ♦ భక్తికి వశ్యుఁడనయ్య యుద్ధవా! 57

కం. పరదత్తమొ స్వదత్తమొ
సుర భూసురవృత్తులఁ గొనఁ ♦ జూచు గడుసు వ
త్సరము లయుతాయుతంబులు
పురుగై విష్ఠక్రిముఁడగుచుఁ ♦ బొరలాడునలుక. 58

కం. దానమయిన నపహారము, నైన నలఁపునతఁడు చేయు ♦ ననునతఁడును దో
డౌనతఁ డిష్టమనునతం, డీనలువురు సమముగ భుజి♦యింతురు ఫలముల్. 59

వ. అని శ్రీకృష్ణుండు వక్కాణించె నని శుకమహర్షి వినిపించెను. 60

ఇది సప్తవింశాధ్యాయము సమాప్తము.

---

## అ ష్టా విం శా ధ్యా య ము

కం. శ్రీమందిరవక్షోగళ, సీమా! నాగమదదాన ♦ చేష్టారతభీ
మా! మానవధర్మప్రియ, తాముక్తమనస్సనాథ! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. ఆవల భగవంతుం డుద్ధవునిం జూచి వచనేస్థితా! నీకు వచనీయ మశేషము వచించితి, నయినను మరలనొకసారి జ్ఞానయోగమును సంక్షేపముగా నుడివెదను. వినుము.

-* శ్రీకృష్ణుం డుద్ధవునకు జ్ఞానయోగముపదేశించుట *-

తే. ఇతరుల స్వభావకర్మాళి ♦ నెవ్వఁడైనఁ
బొగడరాదు తెగడరాదు ♦ బుద్ధిమంతుఁ
డీప్రకృతిపూరుషులచేత ♦ నెల్ల విశ్వ
మలరుఁగాదె యేకాత్మకం ♦ బగుచువత్స! 3

తే. కాన నీప్రకృత్యాత్మక ♦ మైనద్వైత
మానుమిథ్య; శిష్టుం డధి ♦ ష్ఠానుఁడరసి
చూడఁ బ్రత్యగభిన్నుఁ డి ♦ చ్చోఁ బొగడ్త
యేడ మఱియుం దెగడ్తయు ♦ నేడ? చెపుమ! 4

---

1 అధ్యాయప్రారంభము 11—9—46.

కం. ఇది తెలియలేక జనుఁడు, స్మృతివిష్ణువయి వానివెంట ♦ మలసిన మిథ్యా
స్పదముగు ద్వైతము వెతుకొనుఁ, బదపడి స్వార్థమ్మునుండి ♦ పతనము నొందున్

వ. తైజసుండగు నింద్రియగణంబు నిదురచే నభిభూతముగాఁగా దేహస్థుండగు జీవుండు కేవలము మనోమాత్రముచే స్వప్నరూపము నొందును. ఆపల మనస్సుగూడ లీనముగాఁగా నష్టచేతనుఁడై మృత్యుతుల్య సుషుప్తిని బొందును. అట్లే నానార్థములం జూచుచు ద్వైతాభినివేశియైన పురుషుండును విక్షేప లయంబులం బొందెడిని. ఎట్లు ప్రాజ్ఞసంపర్కమువలన విషయసుఖ భోగము భ్రంశంబగునో యట్లనాత్మ సంపర్కము వలన నాత్మకు స్వరూపము భ్రంశంబగు నని తెలియుము. 6

మ. కలలో వస్తువుఁబోలె వాస్తవికముం ♦ గానట్టి ద్వైతంబులో
వల భద్రంబెదిరా! యభద్రమెదిరా? ♦ భాసిల్లుఁగా నున్నయ
ట్టు లటంచందువొ! యెంతకాల మవిరెం♦డుం గుల్కరా? యింద్రియం
బుల గ్రాహ్యంబగు సర్వముల్ ఋతముగాఁ♦బో, దేల పెక్కాడఁగన్?

వ. అయిన నసత్యంబు లర్థకారు లెట్లగు నందువా? 8

మ. అతిచిత్రంబగుఁ జూడు శుక్తి రజతా ♦ ద్యాభాసముల్ సత్యమే?
ప్రతిబింబంబు ప్రతిస్వనంబు ఋతమే? ♦ వానన్ భయాదుల్ సుసం
గతముల్ గావటె? యట్లె మిథ్యలగు ని ♦ ష్కాయాదులుంగూడ ను
ద్గతి [1] నామృత్యువు గల్గఁజేసెడిని సం ♦ త్రాసాది భావంబులన్. 9

కం. ఇది పాముకాదు త్రాడని, యెడ సత్యం బెఱిఁగినప్పు ♦ డే భయముం బా
సెడవు తను వాత్మగాదని, పదిలంబుగ నిజమెఱుంగ ♦ భయ మిఁక నున్నే? 10

వ. అనిన నుద్ధవుండు స్వామీ! సృష్టిశ్రుతులు ద్వైతము నిరూపించుంగదా? వానిం ద్రోసివైతురె! యనఁ గృష్ణుండిట్లనియె

తే. ఆత్మ తనకుఁదాఁ బ్రభువయి ♦ యఖిలజగము
నటుసృజించు సృజ్యమగు; వి ♦ శ్వాత్మకుఁడయి
యేలుకొను నేలఁగాఁబడు; ♦ నీశ్వరుఁడయి
వరలి హరియించు హరియింపఁ ♦ బడుచునుండు. 12

కం. కావున నాత్మాన్యంబగు, భావ మ్మొక్కండును బ్రతి ♦ పాదింపఁబడం
బోవద యధ్యాత్మాది, త్రైవిధ్య మ్మాత్మమొదలో? ♦ దవకయె వెలుఁగున్.

తే. వింటె యాధ్యాత్మికాది త్రి ♦ విధము గుణమ
యంబకదె యిది మాయాకృ ♦ తంబ కాన
నాత్మయందు నిర్మాలమై ♦ యలరుచుండు
స్వప్నముంబోలె నేటికి ♦ నందియంబు? 14

---

1, అమృత్యువు = మరణించువఱకు.

మ. కలలం దోఁచెడివెల్ల సత్యములనే ♦ గాఢంబుగా నమ్ముటం
గలుగుం ద్రాసము స్వప్నమందు నొకవ్యా ♦ ఘ్రుంబేచి రూక్షేక్షణం
బులఁ దన్గన్గొనఁ బర్వులెత్తు నరుఁ డీ ♦ మోహంబు నేమంద! మ
వ్వులి తన్జంపునె! తానుజచ్చునె! కలల్ ♦ వో నవ్వ దేముండెడిన్? 25

క. ప్రతిబుద్ధుఁడు స్వప్నాన, ర్థతతిం బొరయండ, యవ్వి ♦ ధమున వివేకో
న్నతి గల్గినవాఁడును సం, సృతిబాధలఁ బొందఁజాలఁ ♦ డెన్నటికైనన్. 26

క. అరుసమొ వెఱ పగవు కినుక, గరువమ్మును లోభ మోహ ♦ కామ మదాదుల్
మరణము జననమ్ము నహం, కరణమునకె, యాత్మ కివ్వి ♦ గలుగవ యెపుడున్.

వ. శోకమోహాదులు సుషుప్త్యాదులందు గోచరింపమిచేతను, నవి ద్రష్ట్రుధర్మ
ములుకామిచేతను, నహంమతిపలెఁ జైతన్యమెప్పుడును నేను సుఖిని
నేనుదుఃఖిని యనుచున్నట్లు ప్రతీతి లేనపోవుటచేతను నహంకారిదే సంసా
రము కాని యాత్మదికాదు. అహంకారమున్న సంసృతియుండునది లేకున్న
సంసృతి లేదని యన్వయవ్యతిరేకముల నెఱుంగునది యన నుద్ధవుం డటు
లైన ముక్తిమాత్ర మహంకారిదే కాదా? యనఁ గృష్ణుండు నవ్వి యహం
కారము తొలఁగినఁ గాని ముక్తి లేదయ్యా యని మఱియు నిట్లనె. 28

తే. ఆత్మ దేహేంద్రియాసుమ ♦ నోభిమానుఁ
డంతరాత్మకుండు గుణాక్రి ♦ యామయుండు
సూత్ర మహదాదినామ సం ♦ స్తుతుఁడు జీవుఁ
డగుచు సంసృతిఁ గాలవ ♦ శ్యతఁ జరించు. 29

వ. ఆత్మ యహంకారాదుల కలిమింజేసి జీవుండు నాఁబడె నీయహంకార
కృతబంధము వాస్తవమున నమూలమైనదియు నజ్ఞానవశంబున బహు
రూపంబులఁ బ్రకాశించునదియు నగు, నట్టి యీ సంసారాదిని గురూపాసన
మనెడి వాడిదనముగల జ్ఞానఖడ్గంబున ఛేదించి యతృష్ణుండగుచు ముని
చరించు. 30

సీ. ఆగమంబు స్వధర్మ ♦ మైతిహ్య మనుమాన
మును స్వానుభవము సా ♦ ధనము లగుచు
నలర, జగమ్మున ♦ కాద్యంతములనుండు
నదియె మధ్యంబున ♦ యందునుండు
నదియె ప్రకాశకం ♦ బదియె జగత్కార
ణమ్మును నదియె బ్ర ♦ హ్మమ్మటంచు
నెఱుఁగుటయే జ్ఞాన ♦ మిటు కుండలముల యా
ద్యంతంబులందు మ ♦ ధ్య దశఁగూడ

తే. హేమ మొక్కండకదె పసి ♦ మించు నదియ
వానికిం గారణముగాదె ♦ వత్స! యట్లె
బ్రహ్మమగు నేవ యఖిల వి ♦ శ్వంబునకును ని
మిత్తమును నుపాదానమై ♦ మెలఁగుచుండు. 31

కం. బంగారమె కుండలము ట్లుం గొరలుం బిలువఁగాఁబ ♦ డుఁ దదాఖ్య, నటే
నుంగూడ మధ్యదశఁ బ్ర,ల్వొంగఁబడుఁ బెక్కుపేళ్ల ♦ వ్యవహారమునన్. 32

వ. ఇట్లు కార్యంబునకుఁ గారణంబు నాత్మయె సుమీ. మఱియు మనంబును దత్కృత జాగ్రదాద్యవస్థాత్రయంబును వానికిఁ గారణభూతంబైన త్రిగుణంబులును దదీయంబులైన కారణకార్యకర్తలగు నధ్యాత్మాధిభూతాధిదైవంబులును గలిసి యేర్పడిన యీ త్రివిధజగంబును దేనిచేతఁ బ్రకాశించుచున్నదో? యేది లేకున్నం బ్రకాశింపదో? యా తుర్యంబె సత్యమైనది యని యెఱుంగుటయే విజ్ఞానము. ఇట్లు పరికార్యంబునకుఁ బ్రకాశకంబును నాత్మయె యని గ్రహించితివిగదా. 33

తే. పుట్టుటకుఁ బూర్వమును నాశ ♦ మునకుఁ బిదప
లేని వస్తువు నడుమను ♦ లేకయుండు
మనుజు లూరక వ్యవహార ♦ మాత్రమునక
యున్నదనుచును బల్కుచు ♦ నుందురనఘ! 34

వ. ఏది యేది పరజాతంబుఁ బరప్రకాశితంబు నగునో దాని కాతండే కారణభూతుండు ప్రకాశకుండు నగుననుట యెవ్వఁగాదె. తద్భిన్నం బింతయు నుండదని మన్మతంబు సుమీ. 35

సీ. ఈ వికారచయంబు ♦ సృష్టికిఁ బూర్వ, మ
విద్యమానంబయ్యె ♦ వెనుకకాల
మున నవభాసించె ♦ డినిఁ బ్రహ్మచే రజోం
శమున; బ్రహ్మమ్మె కా ♦ ర్యమునుగాద
యది స్వతస్సిద్ధమై ♦ నదియు స్వయంప్రకా
శమునైనదియు నగు ♦ సత్యవచన!
యర్థంబులును నింద్రి ♦ యంబులు మన మధి
దేవతల్ పంచభూ ♦ తావళియును

తే. ననఁగ భేదంబునం గ్రాలు ♦ నట్టి చిత్ర
మైన జగము బ్రహ్మమని వే ♦ దాదిసాధ
నమ్ములం దెలిసికొని వి ♦ జ్ఞాని యగుచు
నింద్రియోపరతి నొంద ♦ మెనయవలయు. 36

ఉ. ఏదిరొయాత్మ? దేహ మగు ♦ నే? ఘటమట్టుల నద్ది పార్థివో
ద్భేదముగానఁగాదు. మఱి ♦ దెందమొ? యన్నమయంబు గావునం
గాదు శరీరమట్లదియుఁ; ♦ గ్రాలెడి యింద్రియసంచయంబొ వా
క్యాదిక ముంబలెం గరణ ♦ మాటను గాదదిగూడ నుద్ధవా! 37

ఉ. ఆరయ దేవసంఘమగు ♦ నా? మనముంబలె నద్దిగూడ వై
కారికమాటఁగా; దొడలి ♦ కైవడిఁగాఁ బరిణామియౌ నహం
కారము గాదు బుద్ధియును ♦ గా దది తైజసమాటఁ; బ్రాణమో
మారుతమాటఁగాదు గుణ ♦ మండన! చిత్తముగూడఁ గాదిఁకన్. 38

తే. ఆరయజడమాటఁ ద్రిగుణసా ♦ మ్యమగు బ్రకృతి
గాదు, భూతపంచకమును ♦ గాదు విషయ
సమితిగా, దిదోయదొ యని ♦ సంశయంబు
నందఁబోవకు మిదియేది ♦ యాత్మగాదు. 39

చం. విను మిటు మత్స్వరూపము వి ♦ విక్తముగాఁ గలదం చెఱుంగు స
య్యనఘ నకుం గుణాత్మకము ♦ లైన హృషీకములం గుదింపఁగాఁ
ఘనతపమునేఫలంబు? విడఁ ♦ బుచ్చిన వచ్చెడిదోషమేమి? ధా
మనిధిని మబ్బుమూటువలు ♦ మాటిన బిచ్చిన వానికేమగున్? 40

చం. క్షితితలగంధి, యంబువుల ♦ క్లేదము, పావకు నౌష్ణ్యమున్, సదా
గతి పురుశోషణత్వమును ♦ గాఁనఁగ లేవు విహాయసంబు, నా
ఋతువుల వేఁడి శీతువు ల ♦ వేని కలంపఁగ లేవ; యట్లహం
కృతిపరు నక్షరుం జెనక ♦ వీభవహేతు గుణత్రయవ్యథల్. 41

చం. పటుతర భక్తియోగ పరి ♦ పాకము వ స్వమయానురాగ సో
త్కట హృదయాఘముం దొరఁగు ♦ దాఁక గుణావళిసంగముం దొలం
గుట దగు; సంగ మెంతగిఱి ♦ కొన్నఁ గుయోగి నలంచు, రోగ మెం
తటి యలువంబునుం గలప ♦ దా? నదు సారె కసడ్డసేసినన్ 42

మ. అమరప్రేరణచేత దార సుత మి ♦ త్రాంతేవస న్మఖ్యరూ
పములం గల్గఁగ నంతరాయము లన ♦ ల్పంబైన యోగమ్ము భ్రం
శము చెంద న్మఱుపుట్టువం దతఁడు ప్రా ♦ గ్జన్మసుస్ఫుటాభ్యాససం
క్రమ శక్తిం గను వెండి యోగము నె; ద్రో ♦ హ్యం దుర్గకర్మాధ్వమున్

ఉ. సోదెముగాఁగ నేమొకఁడొ ♦ చోదనసేయఁగ జంతుకోటి యీ
మాదిరి కర్మముల్ సలిపి ♦ మాఁటి వికారము నొందుచుండు మృ
త్యాదము మొందుదాఁక, మఱి ♦ యోగియొ యట్లుఁగాదు శోకహ
ర్షాదులఁ గాంచ కాత్మసుఖ ♦ మందుచు సంగముఁ బాసియుండెడిన్ 44

కం. కనుటయు వినుటయుఁ దాఁకుట, యనునిలుచుట కూరుచుంట ♦ యనులోనగువా
ని నెఱుంగఁడు తన దేహం, బునఁగా కాత్మయెడ బుద్ధి ♦ మునికలరుటచే 45

చం. ఎఱుఁగక పోవు టేల? యతఁ డింద్రియవంతుఁడు గాఁడె? యన్నచో
నెఱిఁగిన నేమి? యాతఁ డన ♦ దింద్రియవృత్తి యసత్యమం చెదన్
స్థిరముగ నమ్మియుండుఁ, గల ♦ దే యొకఁ డాత్మకు భిన్నవస్తు వం
చరయుచు స్వాప్నదృశ్యముల ♦ యట్టులు మిథ్యయటంచు నెంచుచున్ 46

కం. కలలోఁ దోఁచినవెల్లన్, మెలఁకువలో నేమి యయ్యె? ♦ మివ్వుల మఱువం
బొలసెడి వన్నియు నెఱుకువ, గలిగిఁ దమయంత పాయుఁ ♦ గాఁ జిత్రముగన్

వ. అని చర్చించికొని మునీషి నానాత్వము మిథ్యయని తలంచి దైహికంబులైన
స్వాభావికకర్మంబులకు వస్తుభావంబునఁ గనండనుటయె యెఱుంగండనుట
యనుడు నుద్ధవుండు స్వామీ! బద్ధావస్థను వదలినంగదా ముక్తావస్థ
లభించు నట్లైని యాత్మ యవికారి యనుట యెట్లు పొసంగునన భగ
వంతుం డిట్లనె. ద్రోహుల కపఘాతంబున ద్రోహిభావంబు తొలంగఁ దండు
నీభావ ముదయించినట్లయ్యె 48

సీ. ఆత్మమ్మునం జిత్ర♦మైన దేహేంద్రియా, దులఁ జూచె నజ్ఞాన♦మలమికొనఁగ
నదియె బద్ధావస్థ; ♦ యాతండ క్రమ్మర, జ్ఞానమ్ము కలుగ న♦వ్వానిఁ గానఁ
డయ్యె నయ్యదియెమ♦క్తావస్థ; రెండవ, స్థల నాత్మస్థిరముగాఁ♦గుఱుపుచుండు
నజ్ఞానమే వచ్చి ♦ నది పోయినది గూడఁ; గా దాత్మ; దానికిఁ♦గల్గఁబోవు

తే. బంధ మోక్ష వికారముల్; ♦ భానుఁ డుదయ
మగుడు జననేత్రములఁ దమం ♦ బడఁగుఁ దోన
పూర్వసిద్ధ ఘటాదికం ♦ బు స్ఫురియించు
నట్లె జ్ఞానోదయమున సి ♦ ద్ధాత్మ తోఁచు. 49

తే. జ్ఞాన ముదయింపఁగానె య ♦ జ్ఞాన మడఁగు
ననవలయు నె? యజ్ఞానమ్మె ♦ యగును బంధ
మనఘ! తన్నివృత్తియె మోక్ష ♦ మంతె కాని
నమ్మె మది క్రియాజన్య ఫ ♦ లమ్ము కాదు. 50

సీ. యాదవా! ముక్తి క్రి♦యాజన్యమైనఁగ
దయ్యె యాత్మవికారి ♦ యగుట, వింటె?
యాత్మకుఁ బుట్టువు ♦ నంతమ్ము లే, దది
తనయంత తానె స ♦ తమ్ము వెలుఁగు

చొండ్లను వెలిగించు ♦ చుండును, దేశకా
లాదుల కదియుండ, ♦ దన్నిటికిని
మొదటనే యది రెండ ♦ వది లేక యొంటిగాఁ
గులుకు, దాని విభూతిఁ ♦ బలుక లేము

తే. వాఙ్మనంబు లద్దానిఁ బ్రకే ♦ వఁ జననేర
వద్ది ప్రేరింప ననువాక్కు ♦ లటునిటాడి
దాని వాకొనఁజాలక ♦ మౌనమూను
నునికి యెఱుక సుకమ్మది ♦ యనఁగవచ్చు. 51

ఆ. అట్టి కేవలాత్మ ♦ నందు వికల్పంపు, మాట చిత్తవిభ్ర♦మమునఁ జూవె
యా వికల్పమునకు ♦ నవలంబమాత్మయె. త్రాడు లేక పాము♦భ్రాంతియెట్లు?

వ. కావున నాత్మ లేదనరాదు. మఱికొందరు పండితమ్మన్యులు ప్రత్యక్షాది ప్రతీతంబైనదియు, నామరూపగ్రాహ్యమైనదియుఁ, బంచభూతాత్మకమైనదియు నగు నీద్వైతమ్ము సత్యమ్మగాకేమి ? యనియుఁ, గర్త్వర్థకర్త్ర ప్రతిపాదనపరత్వంబునంజేసి వేదాంతంబు లర్థవాదంబులనియు వాకొందురు. కాని తత్త్వవిదు లిదియంతయు వ్యర్థవాదంబనియు, వేదాంతార్థంబులకు విధ్యేకవాక్యత్వంబు చొప్పడమింజేసియు, నకర్తయు నభోక్తయు సచ్చిదానంద స్వరూపంబు నగు నాత్మను ప్రతిపాదించు శాస్త్రము కర్మవిధిశేషత్వంబు భజింపమింజేసియు వేదాంతవాక్యంబు లర్థవాదంబులుగావనియు వాచారంభణాది శ్రుతులవలన నామరూపాత్మకంబు పంచభూతమయంబు నగుటవలననే ద్వైతంబు మిథ్యయనియు వారి వ్రేలితోడనే వారి కన్ను పొడిచినట్లు వారు చెప్పు యుక్తులతోడనే వారిమతంబు ఖండింతురు. 53

ఆ. ఇట్లు జ్ఞానయోగ ♦ మే శ్రేష్ఠమని యెంచి
చనుచునుండ నడుమఁ ♦ దనువునకును
వ్యాధి ముఖములైన ♦ యంతరాయమ్ములు
కలుగ వానిఁ దలఁగు ♦ క్రమము వినుము. 54

సీ. రవి సుధాంశ్వాది ధా ♦ రణచేత శైత్యతా
పాది పీడలనెల్ల ♦ నదుమవలయు
ననిలకుంభకపూర్వ ♦ కాసనంబులచేత
వాతాదిరోగాళిఁ ♦ బాపవలయు
మంత్రౌషధ తపఃక్ర ♦ మంబుల గ్రహసర్ప
పాపాదిబాధలఁ ♦ జోపవలయు
నస్మదీయాంఘ్రిద్వ♦యు ధ్యానరతుఁడయి
కామాది వర్గంబు. ♦ గ్రాఁచవలయు

ఆ. నామకీర్తనంబు ♦ నర్మ సత్క్రియణములు,
విమలయోగుల పను ♦ విఘ్నకలన
దంభమార్గములు, మజ్జీ ♦ తగిన యుపాయమ్ము
ఐశుభ విఘ్నవితతి ♦ నాపవలయు. 55

ఉ. కొందఱు దేహ లీతతను ♦ కోమలమై నను(్ర)బాయపుంగళిల్
చిందఁగ వ్యాధులాధులు వ ♦ లీ పలితాక్త జరాభరంబులుం
బొందకయుండ స్వేచ్ఛగ న ♦ పూర్వ వరాంగ నివేశనాదులం
జెందఁగ యోగధారణను ♦ జేయుదు రెన్నఁడొ పాట్లగొగ్గుచున్. 56

చం. ఇది యుచితంపుఁద్రోవయటె ! ♦ యేబుధకోటికి సిద్ధియాదృతం ?
బదియును గా, కనిత్యమగు ♦ నంగముకై పడుపాటులెల్ల నొ
ప్పిదములు గావుగాదె ! క్లము ♦ వృద్ధియు దక్కు; ఫలస్ఫురింబలెం
బొదలెడి నాత్మ, స్థైర్యమునఁ, ♦ బోవు నశించి ఫలంబునట్లొడల్. 57

కం. యోగంబును సేవింపం, గాఁ గాయముఁ గాచుకడఁకఁ ♦ గాదనఁ గానీ
యోగంబు విడిచి కాయము, పైఁ గోల్పోవు లంగరాదు ♦ శాస్త్రశ్రద్ధన్. 58

కం. అనిలాశనామాదికమో, యనఘ ! సమాధికిని నంగ ♦ మాట నలుపుచోఁ
దనువు జరాదులఁ గనకుం, డినమాత్రనె యుద్ధి యగునె ! ♦ సత్యము చెపుమా!

కం. కాన నడుమఁ గనుపించెడి, యీశ్వర ఫలము నమ్మ ♦ కెంతయు శ్రద్ధన్
మానసమున నన్ను నిలిపి, స్వానందము గనఁగఁదగు న ♦ మాధిస్థితుఁడై.

కం. నన్నాశ్రయించి పెరతలఁ, పున్నగుడైఁగనీక యోగ ♦ ముం బూనిన వా
నినిమ్నాంతరాయము, లెన్నండు గలంప వాతఁ ♦ డెనయు స్వసుఖమున్.

వ. అని కృష్ణుండు నుడివెనని శుకమహర్షి వచించె. 62

ఇది యష్టావింశాధ్యాయము – సమాప్తము.

---

## ఏకోనత్రింశాధ్యాయము

కం. భక్తులను బరీక్షింపఁగ, యుక్తంబటె ? నిన్ను విడిచి ♦ యొకనిముసంబున్
శక్తులటె నిలువఁగా న,వ్యక్తాంతరపథవిహార ! హరిహరనాథా ! 1

వ. [1] దేవా ! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. అట్లు భక్తపాలన బద్ధకంకణుఁడైన శ్రీకృష్ణుండు విసువులేక మాటిమాటికి మృదుమధుర వచనముల బోధించుచుండ నుద్ధవుం డెంతయు నలరి యిట్లనె. 2

---

[1] 23-9-1946 అధ్యాయ ప్రారంభము

కం. అవశీకృత మానసులకు, విపులం దుష్కరమ యువుఁజ ♦ మీ యోగదో
గ విజ్ఞానములగాన నవియం, దవె సులభమ్ముగను సిద్ధిఁ ♦ బడయు తెఱంగుల్. 3

కం. తఱచుగ యోగుల మానస, మరికట్టఁగ లేక శ్రమము ♦ లందుచునుంటం
బరికింపుచుండుఁ గదు దు, స్తరముగదే యిద్ది యోగి ♦ జనతాభినుతా! 4

శా. సారాసారవివేక పేశలులు హం ♦ సశ్రేష్ఠు లత్యంత భ
క్త్యాసక్తిన్ భవదంఘ్రి సారస మరం ♦ దాసారపానోదిత
స్ఫారానంద వశంవదాత్ములయి యు ♦ ష్మన్మాయకుం జిక్కఁగాఁ
బో రెన్నండుఁ శ్రితాభిరక్షణ! మహాం ♦ భోజాతపత్రేక్షణా! 5

కం. కొందఱు యోగుల మంచుం, గొందఱు కర్మఠుల మనుచుఁ ♦ గుల్కుచుఁ గర్వ
స్పందితమతులై నిన్నెఱుఁ,గం దలఁపక కూలిపోయె ♦ దరు నీమాయన్. 6

ఉ. ఏమివిచిత్ర! మచ్యుత! త్వ ♦ దేకమనస్కుల కాత్మసాత్త్వముం
బ్రేమయిడి నీవొనర్చుట! వి ♦ రించి సురేంద్ర కిరీటకోటి ర
త్నామల కాంతిపూరిత మ ♦ హారజతోజ్జ్వల పాదపీఠికా
స్వామివి తోడుల ట్లరయ ♦ వా? మును గోఁతుల గొండముచ్చులన్? 7

మ. సకలాత్మా! సకలాప్తబంధు! సకలే ♦ శా! యాశ్రితేష్టార్థముల్
సకలం బిచ్చెడి నిన్ గృతజ్ఞుఁ డెవఁ డెం ♦ చం బోక వర్జించెడిన్?
బ్రకటైశ్వర్యములొంద ముక్తియొదవన్ ♦ వాంఛించు నెవ్వండు వే
ఱొకదైవంబు? త్వదంఘ్రిధూళి భజనో ♦ ద్యోగంబ చాలుం గదే. 8

మ. వెలి నాచార్యుఁడవౌచు సంశయముల ♦ న్విచ్ఛిన్నముం జేసి లో
పలఁ జిద్రూపుఁడవౌచు వాసనల వి ♦ ధ్వంసంబు గావించి మా
కెలమిం గూర్చి వెలార్చినాఁడవు స్వకీ ♦ యేద్ధ స్వరూపంబు ని
మ్ముల బ్రహ్మాయువు మన్న నీ ఋణము మే ♦ ముం దీర్పలే మీశ్వరా! ♦

మత్త. ఇత్తెఱంగున శిష్యుఁ డుద్ధవుఁ డిద్ధభక్తిని బల్కనం
చుత్తరాసుతుతోడ శ్రీశుక ♦ యోగిసత్తముఁ డాదరం
బొత్తరింప వచించి యిట్లను ♦ నో నృపాగ్రణి! విస్మిత
చ్ఛిత్తముం గరఁగించు మాటల ♦ చే మృదుస్మిత వక్త్రుఁడై. 10

ఆ. ఈశ్వరేశ్వరుఁడు గృహీతమూర్తిత్రయుం,డాత్మశక్తి జగతి ♦ నాఁడు వాఁడు
వారిజాక్షుఁడు భగ♦వానుండు కృష్ణుండు, పలికె నెట్లు ప్రేమ♦భాషణముల.

—* శ్రీకృష్ణుం డుద్ధవునకు మరల భక్తియోగము సంగ్రహముగా నుడువుట *—

ఆ. బిడ్డ ! శ్రద్ధతోడ ♦ వినుము నిశ్శ్రేయస,దాయకముల నాదు♦ధర్మములను,
వాని నాచరించి♦ మానవుండు సుమర్త్య,యంబు భవముదాఁటు♦నశ్రమమున.

కం. మెల్లగ నన్నే స్మరించుచు, నెల్లపనులు నాకొఱకె ప♦హించుచుఁ దనదా
నుల్లము బుద్ధిని మత్పద,వల్లవముల నిల్పి నల్పు♦వలె ధర్మములన్. 13

ఆ. అస్మదీయ భక్త ♦ లగు సాధువులుగల, పుణ్యదేశములకుఁ ♦ బోవలయును
నరసురాసురులను ♦ వరలిన భక్తుల,కృత్య వితతి ననుస♦రింపవలయు. 14

తే. ఏకకుండైనఁ బెక్కండ్ర♦నైనసిద్ధమైన,
నృత్తగీత వాద్యములతో ♦ నృపమహోప
చారములతోడ నాసేవ ♦ సలుపవలయుఁ
బర్వ యాత్రా మహోత్స వా ♦ వసరములను. 15

కం. అమలమతిమై నిఖలభూ,తములందున్ స్వాత్మయందుఁ ♦ దద్గగనముచం
దము బహిరంతరపావృతు,నమేయు నను జూచుచుండ♦నగు నెల్లపుడున్.

ఉ. ఈ విధి జ్ఞానసారము గ్ర ♦ హించి సమస్త చరాచరంబు మ
ద్భావమునం గనుంగొనుచు ♦ బ్రాహ్మణ పుల్కసులందు స్తేన వి
ద్వావిదులందు వహ్నికణ ♦ తామరసాప్తులయందుఁ గ్రూరసా
ధ్వావళియందుఁ దుల్యదృశుఁ ♦ డౌ నతఁడేనుమి పండితుండనన్. 17

కం. నరుల న్మద్భావముతోఁ, బరికించెడి భక్తునకును ♦ స్పర్ధాసూయా
దురహంకారాదులు న, త్వరము నశించెడిని దేవ ♦ భాగ తనూజా ! 18

ఉ. ఈతఁడు నీచుఁ డుత్తముఁడ ♦ నే ననుదైహికదృష్టి వీడి వ్రీ
డాతురతల్ త్యజించి, పరి ♦ హాసము లుద్ధతిఁజేయునేని సం
గాతిదళంబుఁబాసి, శుని ♦ గార్దభ పుల్కసముఖ్యభూతసం
ఘాతము బ్రహ్మబుద్ధిఁ గని ♦ ధ్మాఁబడి దండముపెట్టఁగాఁ దగున్. 19

కం. ఎందాఁక సర్వభూతము, లందు న్మద్భావ ముదయ ♦ మందదొ మదిలో
నందాఁకఁ ద్రికశుద్ధిగ నీ, చందము సమదృష్టి నన్నుఁ ♦ జను నర్చింపన్. 20

తే. అశ్వచాండాల గోఖరా ♦ ద్యర్చన మిటు
సేయ నీశ్వరబుద్ధితో ♦ స్థిరపడెడిని
నంతయును బ్రహ్మమనుభావ ♦ మంత బంధ
వితతి సడలును సర్వోవ ♦ రతిమెలర్చు. 21

కం. కల దెన్నియే నుపాయం, బులు గాని సర్వభూత ♦ ముల మద్భావం
బెలయించి త్రిశుద్ధిగఁ దా, మెలఁగుట నామతమున స్స ♦ మీచీనమగున్.

కం. సుమతీ! మద్ధర్మోద్భవ, క్రమమున నణుమాత్రమైనఁ ♦ గలుగదు ప్రత్యూ
హ, మకామున కేతద్ధర్మము నిర్గుణముగను నేన ♦ రచియించితిఁ జూ. 23

తే. లోకమున నిరర్థకమగుఁ ♦ గాక దానిఁ
బరుఁడనగు నాకు నిష్కామ ♦ నిరతుఁడగుచు
నర్పణము సేయ నదె మదీ ♦ యమగుధర్మ
మగును దానిచేఁగూడ నే ♦ నలరుచుండు. 24

వ. ఎట్లన లోకంబున భయశోకాదులచేఁ బలాయనాక్రందనాదులు నిరర్థా
యాసకరంబులే కాని యవియు మదర్థం బనుసంధింపంబడు నేని ఫలంబు
లభించెడిని. 25

కం. అమృతము వినాశి యగు నీ
మనుష్యదేహమున సుగుణ ♦ మండన! సత్యుం
డును నమృతుఁడు నగు నన్నుం
గనుఁగొనుటయె తెలివిచదురు ♦ ఘనబుద్ధులకున్. 26

తే. నాయనా! యుద్ధవా! చెప్పి ♦ నాఁడ నీకు
బ్రహ్మవాదమ్ము కొంత సం ♦ గ్రహపఱిచియుఁ
గొంత విస్తరించియును బె ♦ క్కు విధములఁగ
సుమతి! యిది వేల్పులకును దు ♦ ర్గమము సూవె. 27

కం. స్పష్టమగు యుక్తితతితో, నిష్టమ్మగు జ్ఞానయోగ ♦ మెన్నియు గతులం
దుష్టిగ నుడివితి నిది విన, నష్టద్వాపరులు ముక్తి ♦ నాథులుగారే? 28

కం. నీయడిగిన ప్రశ్నంబుల, నాయుత్తరములను విన స ♦ నాతన మఖిలా
మ్నాయాతిగమ్యమైన య, మేయ పరబ్రహ్మ మధిగ ♦ మింతురు మనుజుల్.

ఆ. ఎవఁడు పుష్కలముగ ♦ నిద్దాని మద్భక్త, జనుల కొసఁగునో ప్ర ♦ శంసనీయ
శక్తితోడ నట్టి ♦ బ్రహ్మోపదేష్టకుఁ, గోరి నన్ను నిచ్చి ♦ కొందు నేన. 30

కం. పరమపవిత్రము శుచి యీ
యురుబోధము సతముఁ జదివి ♦ యుచ్చైర్ధ్వని నా
పురుషుండు జ్ఞానదీపం
బురమున ననుఁజూపి సేయు ♦ క్షోణిఁ బ్రియతమున్. 31

కం. ఎవఁ డవ్యగ్రుఁడు శ్రద్ధా, ళువు డయి యిద్దాని విని ని ♦ లుపునో మది వాఁ
డవిరళభక్తిని నావయిఁ, దవిలిచి పృథు కర్మబంధ ♦ తతినిఁ దొఱఁగున్. 32

ఉ. నాయన! యుద్ధవా! తెలిసె ♦ నా? యిపుడెల్లెడఁ బ్రహ్మవస్తు వా
ప్యాయముగాఁగ వింటివిగ ♦ జూ! నను జూచితె తెల్ల కోరికం
బాయఁగ, నాత్మదేహముల ♦ ద్వైతము డించెను? యింక నీవుఁ బా
రాయణముం బొనర్పు మహా♦పగ్రణి! నీకు శుభంబు ప్రాప్తమౌ! 33

చం. వినవలె నన్న యిచ్ఛ ప్రభ ♦ వింపనివానికి భక్తిలేని వా
నికిని మదిన్ సీతునకి ♦ దంభముగల్గినవానికిన్ శఠా
త్మునికిని నాస్తికత్వమున ♦ దోకసివానికి నీతత్త్వమున్
వినిచెదవేమొ? కూడ దిది ♦ వెఱ్ఱికి వేఁడివిధాలుగాదచే 34

కం. ఈ దోషంబులఁ బాసిన, వేదవినుతకుం బ్రియునకు ♦ విమలాత్మునకున్
సాదరమున నుడువుము స్త్రీ,పాదజులకు భక్తియున్న ♦ వారికిఁ గూడన్. 35

కం. జిజ్ఞాసునైన సాత్వతుఁ, డీజ్ఞానము విన్న పిదప ♦ నెడివినఁగోరున్
అజ్ఞుఁడును సుధాసారా, భిజ్ఞుండయి తలచునట్లె ♦ పెరరసమూనన్. 36

వ. కర్మ వార్తా యోగదండనీతి జ్ఞానంబులం గల చతుర్విధపురుషార్థంబులు నరులకు నేన యున నుద్ధవుండు స్వామీ! వీనిని విభజించి తెలుపుఁడన భగవానుం డిట్లనియె. కర్మంబున ధర్మంబును, వార్తయందు నర్థంబు, యోగదండనీతులంగల యణిమాది సిద్ధ్యైశ్వర్యరూపకామంబును, జ్ఞానంబున మోక్షంబును నేన యని యెఱింగి 37

తే. మానవుండు సమస్తక ♦ ర్మములు వదలి
నాకు నాత్మార్పణంబు గా ♦ వర్చునేని,
తనివిసెంది వానికి నమృ ♦ తత్వ మిచ్చి
కొలుతు నాత్మైక్యమొనరించు ♦ కొందునయ్య. 38

వ. ఉద్ధవా! ఇఁక నీకు బోధింపవలసినది లేదు. ఇటనుండి బదరీవనమునకరుగు మనుచు శ్రీకృష్ణుండు పలికెనని శ్రీ శుకమహర్షి నరేంద్రునితో నుడివి మఱియు నిట్లనియె. 39

*- ఉద్ధవుఁడు శ్రీకృష్ణుని వీడ్కొని చనుట *-

కం. ఆ కైవడి సర్వజ్ఞుఁడు, వైకుంఠుఁడు జ్ఞానయోగ ♦ పథములఁ గూరు
న్యాకలిత మానసుండై, వాకొనఁ గర్ణములఁ ద్రావి ♦ వచనామృతమున్

కం. నిర్భర పూర్ణానందా, విర్భావాన్వయవశుఁ డగు ♦ వికలాక్షుఁడు ప్రా
దుర్భూత పులకుఁడుం గళ, గర్భ స్తంభితవచనుఁడు ♦ కంపితతనుఁడున్ 41

తే. అపుడు నుద్ధవుం డవలఁ గొం ♦ తవడి కెట్లొ
ప్రణయ భారావఘూర్ణిత ♦ స్వాంత మొయ్యె
నొయ్యనం జేర్చికొని దిట ♦ వ్వానఁగడఁగె
సద్గురు వియోగ మెరియించు ♦ ఛాత్రవరుల. 42

వ. అంతం గొంతతడవునకుఁ బ్రకృతిస్థుండై యుద్ధవుండు భక్తిశ్రద్ధాబద్ధుం
డగుచుఁ బ్రత్యంతవీధీ విహారణమ్ములగు సద్దేవుచరణమ్ములకు దండవ
త్ప్రణామమ్ము లాచరించి మాటిమాటికిం దదంగుళీపల్లవంబులఁ గంటనద్ది
కొనుచుఁ దత్పాదాబ్జగంధము నాఘ్రాణించుచుఁ దత్పదంబులం దనకర
తలంబులం బుణుకుచుఁ దదంగుష్ఠాగ్రంబుఁ జుంబించుచుఁ దద్రజోలేశంబుఁ
దనయుపఘనంబుల నలందుకొనుచుఁ దత్పాదంబులఁ దనశిరోముఖ నేత్ర
గండ కంఠవక్షోభాగంబులచే స్పృశించుకొనుచుఁ గొంతవడి యున్మత్తుం
బోలెఁ గ్రీడించి యవ్వలఁ దృప్తిదీఱఁ బాదసంవాహనం బాచరించి యంత
నిటలతట ఘటితాంజలిపుటుఁడై యిట్లనియె. 43

సీ. [1]ఈపదాబ్జముగదే ♦ కృత్స్న వేదశిరోజి,రమ్ముల ఘుల్లలా ♦ రవము సేయు
నీపదాబ్జముగదే ♦ పాపభూయిష్ఠ సం,సారామయమ్మును ♦ జక్కడంచు
నీపదాబ్జముగదే ♦ హృద్ధ్యానరత మునీం,ద్రాజ్ఞాన తిమిరంబు ♦ నంటఁద్రోలు
నీపదాబ్జముగదే ♦ యిందిరాసుందరీ, మణి దేహతాపంబు ♦ మాయఁజేయు

తె. నీపదాబ్జమ్ముగదె రాత్మ ♦ సేశ్వరుండు
బలిమహేచ్ఛుండు వినయుత ♦ త్వరతఁ గడిగి
యర్చలొనరింపఁ గార్త్యార్థ్య ♦ మందఁజేసె
నద్దినేఁడు నాకబ్బెఁగా ♦ హరిముకుంద. 44

సీ. ఈ పదంబులు స్పృశి ♦ యింపఁగా శకటదా,నవుఁ డేసదాచార ♦ మవధరించె
నీ పదంబులు నటి ♦ యింపఁగా ఫణముల,భోగి యేపుట్టకుఁ ♦ బూజసేసె
నీ పదంబులు స్వైర ♦ చోవరి విహరింపఁ,గాఁ గుబ్జ యేదాన ♦ గరిమఁబూనె
నీపదంబులు తమ్మఁ ♦ ద్రోపాడఁగఁ గుబేర,తనయు లేమానత్వ ♦ తమ్ముపట్టె

తే. రీపదంబులు మెట్టఁగా ♦ నీపపాద,పం బచలవృత్తిమై బహు ♦ వత్సరములు
నిలిచి యేమిదీర్ఘతపంబు ♦ నిష్ఠసలిపె, నవ్వి నీదయ నేఁడు నా ♦ కబ్బెదేవ!

తే. స్వామి! త్వత్సన్నిధాన ప్ర ♦ భావమున నె
నాదు మోహాంధకారంబు ♦ నాశమయ్యె
నుండునే! విభావసుచెంత ♦ నున్నవాని
కెన్నఁడే శీతతమములు ♦ కన్నతండ్రి ! 46

(1) శంఖే ధన్వంతరౌ చంద్రే పుంస్యబ్జః క్లీబమంబుజమ్-యథాయోగ్యము గ్రాహ్యము.

కం. కరుణాకర ! మద్హృన్మం,దిరమున వెలిఁగించి జ్ఞాన ♦ దీపము భృత్యుం
బరిరక్షించితి నీవుఁగా,కొరుని గృతజ్ఞుఁ డెవఁడు శర♦ణొందుం దండ్రీ! 47

ఉ. అంధక వృష్ణి సాత్వత ద ♦ శార్హజ ముఖ్యులయందు స్నేహసం
బంధము నాత్మమాయఁ గను ♦ వట్టఁగఁజేసితి సృష్టివృద్ధి. కా
బంధనబంధ మిప్డు దృఢ ♦ తాత్త్వికబోధ శితాసిధేనుకా
బంధురధారఁ ద్రుంచి ననుఁ ♦ బాలనసేసితి వైతి ధన్యుఁడన్. 48

విచిత్రవృత్తము. నమస్కారముల్ దా
సమాన్యా ! భవత్పా
దమే నాకు దిక్కం
టె మన్నింపు నన్నున్. 49

మదరేఖావృత్తము. నీపాదాబ్జములందే
యే పొద్దున్ రతి నాకున్
దీపింపంగ నొనర్పన్
శ్రీపా ! వేఁడుదు నిన్నున్. 50

స్రగ్విణి॥ తొల్లి పార్థుండెటుల్ ♦ దోఁచ కయ్యాజిలో
డిల్లపోఁగా వను ♦ ష్ఠింప ధర్మంబు నీ
వల్లనం దెల్పిన ♦ ట్లాగమాంతంబు నా
కెల్ల బోధించి న ♦ న్నేలి తాత్మేశ్వరా ! 51

కం. నీపాలఁబడిన నన్నున్, లోపాల గణింప కెడఁద ♦ లోపలఁగొని నా
తాపా లడంచినాఁడవు, గోపాలా ! మంగళాను ♦ గుణ గుణజాలా ! 52

కమలవిలసితము॥ అడిగిన విషయమె ♦ యడిగినఁగూడన్
గడువడిఁ గఱపితి ♦ కసరక తండ్రీ !
నుడివినయదె మఱి ♦ నుడివిన సందే
ర్పడినది యభినవ ♦ వరరుచి కృష్ణా ! 53

ప్రమితాక్షరము॥ ప్రమితాక్షరంబు బహు ♦ భావమనో
జ్ఞము వేదసారము ప్ర ♦ శస్తకథా
ర్థము శిష్యతారకము ♦ తావకవా
క్యము నావశంబె కొని ♦ యాడ హరీ ! 54

నలిని॥ కలరెండఱో తావకభ ♦ క్తశిఖామణు లీ
యిల వారల నేరిని సా ♦ హృదభావముతోఁ
దిలకింపక నన్న దయా ♦ దృతిఁ దేల్చితి నా
తొలివున్న మదేమొ త్రయీ ♦ స్తుత పాదయుగా ! 55

ప్రహర్షిణి॥ ధన్యుండన్ భళిభళి ♦ ధన్యుఁడ న్ముకుందా !
అన్యాసాధ్యమయిన ♦ యాత్మవిద్య గంటిన్
మాన్యుల్ పొందెడి పర ♦ మస్థితి న్వహింతున్
ధన్యుండ న్నిజముగ ♦ ధన్యుఁడ న్మహాత్మా ! 56

చం. అని యిటు లుద్ధవుండు విన ♦ యమ్మున వేఁడి నమస్కరింపఁగా
విని యరవిందలోచనుఁడు ♦ ప్రేముడి నిట్లను వత్స ! నీవిఁకం
జను బదరీవనస్థ మతి ♦ శాంతము పావన మస్మదాశ్రమం
బునకు ననుజ్ఞ యిచ్చితిని ♦ బోయిఁక సంశయ మందనేటికిన్ ! 57

కం. కల దటఁగను మత్పాదా, మలతీర్థోత్తుంగ భంగ ♦ మంగళరంగన్
గలుషస్మయభంగన్ ము, క్త్యలి వేణ్యపరాంగఁ బావ ♦ నాంగన్ గంగన్. 58

కం. దర్శనమాత్రంబున నఘ, కర్శన మొనరించుఁజుమ్మి ♦ గంగ తదీయ
స్పర్శనమునఁ గలఫలము వి, మర్శింపఁగ లేము పెక్కు ♦ మాట లిఁకేలా? 59

వ. అట్టి యలకనందాభిఖ్య గంగం గన్నతోడన నమస్కరించి 60

సీ. కడుభక్తిగంగ ! గం ♦ గా ! యనుచు స్మరియించి,
గంగాభిముఖముగాఁ ♦ గదలిపోయి
నాభిమాత్రజలమ్ము ♦ న న్నిల్చి సిగకెంపు
వలఁకులందగఁ జల ♦ వంచి మాఁడు
మార్లు మునిఁగి యాచ ♦ మన మొనర్చి శిఖను
ముడివైచి లాగిపో ♦ విడిచియూర్పు
సంకల్ప మొనరించి ♦ సరిగ "హిరణ్యశృం
గ"మ్మను వరుణసూ ♦ క్తము జపించి
తే. మార్జనమ్ము "నాపోహిష్ఠ"... ♦ మంత్రముల న
మర "ఋతంచ" యనెడు నఘ ♦ మర్షణమునఁ
దానముంజేసి దేవాది ♦ తర్పణమ్ము
లాచరింపుమా ! దేవభా ♦ గాత్మజన్మ ! 61

కం. అంతట నారలు గట్టుము, చింతలుడిగి వన్యములను ♦ సేవింపుము నీ
స్వాంతమ్మున ద్వంద్వములకు, నుంతయుఁ దావీయఁబోకు ♦ సుభగచరిత్రా !

కం. శాంతుఁడవై విషయులకుని, యంతవున్నై! యుండవలయు ♦ నాత్మానుభవా
శ్రాంత సుఖుఁడవై మదిభా, వింతె మదుక్తముల జ్ఞాన ♦ విజ్ఞానములన్. 63

ఉ. చిక్కులమారి పెందమును ♦ జిందులుద్రొక్కఁగనీక, బుద్ధివిం
జిక్కఁగబట్టు, నానుడులు ♦ చింతనసేయుము, నాయెడ న్మదిన్

వాక్కునుగట్టివేయు, మిం(క ♦ నాదగు ధర్మముచే నాచరింపు మీ
భక్తి నెలంగ నీత్రిగుణ ♦ పద్ధతి దాటఁగ నొక్క లెక్కయే? 64

వ. అని భగవంతుం డానతిచ్చిన సంతోషించి యుద్ధవుండు వినయావనతుండై యిట్లనియె: ఉత్తరవట్టీ! యట్లు లాచుట్టువాలు దోర వాఁకుప్ప నానట్టికసీల కేలుజోడించి మునుమ్మారు తాళలేవేల్పునకు నెట్టుకొని వచ్చు బత్తిం జుట్టివచ్చి జాఁగిలపడి జాలువారు కన్నీటివెల్లువల వెల్లువ నడుగులఁ గడిగి తొంటరిజంటల గొంటిన దంటయయ్యె నావుడు మనియె. అవ్వాడు భగవానుం డూఱడించి హస్తమస్తకయోగంబున నాదరించి యభయమిచ్చి తన శ్రీపాదుకల నొసంగి శుభంబు కలుగుఁ బొమ్మన నవ్వాని నమ్మహాభాగవతుండు మహాప్రసాదంబనుచు స్వీకరించి కంటనద్దుకొని యౌఁదల దాల్చి భరతుండుంబోలె నెట్టకేని సుదుస్త్యజ స్నేహవియోగబాధ సహించి పునఃపునఃప్రదక్షిణ నమస్కారాదులఁ గావించుచుఁ దుదకు మనంబు బిగ్గవట్టి యుల్లసం బనుచు మాటిమాటికి వెనుదిరిగి చూచుచుఁ గరంబుల మోగిడించుచు నవల శిరమ్ము వాల్చుచు నంతవీక్షణమ్ముల నెఱఁగుచు నంతట డెందంబున వందనంబు సలుపుచుఁ గృష్ణుంబాసి కతిపయప్రయాణంబులం జనుచు మార్గమధ్యంబునం గొన్ని దినంబులకు వాసుదేవుండు ప్రభాసంబున కరుదెంచెనని విని నెమ్మది నరికట్ట నేరక యద్దేవుం జూచుఁ వేడ్కఁ గ్రమ్మరి యరుదెంచి యట నిజకులనాశం బెఱింగి భగవంతుం డాసి నమస్కరించి యచ్చట చనుదెంచిన మైత్రేయునితోఁ గూడి మరల భగవదుక్త తత్త్వరహస్యం బెఱింగి సంతుష్టుండై యావల బదరికాశ్రమంబున కరిగి జగద్బంధూపదిష్ట ప్రకారంబునఁ దపంబు సేసి హరిగతిం బొందె. 65

తే. ఏతదానందజలధి సం ♦ భృతము జ్ఞాన
పావనామృతంబు ముకుంద ♦ భాషితంబు
శ్రద్ధతోడ నించుకయేని ♦ త్రావువాఁడు
ముక్తికాంతామణీ మనో ♦ మోహనుండు. 66

వ. అని శ్రీశుకమహర్షి వచించి ధ్యాననిమీలితాక్షుండై కొండొకతడవుండి

కం. శ్రీకృష్ణా! యుద్ధవు నొక, సాకుగఁ జెట్టుకొని వేద ♦ సారామృతముం
బైకిం దీసితె విబుధా, నీకము సాకం దలంచి ♦ నీ కివె జోతల్! 68

తన్వీ. తుమ్మెద నూనమ్ములఁగల మధుబిం ♦ దుల్ గొనునట్టుల శ్రుతివిలసజ్జ్ఞా
నమ్ము నివృత్త్యర్థగులకు భవభీ ♦ నాశము సేయఁగ, మరణజరా భా

రమ్ము ప్రవృత్త్యర్థ్వగులకుఁ దలఁగక్ ♦ ద్రచ్చి సముద్రము సుధఁగొని యీవే
కమ్మఁగఁ ద్రావక్ బురుషవర! త్రయీకర్త! సనాతన! కొనుమి వెజోతల్.

వ. అని శ్రీశుకుండు భగవంతుని ధ్యానించెనని సూతుండు శౌనకాదులతోఁ జెప్పెను. 70

ఇది యేకోనత్రింశాధ్యాయము – సమాప్తము

---

## త్రింశాధ్యాయము

పడుచుఁ లేచుచుఁ బసిబాలుఁడు నడక నేర్చునట్టు ♦ లు భవన్మాయం
బడుచుఁ లేచుచు నెఱుకవ, నడుగిడడము నీదుకరుణ ♦ హరిహరనాథా! 1

వ. [1]దేవా! యవధరింపుము. సూతుండు శౌనకాదులతో నిట్లనియె. శ్రీశుకయోగీంద్రుండు ధ్యానము చాలించియుండ శ్రీపరీక్షిన్నరేంద్రుం డమ్మహాత్మ్యుం జూచి 2

కం. ఉద్ధవుఁడు భక్తిభావను, మిద్ధుఁడు బదరీవనమున ♦ కేగఁగ భూదే
వ్యుద్ధర్త కృష్ణుఁ డట నే, పద్ధతి నేమిరొనరించె ♦ ద్వారకలోనన్. 3

కం. విప్రర్షి వరేణ్య! క్రో, ధ ప్రాప్తంబైన శాప ♦ తాపము యదువం
శప్రథ నడఁచెను సకలా, ర్తిప్రియకర తనువు నేమి ♦ సేసెనొ హరియున్? 4

మ. ఎచ్చట లగ్నముచెందిన చూడ్కి మ్రు ♦ గేక్షణలు న్మరలింపఁగలేఁ;
రెచ్చుగవిన్కి మనీషుల చిత్తము ♦ నేయది పాయక నిల్చెడినో?
అచ్చవి సూరులసూక్తికి దేనిహా ♦ యల్ నుతిసేయఁగఁగల్గునో? వి
వ్యచ్చు రథస్థము దేనిఁగనన్ మృత ♦ పాళి సరూపతఁ గాంచెడినో? 5

వ. అట్టి శ్రీకృష్ణదేవు దివ్యమంగళవిగ్రహముంగూర్చి నుడువుమన శ్రీ బాదరాయణి భగవత్స్మరణపూర్వకంబుగా నిట్లనియె. 6

♦ శ్రీకృష్ణుండు యాదవులఁ బ్రభాసతీర్థంబున కరుగుమనుట ♦

కం. క్షమ కంపించుట దిగ్దాహము రవిపరివేష మాది ♦ యయిన మహోత్పా
తములఁగని కృష్ణుఁడు యదూ, త్తములకు నిట్లనియె దత్సు ♦ ధర్మాఖ్యసభన్. 7

ఉ. చూతుర వృష్ణులార! ను ♦ యశోధనులార! కనంబడు న్మహో
త్పాతము లంతకాశ్వగళ ♦ దామ హిరణ్మయ భూరికింకిణీ
జాత పరస్పరాభిహతి ♦ జాత పతత్స్ఫుట విస్ఫులింగ సం
కేతము, లార్యయాదవ ని ♦ కేతన భూచర మృత్యుదూతముల్. 8

---

అధ్యాయ ప్రారంభము 29-9-1946.

చం. కలదుగదా మహీసుర శి ♦ ఖామణి కల్పిత ఘోరశాప మీ
కులమున, కద్దినేఁడు సమ ♦ కూడెను నట్టులు దోఁచుచున్న, దీ
స్థలమున నిల్వఁగూడ, దిఁక ♦ జాలముసేయక లెంకు లెండు మీ
వలసిన వస్తువుల్ గొనుచు ♦ బంధు సుహృజ్జనులార! చయ్యనన్. 9

కం. ఈద్వారపతి విడిచి యోపి వృద్ధులు బాలురెల్ల ♦ శీఘ్రంబున [1] శం
ఖోద్ధారమునకుఁ జనవలె నద్వైవిధ్యమతి సుచిత ♦ యానంబులపై. 10

కం ఈసర్వాలతో నేమిటఁ, గాసి యరిగెదము పవిత్ర వారిపూర మహో
ల్లాసమునకు శ్రేయస, వాసమునకుఁ బుణ్యపుం బ్ర ♦ భాసమ్మునకున్. 11

ఉ. అచ్చటఁ బశ్చిమాభిముఖ ♦ మై ప్రవహించు సరస్వతీనదీ
ప్రోచ్చలదంబుపూరముల ♦ మొక్కి యథావిధి స్నానసత్క్రియల్
క్రచ్చఱ సల్పి పావనతఁ ♦ గ్రాలి యుపోసము పూని నిష్ఠమై
హృచ్చలనంబు లేక నిఖ ♦ లేశ్వరుఁ గొల్తమనేకభంగులన్. 12

ఉ. ప్రీతిగ దేవతార్చ లొన ♦ రింతము పిమ్మట బ్రహ్మగోత్రులన్
బూతచరిత్రుల న్నిగమ ♦ పుంజపవిత్రులఁ బూజసేసి గో
భూతిల ధర్మచేల మణి ♦ భూషణ సింధుర సైంధవాలయా
ద్యాతత వస్తుదానము ల ♦ నల్పమతిం బొనరింత మచ్చటన్. 13

కం. బావ లట శాంతికర్మ క, లాపమ్ము లొనర్తు రవ్వ ♦ ల నరిష్టమ్ముల్
ప్రాపింపవు మనలఁ, బిదప, గోపూజ లొనర్తము యదు ♦ కుంజరులారా! 14

కం. దేవద్విజ గోపూజల, చే వివిధారిష్టములు న ♦ శించునని ప్రజల్
భావింతురు లెండో మృదు, భావులు! మన మరుగుదము ప్ర ♦ భాసంబునకున్.

వ. అనెడి గరుడగమను నొడువులకు యదుకులభవు లొడఁబడి రంగచ్చతురంగంబులతో వివిధసాధనంబులతో సమస్తవస్తువిస్తారసంధానిత నానానూన యానంబులతో నపార పారావారము నౌకానీకంబుల నుదాత్తచిత్తంబుల నుత్తరించి పవిత్ర ప్రభాసక్షేత్రంబున కరిగి సరగ భక్తియుక్తులై ప్రవర్తిల్లి భగవదాదిష్ట శిష్టవిధానంబున సముచిత కార్యము లనివార్యముగ నాచరించిరి. తదనంతరంబు దైవప్రేరితులై. 16

-* యాదవులు సురాపానముచేసి కలహించి మడియుట *-

ఆ. మాఱుపలుకు వారి ♦ మాఱుకొనుచుఁ గిన్క, మాఱులిచ్చి పెక్కు ♦ మాఱులుగడ
మాగులాదియదుకు ♦ మారులు మైరేయ, మారగించిరిమన ♦ మారనవుడు.

(1) వావిళ్ళప్రతిలో శంఖద్వారం ప్రజంత్వితః అని యుండ బొంబైప్రతిలో "శంఖోద్ధారం" అని కలదు.

క. చిత్తంబులు చాంచల్యా, యత్తంబులు భాషితంబు ♦ లసుహృద్విధి సం
వృత్తంబులు నేత్రంబుల, మొత్తంబులు వహ్నికణచ ♦ యావిత్తంబుల్. 18

వ. కావుటంజేసి యాదవులు సురాపానపారవశ్యంబునఁ దారతమ్యజ్ఞాన
శూన్యులై యన్యోన్యావహాస్య వ్యాహారవ్యాపారంబులకుం దొడంగిరి. 19

క. 'మాధవకమనుండ వగుట, మాధవకమనుండ' వనెదె? ♦ మందా! యనఁగా
'సాధుహాలిప్రియుఁడ వగుట, సాధుహాలిప్రియుఁడ' వంచుఁ ♦ జాటవె నీవున్.

క. అని మొదిరి పొడువ నాతం, డనె నేమాధవకమనుఁడ ♦ నటరా? వెడఁగా!
విను సరిగ నేమధుప్రియుఁ, డను వాఁడో మధువిరోధి ♦ డంబము లేలా? 21

వ. అని యొండొరులు పొసఁగియుఁ బొసఁగని నిలుకడలేని వెఱ్ఱిమాటలతో
వాగ్వాదమున నుపక్రమించి యొక్కెడ విక్రమింప వేఱొక్కయెడ
గుంపులో. 22

సీ. వరుణాత్మజకు నాకుఁ ♦ బట్టి యీరే యనఁ
గాడంబరియె నీకుఁ ♦ గతి యనె నొకఁ
డిప్పపువ్వులకల్లు ♦ నిప్పింపరే యన్న
నారెపువ్వులదె నీ ♦ కనియె నొక్కఁ
డిపక పక్వేక్షుశీ ♦ ధువు నిమ్మన నొకండు
పశుప! నీ కాయూస ♦ వమ్మొయునిదె
గోస్తనీరసము నా ♦ కుం దేరె యన ఖర
జగల పిష్టము గ్రింకఁ ♦ జనుమనె నొకఁ

తే. డేమిరా హాస్యమాడెద ♦ వింతయేని
నన్నెఱుంగవా? యొక గ్రుద్దు ♦ నకె పగుల్పఁ
గలరబమ్మగుడ్డు నన ని ♦ క్కముగ నీవు
గడుసరివె పుల్లెయాకును ♦ బొడువఁగలవు 23

వ. అనుచు నొకళ్లొకళ్లు కవ్వించుకొని యీర్ష్యాగులై యావల దొమ్మికిం
గడంగఁజొచ్చిరి. వేఱొక్క మూకలో 24

క. గిరగిర గిరగిర గిరగిర, దిరిగెద రిదిపలదు కనులు ♦ దిరుగ ననఁగ నొ
క్కరుఁ డతనియుడుగుల నొడిసి, కరములఁ గొని జరజరజర ♦ కడువడిఁ దివియన్

ఆ. ఊరకున్న వాని ♦ నూరకుక్కం బోలె, నోరఁ దిగువ నేమి ♦ నోరఁ బడెర
యోరితులువ! నేన ♦ యోరిమి విడనిన్న, యో! రణమునఁ దినదె! ♦ యోరణమ్ము.

వ. అని యొండొరు లట్టెట్టలు వట్టుకొని రెట్టించుకొని మగతనమ్ములు
క్రమ్మరించుకొనుచుఁ గుమ్మరింపులకుం గ్రమ్మికొని కమ్మలువోవఁ
గుమ్మికొనుచు సొమ్మసిలి యమ్మొయిమ్మడియందొడంగిరి. 27

ఆ. ఇట్లు వెట్టిగొల్ల ♦ లింతలంతలవారు, కొన్ని తావులందుఁ గూలుచుండ
రాచకొలమునందు ♦ రసులుకొని యెవ్వైర, మెప్పుపౌరుషములకు ♦ వృథగఁబోవు

సీ. నీయూర్పు నావయి ♦ నిం బొల్చెనంచు నీ, వృష్టంబుఁజూపె దే! ♦ బేల! యంచు
నీవేల నాక్రేవ ♦ నిగిడింతు చూపంచు, నీమోముఁ బిపాసి ♦ నెగడునంచు
నీపల్లు క్రక్కుచుం ♦ డెను విషమ్మనటంచు, నీనోరు పూతి ♦ గం ♦ ధిలమటంచు
నీనడవడి గర్హ ♦ నీయుంబటంచు నీ, యాలోచనకుఁ గీడె ♦ యవధియంచు

ఆ. తండ్రికొడుకు లన్న ♦ దమ్ములు సేవ్యసే
వకులు పెద్దపిన్న ♦ లకట! యొంతొ
రులు ప్రియాప్తులెల్ల ♦ రుచు నెమ్మదులలోన
నొకరిఁజూచి యొక్క ♦ రోర్వరైరి. 29

వ. అట్టి యిక్కట్టువుట్టి గిట్టనికాలంబున గతమన్యుండైన కృతవర్మ 30

ఉ. నిప్పులురాలఁగా నరుణ ♦ నేత్రములన్ మసిబ్రేల మీసముల్
ద్రిప్పుచు సేన కీశ్వరుఁడ ♦ నేనిటనుండఁగ నాకొకింతయుం
జెప్పక చావసాఁగి రిఁకఁ ♦ జెచ్చెరఁ బిన్నలగొంతు గోయరే
చెప్పితిశిక్ష, నాపలుకు ♦ సేయనివారల శిక్షసేయుఁడున్. 31

కం. అనుచు నెదుటఁగల యక్రూరునిఁ గనుచుం బ్రేల వాఁడు ♦ రోషించి మహా
ధ్వనిగా నవ్వుచు నీయా, జ్ఞను నేనా చేయవలయు ♦ జాల్మఁడ! పశువా! 32

శా. సేనానాథుఁడు మున్న నిద్రితులనా! ♦ చెండాడెఁ జీ! ఛీ! మఱి
చ్చో నేఁడీవిగ తానులం మనుముమం ♦ చుం జెప్పుచున్నాఁడుగా
యానే? యిద్ది పరాక్రమంబె? కృతవ ♦ ర్మా! యీదెసంజూడు మీ
శైనేయుం డటువించునుండఁగనె యీ ♦ శౌర్యప్రలాపంబులా? 33

మ. అనుచో నాయనిరుద్ధుఁ డార్చుచు మహా ♦ త్మా! సాత్యకిప్రౌఢి నే
ము నిరీక్షించుచునుండ లేదటర! మా ♦ భూరిశ్రవుం దాఁకి చే
సిన యాపోరిత, మాధరం దొరఁకు, టా ♦ శ్వేతాశ్వసాహాయ్య మా
యనికిం బాసినవానిఁ జంపుట; మహా ♦ త్మా! సాత్యకీ! దండముల్. 34

మ. అనుచు న్నవ్వుచునుండ లోహితముఖుం ♦ డై లేచి శైనేయుఁ డే
మును విన్నారము బాణుతోడఁ గలహం ♦ బుల్ దాను మున్ జేసి యే
డ్చిన యేడ్పెల్లను, సాంబుఁ డాయదనునం ♦ జేసెం గదుల్ సాయ, మెం
దును విన్నారమె పూలదెబ్బలకె శ ♦ త్రుల్ సచ్చుటల్ మన్మథా! 35

మ. అనఁ బ్రద్యుమ్నుఁడు ప్రోద్యతాయుధకరుం ♦ డై మండి యీపిల్లకా
కిని సాంబుం గదఁబెద్దఁజేసి భళిరే! కీ ♦ ర్తింతు, పేశుంఠ నీ

వుడు లేకుండిన మాకిఁకం గతులు లే ♦ వో! రాజ్యముల్ పోవునో!
అనదా! నోరును మూయఁజేసెద మదీ ♦ య క్రూరఖడ్గాహతిన్. 36

మ. అనఁగా సాంబుఁడు, వృద్ధవంచకము శౌ ♦ ర్యాటోపముల్ కంబరున్
వనితానుప్లవుఁడై వధించుటలు సే ♦ బ న్! మా చెవుల్ సోఁకవో?
యన దంతంబులు ఘట్ఘటంగొఱికి తీ ♦ క్ష్ణాలోకముల్ పర్వఁజే
సి సటద్భ్రూకుటియై ఖరాసిఁ గొని లే ♦ చె న్మారుఁ డుగ్రాకృతిన్. 37

కం. అదిగని సాంబుఁడు కోపో, న్మదితుండై మండలాగ్ర ♦ మండితకరుఁడై
కదిసె నవు డందఱార్చుచు, గదాది సాధనము లూని ♦ కడఁగిరిపోరన్. 38

వ. ఇట్లు దైవచోదితులై పూర్వస్నేహ గౌరవ భక్తివినయ వాత్సల్యాదిభావంబుల నుజ్జగించి బ్రాహ్మణశాపవశంబున జాతమత్సరులై ప్రద్యుమ్నసాంబులు, నక్రూరకృతవర్మలు, ననిరుద్ధసాత్యకులు, సుభద్రసంగ్రామజితులు సుమిత్రసురథులు, [1] సుచారుగదులు ద్వంద్వయుద్ధములకుం జొచ్చి పరస్పరజిగీషామతులై వెనుదీయక పోరిపోరి కొంతవడి కాయుధవిరహితులై వర్ధమానస్పర్థచే నిలుపోవక తత్సముద్రతీరమున నయశ్శిలాకారజంబున నుద్భవించిన కదురుతుంగలం బెరికికొని బాదుకొని మడియసాఁగిరి. అదిచూచి యెసరేగి తదీయులెల్లరు స్వీయపరకీయ భేదశూన్యులై పరశు పట్టిస తోమర భిండివాల గదాద్యాయుధంబులఁ జతురంగసైన్యమ్ముల నఱుమాడుకొనం జొచ్చిరి. పోరు ఘోరాతిఘోరం బయ్యె. ఒకయెడఁ గఠోర కరాళ కరవాల కాలవ్యాలములఁ బ్రతిపక్ష క్షితీశుల ప్రాణవాయుభిక్ష పెట్టువారును, నొండొకకడ విడివడని వడినడువుచుఁ బోటుముట్టుపోటుల పోటులఁ బోటాపోటిఁ బోవు పోటుమగల తలలఁ బోటన బంతులాడువారును, మఱొండొకదండ మహోద్దండులై మండిపడుచుం గాండీవంబుం బురుడించు కోదండదండంబులఁ జండకాండకాండంబులు వఱపి భండనభూమండలంబు రుండమయంబు సేయువారును, మఱియొక్కయిక్క స్వీయవాహిను లుత్సాహాతిశయంబునం బొంగి పటహ కాహళ భేరీ శంఖ ముఖనిర్ఘోషంబుల భూనభోంతరాళంబులం బూరింపఁ బ్రతి వ్యూహంబులు మోహరింపలేక యోహాటిల్లఁ బ్రళయకాండ దండిదండ ప్రచండంబులుంబోని యాత్మీయ బాహుదండంబుల వేదండతండంబుల శుండాకాండంబు లొడిసిపట్టి తిగిచి కదిచి నులిచి విఱిచి వైచువారును, నొకయోరఁ గోరకయే చేరికలైన యేరకలఁ బూని బారులుతీర్చి యూరికలెత్తు నీరసంబునం బోరికిఁ బాఱుతెంచి మోఱకులై పేరులు పేరుకొనుచు

1. సుచారుగదౌ అవి వావిళ్లప్రతిలోనుండ, సుదారుణౌగదౌ. అవి బొంబై ప్రతి. అనఁగాఁ గృష్ణనందనుఁడగు గదుఁడును, గృష్ణభ్రాతయగు గదుఁడును దలపడిరనుట.

మాఱుకొన్న మాఱుతుల వారింపనేరక యూరక దోరువారును, నొక
క్రేవ నవక్ర పరాక్రమంబున వీరచక్రము విక్రమింపఁగా వ్రాలెడితురం
గంబులు, సోలెడి మాతంగంబులు, వ్రీలెడిశతాంగంబులు, దూలెడి
భటాంగంబులు, మ్రొగ్గెడి సామంతులు, గగ్గెడిరేవంతులు, నుఱిగెడిభింది
పాలంబులు, విఱిగెడి శరజాలంబులు, మొక్కవోవు కరవాలంబులు,
నుక్కసెడు శూలంబులునై భయానకరసంబు ప్రబ్బుకొని ప్రవహించుచున్న
ట్లున్న నెత్తుటేర్లకుం గూలంబులు గూలిన మత్తశుండాలమ్ములు వాలు
గలు వాలువాలుగములు శైవాలమ్ములు కృత్తపదాతిశిరోజజాలమ్ములు
మృణాళమ్ము లాంత్రనాళమ్ములుగాఁ జెలంగె. 39

కం. అవనిప! యేమనఁ జతురం,గ విశిష్టబలమ్ము నంధ ♦ క మధు దశార్హో
ద్భవ సాత్వతాదియుత యా,దవవార్నిధి గోష్పదీకృ ♦ తంబయ్యెఁ గదే. 40

వ. హతశేషులు [1]భిషదోల్ముకాదులు సహస్రజిచ్ఛతజిద్భానుముఖ్యులు
మదాంధకారితులై ముకుందవిమోహితులై యొకళ్ళొకళ్ళ నిర్గ్రంథితృణ
విశేషమ్ము వెఱికికొని మోదుకొనుచుం జచ్చిరి. మఱియు సందందుఁ
జెదరి బ్రదికియున్న దాశార్హ వృష్ణ్యంధక భోజ సాత్వత మధువంశవీరు
లును నర్బుద మాథుర శూరసేన [2]వితర్జన కుకుర కుంతి మద్రాది దేశ
భవులును సౌహృదంబు లుజ్జగించి పెనంగి తెగంగలం బ్రుంగిరి. 41

తే. సుతులు తండ్రులతో భ్రాతృ ♦ వితతితోడ
మాతుల పితృవ్య దుహితృ సం ♦ భవులతోడఁ
బెనఁగి చంపి చచ్చిరి మఱి ♦ యనుఁగులనుఁగు
లాప్తులాప్తులు పోరి నీ ♦ జైరినూవె. 42

కం. ఏరకముగనో హృదయవి,దారకముగ వచ్చిపడిన ♦ తన్మునిశాప
మ్మేరకలై యదువంశకు,మారక వర్గ మిటుసేసె ♦ మారణ మధిపా! 43

కం. అట్టియెడ నల్గురెనుగు.రుట్టిపడిరి కేలఁ దుంగ ♦ నొడ్డు చొడళ్ళం
దుట్టఁగ నెత్తుకు బలుపై,కట్టలవుంగినుకఁ గృష్ణుఁ ♦ డేత్తెఱ నద్దా. 44

తే. అప్పు డయ్యాతతాయుల ♦ చొప్పునరసి
రామకృష్ణులు సంభృతులై ♦ రకులగుచును
వారిఁజంపి రిట్లుడఁగె శా ♦ వమునవంశ
మతుల దావాగ్ని వెదుళ్ళ ♦ యడవివోలె. 45

(1) భిషదోల్ముకాదయః అని వావిళ్ల ప్రతి. నిశఠోల్ముకాదయః అని బొంబై ప్రతి. (2) విస
ర్జనాః కుకురాః కుంతయశ్చ మిథ స్తత స్తేధ విసృజ్య సౌహృదం అని బొంబై. వితర్జనా వై
కుకురాః కుంతయశ్చ మద్రాశ్చజఘ్నుః పరిహృత్య సౌహృదం అని వావిళ్ళ ప్రతి.

తే. అస్మదీయ వంశంబెల్ల ♦ నణఁగె నింక
నేను వచ్చిన కార్యంబ ♦ దెల్లఁదీఱె
భూమిభారంబుఁ దీర్చితిఁ ♦ బో యటంచు
నెంచె శ్రీకృష్ణభగవాను ♦ డెడఁదయందు. 46

—♦ రామకృష్ణుల యంత్యదశ ♦—

వ. అంత, 47

కం. రాముండు వృష్ణికులసు, త్రాముం డుర్వపలభాభి ♦ రాముం డాత్మా
రాముండు నిశ్చలుండై, భూమిఁ దనువు విడిచె యోగ ♦ మున గడలిదరిన్.

ఆ. అన్న పుడమివిడిచి ♦ చన్నది చూచి స, హిష్ణువైన కృష్ణుఁ ♦ డేమిచేయ
కచటు వాసిపొక్క ♦ యశ్వత్థ తరుమూల, మందుఁగూరుచుండె ♦ నవనిమీఁద.

కం. అత్తఱి స్వామికి నలుఁగే లొత్తుకొనుచు నుండె ధగధ ♦ గోజ్జ్వల దేహో
ద్యత్తతకాంతు లధూమో, పాత్తాగ్ని వలెం దమిస్ర ♦ మణఁచుచునుండెన్

ఉ. ఆ సమయంబునందు మృగ ♦ యారతుఁడై జర నామ లుబ్ధకా
గ్రేసరుఁ డమ్మహాటవిని ♦ గింగిరిచేఁతల సంచరించుచున్
గాసిలి సాంద్రవేతస ని ♦ కార నికుంజ వృతంబు బోధి నా
సాసలఁ జూచెఁ గొండొక ర ♦ హస్య తలంబుననుండి దవ్వుగన్. 51

ఉ. వాఁ డటుసూచు నప్డు భగ ♦ వానుఁడు దక్షిణజాను కోటిక
న్వేదుక వామపాదమును ♦ నిల్పి కదల్చుచునుండ నేసె వా
ట్లేఁడు మృగాస్యబుద్ధిని బ ♦ టిష్ఠముఁ దన్ముసలావశేషము
న్వాడిఫలంబుగా నిడిన ♦ బాణము నెక్కిడి హంజనూటిగన్. 52

కం. ఏసిన శరంబు రుయ్యున, డాసి పడిం గ్రుచ్చుకొనె న ♦ డమచరణంబున్
దాసాభయ శరణంబున్, వాసవశరణంబు దైత్య ♦ పతిహరణంబున్ 53

ఆ. కృష్ణుపాదమేమి? ♦ మృగయుండు మృగముఖం
బంచుఁ దలఁచుటేమి? ♦ యతనికడన
ముసలఖండ బాణ ♦ ము తనర్చుటేమి? యె
వ్వాఁడు విధిని దాఁట ♦ వలఁతిసెవుమ! 54

—✻ వ్యాధుఁడు కృష్ణుడాసి ప్రార్థించుట ✻—

ఉ. ఇట్టులు బాణమేసి పరు ♦ వెత్తుచుఁ జెంతకువచ్చి కృష్ణుపై
న్బొట్టనవ్రేల నాటుకొని ♦ పోల్చు శరంబుఁగాంచి మోమునం
దొట్టఁగ దీనతాగరిమ ♦ తొట్రుపడం బదముల్ శరీరమం
దిట్టలమైన స్వేదముద ♦ యింపఁగ మ్రాన్పడి నిల్చె నివ్వెఱన్. 55

చం. నిలిచి యొకింతసేపటికి ♦ నెమ్మదిలో దిటవూని చూడఁగా
విలసిత పీతచేల పరి ♦ వీత సుమంగళవిగ్రహంబు ప్రో
జ్జ్వల కటిసూత్ర నూపుర ల ♦ సత్కటకాంగద రత్నహార కుం
డల మకుటాది భూషణ గ ♦ ణాన్వితుఁ డనుగ్రహ చక్షులంబడెన్. 56

శా. శ్రీవత్సాంకము కౌస్తుభం బురమునం ♦ జెన్నొంద, నీలాభ్రభా
లావణ్యంబులు తప్తహాటక రుచుల్ ♦ మైఁజెంద, శ్రీవైజయం
తీ వాహ్యాళులు వక్షిఁజెంద, స్మితకాం ♦ తివ్రాత మాస్యంబునన్
మోవుల్ వొంద వినీలకుంతల చయం ♦ బుల్ మౌళిఁ జెల్వొందఁగన్. 57

తే. ఆయుధంబు లాకారంబు ♦ లవధరించి
కొలుచుచుండ నుల్లసిలు ము ♦ కుందు నంబు
జాయతాక్షు నిరీక్షించి ♦ యప్పళిందుఁ
డడుగులం జాఁగిలంబడి ♦ వడఁకుచనియె. 58

శా. దేవా! మూర్ఖుఁడ! పాతకుండను మహాం ♦ ధీభూత చేతస్కుఁడన్
గావంగానలెఁ దప్పుచేసితిని న ♦ జ్ఞానుండనై మత్కృతాం
హో వారాన్నిధి కంతు లేదు శరణం ♦ బో పుండరీకాక్ష! నా
భావంబందు మృగాస్యమంచుఁ బదముం ♦ భావించి యుల్లేసితిన్. 59

ఉ. నీనిజరూపముం దెలియ ♦ నేరక జాదులె మోసపోవఁగా
హీనకులుండ విద్యల గ్ర ♦ హింపని వాఁడను నీచవృత్తి న
జ్ఞానుఁడ నేనకే యెఱుఁగఁ ♦ జాలెడి వాఁడ క్షమింపు మోదయాం
భోనిధి! యోమహానుగుణ ♦ పుష్కలశేవధి! యోసుఖావధీ! 60

కం. ఎవ్వని యనుస్మరణమున,దవ్వుల కజ్ఞానతిమిర ♦ తతి చనియెడి నా
పువ్విలుకాని జనకునకుఁ,గ్రొవ్వున నపకృతి యొనర్చి ♦ కూళుఁడనైతిన్. 61

ఉ. ఇంతటి పాతకుండ వసి ♦ యింపఁగరా దికభూమి నుండినన్
వంతువు లెన్ని చేసెదనో ♦ మాన్యుల, కట్లగుటన్ రమాసతీ
కాంత! భవత్కుఠారమున ♦ ఖండనముం బొనరింపు మచ్చిరో
వృంతము సాధుకోటి సుఖ ♦ యించును నే ననఘుండ నయ్యెదన్. 62

ఉ. తావక మాత్మయోగ రచి ♦ తంబు సురేశ మహేశ ముఖ్యభా
షావరులుం ద్వదీయ పృథు ♦ శక్తి తిరోహితదృష్టులై కనం
బోవ రటన్న మాదృశులు ♦ మూర్ఖులు పాపులు యుష్మదీయ మా
యా విభవం బెఱుంగఁగల ♦ రా! యపరాధి క్షమింపు మీశ్వరా! 63

కం. వేద ద్రష్టలయిన సనకాది మహామునులు గూడ ♦ నవతార రహ
స్యోదయము లెఱుఁగలేరుగ, దే! దేవా! నాకు శక్య ♦ మే యెఱుఁగంగన్. 64

ఉ. ఎందుల కీజగంబు జని ♦ యింపఁగ జేసెదొ? యెందుకోసమై
మ్రింపఁగ జేసెదో? శ్రుతి స ♦ మాజము గూడ వచింపఁజాల దం
చుం దమభక్తులందు, రిది ♦ చోద్యముగాఁ గనుపట్టు మాకు నీ
చంద మెఱుంగ మాదృశులు ♦ చాలుదురయ్య? దయాపయోనిధీ! 65

కం. అట్టి పరేశుఁడవగు నీ కిట్టులు చెట్ట ఘటియించి ♦ యేఁజెడితిఁగదే
కట్టా! యెట్టులుగాతువొ?, పట్టితి నీపాదములను ♦ భరియింపుహరీ! 66

సీ. ద్విజులల్లు శాకముల్ ♦ భుజియింపఁబోక మాం
సాహారమున కేల ♦ యంటుపడితిఁ
బడితిఁబో యొరులు తె ♦ చ్చిడిది గైకొనక సొం
తముగ నేల గడింపఁ ♦ దారుచుంటి
నుంటిఁబో ఘోరస ♦ త్త్వోగ్రాటవికిఁ బోక
వేలాతటుల నేల ♦ క్రాలఁగంటిఁ
గంటిఁబో నరుఁడో? మృ ♦ గంబో యెఱుంగక
వడిగ నేల శరంబు ♦ విడుచుకొంటి

తే. కొంటిఁబో తండ్రిప్రాణాలు ♦ గొంకులేక
యుంటెఁబో యంతులేని పా ♦ పౌఘమెల్ల
కొంటె బోయండు మీసేవ ♦ కుం డటంచు
నంటిఁబో స్వామి! యెట్లున ♦ న్నాదరింతొ? 67

ఉ. ఈ వవనిం దొఱంగి చన ♦ నెంచితివట్టె? నిమిత్తమాత్రునిం
గా విధియించినాఁడ వొక ♦ కష్టుని దుష్టుని నేరి తెచ్చి తం
డ్రీ! పశమాన యీకటికి ♦ నిందకు మోయఁగ! మందిలోని కేఁ
బోవఁ దలెత్తికొంచు నను ♦ ముంచినఁ దేల్చిన నిన్నునమ్మితిన్. 68

ఆ. మాయగప్పి బాణ ♦ మేయింపఁజేసితే?, బోయనొక్క పెద్ద ♦ జేయ నెంచి
కాదయేని యొక్క ♦ కట్టెదెబ్బకె యీశ్వ, రేశ్వరుండ! ప్రాణ ♦ మెట్లువిడుతు?

కం. ఈపాడుపొట్టకొఱకై యీపాడు పనుల్ పొనర్చు ♦ చీకటి నెన్నో
పాపంబులు చేసితి న,య్యో! పాపాత్ముండ నేది ♦ యోగతి? నాకిఁక 70

కం. పారంబులేదుగదె యీ, క్రూరాఘంబున కిఁకెన్ని ♦ కోట్లభవంబుల్
గూరునొ? యేమిగుడుతునో?, యేరీతిగ జరుగునో! హ ♦ రీ! గోవిందా!

కం. తెలిసియొ? తెలియకొ యెన్నియొ, కలుషంబులొనర్చినాఁడఁ ♦ గట్టికుడిపెదో?
పాలియించెదొ? నేనీయం, ఘ్రులఁబట్టితి శరణుశరణు ♦ గోవింద! హరీ! 72

వ. అని సాశ్రుముఖుండై గడగడ వడఁకుచు ముకుందుపాదంబుల వ్రాలి లేవ
కున్న నాగోవిందుండు మందస్మిత వదనారవిందుండై యిట్లనియె. 73

చం. వలదు భయమ్ము లెమ్ము జర ! ♦ వ్యాధపతీ ! యపరాధమేమియుం
గలుఁగ లేదునీ విటులు ♦ సర్వము కావుట కేన యాత్మలోఁ
దలఁచితి నట్టులే జరిగె ♦ దానికి నీవగ పేల ! నీవు పు
ణ్యులకగు స్వర్గలోకమున ♦ కొయ్యఁబొమ్మ యనుజ్ఞయిచ్చితిన్. 74

వ. అని శుద్ధసత్త్వమయి యగు నిజశ్రీమూర్తి నంతర్ధానం బొనరించి తత్ప్రతి
కృతిచే విడంబించు జనార్దనుం డానతీయఁగా, 75

చం ఎఱు కతిహర్ష సంభరిత ♦ హృత్కమలుండయి యాత్మఁబుట్టఁగా
నెఱుక, శరంబు మోడ్చి వనజేక్షణుఁ జుట్టుచు మాఁటిమాఁటి ల
త్తఱి నట కేగుదెంచిన యు ♦ దాత్త విమానము నెక్కిపోయె ని
ర్జరభువి కెందునుంగలదొ ! ♦ చంపినవానికి స్వర్గమిచ్చుటల్ ! 76

* దారుకుండు శ్రీకృష్ణ దర్శనార్థ మరుదెంచుట *

వ. అంత, 77

ఉ. వారిజనాభుఁ డెయ్యెడల ♦ వర్తిలుచుండెనో ! యంచుఁ దన్నిరీ
క్షారతి దారుకుండు రథ ♦ సంయుతుఁడై జలరాశితీరమం
దారయ చేగుచో నభిము ♦ ఖాగత తత్తులసీపరీమళో
దార సమీర యోగమునఁ ♦ దావు నెఱింగి ముకుందుడాయుచున్ 78

చం. అరదముదూఁకి దవ్వుల, ర ♦ యంబునఁ బర్విడివచ్చి యశ్రుసం
భరిత విలోచనుండగుచు ♦ స్వాంతము స్నేహరసాప్లుతంబుగాఁ,
దరువర మూలసీమను సు ♦ దర్శన ముఖ్య నిజాయుధోత్కరో
ద్ధురుఁడయి పొల్చు కృష్ణుపద ♦ తోయజముల్ శిరసంటమ్రొక్కుచున్ 79

చం. కమలదళాక్ష ! నీపదయు ♦ గంబును గానమి నస్మదీయ నే
త్రములకుఁ జూడ్కియారెఁ, దిమి ♦ రం బటుమీఱె, మనంబునం బ్రమో
దము దిగజాఱె దిగ్భ్రమము ♦ దారె నభోనిశియందు నావ సం
భ్రమునను బద్దలైన నరు ♦ తెమ్మఁడ నైతి దయాపయోనిధీ ! 80

తే. అనుచు దారుకుం డనుచున్న ♦ యంతలోన
శైబ్య సుగ్రీవ మేఘపు ♦ ష్పక వలాహ
కాశ్వయుక్తమ్ము గరుడధ్వ ♦ జాంచితమ్ము
కృష్ణుదివ్యరథమ్ము మి ♦ న్నెగసిపోయె. 81

తే. దాని వెనువెన్క శ్రీభగ ♦ వాను నాయు
ధమ్ములెల్ల రివ్వున నాక ♦ సమ్మువట్టి
చనియె నదిమొల్ల నూతుండు ♦ కనులువాల్ప
కట్టె నివ్వెఱపడి చూచు ♦ నవసరమున 82

వ. శ్రీకృష్ణుండు దారుకుం జూచి యిట్లనియె. 83

చం. చనుమిఁక నీవు ద్వారకకుఁ ♦ జయ్యన, నక్కడ బంధువర్గముల్
గని వచియింపు మిందయిన ♦ జ్ఞాతి పరస్పర మారణక్రమం
బును బలరామదేవు చను ♦ పోఁబడి నాదగు నీదశల్ గనం
గొఁకతివిగా రథాదులును ♦ గూడ దివిం బఱచెన్ రయంబునన్. 84

వ. దారుకా! యావల ద్వారకం జేరియున్న మనవారి కీనాసందేశము విన్పింపుము. 85

శా. ఆభీరాగ్రణులార! మీరలిఁక దా ♦ రాపత్య మిత్రాప్తను
శ్రీభద్రేభ హయాది యుక్తులయి కూ ♦ ర్మిన్ ద్వారక న్నిల్వరా,
దీభూమిం ద్యజియించి నేనరుగ న ♦ బ్ధీంద్రుండు కల్లోలమా
లాభీలుండయి పొంగి పట్టణము నం ♦ బ్వాక్రాంతముం జేసెడిన్. 86

కం. చంద్రాన్వయులారా! ని,స్తంద్రత మీ సర్వముగొని ♦ దారాదులతో
నింద్రప్రస్థమున కరిగి, యింద్రజప్రోవునను బ్రదుకుఁ ♦ డీ! మతియుతులై.

వ. ఇట్లు ప్రజలకు నామాటలుగాఁజెప్పి ద్వారకావాసులనెల్లం దోడ్కొని పొమ్మని యర్జునునితోడను నేఁజెప్పితినని చెప్పుము. ఇఁక దారుకా! నీదారియిది. 88

తే. అస్మదీయ మాయాకృతం ♦ బంచు విశ్వ
మఖిలమం దుదాసీనుండ ♦ వగుచు జ్ఞాన
నిష్ఠతోడ మద్ధర్మమం ♦ దికొని మెలఁగ
దారుకా! యుపశాంతి నొం ♦ దఁగలవయ్య. 89

కం. ఈ మాయాకృత తనువున, కై మిక్కిలి వగతువేమి ♦ కా! జ్ఞానగతి
న్నీ మానసంబుఁ ద్రిప్పుము, నామాటలబడి చరించి ♦ నన్ శ్రేయముగున్.

కం. ఈ రీతిఁ గృష్ణుఁడాడఁగ, దారుకుఁడు ప్రదక్షిణించి ♦ తతభక్తి నమ
స్కారము సాష్టాంగముగా, సారెకు సలుఁపుచును దనివి ♦ సనక యెడందన్

కం. శ్రీరమణపావనాంఘ్రుల, మూరుకొని స్వమూర్ధమందు ♦ మోపుకొని ధృతిం
గూరి మొకెట్టులో చనియెన్, ద్వారకకు న్వెనుకకీక్షు ♦ పాదంబులతో. 92

వ. అని శ్రీశుకయోగీంద్రుండు పలికె 93

ఇది త్రింశాధ్యాయము సమాప్తము

కం, వినుకలినేఁ గనుకలినేఁ,దనువిట్లుండుననియెఱిఁగి ♦ ధ్యానముచే దా
నినిజూచుచు మ్రొక్కకొనెద, మనవరతముభక్తితోడ ♦ హరిహరనాథా!

## ఏకత్రింశాధ్యాయము

కం. పరిమితమగు తనువునకే, యజగోజలును రాకపోక, ♦ లఖిలమ్మౌదుం
బరివృత్తిగ వెలిఁగెడి నీ, కరమునికలు గలవటయ్య? ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపు మంత శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె రాజేంద్రా! వినుము. దారుకుండు చన్నపిదప గోవిందు నవతారసమాప్తి లీలాసందర్శనాభిలాషంజేసి సురజ్యేష్ఠుండును భవానీసహితుండై భవుండును మహేంద్రప్రముఖ నిర్జరులును సనకాదిమునీంద్రులును భృగుప్రముఖ ప్రజాపతులును విశ్వ సిద్ధ సాధ్య గరుడ గంధర్వ కిన్నర కింపురుష విద్యాధర మహోరగ చారణ యక్ష రక్షోప్సరోగణంబులును జనుదెంచి 2

*- కృష్ణావతారసమాప్తి *-

తే. ఆకసమున విమానమ్ము ♦ లందు నిలిచి
శౌరి జన్మకర్మకథాళి ♦ సంతసమునఁ
బాడుచుం బొగడుచుఁ బువ్వు ♦ వర్షములను
గురిసి రమితభక్తి శ్రద్ధ ♦ లిరవుకొనఁగ 3

వ. అప్పు డచ్యుతుండు 4

ఉ. అంబుజగర్భ ముఖ్యులగు ♦ నాత్మవిభూతుల సాదరార్ద్ర దృ
ష్టిం బరికించి తన్నుఁ దమ ♦ సీమలకుం గొనిపోవ నెంచి రే
నింబుగ వీరల న్మొఱఁగి ♦ యేగుట యుక్త మటంచు నెంచి తో
గంబున నాత్మనాత్మయొదుఁ ♦ గ౯ ముకుళించెను నేత్రపద్మముల్. 5

తే. [2] యోగివరులు స్వచ్ఛందమృ ♦ త్యువులు తమశ
రీర మాగ్నేయి యగుయోగ ♦ ధారణ౯ ద
హించి చనుచుండు రట్లుగా ♦ కిందిరామ
నోహరుం డొండుప్రోవఁబో ♦ నూహ మొందె. 6

తే. ధారణాధ్యానములకు నః ♦ ద్యచ్ఛుభాశ్ర
యంబు లోకాభిరామంబు ♦ శ్యామలంబు
నైన నిజవిగ్రహంబుతో ♦ నరిగె నాత్మ
ధామమునకు వైకుంఠాభి ♦ ధానమునకు. 7

1. అధ్యాయప్రారంభము 6-10-1946

2. యోగధారణయాగ్నేయ్యాదగ్ధ్వాధామావిశత్స్వకమ్ ఇచట దగ్ధ్వా అని కొందఱు అదగ్ధ్వా అని మఱికొందఱు గ్రహించెదరు.

శా. వక్షిక్ష్మాతనుఁ డాత్మయోగజ బృహ ♦ ద్ధ్యానోజ్జ్వల జ్వాలికా
ప్రక్షేపంబుల ముందఁడాయెను శరీ ♦ రంబుల్, సమస్తప్రపం
చాక్షిప్రీణనశాలి సుందరత పా ♦ డైపోవునం చెంచెనో?
కుక్షిస్థాఖిల లోకసంతతికి నె ♦ గ్గుల్ గల్గునం చెంచెనో! 8

తే. అపుడు దివి దుందుభులు మ్రోగె ♦ నంబరమున
నుండి పువ్వులు వర్షించె ♦ నుత్కటముగ
భూమినుండి సత్యము ధర్మ ♦ మును యశంబు
ధృతియు శ్రీయు నాతనిబడి ♦ యేగెనధిప! 9

కం. అచటం బ్రహ్మాదులు చూచుచునుండియుఁ గృష్ణుఁ డేగు ♦ చొప్పుఁ దెలియరై
రచిరద్యుతి యభ్రంబువిడిచి పోవుట వశమె యెన్న ♦ టికి దెలియంగన్.

తే. బ్రహ్మరుద్రాదులు ముకుంద ♦ పరమయోగ
గతికి నత్యంత విస్మయా ♦ కలితహృదయు
లగుచు నాతని వేనోళ్ళఁ ♦ బొగడుకొనుచు
నరిగి రాత్మమందిరముల ♦ కనఘచరిత! 11

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుండు బాష్పాకులితనేత్రుండై స్వామీ! శ్రీకృ
ష్ణుండును ధరణిపైఁ దన దేహము స్థిరముగా నిలువలేకపోయెనే! యనవుడు
శ్రీ శుకయోగీంద్రుం డిట్లనియె. 12

మ. జననంబు న్మరణంబు నీశ్వరునకు ♦ న్సత్యంబె? మాయావిడం
బన మీయెల్ల, నటుండు వేషములతో ♦ వర్తించుచందంబ నూ
తనరం జేయు జగత్సమూహముల, నం ♦ తర్యామియై చొచ్చు, నా
వెనుకన్ సర్వము సంహరించి, వెలుఁగున్ ♦ విశ్వేశుఁ డేకాకియై. 13

వ. అదియునుంగాక మహీనాథా! లౌకికదృష్టిం జూచినను, 14

కం. మూఁడుజగము లనుగృహములఁ, గ్రీడించెడివాని కొక్క ♦ క్షితియే సతమా!
వేడుక నితరగృహంబులఁ, జూడంగాఁ జనిన శక్తిశూన్యత ♦ యగునే? 15

సీ. మానవదేహంబు ♦ తోన సంయమికిఁ
జని గురుపుత్త్రుఁ దె ♦ చ్చిన ఘనుండు
బ్రహ్మాస్త్రవహ్నిచేఁ ♦ గ్రాఁగిన నిను మాతృ
కుక్షిఁ గాచిన దయా ♦ కోవిదుండు
అంతకాంతకుఁడైన ♦ హరునితోఁ బోరి జ
యశ్రీలఁ గొన్న మ ♦ హానుభావుఁ
డాభీర గోతతి ♦ నటుమున్నయట్ల సే
సి విరించిఁ గలఁచిన చేవకాఁడు

తే. వ్యాధనాథుని మేనితోఁ ♦ స్వర్గమునకుఁ
గరుణ దోల్కొనఁ బంపిన ♦ వరగుణుండు
కావలయునన్న దేహంబుఁ ♦ గాచికొనఁగ
లేఁడె? జగమున నీగతి ♦ నాడెఁగాక. 16

ఉ. తాన యశేషశక్తులను ♦ దాల్చినవాఁడు జగత్సమూహముం
దాన సృజించి పెంచు మఱి ♦ తాన లయంబొనరించు నన్యమిం
కైనను దోడు కన్పడద ♦ యట్టి మహామహిముండు భూపతీ!
మానవదేహము న్నిలుపు ♦ మాత్రకుఁ జాలఁడె? శంక యేటికిన్! 17

చం. అదియునుగాక, యాత్మరతు ♦ లంగముఁ జూతురె? మర్త్యదేహముం
మది భగవానుఁడే నిలువ, ♦ మాన్యులు యోగులు దేహసిద్ధియే
తుదిఫలమంచు నెంచి సుగ ♦ తుల్ గనఁబోవరుగాదె? కాన శ్రీ
సదనుఁడు చూపె [1]స్వాత్మగతి ♦ సర్వుల కిట్లు నృపాలశేఖరా! 18

కం. తా నరుదెంచిన కార్యం, బైనది గనుక నిఁక మాన ♦ వాంగము నిలువం
గానేల ధరణి నంచున్, శ్రీనారాయణుఁడు స్వగతిఁ ♦ జెందె నరేంద్రా! 19

ఆ. తన్నుఁ జూచి యొరులు ♦ తా మట్లుచరియింపఁ
గాదె? శౌరి నాట ♦ కంబునాడె
కానియెడల లోక ♦ కర్తకు భర్తకు
జన్మకర్మము లెటు ♦ సంభవించు. 20

కం. ఏత త్కృష్ణోత్క్రమణము, ప్రాతఃకాలమున లేచి ♦ ప్రయతాత్ముండై
ప్రీతి ననుదినము దలఁచెడి, యాతఁడు సద్గతిని బొందు ♦ నవనీనాథా! 21

-♦ దారుకుండు యాదవులచేటు వసుదేవాదులకుం జెప్పుట ♦-

వ. అంతనక్కడఁ గృష్ణవిచ్యుతుండైన దారుకుండు విన్నఁబోయిన మొగ
మ్ముతోఁ గ్లిద్దుచ్చుకొనుచు ద్వారక కరిగి వసుదేవోగ్రసేనుల పాదమ్ముల
వ్రాలి కన్నీటితోఁ గడుగుచుండ వసుదేవుం డిట్లనియె 22

కం. కన్నులు వాయఁగ నేడ్చుచు, నున్నాఁడ విదేమి? చెప్పు ♦ మో దారుక! మా
కన్నయ్య కృష్ణుఁ డెచ్చట, నున్నాఁ, డాతండు సుఖియె? ♦ యోయి తెలుపుమా!

కం. ఇంచించుక చెవులఁబడెడిఁ, గించుఁదనముతోడఁ ద్రాగి ♦ కెడసిరఁట సము
ద్రాంచలమున మనవారలు, కొంచక నాతండ్రి కేమి ♦ గోడడరదుగా. 24

వ. అనుచుండ నుగ్రసేనుండును నెలుంగు రాల్పడ దారుకా! 25

(1) స్వాత్మగతిం ప్రదర్శయన్ అని వావిళ్ళ; స్వస్థగతిం అని బొంబై.

కం. మనవారలకును సేమమ, యనవుడు దారుకుఁడు సెప్పె ♦ యాదవనాశ
మ్మును నానుపూర్వ్యముగ దా,నిని విని ముదుసల్లు ధారు ♦ ణిం బడిరధిపా !
కం. జలముపయి తైలముంబలెఁ, బొలసెను దద్వార్త నగర ♦ మున నిముసములో
గలగల నింగికెగసె నే, డ్పుల యులి వఖిలోదవసిత ♦ ములనుండి వశీ. 27
వ. అంతం గొంతవడికి వృద్ధులగు వసుదేవోగ్రసేనులు లబ్ధసంజ్ఞులై యొండొరుల యూఁతగొని దురపిల్లి రపుడు వసుదేవుండు. 28
కం. బెడిదవుఁ బిడుగులవడుపునఁ, బడినవి నాచెవులఁ బొడు ♦ వార్తలయిన నా
యెడఁద వలువఱియలయి పోడ,వడఁగద! యిదియౌయియాకిమ ♦ హావజ్రంబా?
కం. దారుక ! యేమంటివి ? యేడీ రాముఁడు? లేఁడెకృష్ణుఁ? ♦ డేగెన? అయ్యో!
నారాయణ! నారాయణ !, నారాయణ! యెంతమాట ♦ నానోర్వడలేఁ.
వ. అని వగఁ గూయుచుండ దేవకీరోహిణ్యాది వృద్ధమాతృజనంబులు రుక్మిణీరేవత్యాది వధూజనంబులు మఱియు రత్యాదిస్త్రీజనంబులుం బ్రోవై గొల్లున నేడ్చుచు నొకళ్లొకళ్ళపై నొఱగుచు మూర్ఛిల్లుచుఁ దేఱుచు నతికరుణంబుగా విలపించుచుండ నంతకుమున్న వార్త తెలిసి సత్వరంబుగా నర్జునుం డరుదెంచి వారల కించుక సమీపంబున రథంబు దిగి నేలంబడి రోదించుచుండం గట్టా! యద్దెసం జూడ్కి వఱవ రిపునకైన గుండియ నీఱుగాదే! అంతం గొంతసేపటికిం దారుకుం డక్కిరీటిం దేర్ప నతండు దేవకీవసుదేవాదులం డగ్గఱి యేమేని పల్కఁబూనియు నోట మాటరాక డగ్గుత్తికవడుచుండ నవ్వాడు వసుదేవుండు కిరీటింజూచి మూర్ఛిల్లి కొండొక తడవునకుఁ దెప్పిరిల్లి. 31
కం. నాయన! యర్జున! వింటివ, నా! యనద నయితిని మునిఁగి ♦ నది కొంపయయో !
నాయనఁగుబిడ్డ లరిగిరి, నా యనువాఁ డొకఁడు లేఁడ ♦ నాకిఁకఁబుడమిఁ 32
ఉ. ఇంతటి పాపకాల మెట ♦ నేఁ గలదే! సురకోటి నేని ని
ర్జింతు, రొకళ్లొక ళ్ళిటులు ♦ చేడ్పడిరే యొకఁడేనిదక్క, కీ
వింతల వింటిమే? విజయ! ♦ వీఁగలు దివ్యతరాస్త్రవేదు ల
త్యంతము ద్రుంగిరంట యక ♦ టా! కొఱమాలిన తుంగగడ్డిచే. 33
కం. అన మామా! యిది యీరీతిని జరుగ న్విధిదలంచెఁ ♦ దేఁకువగొను త
ప్పున బ్రాహ్మణోక్తి! హాహో,యిన లాభము లేదు పోద ♦ మే యటునూడఁ.

—♦ దేవకీమరణము ♦—

వ. అని యందఱం గదలించుకొని దారుకుండు తెరువుసూప నుచితగతిం బొలికలని కరిగి రందు స్త్రీజన మ్మొక్కపెట్టి రోదనమ్ముసేయుచుం దమ తమవారి శవమ్ములం గుర్తుపట్టి పైఁబడి వివిధవిధంబులం బనవివనవి శోకింపం దొడంగి రందు దేవకి, 35

ఆ. నాదునోముపంట ♦ నాకన్నతండ్రి నా, కంటివెలుఁగు నాసు ♦ ఖాలయిక్క
నాకుమారకుండు ♦ నాముద్దులయ్య నా, చిన్నికృష్ణుఁ డేడి! చెప్పరయ్య! 36

కం. మున్నుగ నాముద్దులదొర, నన్నుం దిగనాడిపోయె ♦ నా! యిది వినియుం
గన్నీటికోడ బ్రదుకుట, కన్న న్నేనేమిచేయు ♦ నది లేదొగదే! 37

ఉ. ఎంత యదృష్టహీనఁ బసి ♦ కృష్ణుని యాటలు ముద్దుముచ్చటల్
సంతసమందు చప్పు కసఁ ♦ జాలకపోయితిఁ, గాలుద్రొక్కి యొ
క్కింతగ నిల్వరించుకొన ♦ నిష్టిబులయ్యొ నిదెంతవారికో
సంతులచేఁ దిలాంజలులు ♦ స్వస్థితిఁ జెంది గ్రహింపఁగల్గుటల్. 38

ఆ. పుత్త్రశోకమునను ♦ బొగులుమనుచు నంబు
జాసనుండు నుదుట ♦ వ్రాసినాఁడు
పోయిపోయి యొక్క ♦ బుడుత నల్వ మొఱంగి
బ్రదికె ననుకొనంగ ♦ వాఁడుఁ జెల్లె. 39

ఉ. క్రూరులు నందనుల్ తమకు ♦ గోఁతులఁ ద్రవ్వకొనంగఁ దామె గాం
ధారి యదేల పేరలుక ♦ నాకొడుకుం జెడఁద్రిట్టె, నంతలో
నోరును మూయ కీయదు త ♦ నూజుల నెల్లను జావఁదిట్టె నా
యూరును బేసమాపె విధి ♦ యింగసఁ డేటికి న్యాయమక్కటా! 40

వ. అని యప్పెద్ద ముదుసలియవ్వ వెక్కి వెక్కి యేడ్చుచుం బుడమింబడ
నక్కొఱపాన మెడలిచనిన దెవ్వరు నెఱుఁగరైరి. వసుదేవుండు విజయు
బుజమ్ము నూఁతగొని గళితాశ్రుకపోలుం డగుచు 41

—♦ వసుదేవ మరణము ♦—

జలధరమ్మవృత్తము. ఆమెడ నాంబికేయుఁడు శ ♦ తాధికపు
త్రాయత సౌఖ్యసంపదల ♦ నందెకున
ట్లీయెడ నేను నుంటినని ♦ యెంచితి న
య్యో! యటు శోకముం బొలసె ♦ నో సమప్పై. 42

కం. కలఁడటు యంతటి ప్రజ్ఞా, బలుఁ డన్యాసాధ్యకార్య ♦ వర్గము లెన్నే
సలిపె, నతఁడు నాకొడుకని, పలుకుట కెంతేని గర్వ ♦ పడుచుందు నెదన్. 43

కం. మృతులగువారిఁ బునర్జీ, వితులుగఁ జేయఁగల వారి ♦ వింటిమె? పార్థా!
అతిమానుషంబు వానిచ, రిత మిట్టిఁడునకును వచ్చె ♦ మృతియేమందున్.

కం. అకట! యెవని యడుగుందో, యికి మును నీరాజనమ్ము ♦ లెత్తెను స్వశిరో
మకుట మణుల యముఁ, డానా, దు కుమారవు నేఁడదెట్లు ♦ తోఁప్లానిచ ననో!

సీ. బాల్యమ్మునందె గో ♦ వర్ధనగిరి యెత్తి, గోగోపకుల నెపం ♦ డాఁగికొనిమె
భటుఁడేచి మరునందు ♦ వరుణపురమునకుఁ, గొనిపోవ నెవఁడుశ్రో ద్ధానుచువచ్చె
స్వర్గమ్మునకు నేగి ♦ పాకశాసను గెల్చి, పారుజాతమ్ము నె ♦ వ్వండు తెచ్చె
విగతాసులైన య ♦ ర్వీసుపర్వుని సంతతి నెవండు బ్రతికించి ♦ తెచ్చియిచ్చె

ఆ. చిచ్చుకంటి వానిఁ ♦ జిచ్చికొట్టె సహస్ర, బాహు గర్వమెల్ల ♦ భంగపెట్టె
జయము కీర్తి గొన్న ♦ జగజెట్టి యెవ్వఁడా, తండు నాకుమార ♦ కుండు లేఁడె!

తే. తల్లి యేడ్చుచు నుండ నో ♦ దార్చిమామ
చంపియున్న భ్రాతల నెల్ల ♦ సరవిఁ దెచ్చి
చూపి రెవ్వ రారామకృ ♦ ష్ణులు మదీయ
వంశదీపకుల్ నేఁడు గ ♦ న్పడరె? విజయ! 47

కం. చెఱియొక దెస నిలువం బడి, పరమ మునులవలన యజ్ఞ ♦ వారము నాచే
జరిపించిరే యథావిధి, నెఱుఁగవె! వారేరి! రామ ♦ కృష్ణులు తండ్రీ! 48

కం. కట్టా! కొండంత బలగ, మ్మట్టె కడలకున్న యవ్వ ♦ డటు నేఁడాఁటన్
గట్టేఁడి విధి వ్రాయక యి, క్కట్టిట్టులం బెట్టె నన్ని ♦ గన నేనుండన్. 49

తే. తాము ధన్యులు పుత్త్రిపౌ ♦ త్ర ప్రపౌత్రు
లహరహమ్మును గలకల ♦ లాడుచుండు
నాలయములు తమ్మికొలంకు ♦ లట్టులుండు
నందు రది యిల్లు నేఁడు పా ♦ డయ్యెఁగంటె! 50

కం. ఎంతటివానికి నాజ, న్మాంతము నొకరీతి జరుగ ♦ దానందముగా
నింతయు నిజమని యివ్వాడు స్వాంతమునంగంటి నెంత ♦ యాపద విజయా!

కం. యేమాపదలం బ్రుంగిన, చో మీరలు వరుగుదీయు ♦ చున్వాత్తురె? యు
ద్యోమీ జననులు వగచుచు, భూమివయిం బడఁగఁ బల్కఁ ♦ బో రేలసుతుల్.

వ. అని పెక్కుతెఱంగుల వాపోయి వాపోయి 53

కం. రామా! కృష్ణా! కృష్ణా, రామా! కృష్ణా! యనుచు నె ♦ ప్రాణము వాసెన్
భూమిం బడెఁ గాయంబు, ద్ధామధ్వని, నేమిసెప్పె ♦ ద న్నరపాలా! 54

♦- రోహిణి మరణము ♦-

వ. మఱొండు దెసం బడియున్న బలరాముం జూచి యేడ్చుచు రోహిణి,

సీ. గార్ధభేల్వల ధేను ♦ క ప్రలంబాదుల
సౌనంద ముసలాసఁ ♦ జావమోదె
దుర్యోధనుఁడు మాటఁ ♦ ద్రోవ హస్తిపురి గం
గం ద్రోయ సంవర ♦ కమున నెత్తె

నవిధేయుఁడని ఖచి ♦ తాసి సూతుం ద్రుంచి
మరలఁ బ్రాణము వోసె ♦ మానవులకుఁగ
నేను బిల్వఁగ రాక ♦ యెందేగెదే యంచు
గాళిందిఁ దనదు చ ♦ క్కటికి నీడ్చె

తే. తమ్ముఁ గుజ్జకృష్ణుని కండ ♦ దండయగుచు
నుండువాఁ డాత్మవిదుఁడు ని ♦ యుష్మంతు మైత్రి
లునకు నాముద్దుపట్టి పో ♦ ల్చునటు కటకట
నేల బలరామదేవుఁ డే ♦ నేల బ్రమసె. 56

ఆ. నన్ను మట్టిసేసి ♦ నాకిన్ని నీళులు, వదలిపోవరాదె ♦ పట్టిమిన్న !
యీవెఱుఁగని ధర్మమొందుండెనాముద్దు,లయ్య! రామ! రామ! యంచు వ్రాలె

వ. ఆరోహిణి తోడిమయూరశిఖ వంశువలె నేలఁ వ్రాలి నిశ్చేతనయయ్యె. వసుదేవపత్ను లందఱుం దదంగస్పర్శంబు సేయుచుఁ జితాగ్నిం బొచ్చిరి. 58

*- రేవతీ రుక్మిణ్యాదుల మృతి *-

కం. ఇచ్చట రేవతి రాముని, గ్రుచ్చి కవుంగిటను జేర్చి ♦ కొని పైఁబడి వా
విచ్చి కురరివలె నేడ్చుచు, నచ్చట సొమ్మసిలెఁ గదల ♦ దయ్యెను మరలన్.

వ. మఱొకదెస నాథుని వెదకి యెందుం గానక రుక్మిణి పిప్పలతరువు నంటి వ్రాలి 60

కం. అశ్వత్థమ ! నాదగు ప్రా, ణేశ్వరు సంతోష్యపచార ♦ కొలమి సలిపి ని
త్యైశ్వర్యదాయకమ్మగు, శశ్వత్పుణ్యమ్ము గంటి ♦ జని తరియించెన్. 61

కం. పతి యున్నివిధముల సము, ర్థత చూపి మెలంగ సౌఖ్య ♦ తతిఁగను చంత్య
స్థితి నున్నవు డుపచార వ, రత మెలఁగని భార్యఁ దలఁప ♦ రాదెయ్యెడలన్.

ఆ. వార్త పంపినపుడ ♦ వచ్చి వ్రాలితి వుగ్ర, సమరవహ్నిఁ గొండ్లి ♦ సమయమందు
నట్లు నన్నుఁ దెచ్చి ♦ యాదరించిన నీవు, నన్ను విడిచిపోయి ♦ నాఁడ వెట్లు ? 63

కం. నిను బాసి యింతతడవుం, డిన నా నేరమ్ము సైపు ♦ నీపదముల్ నా
మనమునఁ బట్టితిఁ జెదరం, గనీకు వనుపీడఁ బోకు ♦ కావుము కృష్ణా ! 64

వ. అని తద్గతచిత్తయై యనువుం బాసె నవ్వల నటనున్న కృష్ణపత్ను లందఱుం గృష్ణస్మరణ మొనరించుచు నగ్నిప్రవేశం బొనరించిరి. రామపత్నులును దదీయ దేహము నాలింగము సేసికొని వహ్నిం జొచ్చిరి. ప్రద్యుమ్నాదుల కళత్రంబులును వారివారితో ననుమరణ మొనర్చిరి. అప్పు డర్జునుండు. 65

## ♦— అ ర్జు న వి లా ప ము ♦—

కం. ఈవిలయ మరయఁ దొలి నా, కావించిన కర్మమేమొ ♦ కా! దారుక! యం
చావిజయుం డుత్కట శో,కావిల చిత్తుఁడయి మూర్ఛ ♦ నందె నరేంద్రా!

వ. అంత గొంతతడవున కతండు కనులువిచ్చి కూర్చుండి 67

కం. ఏనింక నెట్లు బ్రదుకుదు
హా! నాపాలకుఁడు నాస ♦ హాయుఁడు నాప్రా
ణానిలుఁడు న్నాయొద్దడ
నా నెచ్చెలి నా గురుండు ♦ నా వేల్పరిగెన్. 68

ఉ. ఎవ్వనిదండఁ జూచుకొని ♦ యేవనిచేయఁగ దూఁకుచుందునో?
యెవ్వని నండఁజూచుకొని ♦ యెక్కటి కయ్యములందుఁ జొత్తునో?
యెవ్వని యండఁజూచుకొని ♦ హృష్టుఁడనై విహరించుచుందునో?
యువ్విభుఁ డాయనుంగు దిగ ♦ నాడిచనె న్నను నేమిచేయుదున్. 69

ఉ. ఎప్పటికప్పు డేబెసఁద ♦ యేర్పడినన్ సరిచేయవచ్చి మా
కిప్పటి కేదిచేయవలె ♦ నెల్లవిధుల్ దెలియంగఁజెప్పు మా
కిప్పురుషుండు లేనియెడ ♦ నింత యశోవిభవంబు లందఁగ
న్జొప్పడునట్టె ముందెటుల ♦ నోగదె కాలము వెళ్ళఁబుచ్చుటల్. 70

కం. నానెచ్చెలి యుండినచో, నేఁటు పగచు నెడఁ జూచు ♦ చెట్లుండఁగలం
డానాఁడు కురుక్షేత్రము,లో నావగఁ బావఁడే వె♦లుఁగుసూపి కృపన్. 71

వ. అని తదీయస్మృతి కలుఁగఁగాఁ దెలివివహించి దిగ్గనలేచి యేనెంత మూ
ఢుండనైతి దారుకా! భగవదుక్తుల మఱచి మోహాంధుండనైతిఁగదె.
"నాహంప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః, మూఢోయం
నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్" అనియు, "నత్వం శోచితు
మర్హసి..." అనియు నెన్నియో విధముల స్వామి యిదివఱకే కురుక్షేత్రం
బున బోధించియున్నాఁడు. 72

ఉ. కావునఁ జిత్తవిభ్రమము ♦ గల్గి యశాశ్వత దేహపాళికై
శేవ విచారవారినిధి ♦ డిందుటచెల్లదు పిల్వుమయ్య వి
ప్రావళిఁ, జేయనైన పను ♦ లన్ని యొనర్తము నాఁగ నాతఁ డా
జ్ఞావశుఁడౌచుఁ గృష్ణువచ ♦ నంబులఁగూడ వచించె నీక్రియన్. 73

తే. స్వామి చనిన యేఁడవనాఁడు ♦ ద్వారకాపు
రంబు ద్రుంగెడినంట వా ♦ రాశిపొంగి
కానఁ దత్రత్యుల న్నీరు ♦ కడఁకఁ దోడి
కొనుచుఁ జనవలె నని చెప్పు ♦ మనియెఁ బ్రభువు. 74

వ. అని దారుకుండు నుడివి వేదవిదుల రప్పించఁగా నర్జునుండు నష్టగోత్రులకును దత్తద్వ్యాదవబాంధవుల కంఠజకును యథావిధిఁ బారలౌకిక క్రియలఁ జేయించి రయంబునం గదలి ద్వారకకు వచ్చి యెల్లి ద్వారక మున్నీట మునుఁగుం గాన నెల్ల రింద్రప్రస్థంబున కరుగవలయు. వేగము మీ మీ వలసిన సర్వవస్తువులతోఁ గదలి రండని దండోరా వేయించి హతశేష స్త్రీబాల వృద్ధుల నుచితయానంబులం గదలించుకొని తరలి ద్వారకం బాఁసెను. 76

## సూర్యోదయము

కం. తెలతెలవాఱెను బక్షులు, కలకలకూయం గడంగెఁ ♦ గలువల కొలముల్
వెలవెలఁబోవఁ దొడంగెన్, బలవల మలయు పవనములు ♦ పర్వఁ దొడంగెన్.

సీ. పైఁడిగుబ్బలి క్రేవ ♦ బాల బండలు గుఁజ్జు, నడుగడుగున నేమి ♦ నడ్డుచుండ
మినువాకపేరడు ♦ మన గిట్టలిఱికి ము, గ్గకిలి లేచి రవాళ్లు ♦ కదలుచుండ
క్రొంగరువలి మొత్త ♦ కూడు ద్రావఁగఁ, బగ్గ, ముంజిబ్బెసుబ్బెలు ♦ గుంజుచుండ
ముందఱఁ బఱతెంచి ♦ మందేహ దానవ, సందోహ మల్లరి ♦ సలుపుచుండ

తే. తఱుమఁ దఱుమంచు రథికుండు ♦ తఱుముచుండఁ
బైడిగిలకల చేరోఁకల ♦ నాడఁజేసి
యెట్టకేలకుఁ బిచ్చుకుం ♦ టివముఁ సూడు
రథము నెక్కించె నుదయప ♦ ర్వతము పైకి. 77

సీ. ఒకటి యుష్ట్రమ్ములం ♦ దుకొని రాసులు వోయు
నొకటి మంచుకుదుళ్ళ ♦ నూడఁదీయు
నొకటి మిన్నేటి త ♦ మ్మికొలంబు గిలిగించు
నొకటి జక్కవజంట ♦ నూఱడించు
నొకటి దిక్సతిమోము ♦ నకుఁ గ్రొమెఱుఁగించు
నొకటి దిక్కులదాలు ♦ నోసరించు
నొకటి నింగిని వెల్ల ♦ యుడుఁ ద్రాళ్లు మెఱివెట్టు
నొకటి చీఁకటిగుండె ♦ లూడఁగొట్టు

తే. ఒకటి మలసిగం దలపాగఁ ♦ జికిలిసేయు
నొకటి బ్రాఁకుఁబ్రోవులను ల ♦ త్తుకను బులుము
నన్ని యని చెప్ప సూర్యుని ♦ కున్న వేయి
చేతులును వేయిచేతలఁ ♦ జేయఁజొచ్చె. 78

వ. అత్తఱి 79

ఉ. ఏడుదినంబులాయె హరి ♦ యేగి యటంచు నదీప్రభుండు హ్రా
త్రోక్కడమునం జలంచెడినొ? ♦ గుబ్బుగ గుబ్బుగ ఘుంఘుమార్భటీ
క్రీడలు పిచ్చలించె లయ ♦ కేలి మహోగ్రశిఖాకలాపమో ?
బాడబదీప్తియో? యొకటి ♦ భాసిలె వీచె దురంతవాయువుల్. 80

ఉ. ద్వారకలోన నేల కడు ♦ శ్యామల మయ్యెను సైకతంబు పొం
గారుచుఁ బ్రుబ్బియాడె నదు ♦ గంతయు సార్ద్రిము గాఁదొడంగె ము
స్నీరటు రేఁగి యంఘ్రుల ♦ నిల్చెను గుల్ఫములంటె జంఘల
స్నీరెను జానువుల్పడికె ♦ మేకొనెనూరుల నాభిఁ బైకొనెన్ 81

ఆ. కుక్షిఁ గలయనిమిరి ♦ కక్షలఁజక్కిలి, గింత వెట్టి యాట్టె ♦ గొంతుపట్టి
నోరుమూయఁజేసి ♦ పాతెను సిగఁబట్టి, చూడఁజూడఁదరఁగ పశ్య♦తోహరుండు,

ఉ. గాలింబాళ్ళనెక్కి తరఁ ♦ గల్ నడిపీనుల మాఱులేక వా
హ్యాళులు సల్పె సింధువపుఁ ♦ డన్ని ప్రదేశము లాక్రమించుచున్
బాళెము పెట్టసాఁగెఁ దమ ♦ వారి, నపూర్వ గృహాళిఁ జూచి యం
దోలిమి డాఁగి వాళ్చరము ♦ లొగ్గెను స్వత్వముకై పెనంగఁగన్. 83

సీ. ఒండల కన్నగాఁ ♦ డో యనఁ బ్రాకార
ముల మూలముట్టుగా ♦ మొత్తివైచె
నొండల వేగరి ♦ యో యన ద్వారమ్ము
దనుక వచ్చి యరసి ♦ వెనుకకొదిగె
నొండల వగపట్టు ♦ సురగమో యన బుస్సు
మని వాఁకిటను వచ్చి ♦ యాడెనింట
నొండల గడిదొంగ ♦ యో యన వాతాయ
నముల గుభేల్గుభే ♦ లుమనిదూఁకె.

తే. భళిర! యొండల దూలాల ♦ పైకి నుఱికె
నకట యొండల మేడల ♦ యందుఁబఱచె
నెదిరివలె మఱొండల లగ్గ ♦ కెక్కఁదొడఁగె
నంతలో నంతజలమయ ♦ మయ్యె నృపతి! 84

ఉ. హెచ్చరికించె మున్నుగ న ♦ దీశుని చేటు తలంగుఁ డంచు వి
వ్యచ్చుఁడు, కాని స్వస్థలని ♦ వాసముఁ బాయఁగలేని వారు తా
మెచ్చటనుండి రచ్చటనె ♦ యొగ్గిరి కాఁక తలంచువారు లే
కొచ్చెల! కీడుగల్గునటు ♦ యోగ్యులమాటఁ దిరస్కరించినన్! 85

కం. వారేమైరో? వీరే,మైరో? యనియేడ్చువారె ♦ యటలే, రపుడే
యేరికివారే యమునా,తీరే యనుసుద్ది బయలు ♦ దేఱిన దేమో? 86

కం. నూత్నరుచులతోఁడి యఖిల,రత్నంబులఁ గట్టి రేవు ♦ రము దాని మహా
యత్నమ్మున లోఁగొనఁగఁడె,రత్నాకరనామ మంబు ♦ రాశికిఁగల్గెన్. 87

కం. [1] శ్రీమద్భగవానుని నిజ, ధామము సప్పతి గ్రహింపఁ ♦ దలఁకె, నదియొకం
డే మున్నీటినదుమ ను, ద్దామరుచి న్వెలుఁగు మింట ♦ ధామనిధివలెన్. 88

తే. హరి ముకుందుఁ డా ప్రాసాద మందు నిత్య
సన్నిహితుఁడయి వెలుఁగుఁ ద♦ త్స్మరణమాత్ర
మున సమస్తపాపంబులుఁ ♦ బొలియు సర్వ
మంగళంబులు నరుల కౌ ♦ సంగుచుండు. 89

వ. అంత నక్కడ ద్వారకం దాఁటిచన్న యర్జునుండు 90

—♦ వ జ్రా భి షే క ము ♦—

కం. అరిశిక్ ద్వారావతి, పారావారమున మునుఁగు ♦ వహిఁ జూచుచుఁ ద
న్నారీ వృద్ధాదుల నే, తీరుననో తోడికొని యు ♦ తిత్వరితగతిన్. 91

కం. చని యింద్రప్రస్థమునకు, ననుపమ గృహములను నిలిపి ♦ యాయావారిన్,
జననుతు బాలకుఁ గృష్ణుని, మనుమని వజ్రాభిధాను ♦ మహితజ్ఞానున్ 92

కం. యాదవులకు నధిపతిగా, సాదృతి నభిషిక్తుఁ జేసి ♦ యుండఁజనను స
మ్మోద ధన సుఖాదిక ము, త్పాదిల్లు తెఱంగు సేసెఁ♦బార్థుం డధిపా! 93

వ. అంత నేత త్సుహృద్బంధు నాశాది సర్వవృత్తాంతము బీభత్సునివలన ద్రౌపదీసహితులై నీ పితామహులు యుధిష్ఠిరాదు లాలించి పెద్దయుం బ్రొద్దు శోకమూర్ఛితులై ధౌమ్యాదులవలన నెట్టకేలకు దెప్పరిల్లి మనో ధైర్యము వహించి యావలఁ బరీక్షిన్నరేంద్రా! వంశకరుండవైన నీకుం బట్టంబుగట్టి వారు మహాపథంబు పట్టిరి. 94

తే. ఎవ్వఁ డీ దేవదేవు న ♦ హీనజన్మ
కర్మములను శ్రద్ధానమ♦గ్రమతియగుచుఁ
గీర్తనము సేయు నతఁడప్ప ♦ కిల్బిషములఁ
బాసి శ్రేయసము వొందుఁ ♦ బార్థివేంద్ర! 95

తే. ఇట్లు భగవంతుఁడైన శ్రీ ♦ కృష్ణు నుకుచి
రావతార వీర్యముల బా ♦ ల్యచరితముల
నుభయలోక శంతముల శు ♦ భోదయములఁ
బాడుకొను నరులకు విష్ణు ♦ భక్తి వొడమ. 96

1 "వర్ణయిత్వా మహాబాహ శ్రీమద్భగవతాంయమ్" "నిత్యం సన్నిహితస్తత్రభగవాన్"........

వ. అని శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పెను. 97

కందద్వయ గీత గర్భిత చంపకమాల.

సురమునిపా మహాకలుష ♦ సూదన యాశ్రితకామ్యదానత
త్పర ఘనమానసా దనుజ ♦ భంజనలోలప్రథావిశాల సం
గర పరమాప్రభూ నిగమ ♦ కాండరటత్పదనీరజాత న
వ్యరుచిర భాసురా శశివి ♦ భాకరనేత్రలసత్స్వరూపకా. 98

గర్భగీతము.

కలుష సూదన యాశ్రిత ♦ కామ్యదాన
దనుజ భంజన లోలప్ర ♦ థావిశాల
నిగమకాండ రటత్పద ♦ నీరజాత
శశివిభాకరనేత్రల ♦ సత్స్వరూప 99

గర్భప్రథమకందము.

మునిపామహాకలుష సూ
దనయాశ్రితకామ్యదాన ♦ తత్పరఘనమా
ఘనమానసా దనుజభం
జనలోల ప్రథావిశాల ♦ సంగరపరమా. 100

గర్భద్వితీయకందము.

పరమా ప్రభూ నిగమ కాం
డరటత్పదనీరజాత ♦ నవ్యరుచిర భా
చిరభాసురా శశివిభా
కరనేత్ర లసత్స్వరూప ♦ కాసురమునిపా. 101

కం. సామజవరదానచణా !, భూమీభృన్నందనాను ♦ భోగానుగుణా !
సామాద్యపిగీర్ణరణా !, శ్రీమహిళోరస్స్థలగళ ♦ సీమావరణా ! 102

శా. తారానాథ తుషారహారగిరిభి ♦ త్తారామరోర్వీజ కాం
తారాహీంద్రవయోంబుధి ద్రుహిణకాం ♦ తారామవాణ్యాత్మభూ
తారాహార్య మరాళ చందన సుధా ♦ తారావథప్రహాదినీ
తారానూన యశోవిభాసిత దిగం ♦ తా ! రాగకోపాంతకా ! 103

మాలిని. అనుపమగుణసీమా ! ♦ యబ్ధిజోమాభిరామా !
దనుజమదవిరామా ! ♦ ధైర్యభూభృల్లలామా !
మునిజననుతనామా ! ♦ బుద్ధ్యతీతేద్ధధామా !
ఘనశితితనుధామా ! ♦ కల్మషాంభోజసోమా ! 104

గద్యము

ఇది

శ్రీభగవ

దనుగ్రహలబ్ధకవితాచరిత్ర,

శ్రీవత్సగోత్రపవిత్ర, మిన్నికంటివంశాం

బుధితారాకళత్ర, పేరనామాత్యపౌత్ర, సుబ్బమాంబా

లక్ష్మణమంత్రిపుత్ర, ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణగురు

నాథశర్మ ప్రణీతంబైన శ్రీమద్గురుభాగవతము

నం దేకాదశస్కంధము

సర్వము

సంపూర్ణము.

శ్రీభగవదర్పణమస్తు

---

సమాప్తి 12—10—1946.

# శ్రీమద్భాగవతము

## ద్వాదశస్కంధము

### ప్రథమాధ్యాయము

కం. శ్రీమల్లక్ష్మీగౌరీ, భామా గేహాయితోరు ♦ వక్షోవామాం
గామలసీమా! మునిహృద, యామేయధ్యానధామ! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము. అంత శ్రీ శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. రాజేంద్రా! ఇంక నేమి వినవలతువనినఁ బరీక్షిత్తు నమస్కరించి మహర్షితిలకా! యదువంశనిధానుండైన శ్రీకృష్ణభగవానుండు వైకుంఠము నలంకరించిన పిదప భూమియం దెవ్వాని వంశము విస్తరిల్లెనో యానతిమ్మన బాదరాయణిమునిచంద్రుం డిట్లనియె. 2

* శ్రీ శుకయోగి పరీక్షిత్తునకు మాగధాది కలియుగరాజులం జెప్పుట *

కం. అవనీనాయకులం జంద్రవంశ్య నృపతులను జెప్పి ♦ తఱి మాగధరా
జవరేణ్యులఁ జెప్పితిఁ బాండవపౌత్ర! [2]పురంజయుఁడు క ♦ డమగా వింటే. 3

తే. ఆపురంజయుండె రిపుంజ ♦ యాఖ్యనొప్పు
నతని శునకనామకమంత్రి ♦ హతునిఁ జేసి
స్వసుతుఁ బ్రద్యోతు రాజుగా ♦ నలుపఁగలఁడు
కలిని బ్రభుభక్తి యిట్లుండు క్ష్మాతలేంద్ర! 4

వ. ఆ ప్రద్యోతునకుఁ బాలకుండు నతనికి [3] విశాఖయూపుం డాతనికి [4] జనకుం డతనికి నందివర్ధనుండు జనించు. 5

తే. క్ష్మాతలేశ! యీప్రద్యోత ♦ సంజ్ఞకులు నృ
పాలు రేవురు నూటము ♦ ప్పదియెనిమిది
హాయనమ్ములు వసుమతి ♦ ననుభవింతు
రంత మీఁదివృత్తాంతంబు ♦ నాలకింపు. 6

---

(1) అధ్యాయప్రారంభము 13-10-1946. (2) 9 స్కంధమున 49 శ్లోకము చూడుఁడు. (3) బొంబై ప్రతిలోను వావిళ్ళ ప్రతిలోను విశాఖయూపుఁడని కలదుగాని తెలుఁగు భాగవతమున విశాఖరూపుఁడని కలదు. (4) రాజక స్తతః అని బొంబై ప్రతి; భవితాజనక స్తతః అని వావిళ్ళ ప్రతి, మఱియు భవితాచాజ్ఞక స్తతః అని పాఠాంతరమని వావిళ్ళ ప్రతిలో వ్యాఖ్యయందుఁ గలదు, " భవితా రాజక స్తతః " అని గోరఖపుర ప్రతి.

వ. ఆనందివర్ధనునకు [5] శిశునాగుఁడు వానికిఁ [6] గాకవర్ణుఁడు వానికి [7] క్షేమధన్వుఁడు వాని క్షేత్రంబున [8] క్షత్రధర్మజుండు వానికి విధిసారుండు వానికి [9] జాతశత్రుండు వానికి దర్భకుండు వాని కజయుండు వానికి నందివర్ధనుఁడు వానికి మహానందియు జనింతురు. 7

తే. అనఘచరిత! యీ శైశునా ♦ గ నృపవరులు
పదుగురుం గలియుగమున ♦ మున్నూట
మూఁడునూర్లయర్వదియేండ్లు ♦ ప్రజమి నేలఁ
గల రవక్రపరాక్రమ ♦ క్రమ మెసఁగ. 8

తే. అమ్మహానందికిని శూద్రి ♦ యందు నందుఁ
డుదితుఁడై బాహువీర్య శౌ ♦ ర్యోజ్జ్వలుండయి
ప్రబలధనసైన్యతతి మహా ♦ పద్మపతి య
నంగ నెగడి సల్పును క్షత్ర ♦ నాశనంబు. 9

కం. భార్గవరాముని రీతి న, నర్గళశాసనుఁ డగుచును ♦ నందుఁడు విద్వ
ద్వర్గమ్ముఁ బాఱఁద్రోలి భు, జార్గళమున నవనిఁ జాల్చు ♦ నసమానుండై. 10

కం. ఆ ప్రభువు మొదలుకొని శూ, ద్రప్రాయు లధార్మికులయి ♦ ధరణీశులు రా
జ్యప్రేమమునఁ జరింతురు, విప్రులపైఁ గంటిమెఱుపు ♦ వెట్టి నరేంద్రా! 11

కం. నందుఁడు [10] సుమాలి ముఖనిజ, నందను లెనమండ్రఁ గూడి ♦ నవనందు లనం
గం దాము నొగడఁబడుచున్, వందేం క్లైలెదరుసుస్వో ♦ వసుధాతలమున్. 12

కం. అన్నవనంద ప్రభులఁ బ్రసన్నుల నొక బ్రాహ్మణుండు ♦ పాలాడి ధరి
త్రీ న్నృపునిఁ జేసెడి మురో, త్పన్నుఁ ఘనుఁ జంద్రగుప్తు ♦ భవ్యగుణాఢ్యున్.

సీ. ఇలఁ జంద్రగుప్తాఖ్యు ♦ నకు వారిసారుండు
వానికిని నశోక ♦ వర్ధనుండు
వానికి సుయశుండు ♦ వానికి [1] సంయుతుం
డతనికి శాలిశూ ♦ కాభిధానుఁ

5. శిశునాగః అని బొంబై ప్రతి, శిశునాభః అని వావిళ్ళ ప్రతి.
6. కాకవర్ణః .... .... .... కాకపక్షః .... .... ....
7. క్షేమధర్మా .... .... .... క్షేమధన్వా.... .... ....
8. శ్లో. శిశునాగ స్తతో భావ్యః కాకవర్ణస్తు తత్సుతః। క్షేమధర్మా తస్య సుతః క్షేత్రజ్ఞః క్షేత్రధర్మజః. అని బొంబై. శిశునాభ స్తతో భావీ కాకపక్షస్తు తత్సుతః । క్షేమధన్వా సుత స్తస్య క్షేత్రజః క్షత్రధర్మజః. అని వావిళ్ళ ప్రతి.
9. తస్యాజాతశత్రుః అని బొంబై. తస్యజాతశత్రుః వావిళ్ళ.
10. సుమాత్యః బొంబై. సుమాలీ వావిళ్ళ.
1. సంగతస్సుయస్సుతః అని బొంబై. తెలుఁగుభాగవతమున 'సంయుతుఁ' డనియే కలదు.

డతనికి సోమశ ♦ ర్మాఖ్యుఁ డాతనికి శతధన్వుఁ
డతని కాతనికి బృ ♦ హద్రథుండు
జనియింతు రవ్వలఁ ♦ బరిమితిం [2]దశరథులు
లీపదుగురు మౌర్య ♦ నృపవరేణ్యు

తే. లిమ్మహిని నూటముప్పది ♦ యేడు వత్స
రములు పాలింతు రట బృహ ♦ ద్రథుని జంపి
యతనిసేనాని పుష్యమి ♦ త్రాహ్వయుండు
శుంగవంశప్రథముఁ డవ ♦ నిం గడించు. 14

సీ. ఆపుష్యమిత్రున ♦ కగ్నిమిత్రుండు పుట్టు
నతనికి సుజ్యేష్ఠుఁ ♦ డాత్మజుఁడగు
నతనికి వసుమిత్రుఁ ♦ డతనికి భద్రకుఁ
డాతనికిఁ బుళిందుఁ ♦ డాత్మపాలుఁ
నతనికి ఘోషుండు వా ♦ నికి వజ్రమిత్రుఁ డా
తనికి భాగవతుఁ డా ♦ తనికి దేవ
భూతియనం బుట్టుదు ♦ రొగి నీపదుండ్రు శుం
గులు శతాధిక వర్ష ♦ ములు ధరిత్రి

తే. నేలఁగల, రావలం గుణ ♦ హీనుఁడు పర
భామినీలోలుఁడగు శుంగ ♦ వంశ్యు దేవ
భూతిఁ జంపి యాతని యమా ♦ త్యుండు కణ్వ
కులుఁడు ధీనిధి వసుదేవుఁ ♦ డిల గ్రహించు. 15

వ. ఆవసుదేవునికి భూమిత్రుఁ డతనికి నారాయణుఁడు వానికి సుశర్మ పొడముదు రీనల్వురు కాణ్వాయనులు మున్నూటనలువదియైదేండ్లు భూమి నేలుదురు. 16

తే. కాణ్వుఁడగు సుశర్మాఖ్యుఁ జ ♦ క్కడఁచి వాని
భృత్యుఁ డాంధ్రజాతీయుండు ♦ వృషలుఁడు బలి
కొంతకాలమ్ము భోగించు ♦ క్షోణి నవల
వాని భ్రాత కృష్ణుండు రా ♦ జౌ నరేంద్ర! 17

---

2. ఇచటదశరథునిపేరు మూలశ్లోకముల లేదు. కానఁబొమ్మంద్రేవత్తురు "మౌర్యాః హ్యేతేదశనృపాః" అనియుంటచే బదియవవానిని వ్యాఖ్యలోఁజూపిరి. "మౌర్యం చంద్రగుప్తం ప్రథమం తేషాం చరమోదశరథః పరాశరాదిభిరుక్తః" అని వ్రాసిరి. ఒంటైప్రతిలో "తేషాం మౌర్యాణాం ప్రథమోదశరథః పరాశరాదిభిరుక్తః" అని కలదు. కాని యందే ప్రథమోదశరథః అనుటకు "పంచమోదశరథ ఇతి ము.ము. పుస్తకే పాఠోదృశ్యతో" అనికలదు.

వ. ఆబలిభ్రాతయగు కృష్ణనామాంకుడు [1]శ్రీశాతకర్ణుఁడు వానికిఁ బౌర్ణమాసుఁడు వానికి లంబోదరుఁడు వానికి శిబిలకుఁడు వానికి మేఘస్వాతి వానికి [2]దండమానుఁడు వానికి [3]అరిష్టకర్ముఁడు వానికి హాలేయుఁడు వానికిఁ [4]దిలకుండు వానికిఁ [5]బురీషసేతుండును వానికి [6]సునన్దనుండును వానికిఁ జకోరుండును బుట్టి రాజ్యమేలుదురు. మఱియుఁ జకోరునివంశజులలోఁ గడపటివాఁడగు శివస్వాతి యనువాఁడు జనించి రాజగు. వానికి గోమతి వానికిఁ బురీమంతుఁడు వానికి మేషుఁడు వానికి వేషుఁడు వానికి కీర్తుఁడు వానికి స్కందుఁడు వానికి యజ్ఞశీలుఁడు వానికి సీకుఁడు వానికి సిసేతుఁడు వానికి శ్రుతస్కంధుఁడు వానికి యజ్ఞశ్రీతుండు వానికి విజయుండు వానికి భావ్యుండు వానికిఁ జంద్రబీజుండు వానికి సులోమధియుఁ బుట్టెదరు. బలి మొదలుకొని యీ ముప్పదుండ్రు నృపులు నాలుగు వందల యేఁబదియాఱేండ్లు రాజ్యమేలుదురు. ఆపల 18

సీ. అవభృతినగరమ్ము ♦ నందుండి యాభీరు
లేడ్గురు భూమి వ ♦ హింపఁగలరు
పదపడి గర్దభుల్ ♦ పదుగురు, పిమ్మటఁ
బదునారుగురు కంక ♦ పతులు, పదప
నెనమండ్రు యవనులా ♦ వెనుకఁ బదునల్వుర
బర్బరుల్ భూమిని ♦ బడయఁగలరు
పిదప [1]గురుండులు ♦ పదుముప్వు రంత నే
కాదశమౌనులు ♦ క్ష్మాపులగుదు

తే. రీప్రభువులంద ఱీధర ♦ నేలఁగలరు
వేయుఁదొంబదితొమ్మిది ♦ హాయనమ్ము
లందు మౌనులే ధర మూఁడు ♦ వందలేండ్లు
పాలనమొనర్తు రభిమన్యు ♦ వరతనూజ ! 19

---

1. నేను వావిళ్ల ప్రతి ననుసరించి వ్రాయుచుంటిని. బొంబై ప్రతిలోఁ జాలభేదములు గలవు. శ్రీశాంతకర్ణుఁడని బొంబై. 2. అటమానుఁడు బొంబై. 3. అనిష్టకర్మ్ముఁడు బొంబై. 4. తలకుఁడు అనియు. 5. పురుషభీరువనియు. 6. సునందనుఁడనియు బొంబై ప్రతి. ఇంకఁ బేరుగలబేరులన్నియు బొంబై ప్రతిలోఁ దార్మారె. "ఏకేత్రింశన్నృపతయః" అని రాఁబోవు ముప్పదిసంఖ్యకు ముడివెట్టుటకు వావిళ్ల బొంబై ప్రతులును వ్యాఖ్యాతలును పోటీపడిరి. విశేషణముల విశేష్యములం జేసియు నామములఁజీల్చియుఁ గలిపియు నీపట్టునఁ జాలఁదిద్దుబడలు చేయబడెను. పరిశోధకులకుఁ జేతినిండఁ బనికలదు.

(1) భూయోదశగురుండాళ్ళు అని బొంబై. వావిళ్ళ ప్రతిలో మురుండాళ్ళు అని కలదు. తెలుగు భాగవతమున గురుండు లనియే కలదు.

తే. సరవి భూతనందుం[2]డు వం ♦ గిరుఁడును శిశు
నంది తద్భ్రాతయగు యశో ♦ నందియుఁ బ్ర
వీరకుఁడు కిలకిలయను ♦ పేరిపురి
నెనసి నూటయాఱేండ్లు ♦ నేలఁగలరు. 20

సీ. అనఘ ! యా భూతనం ♦ దాదులకును బాహ్లి
కాహ్వయుల్ పదుమువ్వు ♦ రాత్మజన్ము
లౌర పుష్యమిత్రరా ♦ జోత్తమునకును దు
ర్మిత్రనాముం డుండు ♦ బుత్త్రకుండు
మఱియు నీ బాహ్లికా ♦ త్మజులలో [3] నేడుగు
రాంధ్రదేశము నేలి ♦ యాంధ్రభృత్యులగుచు
లేడ్గురు కోసల ♦ నేలి కోసలుఁ బాదు
రింకను నిషధము ♦ హీంత లేశు

తే. లవుచుఁ గొందఱు నైషధు ♦ లనఁబడియెద
రింకఁ గొందఱు వైదూర్య ♦ న్మృపులనంగ
నిలను బాలింత్రు పేర్లు ♦ నేక కాల
మంతె నా ఖండమండలా ♦ ధ్యక్షులగుట. 21

సీ. అంత విశ్వస్ఫూర్జుఁ ♦ డను మగధేశుండు
తొంటి పురంజయు ♦ కంటెఁ బేరు
పడసి విప్రక్షత్ర ♦ వైశ్యులను బుళింద
యదుమద్రకులుగ మాం ♦ సాశనులుగ
మొగిని మ్లేచ్ఛప్రాయు ♦ లుగ ననాచారులు
గాఁ జేసి వైచు నా[4] ♦ కాపురుషుఁడు
మఱియు నతఁడు రాజ ♦ వరులను దున్మాడి
పద్మవతీనామ ♦ పట్టణమున

తే. నిలిచి గంగమొదలుఁ గొని ♦ నిర్మల ప్ర
యాగ పర్యంత వసుమతీ ♦ భాగమేలు
నతని ప్రజలలోఁ ద్వైవర్ణ్య ♦ లలరఁ బోవ
నేమి చెప్పుదుఁ గలియుగ ♦ వృత్తమనఘ ! 22

(2) కిలికిలాయాం నృపతయో భూతనందో ప్యవంగిరిః అని టొంప్పై. కిలింకిలాయాం నృపతయో భూతనందోయవంహరః అని వావిళ్ల. తె. ఛా. లో కిలికిలానగరభూపతులందు భూతనందనుండు వంగిరుండు అని కలదు. "కిల్కిలాయాం" అనియుఁ బాఠాంతరమని వావిళ్లలోని వ్యాఖ్యయం దున్నది. "కిలికిలాయాం నృపతయో భూతనందోఽథ వంగిరిః" అని గోరఖపుర ప్రతి.

3. సప్తాంధ్రాః సప్తకోసలాః

4. దుర్మతిః అని స్పష్టముగా మూలమందుండ నారాయణభట్టు తన తెలుఁగుభాగవతమున వీనిని నారాయణభక్తునిగాఁ జేసెను.

వ. సౌరాష్ట్రావంత్యాభీరార్బుదమాళవరాజులు శూద్రప్రాయులగుదురు.
అంతలి ద్విజులును నుపనయనాది సంస్కారశూన్యులై వ్రాత్యులగుదురు.
సింధుతీరమ్మును జంద్రభాగాప్రాంతమ్మును గౌంతిని గాశ్మీరమండలమును
వేదాచారశూన్యులగు వ్రాత్యులు శూద్రులు మ్లేచ్ఛులు నేలుదురు. 23

తే. ఇట్టు లేక కాలమ్మున ♦ నృపులు మ్లేచ్ఛు
లెల్లకడలఁ బొల్చి యధర్మ ♦ దృష్టు లధిక
కోపు లనృతభాషణులు ఘ ♦ ల్గుదులఁ బాల
వృద్ధగోద్విజస్త్రీఘ్నులు ♦ దృప్తమతులు 24

తే. అల్పసత్త్వు లల్పాయుష్కు ♦ లన్యదార
విత్తసక్తు లసంస్కృతుల్ ♦ విహితకర్మ
శూన్యులు రజస్తమోవృతుల్ ♦ శుంఠలగుచుఁ
బ్రజలఁ బీడింత్రు రాజసా ♦ వమ్ముఁ దాల్చి. 25

కం. ఇలఁ బ్రజలందఱు నీమ్లేచ్ఛుల యేల్బడిఁ బడి కృశించు ♦ చుఁ దదాచారా
దులఁ బూని పరస్పర భయములు నృపభయముల నశింత్రు ♦ హో నరనాథా!

వ. అని శ్రీశుకుండు పలుకఁ బరీక్షిత్తు విస్మయంపడియె. 27

ఇది ప్రథమాధ్యాయము - సమాప్తము.

---

## ద్వితీయాధ్యాయము

కం. జనసంఘమె కాలముఁ ద్రి
ప్పునొ ? కాలమె జనసమూహ ♦ ముం ద్రిప్పునొ ? మా
మనములు నీమాయాకా
ర్యనిబంధన మెఱుఁగఁగలవె ? ♦ హరిహరనాథా ! 1

వ. [1]దేవా ! యవధరింపుము. అంత శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రు
నితో నిట్లనియె. రాజేంద్రా ! కలిధర్మముల నాలింపుము. 2

-♦ శుకయోగి కలియుగధర్మముల నుడువుట ♦-

కం. అనుదినమును గలికాలంబున నాయువు బలము ధర్మ♦మును స్మృతి శౌచం
బును క్షమ దయ సత్యంబుల్, జనములకు నశించుఁ జువ్వె ♦ జననాథమణీ! 3

కం. జననంబున కాచారంబునకు గుణోత్కర్షమున క ♦ వుం గారణ మీ
ధనమే ధనంబు లేకుండినవాఁ డెవియున్న నేమి ♦ నిందార్హుఁడగుఁ. 4

---

5, 'కౌంతిం' అని దొంపై ప్రతి. 'కాంచిం' అనివావిళ్ళ.

18-10-1946 అధ్యాయ ప్రారంభము.

క. అవనీశ! న్యాయ ధర్మవ్యవస్థయుండదు బల మొక్కఁ ♦ డగుఁజుమ్మీ హే
తువు, శాస్త్రసంపదయు కాదు, దేవనీతి బలముండెడ నాఁటి ♦ వే న్యాయాదుల్.

తే. అనఘ! దాంపత్యమున స్వకీ ♦ యాభిరుచియె
కారణము, కులగోత్రాది ♦ కములుగాన
ఆపణ క్రయవిక్రయ ♦ వ్యావహారి
కముల వాదనే బలము, న్యా ♦ యము వలిక్క. 6

క. స్త్రీపుంస్త్వలక్షణము రతి, నైపుణ్యంబె యొందువిధము ♦ నం గాదుగదే
బాపఁ డగుట జందెమ్ముక్, మూఁపునఁ దాల్చిన నికర్మ ♦ ములఁగాదనఘా! 7

తే. ఇతని యాశ్రమమిది యటంచుఁ ♦ దెలియఁగొటకెను
నతని దండాజినాది చి ♦ హ్నములె కార
ణమ్ము, గాని తదాచర ♦ ణమ్ము గాదు
కలిని సర్వాశ్రమములకు ♦ నదె ప్రమాణము. 8

క. తన యభియోగము గెల్వుమికిని హేతువు న్యాయ మచట ♦ గీడ్పడి కా, దా
య్యన లంచ మొసఁగుపొంటు, ధనమ్ము హస్తమున లేమిఁ ♦ దత్కలిలోనన్. 9

క. చాలఁగ నోటితోలందిం, ప్రేలుచునుండిన నతని, ♦ విద్వత్తు కదే
పోలికచిహ్నము, బహుళా, స్త్రాలం జనవిదపు గాదు ♦ సద్గుణనిర్ధన్? 10

ఉ. ఈతఁడు సాధువంచు గ్రహి ♦ యింపఁగ దాంభికవేషభాషలే
హేతువు కాని చెయ్యుల గ్ర ♦ హించెద రెవ్వరు? వీఁడుచూడఁగా
నేతరియే యటంచు వచి ♦ యింతురు పేదఱికంబు చేతనే
చూతురె! వాని సద్గుణవి ♦ శుద్ధత నోపికతో నృపాలకా! 11

ఉ. "ప్రేయసి! నాకు నీవయిని ♦ ప్రేముడి మిక్కుట, మింతనుండి యుం
జాయవునా" కటన్ననుడి ♦ సస్మితవక్త్రము ప్రేవచూపుతో
నా యెవివాహ. మౌనరవ ♦ రాగ్రణి! పెద్దల సమ్మతంబు శా
స్త్రీయ విధాన మెద్దియు న ♦ సింపదయా కలియందుఁ బెండ్లికిన్. 12

క. స్నానమె ప్రసాధనము, దవ్వైనజలమె పుణ్యతీర్థ ♦ మాచార్యాది
స్థానమ్ముగాదు కేశాధానమె లావణ్య మెల్ల ♦ తఱి జనములకున్. 13

క. పురుషార్థమెల్లఁ గుక్షింభరిత్వమే, నలుఁదెఱఁగుల ♦ పద్ధతిగా, దు
ర్ధుర ధార్ష్ట్యమ్మే సభ్యత, నిరూఢవర్తనముగాదు ♦ నీతినిధానా! 14

తే. దాక్ష్యము కుటుంబపోషణా ♦ ర్థమ్మె కాని
ధర్మసంగ్రహార్థముగాదు; ♦ తప్పిదారి
ధర్మసేవలు సలుపుట ♦ తాము పేరు
వడయుటకె, పరలోక ప్ర ♦ వణతఁగాదు. 15

కం. ఈతీరునఁ [illegible] ప్రజ [illegible]
[illegible] 16

మ. [illegible] రాజ్యంబుఁ, [illegible]
ర్త్యము [illegible]
[illegible] రాజు [illegible]
[illegible] 17

సీ. [illegible] గ్రంథములను
శాకమూలాదుల [illegible] దొరకు
నావయి [illegible] జీవన [illegible] ప్రజల
నత్యంత శీత వా ♦ తాతప [illegible] మనుష్యులు [illegible] ♦ మూఁడు జనము

తే. మఱియు నన్యోన్య వైరాను ♦ మనస్త్రీ భావ
ములఁ గృశింతురు చింతల ♦ [illegible]
రవ్వు డిరువదియో లేక ♦ ముప్పదియొ జ
నమ్ములకుఁ బరమాయుర ♦ బ్దమ్ము లధిప! 18

కం. కలిదోషంబున దేహాం,బులు క్షీణంబులై [illegible] ♦ ప్రాణావశ్యం
బలిసిన వర్ణాశ్రమ పం,క్తుల ధర్మము లెల్ల నొకటఁ ♦ గూలు నరేంద్రా! 19

కం. కలి దస్యుప్రాయులు ప్రభు,వులు, పాషండప్రచురము ♦ పురుధర్మము, మ
ర్త్యులు చౌర్యానృతహింసా,విల నానావృత్తిపరులు ♦ వింటె నృపాలా! 20

వ. మఱియు వర్ణమ్ములు శూద్రప్రాయమ్ములు ధేనువులు ఛాగప్రాయమ్ములు నాశ్రమమ్ములు గృహప్రాయమ్ములు బంధుగణమ్ములు యౌనప్రాయమ్ములు నోషధు లణుప్రాయమ్ములు భూజమ్ములు శమీప్రాయమ్ములు మేఘమ్ములు విద్యుత్ప్రాయమ్ములు సద్మమ్ములు శూన్యప్రాయమ్ములు నగుటయుం గలియుగమ్ము గతప్రాయమ్మగు. 21

—♦ కల్క్యవతారము ♦—

ఉ. భూమిజనంబు లీపగిదిఁ ♦ బొల్పుఱియున్న తఱిం జరాచర
క్షేమకరుండు విష్ణు వతఁ ♦ డీ సురుధామశరీరుఁ డీశ్వరుం
డోమఁ దలంచి సాధుజన ♦ తోషణ ధర్మచయంబు [1]శంభళ
గ్రామమునందు భాసిలెడిఁ ♦ గల్క్యవతారమున న్నరాధిపా! 22

(1) శంభళ, శంభల, శంబల, సంబల, సంభళ, అను పాఠములందందుఁ బొడకట్టెడి. కల్కిపురాణమున శంభలగ్రామ మేవామదపట్టణమని కలదు. ఇప్పుడది కుగ్రామమఁట. మనభారతదేశమందే మురదాబాదుజిల్లాలో సంబలగ్రామమున్నదని కొందఱనిరి.

తే. ఉత్తముల జన్మకర్మము ♦ లుత్తరించు
నట్టిదర్శనం, బవనీసు ♦ రాగ్రగణ్యుఁ
డైన విష్ణుయశుని సద్మ ♦ మందున నవత
రించు నతఁడెంత సుకృత ♦ మార్జించెనొక్కొ ? 23

ఉ. అంతటి పాపకాలమున ♦ యందును సైతము స్వీయధర్మ మ
త్యంతము శ్రద్ధతో జరపు ♦ చక్కడనక్కడ మిణుక్కుమిణుక్కుమం
చెంతయు వెల్గుచుండెడి మ ♦ హీసురజాతియు, విత్తనంబుగాఁ
గొంతకుఁగొంత యెచ్చటనొ ♦ కూరుకుచుండక యెల్లమాయునే ? 24

వ. ఇట్లు ధర్మసంరక్షణార్థము దుండగీంద్ర దండించుటకై భగవానుం డసదృశుం
డగు విష్ణుయశుండను సద్బ్రాహ్మణునింట నవతరించి కల్కినాఁబరగి, 25

కం. అతులాష్టైశ్వర్య సమం, చితుఁ డోజశ్శ్రవముఖ గుణవి ♦ శిష్టుఁ డనుపమ
ద్యుతిమంతుం డఖిల జగ, త్పతి కల్కి యసాధువర్గ ♦ దమనోద్యముఁడై.

చం. ప్రకట శుభాంకభాసురము ♦ వాయుజవోగ్రము దేవదత్త నా
మక మమితోన్నతం బనవ ♦ మానగుణ మ్మనుకూల యానరం
జకము తురంగరత్నమును ♦ ఛంగున నెక్కి నిశాత మండలా
గ్ర కలితహస్తుఁడై ఖలని ♦ కాయముఁ జెండుచు ధాత్రిఁగ్రుమ్మరున్ . 27

కం. ఉరు ఖరతర కరవాలము,కరమున గిరగిరను దిరుగఁ ♦ గఁ గరాళింతల్
పౌరి బ్రహ్మాండము నిండఁగఁ,గరకర నణకెడిని గణకుఁ ♦ గఱటి కటుకులన్.

ఆ. ధారుణీశ వేష ♦ ధారులఁ జోరులఁ,గ్రూరులం ధరిత్రిఁ ♦ దారి తారి
వెతకి వెతకి నూర్ల ♦ వేల లక్షలఁగోట్ల, కొలఁది నుగ్గునుగ్గు ♦ గూల్చివైచు. 29

ఉ. అంతటఁ బౌరజానపదు ♦ లందఱి స్వాంతములుం బ్రసన్నతా
శాంతములౌను, జంతువుల ♦ సంతతి యొంతయు సంతసించు, నా
శాంతము కాంతిమంతమగు, ♦ నంతట శాంతి నిరంతరంబుగా
గంతులువైచుఁ గల్కి తను ♦ గంధ భృతామల వాయుసంగతిన్. 30

వ. అప్పుడు 31

కం. నారాయణు దుర్జనసం,హారక్రీడల స్మరించు ♦ నట్టి జనుల క
వ్వారిగఁ బ్రజాభివృద్ధి శు,భారంభము లొదవు నిద్ది ♦ యబ్బుర మె నృపా! 32

ఆ. సత్యమూర్తి ధర్మ ♦ సంరక్షకుఁడు కల్కి,యిలను నవతరింపఁ ♦ గృతయుగంబు
వచ్చు నపుడుపుట్టు ♦ ప్రజ సాత్వికులు ధర్మ,నిరతు లధికభక్తి ♦ పరులు కృతులు

వాపల నసునను సప్తర్షు లంత దక్షిణముగా ... ప్రస్థితులై యే నక్ష
త్రము గస్పృశించుచుందురో యా నక్షత్రమున నందురు సప్తర్షు లుండిరని గ్రహింప
వలయు. 37

కం. ఈ ఋషు లేడుగు రొక్కొక, తారక రుచిమానమున శ ♦ తమితాబ్దంబుల్
రారాజిల్లుదు రిప్పుడు, పేరలు మఘయందుఁ గలరు ♦ వింపెన్నృపాలా! 38

కం. నారాయణుండు నర్వేశ్వరుఁడు కృష్ణుండు శౌరి ♦ వైకుంఠ్యారి దివిం
జేరెఁ దుస్సహకలి భువిఁ, జేరెఁ దౌష్ట్యంబు ప్రజల ♦ జేరె న్నృపతీ! 39

కం. ఎంతవఱకు శ్రీకాంతుఁ డ,నంతాంఘ్రుచనీమఁ బాద ♦ నలినము లిడెనో
యంతవఱకుఁ గలిపురుషుఁ డ,నంతాక్రాంతికిని జాలఁ ♦ డయ్యె నరేంద్రా! 40

ఆ. దైవమానమునను ♦ ద్వాదశాబ్దశతములు, త్సంధ్యాలంబు నేలఁ ♦ గలివిభుండు
స ప్తఋషులు మఘను ♦ జరియించునప్పు డేపు నమయమునందుఁ గాలు ♦ మోపియుండె

కం. మును లెవుడు మఘవిడిచి క్రమ
మునఁ బూర్వాషాఢఁ గలియుఁ ♦ బోదు రవుడు నం
దనరేంద్రులు మొదలుగ ను
బ్బునఁడగు కలిఁ బట్టఁబగ్గ ♦ ములు లేకుండున్. 42

కం. శ్రీకృష్ణపరబ్రహ్మము, వైకుంఠము చన్నదినము ♦ పగలనె కలి యీ
లోకమ్మునఁ జేరె ననుచు, వాకొందు పురావిదులు ప్ర ♦ భావనిధానా!

తే. తత్కలి సహస్రదివ్యవ ♦ త్సరములుం ద
దంశ సంధ్యలు ద్విశతది ♦ వ్యాబ్దములును
జరుగఁ గలియుగంబంతమౌ ♦ నవల నదుల
యాత్మలలరారఁ గృతయుగం ♦ బడుగుపెట్టు. 44

## -♦ యు గ ప్ర మా ణ ము లు ♦-

వ. అనఁ బరీక్షిన్నరేంద్రుండు వినయంబుదోఁప మహాత్మా! యుగప్రమాణ
దివ్యాబ్దాదుల మఱొకసారి యనుగ్రహింపఁగోరెద నన శుకయోగీంద్రుం
డిట్లనియె, రాజా! విను మొకమనుష్యవత్సరము దేవతలకొకదినము.
మూఁడువందలయఱువది మనుష్యవత్సరములు దేవతలకొకసంవత్సరము.
పండ్రెండువేల దేవతాసంవత్సరము లొకదివ్యయుగము. ఒకవేయి దివ్య
యుగములు బ్రహ్మకొకపగలు. బ్రహ్మపగటిలోఁ బదునల్వురు మనువు
లగుదురు. ప్రతియుగమునకును యుగప్రారంభమున సంధ్యయు, యుగాంత
మున సంధ్యాంశములు నుండును. సంధ్యాసంధ్యాంశములనడుమ యుగ
ముజ్జ్వలమైయుండును. దివ్యమానమునఁ గృతయుగమునకు సంధ్యాబ్దములు

వ. ప్రతియుగమ్మున నీక్రమయోగమ్మున నే ప్రాణులందు ధర్మము ప్రవర్తించుచున్నది. 52

కం. నానుడివిన ననుపని ధర, నేనాథులు మమత భూమి ♦ నెలకొల్పి తుదిన్
దాని ధరవిడిచి మరణా. గ్నినులగుచుఁజనిరి వింటె ♦ ధీరవరేణ్యా! 53

సీ. రాజనామమొందిన శరీ ♦ రమును దుదకు
గాఁడిదరయొ బుగ్గియో యగుఁ ♦ జూడనిట్టి
యంగమునకయి యితఁడు ద్రో ♦ హములు సేసి
నిరయమొందు, నాత్మహితంబు ♦ నెఱుఁగలేక. 54

తే. ఈయఖండ భూమండల ♦ మేలినారు
నామపూర్వులు, నేఁడు నే ♦ నేమచుంటి
నెల్లి నాసుతుం డటుపయి ♦ నీమనుమఁడు
నిల్లి మద్వంశ్యు లేలెద ♦ రీధరిత్రి. 55

కం. అని ధరపయి మమకారం, బును భౌతికమైనకాయ ♦ ముపయి నహమున్మ్రక్
గనుకని నిల్పి తుదకు రెం, టి నిలాకాయమ్ముల న్వి ♦ డిచి చనిరినృపుల్. 56

ఆ. బలపరాక్రమముల ♦ వసుధఁ బాలించిన, రాజులందఱుం ధ ♦ రాబిడౌజ!
భూరికాలవేగ ♦ మునఁ గథామాత్రావ, శిష్టులగుచు కేవలించినబడఁగ. 57

వ. అని శ్రీశుకయోగీంద్రుండు వాక్రుచ్చెను. 58

ఇది ద్వితీయాధ్యాయము - సమాప్తము

---

## తృతీయాధ్యాయము

కం. సాధీరయో భవదంఘ్ర్యా, రాధకతా ప్రయతధిషణ ♦ రాజిల్లిన త
త్సాధూద్ధ వితతి యాధి,వ్యాధులఁ దలఁగింపవయ్య! ♦ హరిహరనాథా!

వ. [1]దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. భూదేవి తనను గైవసముసేసికొనఁ దహతహపడుచున్న నృపాలురంజూచి యిట్లుపరిహసించును. 2

### —* శ్రీశుకుండు భూమిగీతనుపదేశించుట *—

శా. భూమీనాథులు మృత్యుహస్తమునఁ గీ ♦ ల్బొమ్మల్ తదంశంబునీ
భూమీశుల్ గనలేక నన్నుగెలువం♦ బోరాటముల్ సేయుచుం
డ్రేమందుర్? భళిరే! మహోరగముఖం ♦ డేఁకారి, తక్ ద్రిమ్మఁగుచో
నామండూకము మక్షికం దినఁగ జి ♦ హ్వాగ్రంబుసల్లార్చెడిన్. 3

---

(1) 24-10-1946 ప్రారంభము.

ఆ. భళిర! నీటిబుగ్గ ♦ పాటియైన కళేబ
రమ్ముమీఁద నమ్మ ♦ కమ్ము వెట్టి
కాముములకుఁ దొడరు ♦ క్ష్మావతుల్ బుధులైన
నేమి వారియాస ♦ లెల్లవృథలె. 4

వ. ఎట్లన, 5

కం. తొలుతన్ షడ్వర్గమ్ముం
గెలుతు మవల రిపుబలంబుఁ ♦ గెలిచివడిన్
బొలియింతు మంత మంత్ర్యా
దుల నృపుసహితముగఁ బట్టు ♦ దుము కడిమిమెయిన్. 6

ఉ. పిమ్మట రాజధానిని బ్ర ♦ వేశమొనర్తుము, పౌరవర్గము
న్నెమ్మికఁ లోను జేసికొని ♦ నేతలమయ్యెద, మిట్టు లబ్ధిము
ద్రమ్మఖిలమ్ము భూతలముఁ ♦ దాల్తుము బాహువులం దటంచు భా
వమ్ములఁగోరుచుందురు నృ ♦ పాలురు గొంతెమకోరికల్ సదా. 7

కం. ఇట్టులు గోరుచుఁ గానీ, కట్టెదుట న్నోరు దెఱచి ♦ కబళింపఁగ ను
న్నట్టి తమమిత్తిరూపుం, గట్టా! కనలేరు వీరిఁ ♦ గన జాలియగున్. 8

ఉ. అంబుధివేష్టితైతదఖి ♦ లావని గెల్చియు నంతఁబోక ద్వీ
పంబులఁగూడ గెల్తుమని ♦ బాహుబలంబున నబ్ధిఁ జొత్తు ర
బ్రంబగు వీరిఁగన్న నవు ♦ రా! ప్రబలేంద్రియజేతలయ్యు మో
క్షంబును గోర కీగతి న ♦ శాశ్వతరాజ్యము గోరుచేటికో? 9

ద్విపద. ఇంద్రియజయమున ♦ కిదియచే ఫల మ
తంద్ర మనంబునఁ ♦ దా మేలకసరో? 10

కం. దేనిని మనువులు మనుసం,తానము గెల్చి యవల స్వ ♦ దలి చనిరో యు
ద్దానికయి వసికిమాలిన, యానరపతు లేలపెనఁగు ♦ లాడెదరో? యనిన్.

ఉ. నాకొఱకై సుమీ పితలు ♦ నందను లన్నలు దమ్ములొండొరుల్
బాకులు బల్లెముల్ గొని త్ర ♦ పారహితాత్మకులౌచుఁ జంపుకో
మూకలు గట్టుచుం ద్రిదియ ♦ మోహమొ? మౌఢ్యమొ? కాన నే బుధుల్
వాకొనుచుంద్రు తేండ్లకు ధృ ♦ వంబుగ నారకమబ్బునంచొగిన్. 12

కం. ఈధర యెల్లను నాదే, వైధేయా! నీదికాదు ♦ వాగకు మనుచున్
గ్రోధములఁ బరస్పరము మ,హీధవు లనిఁ జంపి చత్తు ♦ రీనాకొఱకై. 13

వ. పృథుండుఁ బురూరవుండు గాధి నహుషుండు భరతుండు నర్జునుండు
మాంధాత సగరుండు రాముండు ఖట్వాంగుండు ధుంధుమారుండు

రఘువుఁ దృణబిందుండు యయాతి శర్యాతి శంతనుండు గయుండు భగీ
రథుండు కువలయాశ్వుండుఁ గకుత్థ్సుండు నైషధుండు నృగుండు నాదిగాఁ
గల మహారాజులును హిరణ్యకశిపుండు వృత్రుండు రావణుండు నముచి
శంబరుండు భౌముండు హిరణ్యాక్షుండు తారకుండు నాదిగాఁగల దైత్య
దానవులును నాకీశ్వరులై యుండిరి. 14

కం. వీరందఱు నిజ్ఞులు విదుల్, వీరులు సర్వజయు లజితు ♦ లుం జూమి నాపైఁ
గూరిమిని నిలిపి పరగ, న్మారోహాతు లగుచు కూలఁగి ♦ యవలంజనరే? 15

కం. ఇలపై శాశ్వతముగ వీరలు నిలువం గలిగిరే? స్పృ ♦ హ దివ్యమయ సుఖం
బులఁ దమిదీఱక మును నీ, రలఁ గొంపోవఁడె కాల ♦ రా జదయుండై. 16

వం. అని భూదేవి పలికెనని. రాజేంద్రా! యీం భూగీతాసారం బెఱుంగుము. 17

శా. ముల్లోకంబుల కాత్మకీర్తి లతికా ♦ పుష్పాధికామోద సం
పల్లాభం బొనఁగూర్చి చన్న ధరణీ ♦ పాలావళీ సత్కథా
వల్లుల్ జ్ఞాన విరాగితా సమధిక ♦ శ్వర్యంబులం గూర్చు నం
చుల్లేఖించితిఁ బారమార్థ్య మిటలే ♦ దుక్త్యాగ్రభటం బౌతయున్. 18

వ. మఱి పురుషోపాదేయంబైన పరమార్థం బెద్ది యందువా! విను. 19

ఉ. ప్రాకట భక్తితత్పరులు ♦ పాడుచునుందురుగా పురాపుర
స్వీకృతవాణులై యశుభ ♦ బృందము డిందఁగఁజేయు నుత్తమ
శ్లోకగుణానువాద మెద ♦ లోఁ నమలంబగు కృష్ణభక్తినిం
గైకొనఁగోరి దాని వినఁ ♦ గావలె నెన్నియొమార్లు నిత్యమున్. 20

కం. ఈలీల న్నిరతము శ్రద్ధాళువగుచు హరికథా సు ♦ ధాపూరమ్మున్
గ్రోలఁగఁ గ్రోలఁగ బొడముం, బాలిశునకుఁ గూడ గాఢ♦భక్తి మనమునన్. 21

వ. అనినం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 22

## —* యుగ ధర్మ నిర్వచనము *—

కం. కలియుగమునఁ గలిదోషం,బులు మిక్కుటముగను బెరిగి♦పోవఁదొడఁగ లో
కులు వాని నేయుపాయం,బులఁ దూలించెదరొ! తెల్పు♦మునిజనతిలకా! 23

కం. యుగముల యుగధర్మంబుల
మొగిఁ గల్పప్రళయ మాన ♦ ములఁ దెల్పఁగదే
భగవత్స్వరూపమగు కా
లగతిం దెలిసికొనఁగాఁ ద♦లం పుదయించెన్. 24

వ. అనవుడు శ్రీశుకయోగీంద్రుం డిట్లనియె. 25

తే. కృతయుగమ్మున జనులు ధ ♦ రించి రెల్ల సత్య
మును దయా తపో దానమ్ము ♦ లనెడి నాల్గు
పాదములుగల ధర్మమ్ము ♦ నాదరమునఁ
గనుక వార లాత్మారాము ♦ లనఘమతులు 26

తే. సర్వభూత మైత్రీయుతుల్ ♦ శాంతిపరులు
దాంతులు తితిక్షువుల్ కృపా ♦ వంతు లును సమ
దర్శనులు తుష్టు లాత్మవి ♦ ద్యావిశారద
కలితులై జనుల్ శ్రమ ♦ ణు లగుచుండ్రు. 27

తే. త్రేతయందు ధర్మాంఘ్రుల ♦ రీతిలోన
మెల్లఁగాఁ దురీయాంశమ్ము ♦ పొల్లవోవఁ
దొడరి యనృత హింసలు నసం ♦ తోష విగ్ర
హమ్ము లనెడి యధర్మాంఘ్రు ♦ లిమ్ము గొనఁగ. 28

వ. ఇట్లు లసత్యంబుచే సత్యంబును, హింసచేత దయయు, నసంతోషంబుచే దపంబును, విగ్రహంబుచే దానంబును, నాలవయంశం బడంగఁ ద్రేతయందు మూఁడుపాదంబుల ధర్మంబు చెల్లు. అప్పుడు క్రియా తపోనిష్ఠులు నాతిహింస్రులు నవిషయలుబ్ధులు ధర్మార్థకామపరులు ఋగాదిత్రయీ నిపుణులు నై ప్రజలుందురు. అందు బ్రాహ్మణు లధికులై వెలింగెదరు. 29

తే. ద్వాపరమున నధర్మపా ♦ దముల బలిమి
ధర్మపాదమ్ములు సగమ్ము ♦ తాఁకువడెడి
నపుడు జనులు కీర్తిప్రియుల్ ♦ [1]యజ్ఞకర్త
లధ్యయనరతులుం [2]దృప్తు ♦ లాఢ్యు లధిప! 30

వ. వారియందు బ్రాహ్మణక్షత్రియు లధికులై యుందురు, 31

కం. కలియుగమున ధర్మమునం, ఘ్రులు మూఁడు నశించె నిక్కముగ నొకయడుగే;
కలియంతమునకు నదియుం, బొలియు నధర్మాంఘ్రు లొక్క ♦ మొగిఁ బలిసినన్.

తే. అపుడు జనులు దురాచారు ♦ లధికలుబ్ధు
లతిదరిద్రు లకారణ ♦ హింసకులు నిర్ద
యులును నిర్భరతృష్ణాభి ♦ వృతులు నగుదు
రందు శూద్ర కైవర్తాదు ♦ లధికులనఘ! 33

వ. అనవుడు పరీక్షిన్నరవరేణ్యుం డేవంభూత యుగవైషమ్యమ్మునకుఁ గారణ
మ్మేమన శ్రీశుకమహర్షి యిట్లనె. 34

---

(1) మహాశాలాః అని దొంతిప్రతిలోనుండ "మహాశీలాః" అని వావిళ్ల ప్రతి.
(2) దృప్తాః అని వావిళ్ల ప్రతిలోనుండ "హృష్టాః" అని దొంతిప్రతి.

సీ. జనులందు సత్త్వర ♦ జస్తమంబుల నెడి, మూఁడుగుణమ్ములు ♦ పొలుచుచుండు
నరగి నయ్యవి కాల♦సంచోదితమ్ములై, మనమందుఁ బర్యాయ♦మున నుదిరుగు,
నట మనోబుద్ధీంద్రి♦యములు సత్త్వమున వ, ర్తింప జ్ఞానతపంబు♦లింపుగాఁగ
నందు నయ్యది కృత♦యుగము; రజోగుణ, మందు వర్తింప♦[3]ధర్మార్థకామ

తే. ములను మిక్కిలి యభిరుచి ♦ కలుగు నదియె
త్రేత; మఱి రజస్తమములం ♦ దిరుగ లోభ
కపట మాన మత్సర వృత్తి ♦ కామ్యకర్మ
పరత లొదవెడి నయ్యదే ♦ ద్వాపరమ్ము. 35

తే. నృపవరేణ్య! మనోబుద్ధు ♦ లింద్రియములు
తమమునం గుల్క- హింసన ♦ దైన్య నిద్ర
లనృత శోక మోహ భయ మా ♦ యాలసత్వ
ములును సంభవించెడి నదే ♦ కలియుగమ్ము. 36

-♦ కలియుగమందలి ప్రజల స్థితిగతులు ♦-

వ. అదియునుఁగాక 37

కం. కలియందుఁ బ్రజలు మందమ
తులు దీనులు బహ్వాశనులు ♦ ధూర్తులు స్త్రీకా
ములు విత్తహీను లగుదురు
పొలతు లసతులై యథేచ్ఛ ♦ ముగ నుంద్రు నృపా! 38

తే. బహుళ జనపదమ్ములు దస్యు ♦ బాధితమ్ము
లాగమములు పాషండ దూ ♦ ష్యములు ద్విజకు
లములు శిశ్నోదర పరాయ ♦ ణములు మాన
వాధిపతులు ప్రజాభక్షు ♦ లగుదు రెందు. 39

తే. బ్రహ్మచారు లశౌచు ల ♦ వ్రతులు నౌచుఁ
గులపతులును భిక్షాటనా ♦ కలితులగుచు
మఱి వనస్థులు గ్రామవా ♦ స రతులగుచు
న్యాసు లర్థలోలురగుచు ♦ నప్పుడుంద్రు. 40

3. ‘యదాకర్మసుకామ్యేషుభక్తిర్భవతిదేహినామ్’ అని బొంబై ప్రతి. ‘యదాకర్మసుకామేషుభక్తిర్యశసి దేహినామ్’ అని వావిళ్ళప్రతి. యదాధర్మార్థకామేషుభక్తిర్భవతి దేహినామ్’ అని గోరఖపురప్రతి.

ఉ. పొట్టిగనుండు మేను నొక ♦ పూటకుఁ జాలద కండెఁడన్న మున్
గట్టుకపోయినంత వజ ♦ కద్దుపఁగల్గు సతంబు నోరికి
స్బట్టని వల్కలూరెకిని ♦ నాన యెసంగ దెసంప మోస పెం
గట్టెఁడిచేత కల్ల చెలి ♦ కత్తెలుగా కలియుందు నెల్తుకన్. 41

తే. వర్తకులు క్షుద్రులై మోస ♦ వాటిలంగ
సలుపుదురు క్రయవిక్రయం ♦ బులను మఱియు
నెల్ల రవివత్తలం గూడ ♦ క్షుల్లకంబు
వార్తఁ గైకొంద్రు లెస్సయున్ ♦ భావముంచి. 42

ఉ. విత్తవిహీనుఁడేని వృధ ♦ వీవతి యుత్తముఁడైన వీడిపోఁ
జొత్తురు సేవకుల్ మఱొక ♦ చోటికి; తేండ్లును వెళ్ళఁగొట్టుచుం
ద్రుత్తముఁ గొలునే బెపద ♦ నొంది క్రియాత్ముఁడైన భృత్యునిన్
మిత్తికిఁ దోలిపెట్టుదురు ♦ నీచులు పాలుడుగంగ గోవులన్. 43

తే. కట్టి! తల్లిదండ్రులను దోఁ ♦ బుట్టువులను
జ్ఞాతులను వీడి సొరత ♦ సౌహృదమున
దారవంశవారల మాట ♦ గారవింత్రు
స్త్రీవశంవదుల్ నరులేమి ♦ చెప్పవాఁడ? 44

ఉ. శావులు గట్టి పెంజడలు ♦ గైకొని కొబ్బరిగింకి దండమున్
వావిరిఁదాల్చి గద్దియల ♦ భాసిలుచున్ యతి వేషధారులై
కోవిదులట్లు ధర్మములు ♦ గూడ వచించుచు నజ్ఞులయ్యు నీ
జీవికతోఁ బ్రతిగ్రహము ♦ సేయుచుఁ గాలముపుత్తు రంఘ్రిజుల్. 45

కం. వానలు లేమిన్ దుర్భిక్షానీకము వొడముట న్ని ♦ రన్నావనిలో
మానవు లతిభీతి సతము, నానాకష్టములఁ జిక్కి ♦ నలుగుదు రధిపా! 46

తే. తాల్పఁ గుడ్డయుఁ దినఁ దిండి ♦ త్రావ నీరు
పండ నిల్లు పెట్టన్ సొమ్ము ♦ పైకిఁదాన
మక్కటా! యేదియును లేక యవని జనులు
తిరిగెదరు పిశాచమ్ముల ♦ కరణిఁ గలిని. 47

ఆ. చిల్లిగవ్వకైన ♦ జెలిమిని దిగనాడి, చొచ్చి జగడములకు ♦ సొంతవారి
నైనఁ బిల్లుమార్చు ♦ చక్కటా! స్వప్రియ, ప్రాణములను గూడ ♦ వదలుచుంద్రు.

చం. తమవయి నాసపెట్టుకొని ♦ తాము గడించినదిచ్చి యెన్నిక
ష్టములనొ పొందు చెట్లొ తము ♦ సాఁకిన తల్లిని దండ్రిఁ గాలవే

గమునను వృద్ధులై నవసి ♦ కన్నులఁగానని వారి నక్కటా!
కొమరు లనాదృతిం గసరి ♦ కొట్టుచుఁ బోషణచేయ రెంతయున్. 49

వ. మఱికొందఱు, పిత లెంత యనుకూలమతి ననుసరించుచున్నను 50

కం. కొడుకులు ప్రయోజకులగుచుఁ
గడకంటనె కనరు మాట ♦ కత యిఁక నేలా?
కడుపునకును శిక్షమునకుఁ
బడిచచ్చెద రెవ్వ రెన్ని ♦ వలుకుచునున్నన్. 51

చం. తనయులఁ జూచి తండ్రులును ♦ దండ్రులఁ జూచి సుతుల్, గృహీతలౌ
వనితలఁజూచి భర్తలును ♦ భర్తలఁజూచి స్వకీయ దారలున్
మునముసలాడుచుండు రొక ♦ పోఁబడిఁబోవ రొకళ్ళొకళ్ళతో
గినుకను వాదులాడుచును ♦ గేడమూడుచునుండు రెవ్వరున్ 52

కం. కలిలోన నరులు పాషండ లుప్తబుద్ధులయి కొల్వ ♦ టకుఁ బూనరు శ్రీ
విలసితవక్షున్ దానవ, కులభక్షున్ నీరజాక్షు ♦ గోద్విజ రక్షున్ 53

తే. ఆతురుఁడు మరణమునందు ♦ నతఁడు జాఱు
నతఁడు పతితుం డవశతచే ♦ నైన నెవని
నామము స్మరింపఁ గర్మబం ♦ ధములు తొలఁగి
పరమగతి గ్గలు వానిఁగొ ♦ ల్వదు జనంబు. 54

వ. ఇది కలిజనంబుల నడివడి రాజా! ఇఁక గలి నిస్తారోపాయంబు వినుము!
ఏతత్కలికృత ద్రవ్యదేశాత్మ సంభవంబులగు దోషంబులనెల్ల భగవంతుం
డైన పురుషోత్తముండు చిత్తస్థుండై పరిహరించును. 55

ఉ. కావున గోపబాలుని జ ♦ గజ్జన రక్షణకేళిలోలునిన్
భావమునందు నిల్పినను ♦ భక్తిని బాడిన నాదరించినన్
గోవెలకేగికొల్చినను ♦ గొండొక విన్నను వాని కోటిజ
న్మావళి సంచితాఘ నిచ ♦ యంబుల శ్రీహరి కాల్చి వైచెడిన్. 56

తే. అన్యలోహముల్ కలియుట ♦ నైన కొఱత
వన్నెఁబాపి పెన్నిగ్గిచ్చుఁ బసిఁడికనలుఁ
డన్యవాంఛలచే నైన ♦ యఘముఁ బాపి
పూతముంజేయు బుధమతిం ♦ బొలసిశౌరి. 57

ఉ. మానస సంస్థితుండయిన ♦ మాధవుచే నగుశుద్ధి విద్యలం
గాని తపోఽనురోధములఁ ♦ గాని సుమైత్రినిగాని తీర్థవా
స్నానన శుభవ్రతంబులను ♦ సల్పినఁగాని జపంబుసేసినం
గాని విహాపితంబులను ♦ గాని లభింపద వేయునేటికిన్? 58

కం. కావున సర్వవిధంబుల, నీ వవహితమతిని హరిని ♦ నిల్పుము దీనిం
గావించిన మృతుఁడవుగాఁ, గైవసమగు నీకుఁ బరమ ♦ గతి మనుజేంద్రా !
కం. మరణించునప్పుడు నరా, త్పరు పాదాంభోజములను ♦ ధ్యానముసేయన్
వరదుఁడు సర్వాత్ముఁడు స్వ, స్వరూపము నొసంగి ప్రోచు ♦ వానింగరుణన్
కం. కలి సర్వదోషములకు, న్నిలయమయిన నందొకంటు ♦ నిలిచె సుగుణమున్
జలజాక్షు కీర్తనంబే, కలిగించుం బంధముక్తి ♦ కల్యాణంబున్. 61
కం. కృతయుగమున ధ్యానంబుల, వితానములఁ త్రేతయందు ♦ వివిధసపర్యా
తతి ద్వాపరమునఁ గల్గెడి, గతి కీర్తనమాత్రమున న♦కలిలోఁగలుగున్. 62
వ. అని శ్రీశుకుండు పలికి నిమీలితాక్షుండై 63
కం. శ్రీవత్సలాంఛనా ! శౌరీ ! వనమాలీ ! ముకుంద ! ♦ కృష్ణా ! శ్రీనా
థా ! విశ్వంభర ! కేశవ !, గోవిందా ! చక్రపాణి! ♦ గొను మన్నుతులన్
వాది కం. వనమాలీ ! వరదాయక !, వనజాక్షా ! వాసుదేవ! ♦వైకుంఠా! వా
మన! వామదేవమిత్రా!, వనజోదర! వజ్రివినుత! ♦ వంచనమథనా!
తలకట్లకం. పరమపురుష!మాధవ! సుర,వరప్రద! దయాంతరంగ!♦భవభంగ!మహా
సురమర్దన! త్రయ్యంత,స్ఫురత్పదద్వయ!ముకుంద!♦సుధకరహృదయా!
వ. అని నృపునితోఁగలిసి శ్రీశుకుండు నామసంకీర్తన మాచరించెను. 67

ఇది తృతీయాధ్యాయము సమాప్తము

---

## చతుర్థాధ్యాయము

కం. కర్మజ్ఞానేంద్రియముల, నిర్మలమానసము బుద్ధి ♦ నిం జిత్తము నం
తర్మహితాహంకారము, నర్మిలి నంటక వెలుంగు ♦ హరిహరనాథా! 1
వ॥ [1]దేవా ! యవధరింపుము. అంత శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రు
నితో నిట్లనియె. రాజా ! యుగధర్మముల నుడివితిని. హరికీర్తనంబునఁ
గలిదోష నివర్తనంబగునని పలికితి. నింక నీయడిగిన కల్పప్రళయంబులం
గూర్చి వక్కాణించెద నాలింపుము. పరమాణువు మొదలుకొని ద్విపరా
ర్థము తుదిదాఁకం గలకాలమును నొడివితి. మఱియు వినుము. 2

### —♦ దైనందిన కల్పములు ♦—

కం. యుగములునాలుగుఁగూడిన,వగునొక్కమహాయుగము సహ♦స్రమితమహా
యుగములు చతురాస్యునకొక,పగలగు, దైనందినమనఁ ♦ బడుకల్పమిదే 3

[1] 29—10—1946 ప్రారంభము.

వ. బ్రహ్మకును మాసంబునకు ముప్పదిదినంబులు. దినమేకల్పము. వానిపేరు. మొదటిది శ్వేతవరాహకల్పము. ఆవల నీలలోహిత, వామదేవ, రాథంతర, రౌరవ, దేవ, బృహ, త్కందర్ప, స, త్యేశాన, తమ, సారస్వ, తోదాన, గారుడ, కౌర్మ, నారసింహ, సమా, నాగ్నేయ, సోమ, మానవ, తత్పురుష, వైకుంఠ, లక్ష్మి, సావిత్రీ, ఘోర, వరాహ, వైరాజ, గౌరీ, మహేశ్వర, పితృ, కల్పంబులు క్రమంబుగా ముప్పది కలవు. 4

కం. దైనందిన కల్పంబున, క్ష్మానాథులు పదునలువురు ♦ మనువులు వరుసన్
క్ష్మానేలుచునుందురుచతు, రాననునకుఁ బ్రొద్దుగ్రుంక♦నదె ప్రలయమనన్

## —♦ నైమిత్తిక ప్రలయము ♦—

కం. జననాయక ! నైమిత్తిక, మనఁ బ్రాకృతికమ్మనంగ ♦ నాత్యంతికమం
చన నిత్యమనాఁ బ్రలయం, బున నాలుగు తెఱఁగులుగ న♦వు న్భాగింపన్ 6

కం. రాతిరి యగుడుఁ బరుండున్ ధాత, యది నిమిత్తమున నై♦మిత్తికమున్
ఖ్యాతిప్రలయమునకొదవెన్, రాతిరిమానమునుబగటి♦క్రమముననుండున్. 7

తే. ఆత్మసాత్కృత మొనరించి ♦ యఖిలవిశ్వ
మబ్జభవుఁడు శ్రీనారాయ ♦ ణాత్మకుఁడయి
యయ్యనంతాసనమ్మున ♦ యందుఁ బండి
హాయిగా నిదురించెడి ♦ నాత్రేయ ! 8

వ. ఈ ధాతృ నిశాకాలంబును చతుర్యుగ సహస్రప్రమాణంబు కావున నంతకాలము కడచన్నపిదపఁ దెల్లవాఱును. అపుడు బ్రహ్మ మేల్కాంచి మరల సృష్టికిం గడంగును. బ్రహ్మదేవుని దినాది సృష్టికల్పము, దినాంతము ప్రలయకల్పముగదా. ఆవ్విధి నవ్విధి దివసంబులు గడచుచుండును. మూడువందలయఱువది దినంబులు వత్సరం బనులెక్క నాదేవునకును నూఱేండ్లాయువు. ఆ నూఱేండ్లాయువునకుఁ బరమనిసంజ్ఞ. కావనే యేఁబదివత్సరములకుఁ బరార్ధసంజ్ఞ కలదు. ఇపుడు ప్రథమపరార్ధము గడచి ద్వితీయపరార్ధమునం బ్రథమదివసము ధాతకుఁ గడచుచున్నది. 9

## —* ప్రాకృతిక ప్రలయము *—

తే. అబ్జునకుం ద్విపరార్ధాయు ♦ వరుగఁగానె
మహ దహంకార పంచత ♦ న్మాత్రములను
ప్రకృతిసప్తకమ్మును గాల ♦ వశతనణఁగు
నందువలన బ్రహ్మాండ ల ♦ యమ్ముజరుగు. 10

వ. ఈ సప్త ప్రకృతిలయనిమిత్తంబున దీనిం బ్రాకృతిక ప్రళయం బందురు. అవ్విధము 11

శా. ధన్యాత్మా! విను నూఱువత్సరము లే ♦ తద్భూతలంబందుఁ బ
ర్జన్యుం డొక్క వృషత్తునే విడువఁ డీ ♦ ప్రాణుల్ జలాన్నంబులున్
శూన్యంబౌటను దృట్క్షుధా వ్యధితులై ♦ చున్ స్వాంతము ల్లేక య
న్యోన్యమ్ముం గబళించి చచ్చెదరుసు ♦ మ్మా యానుపూర్వ్యంబుగన్. 12

తే. అంశుమంతుండు పర్జన్యుఁ ♦ డర్యముండు
ధాత విష్ణువు మిత్రుండు ♦ త్వష్ట భగుఁడు
వరుణుఁడును బూషుఁడును వివ ♦ స్వంతుఁ డింద్రుఁ
డనెడి ద్వాదశాదిత్యులై ♦ క్యమయి యుంద్రు. 13

తే. అవనియందు దేహములందు ♦ నబ్ధులందు
వరలు రసము నంతయును సాం ♦ వర్తకాఖ్యుఁ
డుగ్ర కిరణమ్ములం ద్రావు ♦ చుండుఁగాని
క్రమ్మఱ న్విడువం డంబు ♦ కణ మొకండు. 14

చం. కలగొనుఁ జుంయిచుంయిమనుఁ ♦ గ్రందుకొనర్చుఁ గడున్నహూను స
ల్పలసలఁగ్రాఁగు మొయిమొయి ♦ సందడి బిట్టుగఁజోవుఁ గ్రిందఁ బైఁ
గళపెళలాడి తెప్ప నథి ♦ కంబుగ నూష్మము రేఁచు పొంగులై
పొలపొలవెల్లువల్ వఱవుఁ ♦ బో దివికిన్ రవిఘృష్టి కంబుధుల్. 15

తే. పైని సూర్యుండు లోపల ♦ బాడబాగ్ని
స్వప్రతాపంబులం జూప ♦ సాఁగజలధి
కెంతకాలంబు గాంభీర్య ♦ మెసఁగఁబోవు
సిద్ధఱ నొకండు గెల్చుట ♦ యెట్లు సెపుమ. 16

ఉ. ఊటలబాట బీఁటగిలు ♦ నోటువడుం బ్రిహికాండముల్ సరో
ఝాటము లూఁచిపోవు హ్రద ♦ సంఘము లింకును దేవఖాతముల్
బీఁటికలెత్తు నిమ్నగల ♦ పిండు స్వరూపముమాయు నంబుధుల్
గాటికిఁ గాళ్ళుసాచును వి ♦ కర్తను నుష్ణగభస్తిఘృష్టులన్. 17

ఉ. తావులులేక కాయములు ♦ దాఁచుకొనం బ్లవకోటి దోరు న
క్రావళి రూపుమాయుఁ గమ ♦ ఠాన్వయజాతము లీల్గు కాలరా
జీవ తిమింగిలాది జల ♦ జీవు లశేషము నాశమౌను హా!
జీవనముల్ సమస్తము న ♦ శింప నిఁకం బ్రదుకంగ శక్యమే! 18

చం. చిటచిటలాడి భూజతతి ♦ చెల్లును సావయువాలయావళుల్
పెటపెట పెట్లిపోవుఁ బృథి ♦ వీధ్ర దృషద్ధ్వజ మొక్కపెట్టునన్

పటుపట ప్రబద్ధలై శకల ♦ పంక్తులు నీఱయిపోవు భాస్కరో
త్కట కటు తీక్ష్ణ ఘృష్టి వివి ♦ ధస్ఫుట ఘూర్ణనసంభ్రమంబులన్. 19

వ. ఆ క్షయకాల సమక్షంబునం గర్మసాక్షి యతితీక్ష్ణాత్యుష్ణాంశు ప్రక్షేపంబుల
జగత్కుక్షి విక్షోభంబు గల్గింప, 20

ఆ. ఎచటివస్తు లచట ♦ నే నోళ్ళు తెఱచు న
ప్పేటి మృగంబు లట న ♦ సొమ్మసిల్లు
క్షుద్రమృగములగతి ♦ సోదికిరా దిట్లు
మిత్రుఁడే యొకప్డు ♦ శత్రువగును. 21

వ. ఇట్లిచట సాంవర్తకార్కుండు విక్రమోద్వర్తనంబులం బ్రవర్తిల్లుచుండ నచటఁ బాతాళంబున నమర్షప్రకర్ష ఘూర్ణమానేక్షణ సంకర్షణ సహస్ర వక్త్ర గహ్వర ప్రోద్భూతాసహ్య బృహద్బాహుం డుజ్జ్వల కరాళ జ్వాలా జిహ్వాజాలంబుల నసమరభసమున నలుదెసలఁ బ్రసరింపంజేసి తత్రత్య కాలవ్యాళాది సర్వప్రాణి ప్రతాన ప్రాణసమీరణ పారణ పారీణుండై పాతాళంబుఁ గాతాలంబున నిర్మూలంబు గావించి తీవ్రతమ ప్రకంపన ప్రతాప ప్రేరితుండై యూర్ధ్వంబున నుల్లంఘించి తలాతలంబంటుకొని దానికి దలాత లక్షణంబు శిక్షించి యుపేక్షింప క్షణంబ మహాతలంబుం జొచ్చి దాని నరాతింబోలె నపేతజీవ వితానంబుఁ బొనర్చి మాడ్చి లాఁతి విలాతియగు రసాతలంబున కీతలుండై యేతెంచి యచటి భూతంబుల వితానవతిచి యాలోకంబు ననాలోకంబుఁ జేసి యతులంబగు సుతలంబు లక్షించి దానిం గుక్షినిండ భక్షించి వితలంబుం జొచ్చి మచ్చరించి పెచ్చుపెరిగి దానిని విస్మయంబుగ భస్మమయంబు సలిపి తలమనుచు నతలమున కరిగి దాని నతలకుతలముఁగావించి యటనుండి శరంబు రయంబున భూవివరంబులం బ్రవేశించి పెళ్లుపెళ్లున భూఖండంబుల ఖండంబులు గావించి యఖర్వగర్వంబున మహాపర్వత గహ్వరంబులం దూఱి నిండుకొని యుద్దండుండై యఖండలపింకును బిండలిసేయుచు ధరణ్యుపరితలమున కుఱికి యొకదెస సరీసృపప్రభువునట్లు పీఁకమెయిఁ బ్రాఁకుచు నొకక్రేవ సారంగయూథాధినాథున ట్లుల్లంఘించుచు నొక్క యిక్క హయంబునట్లు రయంబునం బఱచుచు నొకవైపు గరుడునియట్టు లెగురుచు సిమసిమశబ్దించుచు సురసురలాడుచు భగభగమండుచుఁ దుక తుకయుడుకుచు సర్వంసహోజ్జ్వలుండగుటనో భస్మరేణుపటలంబు నెఱపుచు సర్వతోముఖాధికుండగుటనో సుళ్ళుబెట్టుచుఁ బ్రభంజనుండగుటనో నిఖిల వస్తు వినాశంబు గావించుచు ననంతాకారుండగుటనో యెల్లయెడలఁ దాన యగుచు నిట్లు చతుర్విధభూతాత్మకుండగుటనో యన్నింటిని లోఁగొనుచు

ధర్మరాజునాఁ బిండీకృతశల్యుండగుచు భీముండునా నిర్మథితకీచకుండగుచు ధనంజయుండునాఁ గృష్ణవర్త్మానుసారియగుచు నకులుండునా వాహాశిక్షావర్తనుండగుచు సహదేవుండునా దగ్ధశకునియగుచు సర్వభక్షుండయ్యు బావకుండు లోహితవర్ణుండయ్యు శుచి యంటరానివేల్పయ్యు విబుధాస్యుండు నయి యాసాంప్లవిక సప్తార్చి కాళిచేఁ బదార్థజాలంబుల గాలించి గాళిగావించుచుఁ గరాళిచే నరాళలీలఁ గరాళించుచు మనోజవచే ననేదిష్ఠగతంబుల ననోకహపదంబులపై వాలి వినోదించుచు సులోహితచేఁ గులాచలంబుల విలోకించి యేర్చి విలోలంబులొనర్చుచు సుధూమ్రవర్ణచేఁ బృథూటజ విభూతి విధూనన మాచరించుచు స్ఫులింగినిచే నభోంగణము వెలుంగఁజేయుచు విశ్వవాసచే విశ్వమును నశ్వరమొనర్చుచు నడరి యెడవక యుడుకున నుడికిలించుచుఁ బొడఁగనఁబడని వడువునఁ బుడమిని వడివడిఁ ద్రసరేణుమయం బొనర్చి తనలోఁ గల్పుకొనుచు భుగభుగాయమాన ధూమస్తోమంబులు భీమంబులై ప్రసరింపఁ బటపటాయమానంబులై విస్ఫుట విస్ఫులింగపటలంబులు చటులంబులై పెటిలుచుండ భగభగాయమానంబులై యరాళకరాళ కీలికామాలికలు పోలికలు లేక పెంపారుచుండ సహస్రముఖ ప్రభవ విభవుండగుటనో యజస్రంబు సహస్రముఖంబుల వ్యాపించుచుఁ గాళ్యాప్యాశాపాశము నాశంబగుటనో యాకలం బ్రాఁకి భువర్లోకంబు నాలోకించి యేకలంబై దాని నేకీకరించుకొని సువర్లోకము నేఁకటదీఱఁ బొకార్చి యార్చి పేర్చి మహర్లోకంబు దాఁకి దానిం బొకడవెట్టి జనలోకము సోఁకి వీఁక మెయి దానికిఁ గాకచావు కల్పించి తపోలోకము దూఁకొని దానిఁ గాకుసేసి యా సత్యలోకౌన్నత్యము నసత్యముం జేసి యా జంటమొగమ్ములదంట బమ్మగ్రుడ్డువనంటి నంటి యొంటుకొని యొంటరిఁడై పెనుమంటల నెదిరి యొంటమి గెంటంజాలి జంటలేక మలయుచుఁ ద్రిపురరక్షశ్శిక్షణ దీక్షాసదృక్ష రూక్ష దాక్షాయణీశ నిటలాక్షి ప్రక్షిప్తాశుశుక్షణి నకుక్షిజేశీయుం డగుచు వామనుండునుంబోలె బలిబంధనవీరుండై వీరభద్రుండుంబోలె నికృత్తదక్షాయుష్కాలుండై కాలుండుంబోలె శిక్షితాగోజీవభూతుండై భూతేశుండుంబోలె భూతివటలావలిప్తావఘనగణుండై గణనాథుండుంబోలె నాగాస్యప్రభూత విలాసుండై చెలంగు. 22

తే. ఒక్కదిక్కు కృశానుఁ డిం ♦ కొక్కదిక్కు
భానుఁ డుగ్రశిఖా కలా ♦ పముల మాడ్చి
వేయ దగ్ధగోమయ పిండ ♦ విధముగాఁ జె
లంగు బ్రహ్మాండభాండం బి ♦ లాతలేక ! 23

తే. అంతటఁ బ్రచండ సాంవర్త ♦ కానిలుండు
భూరి వేగోద్ధతుండయి పొలసి పొలసి
భంయిభంయిని సుడియుచు ♦ వంద యేండ్ల
కధికముగఁ జేయు వీరవి ♦ హార మనఘ! 24

చం. అహరధినాథుఁ ద్రోపు ప్రవ ♦ హమ్ము, ఘనాదుల నాడఁజేయు నా
వహమును, దారలన్నిలుపఁ ♦ బర్వెడి యుద్వహ, మిందుఁ ద్రిప్పు సం
వహము, గ్రహాళినూఁచెడి వి ♦ వాహము, సప్తఋషిస్వరావగో
ద్వహము పరీవహమ్ము, ధ్రువుఁ ♦ బట్టు పరావహ మైక్యమయ్యెడిన్. 25

కం. సుడిగాలిగ సరిగాలిగఁ, గడువడిగాలిగను మీఁది ♦ గాలిగ, నెదుర
య్యెడిగాలిగ, నడగాలిగ, నడరెడి నా విలయవాయు ♦ వవనీనాథా! 26

తే. మును విభావసూష్ణాంశువుల్ ♦ పొలయునైన
భస్మరాసుల నిమ్మహా ♦ వాయు వెగచి
తద్రజఃకణంబుల మొయిల్ ♦ దారి నెల్ల
ధూమ్ర వర్ణాకలితముగాఁ ♦ దూఁగఁ జేయు. 27

కం. అగ్నామారుతు లీక్రియ, భగ్నము సేయంగ నీప్ర ♦ పంచము నంభో
ముగ్నివహము తమపనికై, భుగ్నాకృతు లగుచు నింగిఁ♦బొలుచు నరేంద్రా!

సీ. కత్కాల విభ్రమ♦కృత్తాల పృథుతటి, త్వత్కేళి కాంచద్వి ♦ యత్కమగుచు
వర్ణభావాఖ్య సం ♦ పూర్ణశోభావదు,ద్గూర్ణ శక్రధ్వజా ♦ కీర్ణమగుచు
నుద్యద్ద్యుతి స్ఫుర♦ద్విద్యుత్స్రహాగ్రసప్రై, శద్యద్ధరిత తమో♦వద్యమగుచు
దుర్జయ గంభీర ♦ గర్జిత నిర్ఘోష, భర్జిత బ్రహ్మాండ ♦ ఖర్జువగుచు

తే. పృథుల దుస్సహ వాయు చ ♦ పేటమగుచుఁ
బటపటాత్కార కరకా ప్ర ♦ పాతమగుచు
నశ్రుతాదృష్టచర శీక ♦ రాఢ్యమగుచు
నలరు దుర్దిన మ్మమ్మహా ♦ విలయమందు. 29

శా. శంభుండుం బ్రళయోగ్ర తాండవకళా ♦ సంరంభిగా నంది హ
స్తాంభోజద్వయి నల్పునో మురజ ని ♦ ర్హ్రాదం బటంచెంచఁగా
నంభోదంబులు ఘెల్ఘెళా ప్రబల గ ♦ ర్జారావముల్ సేయు చా
రంభించుం ధరణీధ్ర తుల్య కరకా ♦ రాజిం బడంద్రోయఁగన్. 30

శా. జంభద్వేషి కృతాంఘ్రిశృంఖలల ర ♦ జ్జ్వాబంధముల్ ద్రెవ్విపో
నంభోభృత్తతి సర్వదిక్తటములన్ ♦ వ్యాపించి విద్యుత్ప్రభా
సంభారంబులు స్ఫూర్జథుధ్వనులు గ ♦ ర్జాధ్వానముల్ భ్రాజిలన్
గుంభద్రోణముగాఁగ వృష్టిగురియున్ ♦ ఘోరాతిఘోరంబుగన్. 31

తే. కాల కావర్త సంవర్త ♦ నీలములును
బుష్కల ద్రోణ వాయు త ♦ మో జలమ్ము
లనెడివారు విసెడివారు ♦ నడ్డ మదుపు
లేమిఁ గ్రుమ్మరించు జలమ్ము ♦ నాముకవిసి. 32

మ. చెవులుం జిల్లులువోవు వాగడుమసం ♦ జీకట్లుగ్రమ్మం గనుం
గవ రాఁబోకుఁడనన్ మనంబులు కలం ♦ గం జొచ్చ సౌదామినీ
నివహం బెటికనన్ బ్రభుం డొకఁడు కా ♦ న్పింపండు గాన న్నిశల్
పవళుల్ సంతతధారగాఁ గురిసెసి ♦ వర్షంబు నూఱేండ్లులుల్. 33

కం. కాండంబు లగుచు నింద్రుని, కాండంబులు ఘోరవిలయ ♦ కాండంబున న
కాండంబుల నెల్లఁ గురిసి, కాండఁబుఘటంబునిండ♦న ప్లావనరించున్. 34

కం. ఇమ్మాయి విశ్వ మ్మఖిల, మ్మమ్మాయమై యుండఁ బుడమి ♦ దగు గంధగుణ
మ్మిమ్ముల జలమ్ము మ్రింగఁగ, నమ్మేదిని యవల నాశ♦మగు నీరములన్.

కం. జలములఁగల రసగుణమును, జ్వలనుండు హరింప నీర♦స జలం బగ్నిన్
విలయించు,వహ్నిరూప మ,నిలుండుగొన వహ్ని యయ్యె♦నిలమందడఁగున్

కం. అనిలుని స్పర్శగుణంబును, విను హరియింపంగ స్పర్శ ♦ విరహితపవనం
బును లయమగు నాకాశం,బున గుణములఁబాసి బ్రదుకఁ♦బోలునె! చెపుమా!

సీ. అంతట వినవయ్య♦యాత్మీయగుణమగు, శబ్దమున్ భూతాది ♦ సంగ్రహింప
నాయంబరమ్ము భూ♦తాదియౌ తామసా,హంకారమందుల♦యంబునొందుఁ;
దైజసాఖ్యంబైన ♦ రాజసాహంకార, మింద్రియంబులను స ♦ వృత్తికముగ
హరియించు;సాత్వికా♦హంకారమయ్యింద్రి,యాధిదేవతలవృ♦త్త్యన్వితముగ

తే. మ్రింగివైచెడి; వినుమంత ♦ మేదినీశ !
తత్త్రివాహంకారముల మహ ♦ త్తత్త్వ,మమ్మ
హత్తుఁ ద్రిగుణమ్ము లాత్రిగు ♦ ణాళిఁ గాల
చోదితమ్మయి ప్రకృతియు ♦ సాకిదిమ్రింగు. 38

కం. సుమతీ! దాని కహోరా, త్రము లిచ్చెడి భావవికృతి ♦ తతి లే, దది ని
త్య మనాద్యంత మ్మవ్య, క్త మవక్షయశూన్య మఖిల ♦ కారణమరయన్ 39

తే. మూలపదము వాఙ్మనములు ♦ ముట్టలేవు
త్రిగుణములు మహదాదులు ♦ తగులలేవు
ప్రాణ బుద్ధీంద్రియాధిదే ♦ వతలు చొరరు
జాగతాకార సన్నివే ♦ శమిఁక నేడ? 40

తే. దానికిం జాగ్రదాద్యవ ♦ స్థలు పొసంగ
వద్దిరవిగాదు పంచభూ ♦ తాళిగాదు

సుప్తమ ట్లింద్రియాదిక • సాన్యమగును
సాన్యమ ట్లప్రతర్క్యమహా • చు వెలుఁగొందు. 41

కం. పురుష ప్రకృతుల సత్వాది రూఢశక్తు లిటు కాల • దీర్ణము లగుచుశా
బరవశములై లయించును, ధరణీశా! యిదియె ప్రాకృ•తప్రళయ మనశా. 42

-• ఆత్యంతిక ప్రళయము •-

ద్విపద. స్తుత్య తత్వజ్ఞాన • శోభా ప్తిచే న, సత్యమహా సర్వవి • శ్వమ్ము లయించు
నాత్యంతిక ప్రళ•యము ము క్తి యిదియె, మత్యమరాచార్య•మతి వినవయ్య! 43

వ. గ్రాహక కరణ గ్రాహ్యంబులైన బుద్ధీంద్రియ విషయముల కాశ్రయభూతంబై జ్ఞానశబ్దవాచ్యంబైన బ్రహ్మమే భాసించుచున్నది. దృశ్యమ్మును గారణావ్యతిరేకంబును నాద్యంతవంతమును నగుటంజేసి ప్రపంచము రజ్జుసర్పము వలె నవస్తువుగదా. అదిభాసించుటక? రాజేంద్రా! యేమట్లుచూచెదు! కారణావ్యతిరేకంబనఁ దెలియ లేదా? దృష్టాంతముం జెప్పెదవినుము. తేజః కార్యము దీపము. తైజసాహంకారజన్యము లింద్రియము లగుటంజేసి తేజోనుగ్రాహ్యము నేత్రము. తేజస్సు నాశ్రయించినది రూపము. కాఁబట్టి దీప నేత్ర రూపములు మూఁడును దేజస్సుకంటె భిన్నములుగావు. అట్లే గ్రాహకంబగుబుద్ధియుఁ గరణంబులగుశ్రోత్రాదీంద్రియములు గ్రాహ్యంబులగు శబ్దాదిమాత్రములును బ్రహ్మకార్యంబులు బ్రహ్మనుగ్రాహ్యంబులు బ్రహ్మాశ్రయంబులు నగుటంజేసి బ్రహ్మముకంటె వేఱైనవిగావు. మఱి కార్యకారణము లభిన్నంబులైనచోఁ గార్యమువలెఁ గారణంబును నసత్తు గాదా? యందువేమో? యట్లుకాదు. ప్రపంచముకంటె బ్రహ్మము వ్యతిరిక్తమైనదే కాని బ్రహ్మముకంటెఁ బ్రపంచము వ్యతిరిక్తమైనది కాదు. జాగ్ర త్స్వప్న సుషుప్తులు బుద్ధిదశలు. ఆయాయవస్థలయందలి విశ్వ తైజస ప్రాజ్ఞ రూపంబగు నానాత్వ మంతయుఁ బ్రత్యగాత్మయందు మాయామాత్రంబని యెఱుంగుము, రాజేంద్రా! బుద్ధియే యసత్తైనఁ దదవస్థలంగూర్చి చెప్పవలయునే! 44

గీ. జలధరములు వ్యోమంబునఁ,
గలుగుచుఁ బాయుచును నుండు • గతి సావయవం
బు లగు సమస్తజగంబులు
నల బ్రహ్మమునం దొడవుచు • నడఁగుచు నుండుశా. 45

కం. ఏయది సావయవంబో
యాయది యాద్యంతవంత • మగు ఘటము వలెశా

ధీయుత ! కాన జగము సా
పాయము నిత్యమ్ము బ్రహ్మ ♦ వస్తువ యంటిఁ. 46

వ. కార్యకారణములలోఁ గారణమే సత్యమైనది. 47

తే. అవయవావయవులలోన ♦ నవయవంబె
సత్యమైన, దవయవి బా ♦ సంగకుండ
నవయవంబు పృథగ్భూత ♦ మై వెలుంగు
దంతు వది విరాజిలదె వ ♦ స్త్రంబు లేక. 48

వ. తంతువులేని వస్త్రంబు మాత్ర ముండదన రాజు కార్యమే లేదనుచుంటివి. మఱి బ్రహ్మమునకుఁ గారణత్వముమాత్ర మెట్లు పొసంగు నన బ్రహ్మరాతుం డిట్లనియె. పోనిమ్ము. ఆపేరుమాత్ర మెవరు సత్యమనిరి కార్య దృష్టిం జేసి కారణమంటిమి. అంతియు నృపతీ ! కార్యకారణములవలనను, నన్యోన్యాపాశ్రయమువలనను, నుపలభ్యమానంబగు నదంతయు భ్రమంబె. ఆద్యంతములుగలది నిత్యమెట్లగు నయ్యా ! ప్రపంచ మసత్తని యనేక హేతువుల సాధించెదవు. ఇది యిట్లు ప్రకాశించుచున్నదే ! దీని నేల సత్తని వల్కరాదందువా? విను మిదిప్రకాశించుట ప్రత్యగాత్మవలననే. అదిలేక వికారంబైన యీప్రపంచమం దణువైనను ప్రకాశింపనేరదు. అట్లు ప్రకాశించినచో నది చిదేకరూపంబై స్వప్రకాశంబ యగును, మఱి యాత్మకు జీవుండని బ్రహ్మంబని నానాత్వము లేదా? యందువా? వినుము.

సీ. అవనీశ ! సత్యమా ♦ నాత్మకు నానాత్వ
మెప్పుడు లే దట్టు ♦ లెంచునాఁ
డజ్ఞుండ ; ఘటమున ♦ యందలి యాకాశ
మును మహాకాశ మొం ♦ దున పృథక్త్వ
మిది పరిచ్ఛేదక ♦ కృతభేద ; మంబరా
ర్కున కంబుబింబితా ♦ ర్కునకుఁ గలదె
యంతర ? మిద్ది యు ♦ పాధికృత వికార
మగుచుగాదా ? శరీ ♦ రాంతరమగు

తే. ప్రాణవాయువు బాహిర ♦ వాయు వొకఁడ
గాద లే క్రియాభేదంబు ♦ గ్రాలుఁగాక
యీ పగిదిని జీవబ్రహ్మ ♦ రూప వివిధ
తా విలాసం బుపాధుల ♦ చే వెలుంగు. 50

వ. వాస్తవంబున లేదు. మఱి జీవనామ మేలవచ్చెనందువా ? యదియు నుపాధి వలన వచ్చినదే. 51

శా. బంగారంబు నెగా విశేషరచనా ♦ ప్రాగల్భ్య మేపారుచో
నంగుళ్యంగద హారకుండల కిరీ ♦ టాద్యాఖ్యలం బిల్తు, మా
భంగిన్ లౌకిక వైదికోక్తులఁ బర ♦ బ్రహ్మంబు నొక్కండె పి
ల్వంగాఁ జొత్తుము జీవుఁడంచుఁ, దనుఁవా ♦ ప్ప న్నిర్భరాహంకృతిన్. 52

వ. అట్లైన నహంకారం బెట్లు స్వకారణభూత బ్రహ్మస్వరూపావరణముం
గల్పించు నందువా ! విను. 53

సీ. అర్కసంభూతమై ♦ యర్క ప్రకాశితం, బైన మేఘంబె య ♦ ర్కాంశభూత
మగు నేత్ర మర్కుని ♦ నరయంగనీయ కా, తని కడ్డముగ నిల్చుఁ ♦ దద్విధమున
బ్రహ్మకార్యంబయి ♦ బ్రహ్మప్రకాశితం, బైన యహమ్ము బ్ర ♦ హ్మాంశభూతుఁ
డగు జీవుఁ డా బ్రహ్మ ♦ మరయంగనీయ కా, తని కడ్డముగనిల్చు ♦ ధరణినాథ !

తే. అబ్ద మనిలంబునఁ దొలంగ ♦ నర్కరూప
మక్షికిం దోఁచు నట్లి స్వో ♦ పాధియౌ న
హమ్ము జిజ్ఞాసచే నాశ ♦ నమ్ము నొంద
నపుడ జీవుండు నేన బ్ర ♦ హ్మమని తెలియు. 54

తే. ఈ యనువున వివేక కా ♦ క్షేయకమున
దీర్ఘ మాయామయాహంకృ ♦ తి స్వరూప
మాత్మబంధంబుఁ ద్రుంచి బ్ర ♦ హ్మస్వరూపుఁ
డగుటె యాత్యంతిక ప్రళ ♦ యంబు ముక్తి. 55

*- నిత్యప్రళయము *-

కం. వనజాసనాద్యఖిలభూ, త నికాయము జనన విలయ ♦ దశలం గనుచుం
డు ననుక్షణం బటంచు, న్వినుతురు సూక్ష్మజ్ఞు లిదియె ♦ నిత్యలయమనన్.

తే. అమిత కాలవేగమున ని ♦ త్యమ్ము పుట్టి
చచ్చుచుండు దేహాద్యవ ♦ స్థల నెఱుంగ
నయితిగాదు నదీప్రవా ♦ హమ్ము పుట్టి
గిట్టును బ్రతిక్షణము పొడ ♦ కట్టునట్టి ? 57

కం. సతతమ్ము దీపకీలా, వితతి పొడము చడఁగుచుండు ♦ వేగముగా, ని
ట్టి తెఱంగుఁ గానలే కె,ల్లతఱిన్ జ్వాల యొకఁడనె త ♦ లంచెద రజ్ఞుల్. 58

తే. గగనమండలి చంద్రాది ♦ గత్యవస్థ
లెట్లు స్థూలదృష్టి గ్రహించు ! ♦ నీశ్వరస్వ
రూపమై యనాద్యంతమై ♦ రూఢికెక్క
కాల, మదియిచ్చు దశ లెఱుం ♦ గ న్వశంబె ? 59

తే. బాల్య యౌవనాది దశలఁ ♦ బట్టి నడుమ
సంతతంబు నేవో యవ ♦ స్థలు జనించు
చడఁగుచుండు నటం చెంచ ♦ నగునుజూవె
లేనిచో దశాంతరములే ♦ లేకపోవు. 60

వ. ఇట్లు ప్రపంచమునకుఁ బరిణామరూపంబున నిత్యప్రళయంబులు రయంబునఁ గాలవశంబున జరుగుచుండు. 61

కం. కాలగతియిట్టులుండు, న్నాలుగు లయము లిటులవి ద ♦ నన్నుచునుంటుక్ బోలంగ వింటిగద నర, పాలా! సంశయములెల్లఁ ♦ బాసెనకాదే? 62

కం. నారాయణ పుణ్యకథా, వారమ్మును సంగ్రహముగఁ ♦ బలికితి వశమే యేరి క శేషమునుడువఁగ!, నాఱు న్నాలు గొక వేయి ♦ యాస్యములున్నన్.

శా. నీరంధ్రోదిత నైకదుఃఖ బడబా ♦ గ్ని జ్వాలికామేయ సం
సారాంభోనిధి నిస్తరించుటకు శ్రీ ♦ మద్విష్ణు గాథామృతా
సారాసేవన మొందుదక్క నితరాం ♦ చత్కోల మొందుం గసం
బో రెవ్వా రిదినిక్క మోనరపతీ! ♦ పుణ్యప్రభావాకృతీ! 64

తే. ఈపురాణసంహిత వచి ♦ యించె మౌని
రాజు నారాయణుండు నా ♦ రదమహర్షి
కతఁడు శ్రీవ్యాసమౌని క ♦ య్యనఘమూర్తి
నాకు నాదరంబునఁజెప్పె ♦ నరవరేణ్య! 65

ఆ. వేదసమ్మితంబు ♦ విమలంబు నీభాగ
వతము నైమిశాఖ్య ♦ వనములోన
దీర్ఘ సత్రమందుఁ ♦ దివిరి శౌనకముఖ
ఋషులు గోర సూతుఁ ♦ డితఁడు నొడువు. 66

వ. అని బ్రహ్మరాతుండు విష్ణురాతున కుపదేశించెను. 67

ఇది నాలవ యధ్యాయము సమాప్తము.

---

## పంచమాధ్యాయము

కం. త్వత్పాదాంభోజమ్ముల, హృత్పద్మమునందు నిలుపు ♦ నేని మృతి త్రా
సోత్పత్తి లడరునే? యు,ద్యత్పుణ్యుఁడు ముక్తుఁడతఁడ ♦ హరిహరనాథా! 1

వ. [1]దేవా! యవధరింపుము. శ్రీశుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునితో నిట్లనియె. 2

---

[1] అధ్యాయప్రారంభము 11—11—1946

-*శ్రీశుకులు పరీక్షిత్తునకు బ్రహ్మోపదేశ మొనర్చుట*-

నర్కుటవృత్తము. ఎవని యనుగ్రహాప్తి నజ ♦ యించెనొ యబ్జభవుం
డెవని మహాగ్రహాప్తి జని ♦ యించెనొ రుద్రుఁడు నేఁ
డవనిప! యట్టిదేవుని మ ♦ హాత్మ్యుని విశ్వవిభుఁ
బ్రవిమలభక్తి నెంచితిని ♦ భాగవతం బదియే. 3

కం. వింటివి దానిని దృష్టిగఁ,గంటివి జ్ఞానంబు భవము ♦ గడతేఱంగన్
మంటివి హరిసేవలఁ ద్రొ,ల్లింటి విభులయట్లు రాజ ♦ లితి విలయేలన్. 4

ఉ. కావున నట్టినీవు మృతి ♦ గందునొ! సర్పము కాటువేయునో!
యేవిధిగాఁగ నున్నదొగ ♦ దే! యని చింతిలఁబోకుమయ్య నీ
భావమునందు నీకు వెఱ ♦ పం బనియేమి? త్రికాలవర్తివిం
గావె? శరీరమే నడుమఁ ♦ గల్గినదేగు విచారమేటికిన్! 5

ఆ. పూర్వ మీవు లేక ♦ పోలేదు మఱి యిప్డు, పుట్టలేదు తేవు ♦ గిట్టఁబోవు
తిరుగులాడి యెల్ల ♦ దేహంబె నీవు ని,త్యుండ వేల వగవు ♦ నొంద నృపతి!

కం. మునులేని దేహమే నదు,మను పశ్చాద్భావియందు ♦ మఱుఁగువడు నిన్నీ
యునికి శరీరముచందం,బునఁగా, దీ వెల్లకాల ♦ ముం బొలుఁతువయా. 7

వ. బీజమునకంకురమువోలె నేన పుత్త్రుఁడ నగుచుంటి. మరల నయ్యంకురము
నకు బీజమువోలె నేన పౌత్రుఁడనగుచుంటిఁగదా. మఱి దేహము
నశించిన నట్లని తలంతేని విను. నీవు బీజాంకురములవలెఁ బుత్త్రపౌత్రాది
రూపుండవు కావు. ఏలన? నగ్ని కాష్ఠమునకంటె భిన్నమైనట్లు నీవు
తద్దేహాదులకంటె భిన్నుండవు. కొఱవివలన మఱొకకొఱవి కలుగు
చున్నది కాని యగ్గికాదు. అట్లే దేహమువలన మఱొక దేహము కలుగు
చున్నది కాని యాత్మకాదు. ఆత్మకుఁ బుట్టుక లేదు. కనుక నీకు విచార
మేల? నీకుఁ జావుపుట్టుకలు లేవయ్యా, 8

తే. స్వప్నమున స్వశిరశ్ఛేద ♦ పంచతలను
స్వయముగాఁగను, నారీతి ♦ జాగరమున
నంగనాశంబుఁగను నది ♦ యాత్మ నాశ
మనుకొనుట భ్రమం; బాత్మ య ♦ జామరంబు. 9

తే. ఘటముకోలచే బ్రద్దలు ♦ గా ఘటాంబ
రమ్ము నిరుపాధికాంతరి ♦ క్షమ్మయగును
దనువునట్లె తత్త్వజ్ఞాన ♦ మున విలన
మైనచో జీవుఁడుం బర ♦ మాత్మయగును. 10

కం. మనమే జీవున కంగము, లను గర్మములను గుణంబు ♦ లను సృజియించున్
మనమునుమాయసృజించును, జనపతి! యివిజీవునకిటు♦సంసృతిఁగూర్చున్.

చం. ప్రమిదమనస్సు కర్మసమ ♦ వాయుము తైలము వెల్గువర్తి దే
హము జ్వలనప్రయోగము ని ♦ జాంగము నాత్మగ నెంచు భ్రాంతి. యీ
క్రమమున దీపముంబలె వి ♦ రాజిలుసంసృతి యున్నికూడుచో
నమలమతీ! భవం బెవరి? ♦ దాత్మది? యోచనసేసిచూడుమా? 12

కం తైలాదులచే దీపము, జ్వాలారూపమున వెలుఁగు ♦ సరణిం ద్రిగుణా
లోలతచే భవము పొడమి, చాల మదింగలఁచుఁ జెనకఁ♦ జాలదయాత్మన్.

తే. ఆత్మ దీపమువలెఁ బుట్టు ♦ దడఁగ, దది స్వ
యంప్రకాశము స్థూలసూ ♦ క్ష్మాస్య మఫల
మూల మనుపమ మాకాశ ♦ మువలె నిర్వి
కారమును విభువని యెఱుం ♦ గఁగదె నృపతి! 14

వ. ఇట్లు దేహాద్యుపాధిస్థితము నాత్మమును స్వయముగానే యనుమాన ప్రమాణసహకృత జ్ఞానంబుచేతను, ముకుందామల పదారవింద భజనంబు చేతను, లెస్సగా విమర్శించి తెలిసికొమ్ము. 15

ఉ. ఇట్టు లొనర్తువేని ధర ♦ ణీశ్వర! మిత్తికి మిత్తివౌచుఁ గ
స్పట్టెద, పట్టిపట్టునను ♦ బాఱునికట్టడ యేమిసేయు? నా
కట్టెఁడి తక్షకుం డెటులు ♦ గాటున గొగ్గుచు? మిత్తియెట్టు చే
పట్టునునిన్ను? నాత్మవిదు ♦ బాము లలంచునటయ్య యెన్నఁడున్? 16

ఆ. ఏన బ్రహ్మ మంచు ♦ నెఱుఁగు మట్లైన లో
కాదికములు నిన్ను ♦ నంటఁబోవు
బ్రహ్మ మేన యంచుఁ ♦ భావింపు బ్రహ్మపా
రోక్ష్య మాక్షణమున ♦ రూపుమాయు. 17

మ. నిరుపాధ్యాత్మ సమైక్య మయ్యెదవయే ♦ నిన్ దుస్సహ క్ష్వేళభీ
కర వక్త్రుండగు తక్షకుం డొడిసి నీ ♦ కాల్వట్టుకొంటల్ కళే
బరము స్వీశ్వము దేనిఁగానవు పర ♦ బ్రహ్మతిరిక్తంబుగా
నెటి సర్వంబుఁబరాత్మగాఁ గనిన ను ♦ న్నేకర్తృకర్మంబులున్? 18

కం. నీయడిగిన రీతిగ నా
రాయణ లీలావిభూతు ♦ లభివర్ణితముల్
హాయిగ విన్నాఁడవుగా
నాయన! యింకనేమి విన మ ♦ నంబుదలంచున్? 19

వ. అని శ్రీ శుకయోగిచంద్రముండు ప్రమాణలక్షణంబుపదేశించె నని శ్రీ సూతుండు శౌనకాదులకుం జెప్పె. 20

ఇది ద్వాదశస్కంధమునఁ బ్రహ్మోపదేశంబను
పంచమాధ్యాయము సమాప్తము.

---

## షష్ఠాధ్యాయము

కం. శాస్త్రముల నొసఁగెదవు త
చ్ఛాస్త్రములనె తెలియఁజెప్పె♦దవు నీ యునికిన్
దుస్త్రైగుణ్య పరిష్కృతాం
హాస్త్రాతా ! బుద్ధ్యతీత ! ♦ హరిహరనాథా ! 1

వ. [1] దేవా ! యవధరింపుము. శ్రీ సూతుండు శౌనకాదిమహర్షులతో నిట్లనియె. అట్లు నిఖిలాత్మదర్శనుండు శ్రీ వ్యాసనందనుండు సర్వసముండు శ్రీ శుకయోగిచంద్రముండు సాదరమేదురావలోకనంబులు వొలయం బలుకుటయు విష్ణురాతుండు పరీక్షిన్నరేంద్రుండు కంటకితసర్వాంగుండు నశ్రుపూర్ణాక్షుండు నగుచుఁ దత్పాదాంబుజంబుల నిజశిరంబు సోఁకవ్రాలి పెద్దయుండదవున కెట్టకేల కుత్థితుండై కైమోడ్పు గీలించి యిట్లనియె. 2

-* శ్రీ శుకులవారి యనుజ్ఞగొని పరీక్షిత్తు సమాధిస్థుఁడగుట *-

కం. కరుణారస భరితాంతః, కరణులరగు మీరు విష్ణు♦గాథామృత మా
దరమున నిచ్చుట సిద్ధుఁడఁ, జరితార్థుఁడ నైతి యోగి ♦ సన్నుతచరితా ! 3

తే. భూరిసంసార తాపత♦ప్తులును నజ్ఞు
లైన మావంటిజంతువు♦ లందు మిమ్ము
వంటి యచ్యుతాత్ములకుఁ గృ♦పారసంబు
కలుగుచో నందువింత లే♦ దలఘుచరిత ! 4

ఆ. మానినాథ! యుత్త♦మశ్లోకుఁడగు భగ, వాను చరిత మెచట♦వర్ణితంబొ?
యాపురాణ సంహి♦తామృతమ్ము త్వదీయ, కృపను ద్రావినాఁడ♦దృప్తిదీఱ.

ఉ. ఆనతియిమ్ము నాకు మహి♦తాత్మక ! యింద్రియ దుష్టచేష్టలన్
మానిచి కామవాసనల♦ మ్రంటఁగఁజేసి విశుద్ధనిశ్చలం
బైన మనం బధోక్షజు ప♦దాబ్జముల న్నమియింపఁజేయుచుం
బ్రాణములం ద్యజించి పర♦మాత్మసమైక్యము నెందియుండెదన్. 6

(1) అధ్యాయప్రారంభము 14-11-1946.

ఆ. శాస్త్రజన్యమైన ♦ జ్ఞానానుభవనిష్ఠఁ, జే మదజ్ఞతావి ♦ శేషమడఁగెఁ
దాము పరమపదము ♦ క్షేమమున్ భాగవ, తమ్ము చూపినారు ♦ ధన్యుఁడైతి 7

క. త్రచ్చితి తత్త్వాంభోనిధి, నిచ్చితి జ్ఞానామృతం బ ♦ హిభయాదికముం
ద్రొచ్చితి బ్రహ్మానందముఁ, జొచ్చితి నిచ్చ నెదిలేదు ♦ జోతలుస్వామీ!

వ. అని యిట్లు విష్ణురాతుండు విజ్ఞాపించుకొని శ్రీశుకయోగిసత్తము నితర భిక్షువర్గము సమధికభక్తిచిత్తంబునం బూజింప నబ్భగవానుండు బాదరాయణి యనన్తరవతి కాజ్ఞయొసంగి తత్రత్య భిక్షుసహితుండై యొందే నరిగె నని సూతుండు శౌనకాది మహర్షులకుం జెప్పి మఱియు నిట్లనియె. అంత,

క. సౌరసరిద్వరదక్షిణ, తీరంబునఁ దూర్పుమొనల ♦ దర్భాసనముం
దాతేఁ డుదఙ్ముఖుం బొ, ప్పారఁగ నాసీనుఁడై గ ♦ తాహంకృతియై 10

వ. ఛిన్నసంశయుండు నిస్సంగుండునై ప్రాణవ్యాపారము నిరోధించి స్థాణువు కైవడి నిశ్చలుండై మనంబును బుద్ధిచేఁ బ్రత్యక్ప్రకాశమందుఁ జేర్చి బ్రహ్మభూతుండై యుండ నక్కడ.

-* తక్షకుండు కశ్యపుమరలించి నృపుం గఱచి చనుట *-

క. విప్రకుమారాప్రతిరో, ధ ప్రతిఘ ప్రహిత శాప ♦ దారుణవాచా
భిప్రేరితుఁడై తక్షకుఁ, డా ప్రభువర హంతుకాముఁ ♦ డై వచ్చునెడన్ 12

సీ. వెనుక ముంగల బిళ్ళ ♦ లనువొందఁగా నీరు
కావి దోవతి దీర్చి ♦ కట్టినాఁడు
బొమలనడుమఁ గుంకు ♦ ము నామంబునఁ దడి
బూది గీఱలు మూఁడు ♦ పులిమినాఁడు
బంగరు సరిగంచుఁ ♦ బట్టుసాలువు చుంగు
లుట్టిపడం దలం ♦ జుట్టినాఁడు
ఱంగావిరంగు తు ♦ ఱంగలింపంగ నం
గీని ముంగాళ్ళంటఁ ♦ బూనినాఁడు

తే. తాటియాకుల కడితంబుఁ ♦ దాల్చినాఁడు
మందువ్రాఁకులు మిరియాలు ♦ మణులు నాది
గాఁ గలుగు వెండిబరణెఁ గైఁ ♦ గదిపినాఁడు
కశ్యపుండు జాంగలికుండు ♦ కర్మసుకుండు. 13

వ. ఆతండు మధ్యేమార్గము తన్నుం గలియఁ గామరూపుండగు తక్షకుండు విప్రరూపంబునం జనువాఁ డవ్విప్రుం గనుంగొని 14

ఉ. కేలు మొగిచ్చి యిట్లు పలి ♦ కెన్ ధరణీసురవర్య! మీరు జే
జే, లెటకేగుచుంటి? రెడ ♦ సేయక తోడుగ నెంతదూర మీ
లీలగ వత్తు? రెండయిన ♦ లేచెనొకో క్రతుధూమరాజి మీ
వాలక మారయున్ విఱిగి ♦ వడ్డటులున్న దిరొట్టె నేతిలో. 15

చం. అనవుడు కశ్యపుండు దర ♦ హాసముఖుండయి యాడెనిట్టు లో
యనఘ! మఖంబులం గనుట ♦ కయ్యెడ దక్షిణలందుకొంటకుం
జనియెడివాఁడఁగాను విను ♦ జాంగలికుండను నేఁడు భూతలే
శుని నొకపాము పట్టునఁట ♦ చూపెద నవ్వాడు నాప్రభావమున్. 16

ఉ. దానికిఁబోవుచుంటి వసు ♦ ధాపతి నాదగుశక్తి మెచ్చి యే
మే నిడి సత్కరింపఁ గొన ♦ మే? ధన మేరికినైనఁ జేఁదె! యుం
చానరుఁ డాడ రాజఘుఁ డ ♦ హంయువు గాన నొకింత రోషముం
బూని వచించెనిట్లరరె! ♦ భూధరుమొత్తఁ దలంచి తేమనన్. 17

సీ. ఎవ్వాని క్రోధతా ♦ మ్రేక్షణంబులకు న,హార్యముల్ సురనర ♦ లాడిపోవు
ఎవ్వాని తిరుగుళ్ల ♦ కీరేడులోకమ్ము లదరుచు గిరకిర ♦ లాడిపోవు
ఎవ్వాని పరుష హూం♦త్కృతులకు మింటి తా,రాకోటి చిటపట♦రాలిపోవు
ఎవ్వాని గరళ వ♦హ్నిజ్వాలకు జగాలు,మాఁడును మలమల♦మాఁడిపోవు.

తే. ఎవ్వఁ డింద్రుతో గద్దియ ♦ నెక్కు మిత్రుఁ
డెవ్వఁ డీశ్వరు ముంజేతి ♦ కెక్కు కడియ
మట్టి తక్షకుండేమి? కా ♦ టందు లేమి?
ఈవు బ్రతికించు టేమి! యి ♦ దెంతవింత! 18

ఉ. అక్కడికేగి నల్వురి స ♦ మక్షమునం గడుఁ బగ్గెలాడి పై
నెక్కిన కార్యభారము వ ♦ హింపఁగలే కటు వెన్కకొగ్గినన్
ఫక్కున నవ్వరే జనులు? ♦ ప్రాప్త పరాభవ వహ్నిఁ గ్రాఁగు చిం
కెక్కడ నెట్టు లీవు తల ♦ యెత్తి చరించెదవయ్య మిత్రమా! 19

కం. కావున నీమంత్రబలం,బీవు పరీక్షించికొనియ ♦ యేగుటతగు, నా
తావున సర్వవిషముగల,దీవృక్షముపైనిఁ జూత ♦ మే యాబలమున్! 20

సీ. ఊర్ధ్వశాఖలనెక్కి ♦ యరిగెదమే ఋక్ష,భంబులఁ జేతితోఁ ♦ బట్టవచ్చు
పార్శ్వశాఖలపైనిఁ ♦ బయనించెదమయేని, యష్టదిగ్గజముల ♦ నరయవచ్చు
ఊడలజాడల ♦ నూఁకనిఁబాడిన, నతలలోకంబెల్ల ♦ వెతకవచ్చు
సాంధ్యకాలముల ని ♦ చ్చట నిల్తుమేని ప,క్షి జగంబునెల్ల వీ♦క్షింపవచ్చు

తే. కడవపోఁతల వాసలు ♦ గలుగుతఱిని
దాకజొంపంబు సొంపును ♦ గానవచ్చుఁ

జలిరులం గాయగసులం • జెలువుమిగులు
నీ వనస్పతిఁ జూడుమా • యేమియగునొ?  21

మ. అని యాతక్షకుఁ డావనస్పతిని డా • యంబోయి గోవ్యంబుగా
మునిపంటిం దగిలించి యీవలకు రా • భూజంబు భగ్గంచు మం
డి నిమేషంబున భస్మరాశి యయియుం • డెన్ శంభుకంఠంబుఁ గా
ల్చిన కాకోలము వచ్చివృక్షము నిటుల్ • చేయ న్విచిత్రంబొకో?  22

వ. అప్పు డక్కపట భూసురవేషుండైన తక్షకుండు చిఱునగవు కెంబెదవులఁ జిందుచుండ నిట్లనియె.  23

కం. ఏదీ చూతము నీమంత్రోదితశక్తిఁ గనఁబఱుపు • మోసఖ! యన నా
భూదేవుఁడు ముక్కున వ్రేలూఁది శిరంబూఁపి నవ్వి • యుత్సాహమునన్

కం. నీవపుర! భూసురుండవు, గా వా భుజగాధిపతివె • కాదేని కుజం
బీవిధమున భస్మంబుం, గావింపఁగ నోరుఁడు వలఁతి • గాఁ డహిదేవా!  25

తే. వందనంబు తక్షకభగ • వానుఁడా! కృతార్థుఁడను భవద్దర్శ • నమునటకతనఁ
బెద్దల యనుగ్రహంబున • వింటి భక్తితోడ రెండక్షరములవ్వో • తోడునాకు.

వ. అని కుఱుఁగటఁగల చెఱువునకు సరగ నరిగి ధౌతకరచరణ సరసిజుఁడై శుచియై వార్చి రయంబున భస్మరాశికడ కరుగుదెంచి ప్రాఙ్ముఖుండై గురుదేవాదులకు భక్తిమెయి నమస్కరించి రజతకరండ గర్భకోశంబునం గల విభూతి నంగుష్ఠతర్జనులతోఁ దీసి 'క్షస్వా' యని మంత్రించి భూరుహ భస్మరాశిపై వైవ నాక్షణంబ యయ్యాది కుమ్మరిసారె యట్లు తిరుగుడు వడుచుండ నందుండి ఘటంబుంబోలె నంకురంబు వొడమి వామనమూర్తి విజృంభించినట్టు లది కాండముగట్టి ప్రమానుఁ గొమ్మలు రెమ్మలు శాఖోపశాఖలు నూడలుఁ జివుళ్లు నాకులుఁ బిందెలుఁ గాయలు గసరులుఁ బండ్లుఁ గులాయంబులుఁ బక్షులు నాదిగా సర్వాంగశోభితంబై యథాపూర్వము మహావృక్షరాజంబై విరాజిల్లసాఁగె.  27

ఉ. అరసి యద్ది తక్షకమ • హాహి కులాగ్రణి రత్నహార కే
యూర కిరీట కుండల ము • ఖోజ్జ్వల భూషణ భూషిత స్వకా
కారముఁ జూపి జాంగలికు • కైఁ గయిఁ బూని భళీ! భళీ!! భవ
ద్ధీరత మంత్రశక్తిఁ గని • తి న్మదిమెచ్చితి విశ్వసించితిన్  28

కం. నీమాట నిజము తక్షక, నామఁడనే, నివిగొ గొను మ • వర్ఘ్యాంబర భూ
షా మణికాంచన రాసులు, మే మగవడి రిత్తవోదు • మే మెవుడైనన్

కం. అని గణనాతీతములగు, ధనరాసులు తనివిదీఱఁ • దా నొసఁగఁగ నె
మ్మనమున నబ్బురవడు చిట్లనె మాంత్రికశేఖరుఁడుమ • హాహీశ్వరుతో.

ఉ. దండము స్వామి! ప్రాజ్ఞ నికృ♦తం బఖిలంబు తపంబు నేఁడుగా
పండెను నిన్నువంటి యహి♦వల్లభు దర్శన మారఁగబ్బనే?
కుండలిసార్వభౌమ? యివి♦గో పదివేల నమస్సులన్న నా
తండనెఁ జాలునయ్య! ధన♦తండము నీకును భూసురాగ్రణీ! 31

కం. ధరణీసురవర్యా! దే, వరహాస్య మొకండు సెప్పు♦ వాఁడఁగ దానిం
జరపెదవేని న్నిజముగఁ, జరితార్థుఁడ వగుదు దివిజ♦సమితియు మెచ్చన్.

వ. అదిమొద్దియనఁ జెవియొగ్గివిను. 33

మ. మునివాక్య ప్రహితుండనై నృపవరుం♦ బోకార్పఁగాఁ బోవుచుం
టిని నాకడ్డము రాకు జాంగలిక మా♦ణిక్యంబ! విప్రోక్తి నీ
వును పాలించుట పాడిగాదె? తమకుం♦బోధింప నేనెంతవాఁ
డను ధర్మంబునుగూర్చి భూసురుఁడ వె♦ద్దన్నీవ యోచింపుమా! 34

వ. అని యర్థగాంభీర్యంబును శబ్దమార్దవంబును వాక్యరచనాచమత్కారం
బును వాఙ్మాధుర్యంబును భాసిల్లం బెక్కుతెఱంగుల బలికి యమ్మాంత్రిక
శేఖరు నొడంబఱచి వెనుకకు మరలించి యయ్యహివల్లభుండు బ్రాహ్మణ
వేషంబునం జని సమాధి నిష్ఠాగరిష్ఠుండైన పరీక్షిన్మహీవల్లభుం గఱచి
పోయె. 35

ఆ. బ్రహ్మభూతుఁడైన ♦ పార్థివాగ్రేసరుం, డఖిలజనము సేరి ♦ యరయుచుండ
దక్షక విషవహ్ని♦దంద్యమానాంగుఁ, డగుచు బూదియయ్యె♦నాక్షణంబ.

తే. నభమునుండి యఖిలదిగం♦తములనుండి
భూమినుండి యాహాకార ♦ ములు సెలంగె
మనుజ దేవాసురాదులు ♦ మానసమున
విస్మయంబులు సెందిర ♦ వ్యధముచూపి. 37

తే. నాల్గుపాదాల ధర్మమ్ము ♦ నడిపినాఁడు
వ్యాసనందను శుశ్రూష ♦ సేసినాఁడు
కొడుకుచేత బూడిదగాని ♦ కొడవగాక
యాత్తరేయున కేమి? ధ ♦ న్యాత్ముఁ డతఁడు. 38

కం. కురిసెం బువ్వులవానలు, మొరసెన్ సురదుందుభులు వి♦బుధ సంస్తవముల్
బెరసెన్ జుక్కల తెరువునఁ,బొరసెం గంధర్వగాన ♦ ములు తద్వేళన్. 39

కం. ఆవల జనమేజయ ధా,త్రీవల్లభుఁడు పితృమేధ♦కృత్యమ్మును శ్ర
ద్ధావంతుఁడగుచు సల్పె య,థావిధి భూసురులు మంత్ర♦తతి నడిపింపన్.

### * జనమేజయుఁడు సర్పయాగము సలుపుట *

వ. పిమ్మట నొకనాఁడు జనమేజయుండు పేరోలగంబుండి ఋత్విక్పురోహితా
దుల నవలక్షించి, 41

ఉ. పాముఁట! తక్షకాఖ్యుఁడఁట ♦ పాఱుని రూపున వచ్చెనంట! యు
ద్దామ తపోగరిష్ఠుఁ బర ♦ తత్పరు మత్పితృపాదుల న్విష
స్తోమ విలీనుఁ జేసెనఁట ♦ చూచుచు నేనిఁక నూరకుండుటే!
యేమిటికింకఁ బుత్త్రిక? యి ♦ సీ! నగరే నను శౌర్యహీనునిన్. 42

మ. కలిగా! కుత్తుక నుత్తరించెదను నా ♦ కంటం బడంబోకు, మం
దుల నీజాడ వినంబడందగదు పో ♦ దుర్మార్గుఁడా! యంచు న
ర్మిలి ధర్మంబును నాల్గుపాదముల న ♦ ర్తింపంగ సల్పెన్ మహీ
స్థలిఁ బూజ్యుల్ పితృమిశ్రు లట్టి ఘను నీ ♦ జాల్మం డిటుల్ సేయునే! 43

కం. శిష్యుఁడు శుకయోగికి నా,ముష్యాయణుఁ డఖిలధర్మ ♦ మూర్తి హరికృపా
యుష్యుఁడు మజ్జనకుండట, విష్యుఁడగుట యేమివ్రాసె ♦ విధిక్రూరుండై. 44

శా. రండో బ్రాహ్మణులార! శాస్త్రములు స ♦ ర్వంబుం బరీక్షింపుఁడా!
తెండా మార్గము తక్షకాధము నెగా ♦ దే సర్వ సర్పక్షయో
ద్దండ ప్రక్రియ నేఁడు సల్పవలె మం ♦ త్రద్రష్టలౌ మీ సహా
యుండ, న్నావెత దీఱకుండునె? సము ♦ ద్యోగింపుఁ డార్యాగ్రణుల్. 45

వ. అని పల్కు నటంగల మహర్షిపుంగవులు నీవూనికొని సర్పయాగంబు దీర్చ
నన నద్దానిం జేయ నవ్వాడ కృతనిశ్చయుండై యజ్ఞోపకరణంబులఁ గూర్చు
కొని శాస్త్రీయ యజ్ఞాయతనంబు విసర్మింపించి యటంజేరి పరీక్షిన్నరేంద్ర
నందనుండైన జనమేజయుండు వపుష్టాదేవి ధర్మపత్నిగా మహర్షిసమక్షం
బున యాగదీక్షంబూని సర్పయాగంబు సేయుచుండఁ దన్మంత్రప్రభావం
బున శంఖకర్ణాది వాసుకికులసంభవులును, మూకముద్గరాది తక్షకకులసంభ
వులును, పాండుర పారయాత్రాద్యైరావతకులసంభవులును, జటిలకుండ
లాది కౌరవకులసంభవులును, శంఖవర్ణాది ధృతరాష్ట్రకులసంభవులును,
శ్వేత కృష్ణ పీతారుణాది నానావిచిత్ర వర్ణ కాయులును ద్విత్రి చతుః
పంచ దశ శతాది నానామస్తకులును, ద్వియోజన త్రియోజనాయామ
స్థూలాంగులునయుతాయుత సంఖ్యాకు లతిరయంబున మూకలుమూకలై
వచ్చి యతిగంభీరంబు నత్యంతవిస్తృతంబునైన హోమకుండంబున జాజ్జ్వ
ల్యమాన కీలికీలాకలాపంబు లంబరంబంటుచుండఁగా నందుఁదొరంగి భస్మ
పటలం బగుచుండిరి. 46

తే. వేయికనుల నంతయుఁ గని ♦ పెట్టుచున్న
జనవరుండు పారిక్షితుం ♦ డనియె నిట్టు
క్రిందిజగమునఁగల సర్ప ♦ బృందమెల్ల
వచ్చిపడియెడిఁగాని దు ♦ ర్వారవహ్ని 47

శా. సఖ్యంబించుక మీకువాని కెడఁదన్ ♦ సంధిల్లెనో? లేక వి
శ్వఖ్యాతుండని పిల్వఁజంకితిరొ? యా ♦ శ్చర్యంబు మా తక్షకా
భిఖ్యుం డేటికొ యింతకాలమునకున్ ♦ వేంచేయఁ డాతండెకా
ముఖ్యుం డీక్రతువందు యాజ్ఞికవరుల్! ♦ బోధింపుఁ డీయర్థమున్. 48

కం. అనవుడు పకపకనగి వా,రని రీచందమున మమ్ము ♦ నాడకుమయ్యా!
మనదాయ సురేంద్రుని శర,ణని యచ్చట డాఁగి కదలఁ ♦ డాతనిరక్షన్. 49

వ. అనఁగా నృపతి కుపితుండై 50

శా. ఎట్టెట్టా! మనదాయ తక్షకుఁడు దే ♦ వేంద్రాంఘ్రులన్ వ్రాలెనా?
యట్టైనం బ్రదుకంగవచ్చునని తా ♦ స్వాంతంబునం దెంచెనా?
కట్టెంసిం దఱుఁజూచు లీల హరి? యిం ♦ కం జంకఁగొం కేటికిన్?
బట్టుండా సనురేంద్ర తక్షకుని వే ♦ ల్వన్ భూరిమంత్రంబులన్. 51

కం. ఉరగాధముఁ గ పాడుచు,పరమంత్రంబుల మహర్షి ♦ వాక్యంబుల ని
త్తెఱఁగున దేవేంద్రుఁడు ధి,క్కరించునటు చూత మెట్లు ♦ గానున్నదియో 52

ఉ. యాజ్ఞికులార! యింద్రుఁడని ♦ యాఁగకుఁ డియ్యెడ దోసమేమి? స
ర్వజ్ఞులు మీకుఁజెప్పఁదగు ♦ ప్రాజ్ఞుఁడఁగాను దలంచిచూడుఁ డీ
యజ్ఞము సేయఁబూనినది ♦ యాతనికేగద వాఁడురానిచో
యజ్ఞము గిజ్ఞమేటికి? మ ♦ హర్షులు! పిల్వుఁడు సేంద్రతక్షకున్. 53

వ. అని నరవరుఁడు తఱిమితఱిమి నుడువుచుండ 54

కం. వసుమత్యధీశుని తలం,పసంగతము గామిఁ "డక్ష ♦ కాశువతస్వే
హాసహేంద్రేణ" యటంచున్, వెస ఋత్విగ్గణము పల్కె ♦ వింటెంగనుచున్

మ. అని బ్రహ్మర్షులుపల్కఁ దత్క్షణమ యా ♦ హాకారముల్ పుట్టె మిం
టను దేవేంద్రునిమానసంబు వవమా ♦ న క్షుబ్ధపాథోజ మ
య్యెను బాతాళము డిల్లపోయెఁ ద్రిదివం ♦ బెల్లం జలించె న్మహా
ముని మంత్రంబునకుం త్రిలోకములు స ♦ మ్మోహంబునం బొందవే? 56

—* బృహస్పతి సర్పయాగము మాన్పుట *—

ఉ. తంత్రద ఘటిల్లె నాగునకుఁ ♦ దా మవుకున్న ధగద్ధగాయమా
నైంద్ర విమానముం గడలె ♦ నయ్యెడ నాఁగ బలంబులేమి దే

వేంద్రుఁడుఁ దోడవచ్చె నిది ♦ యెట్టులొ దైవము ! యంచు నాశచీ
చంద్రముఖీలలామ గురు ♦ సన్నిధి కేఁగి వచించె స్వస్థినిక్. 57

ఉ. శ్రోత్రములం దదుక్తు లెడఁ ♦ జొచ్చెనొ! లేదొ? ససంభ్రమంబునం
జిత్రశిఖండిజుండు క్రతు ♦ సీమకుఁ బర్విడివచ్చి యాఁగుమా
క్షత్రియవంశవర్య! ఋషి ♦ సత్తములార! క్షణంబునిల్వుఁడీ
మైత్రినిఁబూనుఁడీ కినుక ♦ మానుఁడి నానుడి నాలకింపుఁడీ! 58

మ. తమమాటల్ శిరసావహించి దివిష ♦ న్నాథుం డదే వచ్చె యా
గమునం దక్షకుఁగొంచు బ్రహ్మకయిన ♦ న్శక్యంబె మీయాజ్ఞ దాఁ
ట మునీంద్రోత్తములార! మీరు నృపుమా ♦ టల్ వింట ఁజేడిట్టి వృ
త్తి మిముంగోరుట యుక్తమే! జనకఘా ♦ తిక్ సైఁచునే యెవ్వఁడుల్.

కం. జనమేజయ! నీపితృభ,క్తిని నీపిత ధర్మకర్మ ♦ దీక్షను నీతా
త నిరూఢశౌర్య మాపై,ని వరుస్మ మనికముం గ ♦ ణింతుము సుమ్మా 60

ఉ. పాటుని వాక్యముల్ సలుపఁ ♦ బొల్పడె నంతియుకాని స్వార్థముం
గోరి యొనర్చెనయ్య భుజ ♦ గుండు? భవజ్జనకుండు పుణ్యవి
స్తారుఁడు యోగిపుంగవుఁడు ♦ దారుఁడు భాగవతోత్తముండు వి
ద్యా రుచిరాత్మఁ జేరెఁగ ♦ నట్టిమహాత్ముని రిత్తసంపునే! 61

మ. జననంబు న్మరణంబుఁ దద్గతు లొగిల్ ♦ సంప్రాప్తమౌ నాత్మక
ర్మ నికాయంబునఁ బ్రాణికోటికిఁ జే ♦ రంబోవు కర్మంబె కా
జనులల్ దుఃఖులుఁగా సుఖాత్ములనుగా ♦ సల్పుల్ భవన్మానసం
బున సిద్ధాని నెఱింగి యంత ఘణులం ♦ బోకార్పు మూర్వీశ్వరా! 62

ఉ. కద్రువ శాపమిచ్చె భుజ ♦ గంబుల కాత్మవచస్సిరస్క్రియా
క్షుద్రతఁ జూడలేక యదె ♦ సుమ్మహిసంతతి కిట్టు లిమ్మహో
పద్రవముల్ ఘటించెను స ♦ వం బిటువచ్చెను నీకుఁ దండ్రికిన్
భద్రగుణాత్మ లీర లొక ♦ పావ మొనర్తురటయ్య యెన్నఁడుల్! 63

నర్కుటము. మునివెడలోన సర్పశవ ♦ ముం దగిలించుటయుల్
దనయుఁడు శాపమిచ్చుటయుఁ ♦ దక్షకుఁ డేచి భవ
జ్జనకుని గాటువేయుటయు ♦ సర్పనవంబును మీ
రొనరుచుచుంట కద్రువ దు ♦ రుక్తుల ప్రేరణనే. 64

కం. ఒక్కనికై యిక్కరణి,న్నక్కఱఁ జక్కడు లేమి ♦ నెఱి యంచును నే
నొక్క వలుక నయ్యవి తమ,ప్రాక్కర్మమ్మున భుజించెఁ ♦ బంటకురాఁగల్

కం. అటుగాన నెవరి దోసం,బిటఁ దడవఁగ లేద తండ్రి ♦ కీదుర్మృతిచేఁ
బటు దుర్గతియో యనుమతి,ఘటింపకుము నీదుతండ్రి♦గన మోక్షంబుల్.

ఉ. భూతము లాత్మకర్మముల ♦ మూలమునంజావు కల్గు క్షుత్తృషా
వాత భుజంగ చోర జల ♦ వహ్ని రుగాదులఁ జచ్చుచుండుటల్
లాఁతుల కిందుఁ గర్తృత చె ♦ లంగదు సర్వము కర్మతంత్రమే
భూతలనాథ ! కోపమును ♦ బోవిడు మింతట శాంతిఁబొందుమా! 67

కం. అమృతమ్ము ద్రావెఁ దక్షకుఁ, డమరేంద్రునిగూర్చి చెప్ప ♦ నైనదిలే దు
త్తమచరిత ! చెప్పుచుంటి,న్దమిఁబెద్దనొ చిన్ననో వి♦నందగు మాటల్. 68

సీ. తండ్రినిజాతమా ? ♦ ధర్మగవిం గాచి,నట్టివాఁడు కలిని ♦ మట్టుపెట్టె
తాతనుజాతమా! ♦ ప్రీతిమైఁ బెత్తండ్రి,కై ప్రాణముల నొడ్డి ♦ నట్టివాఁడు
ముత్తాతఁజాతమా? ♦ ముజ్జగంబేలు గ,ద్దియ నెక్కనాఁ డింద్రు♦డీటుగాఁగ
ప్రపితామహుఁ ♦ బరికింతమా ? భ్రాతృ,భక్తి రూపొందిన ♦ వగిదివాఁడు

తే. ఇట్టి జగదేకవిఖ్యాతి ♦ నెనసినట్టి, పావనంబగు పౌరవా ♦ న్వయమునందుఁ
బుట్టితివి జనమేజయ♦భూపతిలక ! యాంగిరసుమాటల నొకింత ♦ యాలకింపు

కం. హరి మీకు విరోధియ టే ?, ధరణీశా ! వంగనము క ♦ తల వినలేదే
కరుణగలిగి నవ ముపసం,హరింపు మెనలేని కీర్తి ♦ నందెదు జగతిన్. 70

వ. అన మహర్షులందఱుం బ్రహర్షహృదయులగుచుండ జనమేజయుండు తమ
కెదురాడంగలనే యనుచుం బృహస్పతిం బెక్కుతెఱంగులం బూజించి
పొగడి సర్పసత్రం బుడిగి యథోచిత సత్కారంబుల నందఱం దనిపె నని
సూతుండు వెండియు నిట్లనియె. 71

తే. అభిమన్యవ చేష్ట శా ♦ పాభిగమము
తక్షకునికాటు పారిక్షి ♦ త్క్రతువిధి
యీనమస్తమ్ము విష్ణుమా ♦ యా సృజనయె
దానిదాఁటెడునాతఁ డొం ♦ డైనలేఁడు. 72

కం. ఒక్కండు బాధకుండుగ, నొక్కఁడు బాధ్యుఁడుగ నిట్టి ♦ యోజ నలువునా
టక్కరిమాయయె; యిదిగని, గ్రక్కున విడువవలె రోష ♦ రాగాదికముల్.

తే. అచ్యుతాత్మాంశభూతులౌ ♦ ప్రాణులకును
ద్రిగుణజన్య రోషాదుల ♦ దేహవితతి
మోహమును గలిగించెడి ♦ నూహములకు
నందఁబోని యబాధ్యమై ♦ నట్టిమాయ. 74

వ. మహాత్ము లాత్మవాదమొనర్పఁగా నదివఱ కెంతకాలమునుండియో బుద్ధి
యందుఁగాఁపురమున్న మాయ భయంపడి పాఱిపోవును. ఆత్మయెదుట

మాయ తనప్రభావముం జూపఁగలదె? మఱియుం దన్మాయాశ్రయములైన వివిధవాదములు నాత్మయెదుట నిలువనేరవు. విశేషవిషయములున్నం గదా వివాదములు పొడమెడిని. ఆత్మ తాను విశేషముల కతీతమైనది. సంకల్పవికల్పాత్మకంబైన మనస్సున కాత్మ యుండదుసుమీ. అట్టిచో వివాదమెట్లు? మఱియును గర్మంబును దానంగలుగు దేహంబును నీయుభయసాధ్యంబగు సుఖదుఃఖరూపఫలంబును నేతత్సృజ్య(స్రష్టృ)ఫలత్రియాన్వితుండు నహంకారాత్మకుండు నైనజీవుండు ననెడి యీభేదమెందు లేదో యట్టి నిరస్తబాధ్యబాధకంబైన యాత్మస్వరూపము నెఱింగి యహంకారాద్యాత్మలనెల్ల నిషేధించి ముని స్వయముగా నాత్మరతుండు గావలయు. దేహాదులం దహంభావము నుజ్జగించి యనన్యసౌహృదుండై యాత్మవ్యతిరిక్తం బింతయు లేదని భావించి సర్వప్రాపంచికవస్తువుల నాత్మ యిదిగా దదిగా దనినిషేధించి ధ్యానాదికముచే హృదయమునకు హత్తించుకొని సమాధిచేఁ బొందఁబడునదెయ్యదియో యయ్యాత్మయే వైష్ణవంబైన పరమపద మని తెలియునది. 75

తే. ఎవఁడు దేహజంబగు నహం♦కృతిని గేహ
జంబగు మమత్వమును విస♦ర్జనమొనర్చు
వాఁడు విష్ణుపరమపద♦ప్రాప్తిఁగాంచి
యచ్యుతానందముంబొందు♦ ననవరతము. 76

ఆ. దుష్టభాషణములఁ♦దాలఁగంగవలె నెట్టి,వానిఁగూడఁ దగదు♦ పరిభవింపఁ
గాయమునకుఁగాను♦గలహంబు పెట్టుకో,వలద యేరితోడ♦భాగవతుఁడు. 77

ఆ. వందనమ్ములు భగ♦వంతునకుం గృష్ణు,నకు నకుంఠమతికి♦ నా గురునకు
వారిపాదపద్మ♦భజనచే నీసంహి,తార్థమును గ్రహించి♦ తనఘులార! 78

చం. తెలియని మందబుద్ధులును♦ దెల్లముగా గ్రహియించుపోల్కిఁ బ్రాఁ
బలుకుల ఋఙ్మఖక్రమవి♦భాగముసేసి శ్రమించి వేలశి
ష్యులఁ జదివించి సన్నియమ♦శుద్ధపథంబున ఖ్యాతిఁగన్న యో
జ్జలను బరాశరాత్మజుల♦ సన్నుతియించెదఁ గేల్మొగుడ్చుచున్. 79

వ. అని సూతుండు కులపతియగు వేదవ్యాసభగవాను చరణపంకజముల ధ్యానించినపిదప భృగూద్వహుండైన శౌనకమహర్షి యిట్లనియె. పౌరాణికవర్యా! వ్యాసశిష్యులు వేదవ్యాఖ్యాతలు మహాత్ములునగు పైలాది మహర్షు లెట్లెట్లు శిష్యపరంపరయందు వేదముల వ్యాపింపఁజేసిరో తెలుప వేఁడెద ననవుడు రౌమహర్షణి యిట్లనియె. 80

-♦ శ్రీ సూతుండు శౌనకాదులకు వేదవిభాగక్రమము చెప్పుట ♦-

తే. అనఘమతులార! వినుఁడు స ♦ మాహితాత్ముఁ
డైన పరమేష్ఠిహృదయ వి ♦ హాయసమ్ము
నందు దివ్యనాదంబొకం ♦ డలరుచుండుఁ
గర్ణరోధంబున రవంబుఁ ♦ గనమె మనము. 81

వ. ఈ నాదోపాసనమువలననే యోగులు ద్రవ్య క్రియా కారకాఖ్యంబైన యధిభూతాధ్యాత్మాధిదైవంబులను త్రివిధాత్మమలములం దుంచి యపునర్భవం బందెదరు. 82

తే. ఆ నినాదంబునం ద్రిమా ♦ త్రాంచితంబు
ప్రవిమలంబు నవ్యక్తప్ర ♦ భవము హృదయ
సద్మ సవిధ స్వయంప్రకా ♦ శమ్మును బర
మాత్మలింగమా నోంకార ♦ మలరుచుండు. 83

వ. వర్ణసమామ్నాయము స్ఫుటంబొనర్చుటంజేసి స్ఫోటంబు నాఁబడు నీ యోంకారముఁ గరణరహితుండయ్యు వినువాఁడేపరమాత్ముండు. జీవుండు గాఁడు. జీవుఁడు కరణాధీన జ్ఞానుండు సుమీ. మఱి పరమాత్మద్వారమున జీవుఁడు దాని నెనయంగలఁడు. ఎట్లన, నింద్రియవృత్తిశూన్యంబగు స్వప్నస్థితియందు జీవుఁడుండి యెడేనిశబ్దమువలన నెట్లు మేల్కొను చున్నాఁడో? యెఱింగితిరే! పరమాత్మ తచ్ఛబ్దము విని ప్రబోధించుట వలననే సుమీ. పరమాత్మ కరణాధీనుండు గాఁడు గాన నింద్రియవృత్తి శూన్యుండయ్యు నే శబ్దము నేని వినఁగలఁడు- అది యట్లుండె, అట్టి యయ్యాశ్వరుని హృదయాకాశంబునందలి యోంకృతి క్రమముగా వెల్వడి బృహదాత్రిపము వహించి వైఖర్యాఖ్య నభివ్యక్తమగుచున్నది. 84

సీ. అతుల మీ యోంకృతి ♦ స్వాశ్రయమై పొల్చు
పరమాత్మునకుఁ బర ♦ బ్రహ్మమునకుఁ
గేవలవాచకం ♦ బౌ వేదబీజమౌ
నఖిలమంత్రముల ర ♦ హస్యమౌ స
నాతనంబౌ, బరి ♦ పూతమౌ, నది యకా
రము నుకారము మకా ♦ రము వహించు
దానిచేతను గుణ ♦ త్రయమును ఋగ్యజు
స్సామముల్ భూర్భువ ♦ స్స్వర్భువనము

తే. లింక జాగ్రిదాదికవృత్తు ♦ లేరుపడియె
స్వరగణాంతస్థములను స్ప ♦ ర్శముల నూష్మ

ములను హ్రస్వదీర్ఘాదులం ♦ బొలుచు నక్ష
రముల దానిచే సృజియించెఁ ♦ గమలభవుఁడు. 85

తే. దర్శ పూర్ణమాసాదులం ♦ దనరఁ జేయు
వ్యాహృతి ప్రణవములతో ♦ వరలు నాలు
వేదముల నాల్గుమోములఁ ♦ వెడలఁ జేసి
నలినగర్భుఁ డక్షరసమా ♦ మ్నాయమునను. 86

కం. ఆ వేదంబుల నెల్లం, గోవిదు లుచ్చారణాది ♦ కుశలులు పూనన్
పావనులు మరీచ్యాదిను, తావళు లజుతోడఁ జదివి ♦ రధికశ్రద్ధన్. 87

కం. వారలు తమపుత్త్రుల క, వ్వారలుం దమపుత్త్రులకును ♦ వాగ్రుచ్యాగ నీ
తీరున శిష్యవరంపర, గా రాజిల్లెం జతుర్యు ♦ గములందు శ్రుతుల్. 88

సీ. అంతటఁ దద్ద్వాప ♦ రాంతమ్మునం గాల, వశమున జనము లల్పతరబుద్ధు
లల్పసత్త్వులును క్షీ ♦ ణాయుష్కు లగుట మ, హర్షులువీక్షించి యాత్మహృదయ
మందలి భగవాను ♦ ననుపమ నోదన, చే వేదముల విభ ♦ జించినారు
వదపడి నిప్పటి ♦ వైవస్వతాఖ్య మ, న్వంతరంబందు ధ ♦ ర్మాభిరక్ష

తే. నలువుపొంట బ్రహ్మేశాది ♦ సకలలోక
పాలకులు వేఁడ లోకభా ♦ వనుఁడు విభుఁడు
సత్యవతికిఁ బరాశర ♦ సంయమికిని
నవతరించెఁ గృష్ణుఁ డన న ♦ త్త్వాంశమునను. 89

క. అహ్మానివరులె వ్యాసులు, సు మ్మస్మద్గురులు ఋగ్య ♦ జుస్సామాధ
ర్వమ్ము లనంగా నామ్నా, యమ్ము విభాగించె నాలు ♦ గవు తెఱవులుగా.

వ. కుప్పలుగాఁ గూలియున్న వివిధరత్నమ్ముల వేర్వేఱ యేజాతి కాజాతిరత్న మ్ముల సూత్రమునం గ్రుచ్చినట్లు కలిసియున్న ఋగాదిమంత్రరాశిని వ్యాసభగవానుండు వేఱువేఱ నాలుగుసంహితలుగా నేర్పఱచి బుద్ధి మదగ్రేసరులగు ఛాత్రులంజీరి యందుఁ బైలునకు బహ్వృచమనఁబడు ఋక్సంహితను, వైశంపాయనునకు నిగదంబను యజుర్గణసంహితను, జైమినికి ఛందోగంబనుసామసంహితను, సుమంతునకు నాలవదియగు నధర్వాంగిరస్సంహితను నుపదేశించె. అంతఁ బైలుండు తన పఠించిన ఋగ్వేదమును రెండుగా విభజించి యొకదాని నింద్రప్రమితికి మఱొకదాని బాష్కలునకు నుపదేశించె. బాష్కలుండు తాఁ జదివిన సంహితను నాలుగుగా విభజించి బోధ్యునకు యాజ్ఞవల్క్యునకుఁ బరాశరునకు నగ్ని మిత్రునకు నొక్కొక్కటిసెప్పె. ఇంక నింద్రప్రమితి తనసంహితను గుమా రుండును గవియు ఋషియు నగుమాండూకేయునకుఁ గఱపె. అతఁడు

తన పుత్త్రుఁడగు శాకల్యునకు, శిష్యుండగు * దేవమిత్రునకు దానిం గఱపె. దేవమిత్రుఁడు సౌభర్యాదులకు దాని నేర్పె. మాండూకేయనందనుండగు శాకల్యుండు తన నేర్చిన సంహితను నైదుగా విభజించి [1] వాత్స్య మౌద్గల్య శాలీయ గోబిల్య శిశిరులకు వచించెను. శాకల్యునకు మఱొక శిష్యుండు జాతుకర్ణుండు గలండు. ఆతండు తాఁ జదివిన సంహితకు నిరుక్తమును రచించి తత్సంహితానిరుక్తముల [2] బలాక పైంగ వైతాళ విరజులకు బోధించె. మఱియు బాష్కలుని పుత్త్రుఁడు బాష్కలి యనువాఁ డుక్త సర్వశాఖలనుండి వాలఖిల్యాఖ్య సంహిత నేర్పఱచి దానిని బాలాయని [3] గార్గి కాసారులకో నధ్యయనించెను. ఇవియన్నియు బ్రహ్మర్షులు ధరించిన బహ్వృచసంహితలు. ఈ విభాగక్రమము విన్నవాఁడు సర్వపావవిముక్తుఁడగు. ఇఁక యజుర్వేదమునందలి తైత్తిరీయ శాఖోత్పత్తిక్రమము వినుము. 91

## తైత్తిరీయశాఖోత్పత్తిక్రమము

కం. మునివర్యుఁడు వైశంపాయనుఁడు గురూత్తముఁడు సల్పి♦నట్టి వ్రతంబుం
బొనరిచి చరకాధ్వర్యువు,లనఁ బేర్కొనఁబడిరి వారి ♦ యంతేవాసుల్. 92

ఆ. బ్రహ్మహత్యలను బ్ర ♦ భంజించు తద్వ్రతా
చరణమునను వారు ♦ చరకులైరి
యధ్యయనముసేయు ♦ యాజుషశాఖ స
ధ్వర్యువులనఁబడిరి ♦ వారలెల్ల. 93

వ. [4] గుర్వనుష్ఠేయవ్రతముఁ దదనుమతిం జేసి శిష్యులాచరించుచుండఁగా, 94

---

* తస్యశిష్యోవేదమిత్రః అని బొంబై ప్రతి. తస్యశిష్యోదేవమిత్రః అని వావిళ్ళ. సంస్కృత లిపిలోని వ-ద లించుక సారూప్యము గలవి. व द కాన నిట్లేర్పడియుండు.

(1) "వాత్స్య ముద్గల శాలీయ గోఖల్య శిశిరేష్వధాత్" అని బొంబై ప్రతిలోనుండ "వాచ్య మౌద్గల్య శాలీయ గోబిల్య శిశిరేష్వధాత్" అని వావిళ్ళ ప్రతి. కీ. శే. జనమంచి శేషాద్రిశర్మగారి బ్రహ్మాండ పురాణమున "ముద్గల గోఖల ఖలీయ ద్వాత్స శైశిరేయ" లని కలదు. (2) "బలాక పైజ వైతాల" అని బొంబైప్రతినుండ "బలాక పైంగ వైరాళ" అని వావిళ్ళప్రతి. (3) "చక్రే బాలాయ నిర్భుజ్య" అని బొంబైప్రతినుండ "చక్రే బాలాయనిర్గార్గిః" అని వావిళ్ళప్రతి. (4) "ఋషిర్యోఽద్య మహామేరౌ సమాజేనాగమిష్యతి, తస్యవై సప్తరాత్రాత్తు బ్రహ్మహత్యా భవిష్యతి. పూర్వమేవం మునిగణైః సమయోఽభూత్కృతో ద్విజ। వైశంపాయన ఏకస్తు తం వ్యతిక్రాంతవాంస్తదా" అని విష్ణుపురాణము. ఒక నిర్ణయ మొనర్చుటకు మునులందఱు మేరుగిరికి రావలసినదనియు, నట్లు రానిచో బ్రహ్మహత్య వచ్చుననియు మును లొకసమయ మొనర్చిరఁట. వైశంపాయనుఁడు రామి వానికి బ్రహ్మహత్య చుట్టుకొనెనఁట, అది బోవుటకై వైశంపాయనుఁడు శిష్యులచే వ్రతము చేయించెను.

కం. ఆయతమతియగు వైశం
పాయనునకుఁ గలఁడు యాజ్ఞ ♦ వల్క్యుఁడనఁగ వి
ద్యాయుక్తుఁడు శిష్యుం డొకఁ
డాయనఘుఁడు గురుని జేరి ♦ యను నీ పగిదిన్. 95

కం. ఈయల్పసారు లెక్కడ!, యీయతులవ్రతము సల్పు ♦ టెక్కడ! యిహిహీ!
చేయంగల నేనొక్కఁడ, నే యీవ్రత మానతిమ్ము ♦ ఋషికులతిలకా! 96

మ. అన నాలించి గురుం డిదేమిర! సతీ ♦ ర్థ్యశ్రేణి నీరీతిగా
జను నీ గేలిమొనర్ప! నీనడత శ ♦ స్త్రప్రక్రియన్ లేద య
న్యనుపాలంభము నాత్మభూషణము నం ♦ హోమూలమంచుం దలం
పని నిన్నేనిఁక శిష్యుఁడా! యనుచుఁ బి ♦ ల్వ న్నవ్వరే నల్వురున్. 97

చం. చదువది యెంతయున్న గుణ ♦ సంపద యింతయు లేదయేని యా
చదువు నిరర్థకం బతని ♦ ఛాత్రతచే నసముట్టులుండఁ బైఁ
బొదలెడి నొజ్జకుం గలుష ♦ ముల్, దగుపాత్రమెఱింగి యీయనోఁ
జదువునుగూడ, సల్పదుగె ♦ సజ్జననింద మదంబు పెంపురన్? 98

ఆ. అణఁగిమణఁగి యుండ ♦ నట్టి ధూర్తులకును, విద్యగఱపు టెల్ల ♦ వెఱ్ఱితనము
తెలివి యుండుఁగాక ♦ తేజముండునుగాక, మిట్టిపడఁగఁదగు నె ♦ చట్టులెందు?

శా. నీవిద్యాజనకుం డవండనుచుఁ బ్ర ♦ శ్నింపన్ సభం గోవిదుల్
నీ వచ్చోనిడు నుత్తరంబు వినఁగన్ ♦ సిగ్గిల్లుదుం గాన నీ
వే వేదంబు గ్రహించి తద్ది యిపుడే ♦ యిచ్చో విసర్జించి పొ
మ్మా వేఱొండొకచోటి, కిట్టి విబుధ ♦ మ్మన్యుండు నాకేటికిన్! 100

కం. అన దేవరాతసుతుఁ డొయ్యన గురువును వేఁడుకొనక ♦ యుల్లేయుని తాఁ
గొనిన యజుర్గణములఁ గ్రక్కెను దత్క్షణమున నెమెంత ♦ కినుకఁ ద్విజునకున్!

ఉ. అంతటఁ జెంతనున్న ముని ♦ లాగమలోలుప బుద్ధిఁజేసి య
వ్వాంత యజుర్గణంబుఁగని ♦ పాటులరూపునఁ గాదటంచు నో
కింతతలంచి తిత్తిరఖ ♦ గేంద్రములై కొని రందుచే యజు
స్సంతతి తైత్తిరీయమను ♦ సంజ్ఞగనెన్ రుచిరత్వమేర్పడన్. 102

ఆ. అంతయాజ్ఞవల్క్యుఁ ♦ డామ్నాయశూన్యుఁడై
యుండలేక గురున ♦ కొదవనట్టి
వేదములను దాను ♦ వెదకి పొంది వెలుంగ
బుద్ధిఁదలఁచి సూర్యుఁ ♦ బొగడఁగడఁగె. 103

దండకము. ఓం నమో దేవదేవాయ! దివ్యప్రభావాయ! సూర్యాయ! భూతాళి
రక్షాతిధుర్యాయ! తుభ్యం వరేణ్యాయ! ఆమ్నాయగణ్యాయ! లోకాధి
నాథాయ! సుజ్ఞానగాథాయ! ధాత్రాదిక స్తంబపర్యంత మొప్పారు
చేదారులన్నిటను భూతంబులం దంతరస్థుండవై యయ్యుపాధివ్యవచ్ఛిన్నతం
గాంచ కాకాశముం బోలెఁ దద్వ్యాప్యదోషంబులం బొంద కాత్మస్వరూ
పుండవై వెండి కాష్ఠా కలాయామ రాత్రిందివా ద్యంగసంశోభి వర్షంబుల
న్నిరశేషప్రవర్షంబులన్ సల్పుచున్ గాలరూపుండవై వెల్పుల న్వేగుచు
న్విశ్వముం ద్రిప్పుచున్నాఁడ వొక్కండవే యీశ్వరా! పేదరా వేదవాదం
బున న్నీదుపాదంబు మోదంబుతోఁ దాల్తురా నేఁడలం బూదలంబుం బలె
న్నీదయం బొందయుంబంట కేయూరదలైపోదురా యేదరా సాదరాలోక
మేపారఁగాఁ బద్మినీవల్లభా! 104

దం॥ సవిత! తపన! ప్రత్యహంబుం ద్రికాలంబుల న్వేదమార్గప్రకారంబున
న్నీయుపాస్తిం బొనర్పంగ నీవయ్యవస్థాత్మ సర్వాఘముం దత్ఫల ప్రాప్త
దుఃఖంబుఁ దద్బీజమజ్ఞానమున్ భర్జనం బాచరిం తుగ్ర ఘృష్ట్యావళిం
గ్రిందుగాఁజోవు చేతద్భవన్మండల ధ్యానమున్ ధీమహిం జేసెదన్ నీవు
ఋగ్రాజి విన్వీడిఁ బూర్వాహ్ణమందున్ యజుశ్శ్రేణి మధ్యాహ్నమందున్
లసత్సామవేదాప్తి సాయాహ్నమందున్ విరాజిల్లెదో సూర్యనారాయణా!

దండకము॥ అఖిలాంతర్యామివై స్వాశ్రయంబైన యీ జంగమస్థావరశ్రేణి బుద్ధీం
ద్రియప్రాణవర్గం బనాత్మంబు నిశ్చేతనం బీవ యాత్ముండవై చుం బ్రచో
దింతు సర్వేశ్వరా! దివ్యకారుణ్యపాథోధి! యత్యుగ్రవ క్రాంధకారా
హ్వాయ గాఢవాస గ్రస్తమై లోకమెల్లన్ మృతప్రాయమై చేతనా
శూన్యమైయుండఁ గారుణ్యదృక్పాతమాత్రంబునన్ లేపి నిత్యంబు సంధ్యా
త్రయిన్ స్వీయధర్మంబున న్వర్తిలం జేసి యాత్మానుభూతి స్ఫుర
చ్ఛ్రేవసీయంబు గల్గింతు రాజుంబలెం దుష్టులం భీతులం జేయు చండందు
డిక్పాలకుల్ భక్తిమై పద్మకోశాంజలిశ్రేణి నర్ఘ్యంబు లర్పింపఁ గైకొంచు
వర్తింతు వో దేవ! లోకత్రయీనాథ తోష్టూయమాన త్వదీయాంఘ్రి
పద్మద్వయం బే నుపస్థానముం జేయుటల్ లోకరక్షామణీ! యన్యజుష్టంబు
గాకున్న రాజద్యజుస్సంతతిం గోరిచు మిమ్మీశ్వరా! శంకరా! సర్వ
వేదాకరా! విద్విషద్భీకరా! సూర! మిత్రా! రవీ! సూర్య! భానూ!
ఖగా! పూష! ఆదిత్య! అర్కా! మరీచీ! హిరణ్యోదరా! భాస్కరా!
సప్తవాహా! సవిత్రాఖ్య! ఓం సూర్యనారాయణా! ఓం నమస్తే నమస్తే నమః.

కం. అని దేవరాతనిజసంభవుఁడు త్రిపదమంత్రమునను దలఁప హయాస్యం
బున రవి యయాతయామము, లనుయాజుషసంహితాకలాపములొసగెన్.

ఆ. యాజ్ఞవల్క్యుఁ డంత ♦ నాబహుళ యజుః ప్ర
చయముఁ బదియు నైదు ♦ శాఖలుగను
జేసి యధ్యయనము ♦ సేయించెఁ గాణ్వ మా
ధ్యందినాది శిష్య ♦ తతులచేత. 108

వ. వాజిరూపుం డైన సూర్యభగవానుని వాజ సన్యస్తంబులగుట వీనికి వాజస నేయ సంజ్ఞ లభించె. ఇంక సామశాఖావిభాగ మాలింపుఁడని సూతుండు చెప్పందొడంగె. 109

తే. తానుజదివిన సామవే ♦ దమును రెండు
శాఖలుగఁ జేసి జైమిని ♦ సంయమీంద్రుఁ
డొకటి పుత్త్రుఁ డైన సుమంతు ♦ నకు మఱొకటి
పౌత్త్రుఁడగు [1] సుకర్మకు వేఱు ♦ వఱచినొసఁగె 110

సీ. అనుకర్మయుఁ దన ♦ కబ్బిన సామవృ
క్షమునకు వేయిశా ♦ ఖల నొనర్చి
కోసలజాతుండు ♦ గుణియా హిరణ్యనా
భునకుఁ [2] బౌష్యంజి నా ♦ మునకు మఱియు
నావంత్యవిప్రున ♦ కవినేర్పె నామువ్వు
రేనూఱుగురు శిష్య ♦ బృందమునకు
దీచ్యులకును వానిఁ ♦ దెల్పిరి వీరిని
బ్రాచ్యులంచును బల్కు ♦ వారుగలరు

తే. కుక్షి కుల్య కుసీద [3] లో ♦ కాక్షి లాంగ
లాఖ్యుల నెసంగు నైదుగు ♦ రరుస మొప్ప
నొక్కొకరు నూఱుశాఖల ♦ నొంది రధిక
తర మనీషను బౌష్యంజి ♦ గురునివలన. 111

తే. మఱి హిరణ్యనాభుని శిష్య ♦ వరుఁడు కృతుఁడు
సరవి నిరువదినాలుగు ♦ సంహితలను
దనదు శిష్యులకుం జెప్పెఁ ♦ దక్క వానిఁ
జెప్పె నావంత్యవిప్రుండు ♦ శిష్యతతికి. 112

వ. అని సూతుండు శౌనకాదులకుం జెప్పె. 113

ఇది షష్ఠాధ్యాయము సమాప్తము

---

1. సున్వాంస్తుతత్సుతః. అని దొంబై. "సుకర్మాతత్సుతః"అని వావిళ్ళప్రతి. సుతన్వాన్ అనిమఱొక పాఠము. 2. "పౌష్యింజిళ్ళ" అని వావిళ్ళ. "పౌష్యంజిళ్ళ" అని దొంబై ప్రతి. బ్రహ్మాండపురాణమునను "పౌష్యంజి" అనియే కలదు. 3. లోకాక్షిర్లాంగలః "అని వావిళ్ళ. లౌగాక్షిర్మాంగలిః"అనిదొంబై ప్రతి. .... .... ఆతనికిఁ గుశీదిలాంగలులును లౌగాక్షిఁ పితబుద్ధిప్రైనకుషమియు అని బ్రహ్మాండపురాణము.

## సప్తమాధ్యాయము

కం. నామగ్రాహము పిలిచిన, ధీమంతుల గాతునని ప్ర ♦ తిజ్ఞగదా యి
చ్చో మావల్కలవిన విది, యామీభద్రంకరణము ♦ హరిహరనాథా !

వ. [4] దేవా ! యవధరింపుము. అవ్వల శ్రీసూతపౌరాణికుండు శౌనకాదులతో
నిట్లనె. ఇఁక నథర్వవేదవిభాగము వినుఁడి. 2

### —♦ సూతుండు శౌనకాదుల కథర్వవిభాగక్రమము నుడువుట ♦—

కం. అంత నథర్వశ్రుతిని సుమంతుండు [5] కబంధునకు స ♦ మర్పించె నతం
డెంతయు నది రెండుసలిపి, దాంతులయిన పథ్య [6] వేద ♦ దర్శుల కొసఁగెన్.

కం. అనఘుఁడు పథ్యుఁడు తన నేర్చిన సంహిత మూఁడుగాఁగఁ ♦ జేసి కుముదునికిన్
శునకుని జాబాలిని నేర్పునఁ జదివించె నియమార్థి ♦ గూఢుండగుచున్. 4

తే. వేదదర్శుండు తనచది ♦ వినది నాల్గుగా విభాగించి చెప్పె శౌ ♦ [7] ల్కాయనికిని
బ్రహ్మబలికి [8] నిర్దోషుఁడ ♦ న్పండితునకుఁ, బిప్పలాయనునకు నిష్ఠ ♦ పెంపుమీఱ.

తే. ఆంగిరసగోత్రుఁడగు శున ♦ కాహ్వయుండు
తానుగన్న సంహితను ద్వి ♦ ధావిభాగ
మాచరించి బభ్రుఁడను బ్రా ♦ హ్మణునకొండు
సైంధవాయనున కొకండు ♦ చాటిచెప్పె. 6

వ. ఆ బభ్రుసైంధవాయన శిష్యులగు సావర్ణ్యాదులును నక్షత్రకల్పుఁడు [9] శాంతికల్పుఁడు కశ్యపాంగిరసాదులు నాథర్వణాచార్యులై తద్వేదమును బ్రవచనాదుల విస్తరింపంజేసిరి. ఇఁక పౌరాణికోత్తముల వివరించెదను.

### ♦ పురాణవ్యాప్తి ♦

సీ. శ్రీవ్యాసభగవానుఁ ♦ డవ్యాజకరుణతో, నాఱుపురాణంబు ♦ లలవరించి
యాస్మాక పితృమిత్రశు ♦ లా రోమహర్షణ, మునివరేణ్యునకు వా ♦ నిని వచించె

---

4. అధ్యాయ ప్రారంభము 1-12-1946 (5) "అథర్వవిత్సుమంతుశ్చ శిష్యమధ్యాపయత్స్వకాం" అనియే భాగవతము. శిష్యనామము లేదు. "శిష్యమధ్యాపయామాస కబంధమ్" అని వైష్ణవమున మన్నదని వ్యాఖ్య. బ్రహ్మాండపురాణమునను "కబంధుఁ" డని కలదు. (6) దేవదర్శుఁడని బ్రహ్మాండపురాణము. (7) "శౌక్లాయనిర్బ్రహ్మబలిర్మోదోషః పిప్పలాయనిః" అని బొంబై ప్రతి. శౌల్కాయని ర్బ్రహ్మబలి ర్నిర్దోషః పిప్పలాయనః అని వావిళ్ళ. (8) నిర్దోషుఁడనక బ్రహ్మాండపురాణము మోదుఁడనెను. "బ్రహ్మబలుఁడు మోదుండు మఱిపిప్పలాదుండు శౌల్కాయనియు" అని. (9) నక్షత్రకల్పశ్శాంతిశ్చ కశ్యపాంగిరసాదయః ఏతే ఆథర్వణాచార్యాః అని భాగవతము. "క్రమముగామంజుకేశ్య నక్షత్రకల్పములును వైతానకాంగిరస్సులును శాంతికల్పమును" అని బ్రహ్మాండపురాణము.

నాయనఘుండు త్ర ♦ య్యారుణి కశ్యప, సావర్ణులకును ధీ ♦ శాలియైన
యకృతవ్రణునకును ♦ హారీతునకును వై, శంపాయనున కను ♦ శంపతోడ

తే. నొక్కొక పురాణము వచించె ♦ నుదితభక్తి
నేను నియ్యార్యవరకడ గ్ర ♦ హించితిం బు
రాణముల నాఱిటింగూడ ♦ శ్రద్ధతోడ
నంతఁ దవివిసనక విన ♦ యంబుదోఁప 8

తే. శ్రీశుకమహామునికి సేవ ♦ సేసి నేను
గాశ్యపుండును సావర్ణి ♦ ఘనుఁడు జామ
దగ్న్య శిష్యోత్తముం డకృ ♦ తవ్రణుఁడు గ్ర
హించితిమి నాల్గుమూఁడసం ♦ హితలఁగూడ. 9

♦- సూతుండు శౌనకాదులకుఁబురాణలక్షణము వివరించుట ♦-

వ. ఇంక శాస్త్రానుసారముగా బ్రహ్మర్షులచే నిరూపింపఁబడిన పురాణ లక్షణ
మును వ్రాక్రుచ్చెద వినుండు. 10

తే. విశ్వసర్గ, విసర్గముల్, ♦ వృత్తి, రక్ష,
లంతరములు, వంశములుఁ, వం ♦ శ్యానుచరిత,
సంస్థలును, హేతువులు, నపా ♦ శ్రయము, లను ద
శమ్ము గలది మహాపురా ♦ ణమ్ము సుమ్ము 11

తే. సర్గమును బ్రతిసర్గ వం ♦ శమ్ము లంత
రములు వంశ్యానుచరితముల్ ♦ గ్రాలెనేని
యద్ది యల్పపురాణ మం ♦ చంద్రు బుధులు
పీనిలక్షణమ్ములఁగూడ ♦ విస్తరింతు. 12

సీ. అవ్యాకృతంబగు ♦ సత్త్వప్రధానమం, దలి గుణమ్ముల కలఁ ♦ త న్మహత్తు
కలిగెదానికిమూఁడు♦గతుల యహంకార, ముదయించె నద్దాన♦నొదవెభూత
సూక్ష్మేంద్రియార్థముల్♦సారిదినీకారణ, సర్గంబు నుదువుట ♦ సర్గమంద్రు
బీజంబునం దొండు♦బీజమ్ముపుట్టిన, చంద మీశ్వరుని ప్ర ♦ సాదమునను

తే. కలిగె నీమహదాదివ ♦ ర్గమ్మునం జ, రాచర ప్రాణిజాతమ్ము♦ప్రాక్తన జని
కర్మవాసనా ప్రాధాన్య♦కలన నిట్లు, కార్యసృష్టి నుడువ విస♦ర్గమనఁబడును.

తే. జంగమములకుఁ దఱుచుగా ♦ స్థావరములుఁ
దత్స్వభావ కామముల ప్రో ♦ త్సాహమునను
జీవికావృత్తియగు నిది ♦ చెప్పఁదాని
వృత్తి యంద్రు పౌరాణికా ♦ గ్రియులు ధరణి. 14

కం. సుర నర ఋషి తిర్యగ్వి,స్ఫుర ద్వతారములఁ దాల్చి ♦ పురుషోత్తముఁ డి
ద్ధరఁ బ్రతియుగమ్మునన్ శ్రు,త్యరాతులవధించు రక్ష♦యగు నిదినుడువన్.

కం. మనువులు మనుపుత్త్రులు సుర
లును సురవిభులును ఋషీంద్రు ♦ లును శ్రీవిభుఁ డా
స్దిన యవతారములును గ
ల్గినయది 'మన్వంతరమ్ము' ♦ కృతమతులారా ! 16

తే. కమలజుఁడు మొదలుగాని త్రై ♦ కాలికమగు
క్షత్త్రియకులంబు నుడువ "వం ♦ శ" మనఁబడును
దత్కులప్రసూతుల చరి ♦ త్రము నుడువ
నదియె 'వంశ్యానుచరిత' మం ♦ చాడఁబడును. 17

తే. అఖిలవిశ్వమ్మునకును మా ♦ యాప్రభావ
వశత నిత్య నైమిత్తిక ♦ ప్రాకృతికము
లనఁగ నాత్యంతికమనంగఁ ♦ దనరు లయము
లడరు నే తన్నిరూపణం ♦ బగును 'సంస్థ'. 18

వ. ఎవ్వనిం గొండఱు సృష్టికిఁబూర్వము నరసురాది నామరూపరహితుం
డగుటవలన నుపాధిప్రాధాన్య వివక్షచే నవ్యాకృతుండని నుడివెదరో ?
యెవ్వనిం గొండఱు భుక్తశేష కర్మవాసనా సమేతుండగుటవలనఁ
జైతన్యప్రాధాన్యవివక్షచే ననుశయి యని నుడివెదరో ! యెవ్వఁ డవిద్యా
వశంబునఁ బుణ్యపాపకర్మంబుల నాచరించుచుండునో ? యా జీవుండ
యీ జగత్సర్గాదికమునకు నిమిత్త మని ప్రతిపాదించుట హేతువనఁబడు.
మాయామయంబులైన జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడి జీవవృత్తులందు
విశ్వ తైజస ప్రాజ్ఞ నామములం దాల్చి సాక్షిరూపంబున నన్వితుం
డయ్యు సమాధ్యాదులం దేవృత్తి నంటక వ్యతిరిక్తుండయ్యును బ్రహ్మ
మ్ముండు నని నిరూపించుట "యపాశ్రయం" బనంబడు. మఱియు దీనిన
వివరింతు వినుఁడు. ఘటాదిపదార్థములున్నపుడు వానియందును నవి
లేనపుడును మృదాదులుండనేయుండును. అట్లే నిషేక, గర్భ, జన్మ,
బాల్య, కౌమార, యౌవన, వయోమధ్య, జరా, మృత్యువులను
తొమ్మిదిశరీరావస్థ లున్నపుడును లేనపుడును నట సాక్షి చైతన్యము
పరమాత్మ భాసిల్లుచునే యుండును. 19

సీ. సర్గ విసర్గాది ♦ సంచయమెల్ల మా, యామయంబను బుద్ధి ♦ నలవరించి
వామదేవాదుల♦వలె స్వయంబుగనైన, లేక యిచ్చటనున ♦ ల్పెడి ప్రసిద్ధ
యోగంబుచే దేవ♦హూత్యాదులంబలె, నైనఁజిత్తము జాగ్ర♦దాదికమగు
వృత్తిత్రయాశ్రయో ♦ ద్వేగంబునుండి సాం, సారికేహాప్రవం ♦ చంబునుండి

ఆ. త్రిప్పవలయు వాని కవ్వాతు గోచరిం, చెడిని బ్రహ్మపదము ♦ శిష్యులార !
ఇవ్విధమునఁ జెప్ప♦నిది 'యుపాశ్రయ'మని, పలుకుదురుపురాణ♦పండితులెందు.

కం. ఈ లక్షణ లక్ష్యంబుల, చే లలితములైన పెద్ద ♦ చిన్నవియుఁ బురా
ణాలు పదునెన్మిదని యు, ర్వీశేఖులు పల్కుచుండ్రు ♦ వినుఁ డవ్వానిన్ 21

సీ. బ్రాహ్మంబు పాద్మంబు♦వైష్ణవ శైవముల్
గారుడ లైంగముల్ ♦ నారదీయ
భాగవతంబులు ♦ వారాహ మాత్స్యముల్
బ్రహ్మకైవర్తంబు ♦ వామనంబు
స్కాంద మాగ్నేయంబు ♦ కౌర్మంబు బ్రహ్మాండ
మతుల మార్కండేయ ♦ మనెడి పేళ్ళఁ
బరగుపురాణముల్ ♦ పదియునెన్మిది తపో
హారి శ్రీబాదరా ♦ యణమహర్షి

తే. రమ్యమైనభక్తి రచించెఁ♦బ్రాజ్ఞులార! యిట్లు వేదపురాణమ్ము♦లెల్లఁ బెక్కు
గతుల శాఖోపశాఖలై ♦ క్రాలె వీని, విన్న బ్రహ్మవర్చస మభి♦వృద్ధిసెందు.

వ. అని శ్రీసూతుండు శౌనకాదిమునులకు వచించెను. 23

ఇది సప్తమాధ్యాయము సమాప్తము

## అష్టమాధ్యాయము

కం. దోసంబులు క్షమియింపుము
గాసింబడ నీకు రచన ♦ కై వేఁడెదఁ గ
మిమ్మా సాయము భక్తమనో
బ్జాసీన శుభాంఘ్రియుగళ ! ♦ హరిహరనాథా ! 1

వ. * దేవా! యవధరింపుము. అవ్విధంబునఁ బౌరాణికాగ్రేసరుండగు శ్రీసూతుండు నుడువ వినుచున్న మౌనిపుంగవులలో భార్గవుండైన శౌనక మహర్షి యిట్లనియె. 2

తే. సూతమౌనీంద్ర! వాచావి ♦ భూతిసాంద్ర!
బ్రదుకుమా చిరకాలంబు ♦ వసుధమీఁద
నొడ్డులేని భవాబ్ధిలోఁ ♦ బడ్డ మాదృ
శులకు నౌక తెప్పవొయ్య వౌ ♦ చు న్మహాత్మ ! 3

* 20—12—1946 ప్రారంభము. సప్తమాధ్యాయము 7–12–46 నఁ బూర్తిచేసితిని పిదపఁ గలము సాఁగలేదు. వ్యాసుని స్తుతించినపిదపనే కలము సాగినది ఆ పద్యముల నవల గ్రంథాదిం జేర్చితిని.

సీ. స్వామీ! మృకండ మ ♦ హామునిసుతుఁడు మా
ర్కండేయమౌని యీ ♦ కల్పమంద
యస్మద్భృగుకులంబు ♦ నందు జనించె న
య్యనఘుండు దీర్ఘాయు ♦ వనుచు వృద్ధు
లాడుచేకాక క ♦ ల్పాంతంబున జగంబు
లన్ని నశింపంగ ♦ నాతఁ డొకఁడ
యేకాంబుధిఁ భ్రమి ♦ యించుచు వటపత్ర
శయనుఁడౌ నొకబాలు ♦ సన్నుతాంగు

తే. దరిసెనమొనర్చెఁట యని ♦ తామ నెదరు
వాని పుట్టుకఁదొట్టి యే ♦ ప్రలయ మొదవ
దయ్యెఁ బుట్టనిప్రలయంబు ♦ నరయ నెట్లు?
బాలుఁగనుటెట్టు లిద్ది య ♦ బ్రంబు గాదె? 4

వ. ఈవు సర్వపురాణజ్ఞుండవు మహాయోగివి కాన మాయీ సంశయచ్ఛేదం
బొనర్పవేఁడెద మనవుడు సూతపౌరాణికుం డిట్లనియె. 5

—• మార్కండేయ మహామునిచరిత్ర •—

కం. నీయడిగిన యీప్రశ్నం, బోయయ్యా! కలిమలంబు ♦ నుత్సాదించుఁ
జేయుం జగదభయము నా, రాయణకథ యిందుఁ గ్రాలి ♦ నది గాన మునీ! 6

సీ. వినుఁడు మార్కండేయ♦మునివరుచరిత మా
యన తండ్రివలన వి ♦ ప్రార్హసంస్క్రి
యలఁగ్రమమ్ముగనొంది ♦ యవ్వల
నుపనీతుఁడై సాంగవేదమ్ము ♦ లభ్యసించి
తపము స్వాధ్యాయమ్ము ♦ ధర్మమ్ము వీడక
శాంతుఁడై నైష్ఠికో ♦ చ్చవ్రతంబు
వహియించి వల్కలాం ♦ బరములు గట్టి జ
టాకలాపము కమం ♦ డలువు దండ

తే. మక్షసూత్రోపవీత కు ♦ శాజి నాదు
లవధరించి సన్నియమర్థి ♦ నగ్నిసూర్య
విప్రగురులందు నాత్మయం ♦ దప్రమేయు
హరిని బూజించు నుభయసం ♦ ధ్యల వెలుంగు. 7

కం. ప్రాతస్సాయంవేళా, నీతము భైక్షాన్నము గురు ♦ ని కొసఁగి తదను
జ్ఞాతంత్రి ముస్న వాగ్యతుఁ,డై తిను లేకున్న నిట్రు ♦ నవలంబించుఁ. 8

కం. ఈ యనువునను దపస్స్వా
ధ్యాయపరుం డగుచుఁ గొలుచు ♦ చయుతాయుతముల్
హాయనములు శ్రీమన్నా
రాయణు, గెలిచెఁజుమి దుర్జ ♦ యంబగుమిత్తిన్. 9

తే. అద్దినూచి శతానందుఁ ♦ డభవుఁడు భృగు
వాని దక్షుండు కడమ బ్ర ♦ హ్మ తనయాళి
మఱియు నరదేవ పితరాదు ♦ లరరె! యనిరి
హరుఁడుగాక యెవ్వరు గెల్చ ♦ రయ్యమిత్తి? 10

వ. ఇట్లు సమాధియోగంబున హరిని సేవించుచు యోగధ్వస్తక్లేశాంతరాత్ముం డైన యమ్మార్కండేయున [1]కాఱుమన్వంతరమ్ముల కాలమ్ము గడచె. అవ్వల నేడవదగు నీవైవస్వత మన్వంతరమును గడచుచుండ నింద్రుండు విస్మయాధీనమానసుండై యిట్లు తలపోసె. 11

-✻ దేవతలు మార్కండేయు తపమునకు విఘ్నముచేయఁ బూనుట ✻-

ఉ. ఏమివిచిత్ర మింతవఱ ♦ కెవ్వరు నింతటివీర్ఘకాల మీ
నేమముతోఁ దపంబు సల ♦ ిపంచినవారలు లేర, యిప్పుడే
దో మనకొంపయే మునుఁగ ♦ నున్నది బాపురె! యెల్లవారు సు
త్రామపదంబు పొందుటకె ♦ తారెద, రిద్యదియంత చుల్కనో? 12

ఉ. కోరిక కేమి డెందమునఁ ♦ గోరుచుకా? ప్రతిజీవికోరు నా
కోరికఁదీర్చుకో నెఱవు ♦ కోలునఁగాఁ గనుపట్టుఁ దెల్వి యీ

---

1 శ్లో॥ తస్యైవంయుంజతశ్చిత్తం మహాయోగేన యోగినః
వ్యతీయాయ మహాన్కాలో మన్వంతరషడాత్మకః
ఏతత్పురందరో జ్ఞాత్వా సప్తమేఽస్మిన్ కిలాంతరే 8 అ. 14 శ్లో.

వేయి మహాయుగములందు బ్రహ్మ పగటికాలమున 14 మనువులు వర్తింతురు. ఒక్కొక మనువుకాలము 306720000 వత్సరములు.

6 మనువులకాలము 1840320000 (306720000 × 6)
6 మనువుల కేడుసంధులకాలము 12096000 (1728000 × 7)
7 వ మన్వంతరమున 27 మహాయుగములు కడచిన కాలము 116640000 (4320000 × 27)
ఈ 28 వ మహాయుగమున 3 యుగములు గడచెను. 3888000 (కృతత్రేతాద్వాపరములు)
1972944000 ఆరుమనువుల యిర్వదియేడు మహాయుగముల మూఁడుయుగములకాలమిది.
బ్రహ్మసృష్టిఁజేయుటకుమున్న తపముచేసినకాలము 17064000 (47400 × 360)
1955880000

ఈ కల్పమున నిన్నివత్సరము లీ కలియుగప్రారంభమునకుఁ గడచెను. ఇంచుమించుగా నీ కలియుగ ప్రారంభమందేగదా యీ పురాణమును శౌనకాదులు వినుట. కావున నింతకాలము మార్కండేయునకుఁ గడచినదని తెలియుచున్నది. కాఁగా సృష్ట్యాదిని మార్కండేయుఁడు పుట్టెననుకొనవలసివచ్చుచున్నది.

పాఱుని బట్టిచూతు నిటు ♦ వంటి మునీంద్రుల నెందఱిం గనన్ ?
వారలబైసి మాచెలుల ♦ వాల్గనుఁజూపులు సోఁకుదాఁక నే. 13

ఉ. ఈతని శాంతిదాంతు లవి ♦ యెంతటివో యొకతాఁకుతాఁకి యేఁ
జూతుమగాక యంచు బల ♦ సూదనుఁ డచ్చరపిండుఁ జిల్కరా
రౌతును బేరుటామనిని ♦ బ్రన్ననితెమ్మెరకూనఁ జేరి మీ
చాతురిఁజూపి జేవివని ♦ నల్పఁగఁ గాలమువచ్చె వింటిరే ! 14

తే. మీకు గంధర్వులును రజ ♦ స్తోకులైన
లోభమదనాము లండ ని ♦ ల్తురు భటులు మ్రొ
డక్కి సమధికోత్సాహులై ♦ త్వరగఁజనుఁడ
కార్యసాధకు మూఁడు నా ♦ కై స్మరించు. 15

తే. రాఁగదే పుంజికస్థలీ ! ♦ నాగవాస
మఁనకు నాయికామణివయి ♦ పోయిరమ్మ
నీ యొయారమ్ము నీ సొరు ♦ నీ సురూప
మరసి యంకెకు రానివాఁ ♦ డవనిఁగలఁడె ? 16

కం. హిమవత్కుధరోదక్ప్రాగ్భవమునఁ బవిత్రమగు పుష్ప ♦ భద్రా తటినీ
కమనీయ కూలమున నాశ్రమమున్నది చిత్రశిలయు ♦ రాణిలునచటన్. 17

వ. మీరు సరగనరిగి తపసిపబువు తపముసొబగు సెఱిచి కార్యము పండించుకొని రండని సగౌరవంబుగఁ గర్పూరతాంబూలాదు లొసంగి యనుప ననుపమవిలాసంబుల వారంద అమ్మరుద్వతీనందను నాశ్రమమ్మున కరిగిరి. అందు, 18

క. తాఁకెడితలఁ చెడివారలు, తేకునికి యథేచ్ఛముగఁ బొ ♦ లిచి సర్వఋజా
నీకము కళకళలాడుచు, నాకులఁ బువ్వుల ఫలముల ♦ నలరుచునుండెన్. 19

ఉ. పచ్చని యాకుజొంపముల ♦ బ్రన్ననిచీర ధరించి పుప్పొడుల్
క్రచ్చిన లేపముల్ పులిమి ♦ క్రొల్పువుగుత్తులఁ జెర్వి పెన్నిగన్
వచ్చినయామనిన్ మృదుల ♦ బాహు లతావళిఁ గౌఁగిలించుచున్
ముచ్చటలాడఁగాఁదొడఁగె ♦ బో ద్విజరావములం ద్రుమాంగనల్. 20

ఉ. మ్రాఁకులతేవి గ్రొంజివురు ♦ మవ్వపు రాంకపమందుఁ జేరి పుం
స్కోకిల గాయకుం డొనరు ♦ చు న్మృదుగానము, తోడు శారికా
శౌకములుండఁ దుమ్మెదల ♦ ఝుంకృతియే శ్రుతిగాఁగ, మద్దెలల్
గైకొన మ్రానుకోయిలలు ♦ గన్నులపుల్గులు చిందుద్రొక్కఁగన్. 21

చం. నవనవలాడు కెంజిగురు ♦ నాఁడెపుకావు లెసంగఁ, బువ్వగు
చ్ఛ విమలఖండికల్ వెలుఁగ ♦ జానగునూడల లంబకూర్చముల్

నిపుడఁగ నల్లిబిల్లిగొను ♦ నిద్దపుఁదీవల జీబుపొజడల్
మిపులఁగ ప్రమాఁకు,జోగి గమి ♦ మించె సమాధి నచంచలస్థితిన్. 22

సీ. తియ్యమామిడిగుజ్జు♦లుయ్యాలలూఁగు పి, కావళికిదియె వ్యా♦యామశాల
వలఁజగ్గునిగ్గు రం♦గులుగుల్కు పుకులఁదా, రెడి నెమ్మిలకు నిదే♦నృత్యశాల
అలరుజొంపముల జొ♦బ్బలు తేనెసోనల, నాను తేంట్లకు నిదే ♦ పానశాల
మాఁగఁబండినపండ్ల♦ రేఁగి మాఁగిన చిల్క, బారుల కియ్యదే ♦ పాకశాల

తే. జీబుతీవకన్నియలు క్రొం ♦ జివురుఁగేలు
సాఁచి బిగికౌఁగిలింతల ♦ లోఁచి ప్రమాఁకుఁ
జాలుఁ దన్వఁగ నియ్యదే ♦ కేళిశాల
గానఁ గానకుఁబురుడు జ ♦ గానఁ గాన. 23

వ. అట్టియెడ మార్కండేయుండు వహ్నినివేలిచి నిమీలితనేత్రుండై ధురా
ధర్షుండై స్వరూపముంగన్న పావకుండో యనునట్లుండ 24

కం. వనముకు చలగు సురయా, వనము యథేచ్ఛముగ నాట ♦ పాటల నాపా
వన మున్యాశ్రమ పరిసర, వనమునఁ దిరుగందొడఁగిరి♦పాఱునిగలఁవన్.25

మధురగతిరగడ.

ఇంతులార! వన♦శృంగారంబులు, కాంతము రండివె ♦ కనుఁడి సుమంబులు
వింతలమల్లెల♦విరులవికాసము, కాంతాశోక ని ♦ కాయ విలాసము
నీలీవారము ♦ నిచులాకారము, నేలాసారము ♦ హింతకరవీరము
ఘూళీపూరము♦తోఁ బువుటీరము, గ్రాలెడి దూరము♦గాఁకఁడి మాఱము
ఈయరవిందము ♦ నేఁసి మిళిందము, తీయ మరందము ♦ తినియెడిఁగందము
కోయిలబృందము ♦ కో యనుచందము, పాయక విందము ♦ వజ్జనెయుందము
పొన్నలచిన్నెలఁ ♦ బొగడలవన్నెలఁ, గ్రొన్నఁగున్నల ♦ గొజ్జఁగపున్నల
గన్నరుఁతిన్నెలఁ♦ గఁకఁక కన్నెల, మిన్నలు క్రొన్నన ♦ మినుకులఁగన్నన

వ. పరికించి పువ్వులు చిదుము డనుచుండ నందొకర్తు చప్పటలు సఱచుచు 27

తన్వీవృత్తము.

ఎల్లెడ ఝుంఝుమ్మనురవములతో ♦ నెద్దుచు వచ్చెడి తనసతితోడన్
ఫుల్ల సరోజాంతరమున కమితా ♦ మోదముతో నరిగి కడుపునిండన్
జల్లని పూఁదేనె మెసవి తనదా ♦ చానకుఁ బుక్కిఁటఁగల యొకకొంతన్
ఘొల్లఁగ నందించుచుఁ దజీఁగని చుం ♦ బించెడి తుమ్మెదదారఁ గనుతన్వీ!

వ. అన మఱొకతుక 29

మంజుభాషిణి.

ఎలమావిగొమ్మపయి ♦ కెక్కి యందమం
దలి యాన తీఱకి వి ♦ ధాన మెక్కి క్రొం
దలిరుల్, పికాంగన ల ♦ నంగఁ జీకుఁ గో
మలరావముల్ వఱపి ♦ మంజుభాషిణీ! 30

వ. అన మఱియొక తె 31

చం. కలువలు నేత్రముల్ వికచ ♦ కంజముల్ వదనముల్ తరంగపం
క్తులు వళులుఁ ద్విరేఫములు ♦ కుంతలముల్ బిసముల్ సుబాహువుల్
గళము దరమ్ము చక్రములు ♦ క్రముకుచమ్ములు గా నొయారియై
కులుకుచునుండె నేఁడు కనుఁ ♦ గొంటె సరోవరలక్ష్మి నియ్యెడన్. 32

వ. అనుచుండ 33

కం. హిమనిర్ఝరశీకరబృం, దములోఁదోఁగినమనోపి ♦ తతిసి బరిష్వం
గము సల్పి దేల్చు లతాలా, స్యములరయుచు మలయ ♦ పవనుఁడలరాఁదొడఁగెన్

వ. అయ్యవసరమ్మున 35

చం. తలఁపుల నల్లనం బెనుపు ♦ తామరతూపుల నూఱి, కూడునీ
ఋల నుడిగించు వంజులము ♦ లోడిని ద్రిప్పి, వివర్ణతావదన్
మలిచెడి మావి కల్గునిచి, ♦ మాడుచు క్రొవ్విరవాజి ముల్కి తె
క్కల నవరించి, ప్రాణములఁ ♦ గైకొను కల్వను దువ్వె మారుఁడున్. 36

ఉ. అట్టితఱి న్మృదింగలఁచు ♦ నట్టి తెఱంగునఁ బాటపాడుచున్
నట్టువలాడుచుం బణవ ♦ నవ్యమృదంగ మనోహరస్వనం
బుట్టిపడంగఁ జేయుచుఁ బ ♦ యోజదళాక్షులు మానిపుంగవుం
జుట్టిరి కాని మాని యటు ♦ సూడఁడ కన్నులు విచ్చియింతయున్. 37

కం. ఒకధనువుం గాదని వే, ఱొకధనువుం దీయు శరము ♦ నొక్కటిగాదం
చొకచానిఁ దీయు నా ద,ర్పకుఁ డేమిఫలంబు? గుఱి వ ♦ రల దెటుగన్నన్.

కం. నారీతింగాంచి మఱు,న్నారీ రత్న మెటు లెడఁదఁ ♦ దలఁచునొ యనుచున్
నారిని ప్రేమోఁగించుచుఁ బృత,నా దిష్టి గణింప కయ్యె ♦ నంగుం డుఱిమెక్.

వ. అప్పుడు పుంజికస్థలి యొకతియ్యమామిడిగున్న క్రీనీడఁ జెలికత్తియలతోఁ గూడుచుండి సంగీతకళావిన్యాసంబు నెఱపుచు స్వర్గలోకప్రసిద్ధంబైన గాంధారగ్రామంబుఁ బ్రకటించుచుం గొండొకవినోదింపసాఁగె. 40

సీ. జీవస్వరము నుండఁ ♦ జేసి త్రిస్థాయు లం,టంగ రాగాలాప ♦ భంగిఁజూపి
తాల మార్గ క్రియాం♦గ కళాలయాదులఁ, దాళలీలా విచి♦త్రములఁ జూపి

మాతృగ్రహమ్ము పేరూఁతగాఁ బునరుక్తిఁ, దప్పులని నడఁకఁబ ♦ ల్లవినిఁజూపి
భావమాధురి సువి ♦ స్పష్టమ్ముగాఁ దోఁప, సాహిత్యరేఖా ప్ర ♦ శస్తిఁజూపి

తే. స్త్రీపురుషరాగములఁ గాల ♦ దేశములను
గంపితాందోళితాదిక ♦ గమకములను
దెలిసి తాలుప్రవింప ప్రౌ ♦ ఢు లిగిరింపఁ
బుంజికస్థలి గానస ♦ మ్మోహమాన్చె. 41

వ. ఆపైఁ గొండొకవేళవూని వేల్పుగాణి గానక్రీడ మాని 42

మ. మొలనూల్గజ్జెలు నూపురాలు వలయం ♦ బుల్ మంద్రనిస్వానముల్
సలుపన్, నిబ్బరపుబ్బుగుబ్బలబిగిన్ ♦ జవ్వాడఁ గోఁదీఁగ, కుం
డలకాంతుల్ దెసఁ గుప్పిగంతులిడ పీ ♦ డం గ్రొమ్ముడిం బూసరుల్
లలనారత్నము పుంజికస్థలి సలీ ♦ లం గందుకం బాడెడిన్. 43

వ. అయ్యవసరంబున మునివృషభుం డల్లన కనులు విచ్చి మరల వెంటనే ధ్యాననిమీలితాక్షుండు గాఁగా నదిగని రాగాదికము లోఁజేరి తోలుచు చుండెనకాఁ దలంచి యమవ్యసజాస్య సుస్మితాస్యయై చిలుకతేజీ నెక్కియున్న మరుని గనుసన్న నెచ్చరించె నది పరిజనులు పరికించి సముత్సాహదోహదదోహలులైరి. అపుడు 44

కం. అలికులముల ఝంఝామ్ములు
కలరవముల కూజితములు ♦ కలహంస శుకీ
కలకలములు పికముల కుహూ
వులు నెమళుల క్రేంకృతులు ర ♦ వుల్గొని యెగసెన్. 45

కం. పొంచి వసంతుఁడు పుష్పాళి,నించె న్మాయి గాలికూన ♦ నిగిడించి గుబా
ళించు తరంగలఁ బున్నమ,వంచె న్వెన్నెలల మరుఁడు ♦ వంచె న్వింటిన్. 46

కం. ఇటుగను నటుగను వడి ముం,డటికరుగు న్వెనుక కొరగుఁ ♦ వటియుం గ్రేవల్
వటురాగుఁ డెన్నిసేసిన, నెటుగానఁడు నందు లోని ♦ కేగ రుసిమెసన్. 47

వ. ఇటులు కొంతకాలమునన నొకనాఁడు తబిసిఱేఁడు యోగారూఢుఁడు గాక యగ్నికార్యంబు దీర్చి యధ్యయనలోలుఁడై యుండ నతనికట్టిమటం బుంజికస్థలి యందఱుం గవ్వించి తాను నంగభంగిమంబులు నవయవసౌష్ఠవంబులు సౌందర్యమాధుర్యంబులు లావణ్యమానోజ్ఞకంబులు కైశ్యకార్ష్ణ్యంబులు నాసనసైగనిగ్యంబులు నధరాధరారుణ్యంబులు నక్షివైశాల్యంబులు విలోకనతైక్ష్ణ్యంబులు బాహుదార్ఢ్యంబులు వక్షోజకాఠిన్యంబులు నుదరకార్శ్యంబులు నవలగ్నసౌక్ష్మ్యంబులు నూరుసౌకుమార్యం

బులు నితంబనైస్తన్యంబులు జంఘావృత్తానుపూర్వ్యంబులు సంశ్లిష్టమార్దవం
బులు విలాసంబులు విభ్రమంబులు విన్నాణంబులు వెల్లివిరియునట్లు కందుక
క్రీడం జొచ్చి. 48

ఉ. బంతినిడట్టుచుం గదిసి ♦ పట్టుచు నేలకుఁ గొట్టుచుం గుచో
పాంతముఁ బెట్టుచు న్విడుచు ♦ చల్లననవ్వుచు సామిఁ జూచుచున్
గుంతలబంధమూడఁ జను ♦ గుట్టలు కంపిలఁ బైటజాఱఁ గ్రు
చ్చింతలఁ గౌనుఁ దీఁగ వ్రచ ♦ లింపఁగ సచ్చపు లేమ యాడుచున్ 49

చం. ముసిదెస కద్ది పో విసరి ♦ పుచ్చుకొనం జనునట్టులేగి వం
దనములు స్వామి! తుంటరిగ ♦ దా పటు గేందుక, మట్టితుళ్ళి నా
చను బొగడల్ మదుంగఁ బెలు ♦ చన్ స్పృశియించి భయంబుచేతనో
యనఁ బరుగెత్తె మీయదుగు ♦ లంట నొసంగుఁడు బంతిఁ గొట్టెదన్. 50

చం. అను చరుణాధరంబు రద ♦ నాంకుర దంతురితంబు సేయుచున్
గునియుచు వచ్చునానఁ గనఁ ♦ గోసలఁ జెప్పల నవ్వళించుచున్
జనుఁగుదురుంబసల్ వెలికి ♦ జాఱఁ బయంటను దిద్దుచున్ గనుం
గొనల వెలార్చెఁ గక్కసపు ♦ గుండెలఁ బ్రీల్చెడి వాలుఁజూపులన్ 51

కం. చాచి హొయల్ కనఁబడఁ జే, చాఁచి విలాసముగ నిలిచి ♦ చాన మధురవా
చా చిత్ర మ్మొసఁగ నడుగు, చాఁచి కొనఁ దలంచె మోస ♦ యాంతర్యమ్మున్. 52

తే. దృష్టులు స్వలపులఁ గ్రుమ్మ ♦ రించుఁగాక
కూయి యనుకూలత గిరాటు ♦ వేయుఁగాక
ఫలిత మద్వైతసౌఖ్యమై ♦ వెలయుఁగాక
కావిపుట్టగోచులసామి ♦ కదలడాయె. 53

చం. వలుదకుచంబులంటు పొల ♦ పంబుల కస్తురిఁ దానమాడి వే
సలి దిగజాఱు కల్పసుమ ♦ సవ్యపరీమళ మారఁగ్రోలి దు
వ్వలువల గుబ్బతిల్లు పట ♦ వాసక మల్లనఁ గేలఁ బూని క
ర్వలి పసికూన జానుగతి ♦ వచ్చుచునున్నఁ గదల్పఁ డత్తులన్. 54

తే. రమణి రమ్యోరువు త్రిభంగి ♦ కముగ నిలువ
మలచు మారుతుఁ డెదురయి ♦ వలిఘములను
మూలముట్టుగఁ గదలించి ♦ ముగుదకట్టు
మట్టు దెలువందొడఁగె నది ♦ యట్టె నవ్వ. 55

చం. ఎవ రెదియున్నఁ బల్కఁ, డెవ ♦ రేమి రొనర్చినఁ జూడఁ, డెవ్వరె
ద్ది విసిచిన న్వినండు తన ♦ దృష్టి తదర్థముపై నిగిడ్చి పా

టవమున వేదముంజదువు ♦ టల్ విషువం డిటువారు సేయునె
ల్లవియును బూదిలోఁబడిన ♦ యాజ్యములయ్యెను మాటలేటికిన్. 56

కం. ఇది బంతి తీసికొనుమనఁ, దది గైకొనుచుండ నేమి ♦ యది యనఁ, జెదలో
నొదవదు రాగము క్రోధ, మ్మదిరా మరు కాలుసేతు ♦లటు చల్లఁబడెన్. 57

కం. బలిమిం జూత మటంచుం, దలఁచి సతులు డాయఁబోవఁ ♦ దమదగ్ర మహో
జ్జ్వల దుస్సహ తేజోదీ, ప్తుఁ సురనుర చూడఁ రేఁగఁ ♦ దొరఁ బఱదిరటన్

తే. అంత నయ్యింతు లెంతయు ♦ వంతనొంది
కంతుచెంతకుం జని సిగ్గుం ♦ జాంతరమున
నాత్మకీయులం గూడి య ♦ య్యయ్యో చావు
దప్పికనులొట్టపోయె నెం ♦ తపసిజరిగె 59

కం. తాతికిఁ జక్కిలిగింతలె?, చేతనయినదెల్ల మనము ♦ చేసితి మింకం
జేతులు జాడించుకొనుచు, ద్యోతలమున కరుగుదము వ ♦ దుండా సరగన్

వ. అని క్రాఁచుంగన్న బాలురవలె వారంజఱు వచ్చినదారింబఱచి తద్వృత్తాం
తంబును శక్రునకు నివేదింప నతం డమితాశ్చర్యంబునొందె. 61

ఆ. అఖిలజీవినహాజ ♦ మైన మృత్యువుఁ బట్టు
పట్టి గెల్చినట్టి ♦ జెట్టిమిన్న
కబల గెల్చుటెంత ♦ యహముఁ జంపుటయెంత!
కలదటే యసాధ్య ♦ మలఘుమతికి? 62

—♦ మార్కండేయునకు నరనారాయణులు ప్రత్యక్షమగుట ♦—

వ. అంత

చం. త్రివృదుపవీత శోభితులు ♦ కృష్ణమృగాజిన వల్కలాంబరుల్
ప్రవిమల దర్భముష్టు లురు ♦ వైణవ దండ కమండలూజ్జ్వలుల్
నవ కమలాక్షసూత్రలు ల ♦ నల్పచతుర్భుజు లబ్జలోచనుల్
ధవళ వినీలరుక్తను లు ♦ దార తపోమయరూపు లీశ్వరుల్ 64

కం. మెఱుములవలెఁ దమ యున్నత
శరీరములు వెలుఁగ విబుధ ♦ చయము నుతింపన్
నరనారాయణఋషు ల
త్తఱిమార్కండేయమునికి ♦ దరిసెన మొసఁగన్ 65

తే. భగవ దవతారమూర్తులౌ ♦ వారిఁగాంచి
వడివడిగ లేచి యత్యంత ♦ భక్తిభావ

మలర దండప్రణామంబు ♦ లాచరించి
వినయ భయ సంభ్రమంబులు ♦ పెనఁగొనంగ 66

శా. ఆనందోరుతరంగ సంజనిత రో ♦ మాంచాంచదంగుండు బా
ష్పానూనాక్షియుగుండు నిర్వృత నిజ ♦ స్వాంతాశయుం డొంచు నే
మేనం బల్కఁగఁ జూడఁజాల కటు లో ♦ క్కింతాగి గాద్గద్య ని
స్వానం బొప్ప 'నమోనమో' యని మహా ♦ స్తద్వంద్వము న్మోడ్చుచున్.

వ. అంత నొక్కింతసేపటికి డెందంబుఁ గుదురుపఱచికొని యక్షిపద్మంబుల
నమ్మునియుగ్మమ్ము నాప్యాయనంబుగా నాశ్లేషించుచు 68

ఉ. అమ్మునియుంతవారి కుచి ♦ తాసనముల్ ఘటియించి పాదప
ద్మమ్ముల భక్తిమైఁ గడిగి ♦ తా విమలార్ఘ్యమొసంగి ధూపదీ
పమ్ముల మాల్యచందన స ♦ పర్యల వారలఁదన్పి ప్రవ్వాభా
పమ్మున వెండి పాదములు ♦ పట్టి యొరంగుచుఁ బల్కెనిట్టులన్. 69

—* మార్కండేయుఁడు నరనారాయణుల స్తుతించుట *—

చం. నినుఁబొగడన్ స్వతంత్రులమె! ♦ నీరజలోచన! నీవుత్రిప్ప నా
డు నసువు లంతటం దిరిగె ♦ డుం గరణంబులు పుర్వుఁదొట్టి యు
వ్వనజజుదాఁక నీక్రమమె ♦ వర్తిలు సర్వశరీరధారులన్
గనుక భవత్కృపాగరిమ ♦ నావయినిం బొలయింపు మీశ్వరా! 70

ఆ. అట్టులైన దారు ♦ యంత్రిమ్ములట్లు వా, గాదికమ్ము నిన్ను ♦ నభినుతించు
నంతమాత్రమునకె ♦ యలరెదు భావబం, ధుండవగుచు నెంత ♦ దొడ్డపెరిమ!

మ. చిరకారుణ్యముతోఁ ద్రిలోకములకున్ ♦ క్షేమంబుఁజేర్పంగ, దు
ర్భర తాపంబులనార్ప మోక్షముఁగూ ♦ ర్పన్ జిత్తమందెంచి యీ
నరనారాయణమూర్తు లొందితి వనం ♦ తా! నీకిటుల్ క్రొత్తలే?
నరసింహాద్యవతారముల్ గనవె నా ♦ నారీతులం దొల్లియున్ 72

ఆ. విశ్వముల సృజించి ♦ విరమింప వంతతో, వాని నెల్ల మరల ♦ లోనుగొందు
పూర్ణనాభిఁజూడ ♦ మో తంతువుల వెలిఁ, జేర్చి క్రమ్మఱం గ్ర ♦ సించుచుందు

తే. కర్మఫలములు సౌఖ్యదుః ♦ ఖములు, గుణమ
లములు క్రోధకామములు, కా ♦ లము మలములు
శీతవాతాదు, లెటనున్నఁ ♦ జెనకఁజాలఁ
పట్టి నీపాదమూలమ్ము ♦ నాశ్రయింతు. 74

తే. ఆగమార్థవిదుల్ మును ♦ లనవరతము
పొగడుచు నమస్కరించుచుఁ ♦ బూజసేయు

చధికభక్తి ధ్యానింతు య ♦ దాప్తిఁ గోరి
యట్టి భవదంఘ్రిమూలమ్ము ♦ నాశ్రయింతు. 75

ఉ. లేదు కదయ్య త్వత్పదజ ♦ లేజ సమాశ్రయణంబు కంటె వే
ఱేది శుభంబు మార్గ సుఖ ♦ లేశ్వర! యో యపవర్గమూర్తి! భూ
మ్యాది సమస్తదేశముల ♦ యందు భయంబును గాంచు ప్రాణికిన్;
నాదగు విన్నపంబువిని ♦ నన్గరుణామయదృష్టిఁ జూడుమా! 76

కం. అనఘా! కాలాత్ముఁడవగు, నినుఁగని ద్విపరార్ధజీవి ♦ నీరజభవుఁడే
తనుకుచునుండు ననఁగ నా,తని చేసిన ప్రాణిభీతిఁ ♦ దడవఁగవలెనే! 77

మ. అనిదంపూర్వ మపార్థ మంత్యము నిజా ♦ త్మావారకం బట్టిక
న్గాన నాకాశసుమంబు చందమున మా ♦ కున్ భ్రాంతి కల్గించు నీ
తనువందాస్థ త్యజించి జీవగురు! స ♦ త్యజ్ఞానరూపా! వరా!
అనఘా! నీపదమూలముం గొలుతు స ♦ ర్వార్థంబు సిద్ధింపఁగన్. 78

చం. జగదుదయస్థితిప్రలయ ♦ సంగతికై నిజమాయ లీలగాఁ
ద్రిగుణమయస్వరూపములఁ దేలెదు గాని తదీయమూర్తులం
దగపడు సత్త్వమూర్తియె భ ♦ యంబడఁగించి విముక్తిఁ గూర్పఁగా
మిగిలినరెండు నాత్మహిత! ♦ మిక్కిలి భీవ్యసనాళిఁ గొల్పెడిన్. 79

కం. కావుననె పురుషరూపము
భావత సత్వతను వంచు ♦ భజియించి శ్రితుల్
శ్రీవైకుంఠాభయసా
ఖ్యావళిఁ గంద్రు మఱియొకట ♦ నలవడ వవియున్ 80

కం. మఱికొండఱు కుశలులు నీ
పరశుక్లాంగము భజించి ♦ బహుళాపత్సా
గరము తరింత్రఖిలమనో
హర! కొండలదాఁటుటరుదె? ♦ యండ లెసంగన్ 81

మ. పురుషుండున్ జగతీస్వరూపుఁ డఖిలా ♦ త్ముండున్ జగన్నాథుఁడున్
బరదేవుండు సరోత్తముండు శ్రుతిత ♦ త్త్వప్రాపకుం డీశ్వరుం
డు ఋషిశ్రేష్ఠుఁడు హంసుఁడున్ యతిగిరుం ♦ డున్ స్వామి నారాయణుం
డు రమానాథుఁడు నన్నుఁగాచుటకు మో ♦ ద్రుంగేలు పాలంబునన్. 82

మ. మొదట న్నీనిజమాయ గప్పియునికిన్ ♦ బుద్ధిభ్రమంబొంది యు
న్మదితాత్మాధ్వము పట్టి పోవుచును హృ ♦ త్ప్రాణాదులందుండి యం
తృదశ స్వర్తిలు నిన్నఱుఁగ, కవలం ♦ దేవేశ్వరా! నీదుప్రాఁ
జదువుల్ సార్థముగా గ్రహించి నినుఁగాం ♦ చన్నేర్తు రార్యాగ్రణుల్ 83

మ. శ్రుతి నీయాత్మరహఃప్రకాశకమునై ♦ చూపున్ భవద్రూపమున్
శతధృత్యాదులు యోగసాంఖ్యముఖ భి ♦ న్నప్రాధ్వులైయుండ్రు మో
హితులై, యాత్మనిగూఢ బోధవిభవా ♦ బ్ధి! సర్వవాదాళికిం
బ్రతిరూపంబగు నీదుశీలము నమో ♦ వాకంబు నారాయణా! 84

వ. అని మార్కండుండు స్తోత్రముసేసె నని సూతుండు వాక్రుచ్చెను. 85

ఇది యష్టమాధ్యాయము సమాప్తము

---

## నవమాధ్యాయము

కం. మింటిన్మింటిం జలువుచు, మంటిన్మింటిం జలువుచు ♦ మాయాగరిమన్
దంటవగుచు దాసులవె,న్నంటి నిలుతువంట వింటి ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము. అంత శ్రీసూతుండు శౌనకాదులతో నిట్లనియె.

### శ్రీమన్నారాయణుఁడు మార్కండేయునకు వరమిచ్చుట

కం. నిరుపమధీశాలి మునీ,శ్వరుఁ డీచందమున భక్తి ♦ భావనఁ బొగడన్
నరమిత్రుఁడు భగవంతుఁడు, వరుండు నారాయణుండు ♦ పలికెం బ్రీతిన్. 3

కం. తపమున స్వాధ్యాయమున ని,రపాయ మద్భక్తిమహిమ ♦ నాత్మసమాధిన్
విపులతర సంయమమ్మునఁ, బ్రపూర్ణసిద్ధుండవైతి బ్రహ్మర్షివరా! 4

కం. నీనైష్ఠికవ్రతమున న,నూనామోదంబుఁ గంటి ♦ నోహో యంటిన్
గాన వరదేశ్వరుఁడనగు, నేనిచ్చెదఁ గోరుకొమ్మ ♦ భీష్టవరమ్మున్. 5

చం. అనిన మరుద్వతీతనయుఁ ♦ డంజలిసేసి ప్రపన్న దుఃఖమో
చనచణ! దేవదేవ! ముని ♦ సన్నుత! కోర్కులుకోరుమా యటం
చును నను బెద్దసేసె దివి ♦ చోద్యము తావకదర్శనంబుక
న్నను వరమొండు కావలెన? ♦ నాకిదెచాలు ముదంబువొందితిన్. 6

ఉ. అంబుజసంభవాదు లమి ♦ తాదరణంబున యోగవశ్యచి
త్తంబుల నే భవచ్చరణ ♦ తామరసంబులఁ జూడఁగోరి ని
త్యంబు శ్రమంబులొందెదరు ♦ తత్పరమేశునిఁ గన్నులారఁగా
నంబడయంగజాలితిని ♦ నాకిఁక వాంఛితమేమి కావలెన్. 7

శా. ఐనం గోరుమటంచు మీరనఁగ మీ ♦ యాజ్ఞావ్యతిక్రాంతిగా
నౌనేవర్తిల? నిన్నుఁజూపి తిఁక నీ ♦ దౌ మాయఁజూపింపవే

---

(1) అధ్యాయ ప్రారంభము 1-1-1947

తానేకంబగు సత్పదార్థమున భే ♦ దంబుం బ్రదర్శించుచున్
నానాత్వంబును లోకపాలురకునై ♦ నం జూపునం టచ్యుతా ! 8

కం. అని కోరి పెక్కు తెఱఁగుల, వినుతించి సపర్యసలుప ♦ వెన్నుఁడు చిఱున
వ్వున వల్లెయనుచు నరుతో, జనియెం దన బదరికా వ♦నంబున కెలమిన్. 9

వ. అని చెప్పి వెండియు శ్రీసూతుం డిట్లనియె. 10

—* మార్కండుఁడు మాయావిభూతి ననుభవించుట *—

కం మాయ నెపుడు కందునో ! యే
చాయ నది వెలుఁగునో ! యెట్టి ♦ చందంబున నా
రాయణుఁడు దానిఁ జూపునో !
యాయది యేవలనునుండి ♦ యరుదెంచెడినో 11

మ. అని మౌనీంద్రుఁడు మానసంబునఁ దదీ♦యార్థంబ చింతించుచున్
దన పుణ్యాశ్రమమందు వర్తిలుచు స్వా ♦ ధ్యాయాదు లశ్రద్ధవా
అనిచిత్తంబున సల్పుచున్ మఱియు సూ ♦ ర్యాచంద్రమఃపంచభూ
త నికాయంబుల నాత్మ నన్నిట హరిన్ ♦ ధ్యానించి వీక్షించుచున్ 12

వ. మానసపరికల్పిత ద్రవ్యములం బూజించుచు భక్తిరసప్రవర సంప్లుతుండై పారవశ్యంబున నొకప్పు డేతన్మానసపూజయు విస్మరించియుండ నయ్యదనుం గని భగవత్ప్రేరితయై మాయ విజృంభించి మార్కండేయు నంతరంగము నావరించె. మహర్షులారా! యిఁక నేమి సెప్పెదను నమ్మౌని మాయావైభవానుభూతి ప్రకారంబు సావధానమనస్కులరై యాలింపుఁడు. అతం డుపవిష్టుండై నిమీలితాక్షుండై యుండి స్వప్నంబునంబోలె ననుభవించిన దాని నుడువుచున్నాఁడను. అట్లొకనాఁటి సంధ్యాసమయంబునఁ దాను పుష్పభద్రానదీతీరంబున నుపవిష్టుండై పరవశుండై యుండఁ జండమయూఖుం డుద్దండంబుగాఁ దిగ్మగభస్తికాండంబుల నదరించి యజాండంబు గండడఁగింపం దొడంగె. అంత సముద్రోద్వేగంబున మహావాయువు వీవంగడంగె. దానివెనుక వినీలోత్తాల వలాహక జాలంబులు కరాళంబులై కొండలతండంబుడంబున నింగినిండి కనులుచెదరు మెఱుములతోడను జెవులు సిల్లులువడు నుఱుములతోడను బుడమిఁ బ్రద్దలగు పిడుగులతోడను నసరేగి బండికన్నులంతేసి చినుకులతో నేనుంగు గున్నలంతేసి వడగండ్లతో నారంభించి నీరంధ్రంబుగా నఖిలాకాశావకాశంబుల వ్యాపించి తుండితుండాభ వర్షధారఁ గ్రుమ్మరించుచుఁ బెద్దకాలంబు వర్షించెను. 13

శా. ఖద్యోతుం డటు మున్న తీక్ష్ణకిరణౌ ♦ ఘంబు న్వెలారించి ధా
త్రీ ద్యోమండల జీవరాసులను దో ♦ రింపన్, దటిత్వంతముల్
విద్యు ద్గర్జితవృష్టులం బఱపి కా ♦ వించెన్ సమస్తక్షయం
బాహ్యం జిత్రమమాయ కెయ్యది యసా ♦ ధ్యం బెన్నఁ గల్పించెడిన్. 14

వ. అంత, 15

ఉ. వారిధుల్ ఘుమంఘుమ ర ♦ వంబుల గుబ్బతిలందొడంగె గం
భీర జలభ్రమంబు లొద ♦ వెన్ జెలఁగెం దిమినక్రసంహతుల్
భూరి మహాబలోచ్చలిత ♦ ముల్ పృథులోర్మి పరంపరల్ మహో
గ్రారభటిన్ ధరావలయ ♦ మాగ్రసియింపఁగ వేలదాఁటెడిన్. 16

ఉ. నాలుగుదిక్కులం గవిసి ♦ నాలుగుసంద్రము లొక్కపెట్ట ను
ల్లోల కరాళజిహ్వికల ♦ లోఁగొనుచున్ సచరాచరావనీ
గోళము ద్వీపయుక్తముగ ♦ ఘూర్ణిలుచుం దనక్రేవరాఁగ ను
ద్వేల భయంబు డెందమును ♦ ద్రిప్పులు పెట్టఁగఁగాంచు చాశలన్. 17

వ. మార్కండేయుండు కర్తవ్యం బెయ్యది యని తలంచునంతలో, 18

తే. తూర్పుటల యాశ్రమంబును ♦ దోఁచివైచె
బశ్చిమపుటల ముని నీటి ♦ పైకివైచె
దక్షిణపుటల ముందుకుఁ ♦ దన్నివైచె
నుత్తరపుటల వెనుకకు ♦ నూఁచివైచె. 19

కం. ఈలీల న్నాల్గుసముద్రా లేకంబయి వసుంధ ♦ రన్మ్రింగి మహా
భీలమ్మగుచో నీటం, దేలి కనుంగొనుచు మౌని ♦ ధృతిసెడి యుండన్ 20

కం. వేల్లత్ప్రభంజనాహత, కల్లోల సహస్రములు గ ♦ గనముం దివమున్
గొల్లాడి దెసలఁ జుక్కల, పెల్లడఁచి జగత్త్రయంబు ♦ పీటెంబుచ్చెన్. 21

కం. లోకత్రయ గర్భకుహర, మేకార్ణోరాశి గాఁగ ♦ ఋషిపతి తద్వీ
చీ కాండోన్నమితుండై, యేకాకిగనుండెను భ్రమి♦యించుచు నీటన్. 22

సీ. ఒకసారి భీకర ♦ మకరమ్ము లేఁచి వెన్నాడంగ లబలబ ♦ లాడుచుండు
నొకతూరి వీచికా♦నికర సంహతులచేఁ, గడుదవ్వు లేచుచుఁ ♦ బడుచునుండు
నొకసారి బంభ్రమ ♦ దుద్ధతావర్తాళిఁ, బడి దాటలే కుడ్డు ♦ గుడుచుచుండు
నొకతేవగ్రాహశా♦బకములు మెయిఁజుట్టు, కొసఁబీకఁ జేఁదన్ను ♦ కొనుచునుండు

తే. ఒక్కపఱి మీనవక్త్రియం ♦ దొరగుచుండు
నొక్కపరి క్షుత్పిపాసల ♦ నుడుకుచుండు
నొక్కమాటు పెన్వగ మూర్ఛ ♦ నొందుచుండుఁ
గడలినడుమను మిడుకుమృ ♦ కండుకొడుకు. 23

కం. జడలు ముడివెడలి కడచన
బడలిక యొడలం గడు నడర ♦ బయలును గడలుం
బుడమియుఁ బొడవడఁగుడుఁ దమిఁ
బడి తిరుగుచువడియె జడుని ♦ వడువున నతఁడున్. 24

చం. వనచరకోటి తన్నుఁ దిన ♦ వచ్చి పరస్పర మాజి సేయఁగాఁ
దన మొలకట్టు వల్కలము ♦ దగ్రతరంగము లూడ్చి వేయఁగా
ననవరతాంబుమగ్నత రు ♦ జావళి బిట్టు గలంపఁగా భయం
బులు వగ మోహముం గదిరెఁ ♦ బోవునొ ప్రాణములంచు నెంచఁగా. 25

కం. కడ లేకపోయెఁగా యీ
కడలికి నాకడరిన కడ ♦ గండ్లకుడు పెలుల్
కడముట్టునొ! కడలుకొనెడు
కడలుగడిఁదిఁ గడచు కడఁక ♦ కడిమిఁ బొడఁగనన్. 26

చం. అని వగఁ గొంచు నొక్కతఱి ♦ నల్పసుఖంబులఁ గాంచు నొక్కవే
ళ, నొకఁడనే యెటుల్ మనఁగ ♦ లాఁడ నటంచును గుందు నొక్కమా,
టనతతి నిల్వఁ దింక నను ♦ నార్తిని సొమ్మసిలు న్మఱొక్కమా
రసఘున కిల్లి దాఁటె నయు ♦ తాయుతవర్షము లబ్ధినుండఁగన్. 27

కం. ఏమయ్యెనో వైరాగ్యం? బేమయ్యెనో యోగశక్తి? ♦ యేమయ్యెనో జ్ఞా
నామలబుద్ధి! కటా యు,గ్రామంబగు విష్ణుమాయ ♦ తారసిలంగన్. 28

ఆ. మిత్తి గెల్చియున్న ♦ మేటియుఁ జత్తునో యనుచు బీతుచేత ♦ నడలిపోయె
మహితవిష్ణుమాయ ♦ మానసంబును నావ,రింప నెట్టిఁడు దల ♦ క్రిందుగాఁడె! 29

వ. అని సూతుండు మఱియు నిట్లనియె. అట్లు మార్కండేయుం డమ్మ్రజ్జగంబు ముంచిన యగాధైకాంభోరాశిగర్భంబున వామదక్షిణహస్తాంఘ్రి దండ పృష్ఠోదరభాగంబుల నొకదానివెనుక నొకదానిని మార్చుకొనుచు నలఁవు దీర్చుకొనుచు నీఁదులాడుచుం బ్రాణనిరోధంబునను యోగవిధానంబునను గోటానఁగోటులు హాయనంబు లత్యంతదుఃఖభారంబునం గడపువాఁడొకనాఁ డాభీలకల్లోలాఘాతంబుల నెటకో కొట్టుకొనిపోయి యటం గల యొకకొంత మెట్టనేలం గాంచి యందు, 30

సీ. ఎద్దానియూడల ♦ ముద్దుతీరము గిబ్బ,లెంకజోదున కున్కి ♦ టెంకియయ్యె
నెద్దానిజొంపంపు ♦ గద్దఱి కొమ్మరె,మ్మలు వల్కవాల్పాజు ♦ మచ్చులయ్యె
నెద్దానిక్రీనీడ ♦ ముద్ద పితాళ్ళబం,తులకుం గయ న్మొత్తి ♦ త్రోవయయ్యె
నెద్దాని యివురాకు ♦ సిద్ధంపుజాళువా, వలువదాల్పున కించు ♦ పానువయ్యె

తే. ఎద్ది తళ్కు-టాకుల నిండి ♦ యుద్దిలేని
యుళిది వట్టఁబుట్టముఁ గట్టి ♦ నట్టులంచె
నట్టి యొకమఱ్ఱిగున్నఁ గ ♦ న్నారఁగాంచ
బానములు లేచివచ్చె న ♦ ప్పాఱునకును. 31

## * వటపత్రశాయి సందర్శనము *

వ. అంత నతం డధికోత్సాహంబునఁ గరచరణంబుల నీదుచుఁ నెట్టకేల కొడ్డు వట్టి పులినోటి కండంబలెఁ దన్నుం దలంచుచు సంశ్లిష్టాంగంబులతో మెల్లగా న్యగ్రోధపోతము డాసి, 32

తే. వింతకాంతులు ప్రసరించి ♦ యంతనంతఁ
జీఁకటులఁ జోపుచుండ వీ ♦ క్షించి కతముఁ
దెలియ నా్రమూను నలువలం ♦ కులను గలయఁ
దిరిగి నిపుణంబుగా నట ♦ నరయుచుండ 33

వ. ఈశాన్యదిశావ్యాప్త వర్తుల కోమల శాఖాంచన్మంజుల హరిద్వర్ణ పర్ణ పుటాంతర పర్యంకతలంబున 34

కం. బాలకుఁ గుక్షిస్థజగ,జ్జాలకు ఫాలతల నృత్య ♦ శాలి రుచిరనీ
లాలకు నుదరలుఠ ద్వన,మాలకుఁ గనులారఁగని ర ♦ మాపాలకునిన్. 35

వ. కని యుబ్బురముఁ బొంది నాలుగడుగులు ముందునకువైచి, 36

సీ. వచ్చలరతనాల ♦ హెచ్చిన మేఁచా
మనచాయ దెసలందు ♦ మలయుచుండ
సంకులోసిరిఁ గేరు ♦ జాతుగుందోయి డా
నిమ్మపూరవణము ల్ ♦ నెగడుచుండ
నోరగాడ్పులు సోఁకి ♦ యుంగరా ల్దిరిగి రం
గారు ముంగురులు పొం ♦ గారుచుండఁ
బగడంపుఁ బెదవుల ♦ జిగి లేఁగవు వెల్ల
గీఱ లించుక యెట్టి ♦ వాఱుచుండ

తే. మొగము తామరవిరి తళ్కు ♦ నగచుచుండఁ
దీరుగానున్న బొమ యుంకి ♦ మూరుచుండ
నక్కు విప్పారు మురువును ♦ గ్రక్కుచుండ
మఱ్ఱియాకుపైనిఁ బరుండెఁ ♦ గుఱ్ఱ డొకఁడు. 37

వ. ఈ ముద్దుఁబిడ్డం డెవ్వం డిందుండ గతంబేమి? కడు వింతయయ్యెడింగదే
యని తలంచుచు నెప్పగప్పని కంటికోపుఁజూపుఁ బూసరుల మీసరంబులం
గైసేయుచు, 38

సీ. ఊర్పులం బొక్కిలి ♦ యొదవి ముత్తెములుఁ జ
క్కఁదనాల చిఱుబొజ్జ ♦ కదలుచుండ
సంకవు లెంకగా ♦ సంకించు కత్తుక
కలికిబుగ్గలుఁ ముద్దు ♦ గులుకుచుండఁ
బొండమ్మిక్రొన్నన ♦ పోట్ట కెంజాయ న
వ్వెడి కంటిక్రేవలు ♦ వెలుఁగుచుండ
నడఁదను గరఁగించు ♦ బుసుతనవ్వుల చూడ్కి
కూటువఁ బెరిమంబు ♦ కురియుచుండ

తే. చెలువలరు కేలుదోయి వ్రే ♦ ళులను బట్టి
యెత్తి యడుగుఁదామర నోట ♦ నిడి యొయార
ముగను జీకుచు సంతసం ♦ బుగఁ బరున్న
చిన్నిపాపను గాంచి య ♦ చ్చెరువు నెంది. 39

ఉ. ముంగఱముత్తెముం గలికి ♦ ముక్కును జెక్కులచొక్కటమ్ము క
న్నుంగవజోక చూడ్కి పద ♦ నుం జిగిమోవివసందు నల్లనౌ
ముంగురులు న్మొగంబుపస ♦ బొజ్జబెడంగును గానుఁదీఁగసొం
పుం గయినిగ్గు మూఁపుకొన ♦ బుం గని గంతులువేయుచాడుచున్. 40

వ. వీక్షణమాత్రంబున వివృతాశ్రుపూర్ణనేత్రుండును విస్తృతరోమాంచ
గాత్రుండును పీతపరిశ్రమసమూజుండును వికసితహృదయనీరేజుండును
వివిధాద్భుతభావాకృష్టుండును విస్మయాధీనచేష్టుండును నగుచు నవ్విప్రో
త్తముండు ప్రష్టుమనముండై మెల్లమెల్లఁగాఁ జెంగటి కరుగఁ దోడన
యబ్బాలు నూర్పుగాడ్పులకుం జిక్కి తద్వేగంబు నిలువరించుకొననేరక
వానివెంబడిన మశకంబునట్లు తన్నాసికారంధ్రమార్గంబున గర్భగోళంబుం
జొచ్చి యచ్చటను దొల్లింటివలె నిఖిలవిశ్వము నాశ్చర్యంబునం జూడ
సాఁగె 41

చం. తరణి నభంబుఁ జంద్రమసుఁ ♦ దారల దిక్కుల ద్వీప వర్ష సా
గరముల భూమి నద్రులను ♦ గ్రామములం గనులన్ వ్రజంబులన్
బురములఁ గాననంబులను ♦ బుణ్యనదీ నద దేశసీమలన్
సురలను దైత్యులం దపసి ♦ చూచె సమస్తము వేయునేటికిన్. 42

ఆ. వివిధవర్ణజనులు ♦ వివిధాశ్రమముల వ
ర్తించుచుండఁజూచెఁ ♦ బంచభూత
ములును వానికార్య ♦ ములును జంతువులును
స్వేదజాండజములు ♦ వెలయఁజూచె. 43

కం. దినముల రాత్రుల మాసము
లను ఋతువుల హాయనంబు ♦ లను యుగముల నం
దొనరు సకలకల్పంబులఁ
గనె నీగతిఁ బ్రాతిభాసి ♦ కంబు జగంబుల్. 44

కం. హిమవత్కుధరముఁ దత్పా
ర్శ్వమునఁ బవిత్రమగు పుష్ప ♦ భద్రాతటినీ
కమనీయ కూలమును స్వా
శ్రమమును గను చబ్బురమున ♦ సంయమియుండన్. 45

వ. అంతలో మరల నబ్బాలు నుచ్ఛ్వాసవాయు ప్రవాహవేగోద్ధతికిం జిక్కి యొఁగఁబాఱంబోలెఁ గుక్షియందు సుడితిరుగుచు నాసికారంధ్రంబునుండి వెలికివచ్చుచు మరల నిశ్వాసంబులవలన లోనికేఁగుచు నిట్లు సప్తవారంబు లుదరంబుం జొచ్చి యథాప్రకారంబు జగంబులంజూచి కడసారి వెలికి వచ్చినపుడు తల్లయాబ్ధింబడి తన్మహోర్మిజాలంబుల నత్యంతప్రయాసంబున నీఁదులాడుచు నొడ్డుసేరి తొరకపై మొలచిన మఱ్ఱియాకుపైఁ బరున్న బాలుం గని తత్ప్రేమ సుధాస్మితాపాంగ వీక్షణంబు వడసి యతండు స్వీయ హృదయాధిష్ఠితుండగు భగవంతుండ యని యతిసంహృష్టహృదయుం డగుచుఁ గన్నుంగవఁ జిన్నిపావని సోఁకుగంబు జుట్టుకొనుచుం దనివిసనక యుల్లసడాసి బిగియారఁ గౌఁగిలించుకొన నుంకించుటయు, 46

కం. అంతట యోగేశుఁడు భగ,వంతుండు గుహాశయుండు ♦ బాలుఁ డనంతుం
డంతర్హితుఁడయ్యె ముని, స్వాంతేప్స యనీశుచేష్ట ♦ యట్లు నశింపన్. 47

వ. బాలుండు మెఱుమువలె నాకస్మికంబుగా నదృశ్యుండగునవుడు తత్తేజమున కోపక తాపసుని కనులు మిఱుమిట్లుగొని మూఁతలువడియె. అంతం గొంతతడవునకు, 48

తే. విప్రుఁడల్లన కన్నులు ♦ విచ్చిచూడ, స్వాశ్రమంబున నెప్పటి ♦ యట్లయుండెఁ
దొల్లిదోఁచిన ప్రళయపా ♦ థోధిలేదు, పుట్టనేలఁబుట్టిన మఱ్ఱి ♦ చెట్టులేదు.

ఉ. అంతట వాని కాననము ♦ నారయు, నింగినిఁబాఱఁజూచు మే
నంతస్పృశించు వల్కలము ♦ నంటు ధరిత్రినిగాంచు లేచి యా

శాంతముసొక్కి చూచుఁ దన ♦ యాశ్రమమంతయుఁ ద్రిమ్మరున్ మనో
భ్రాంతియొ? నిక్కమో? కలయొ? ♦ వైష్ణవమాయయొ యంచు నెంచుచున్

కం. బాలుఁడు నారాయణుఁ డొక, పోలికగా నుండి రేని ♦ మున్నడిగిన మా
యా లీలం జూపెంగాఁ, బోలు నమోఘ భక్తరక్షు! ♦ ఫుల్లాబ్జాక్షా! 51

వ. అని మార్కండేయమహామునీంద్రుండు తలంచుచుండె నని సూతుండు
వెండియు నిట్లనియె. 52

ఆ. అల్పదేశమందు ♦ నధిక దేశంబు న,త్యల్పకాలమందు ♦ నధిక కాల
మెసఁగఁ జేయునిట్టు ♦ లెన్నొ వింతలొనర్చు, నీశుమాయ నెఱుఁగ ♦ నెవ్వఁ డోపు!

వ. అని సూతుండు వచించె. 54

ఇది మాయాదర్శనమను నవమాధ్యాయము సమాప్తము.

---

## దశమాధ్యాయము

కం. సర్వజ్ఞ! సర్వశక్తి! సర్వేశ్వర! సర్వకర్త! ♦ సర్వాధారా!
సర్వజనీనాగ్రణి! స,ర్వోర్వప్రతి హృదయశోధ! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! అవధరింపుము. శ్రీ సూతుండు శౌనకాదిమహామునులతో నిట్లనియె. అట్లు మార్కండుండు శ్రీమన్నారాయణవినిర్మిత మాయావైభవంబు ననుభవించి మనంబున భయవిస్మయంబులు ముప్పిరిగొన నిట్లనియె.

మ. కమలాక్షా! యసదృక్ష! భక్తజనర ♦ క్షాలోలమా త్వత్పదా
బ్జముమూలంబు సమాశ్రయించితిని గా ♦ పాడంగ రావయ్య! జ్ఞా
నము చందానఁ బ్రకాశమానముగుచుం ♦ డ న్నీదు మాయావిలా
సము విద్వాంసులె విభ్రమింతురన నీ ♦ శా! లెక్కయే నేనిఁకన్! 3

మత్తకోకిలము. ఒంటిజందెపువాని కీమహా ♦ దుగ్రవార్నిధివీచికా
కంటకామిత దుఃఖపుంజ వి ♦ కారముల్ గలిగించి యీ
వెంట నేసుమి ఘోరసంసృతి ♦ వెల్గునంచుఁ దలంపుమం
చంటివో గదె! దేవ దేవ! ద ♦ యానిధీ! సుగుణావధీ! 4

శా. మాయం బుట్టితి మాయలోఁ బెరిగితిన్ ♦ మాయాప్రభావం బదే
మాయంచుం దెలియంగ నెంచి నిను న ♦ భ్యర్థించితిం, జంకయుం
దేయున్నట్టి యజార్భకంబుఁ బురిఁ బ ♦ ర్యేషించు చందంబునన్
మాయం జేయఁగదయ్య నామఱువన్ ♦ మాయామనోనాయకా! 5

---

(1) ప్రారంభము 9-1-9147

ఆ. ఎంతచదువుకొన్న ♦ నెంతతపముసేసి, కొన్న నెంతనిష్ఠ ♦ గూరియున్న
నీకృపారసంబు ♦ నెగడదయేని యీ, మాయదాటలేము ♦ మాకళత్ర ! 6

వ. అని ప్రసన్నుండై నిమీలితాక్షుండై ధ్యానించుచుండ, 7

## పార్వతీ పరమేశ్వరులు మార్కండేయునకుఁ బ్రత్యక్షమగుట

సీ. వచ్చిరేసికతోలు ♦ దెచ్చి తెల్లనిమెయిం, గట్టి నాఁడొకపుక్క ♦ వట్టినాఁడు
కెంజడల్ నెట్టెంబు ♦ గం జుట్టి మిన్నేఱ, నాఁగినాఁడు విసంబు ♦ త్రాగినాఁడు
బుడుతచందురురేక ♦ నొడిసి యాఁదలఁ గ్రేవ, నిల్పినాఁ డగ్గిక ♦ న్మల్పినాఁడు
నిద్దంపువిసదారి ♦ మద్దికాయలజోడు, వేసినాఁ డెసబూది ♦ ఁబూసినాఁడు.

తే. ముమ్మొనలవాలు కెంగేలఁ ♦ బూనినాఁడు
రాణికి స్నేనిసాబాలు ♦ వ్రాసినాఁడు
వెల్లనట్టుమాఁవుర నెక్కి ♦ వెడలినాఁడు
విన్నుసిగవేల్పు ! గుబ్బలి ♦ విల్లుదాల్పు. 8

వ. ఇట్లు మహాదేవుండు పార్వతీసహితుండై ప్రమథగణము సేవించుచుండ గగనంబున విహరించుచు నొకనాఁడు మార్కండేయునాశ్రమ సమీపంబున నరుగుచో భవాని యమ్మౌనిం జూచి తనతేనితో నిట్లనియె. 9

ఉ. చూడుముచూడు మిందొకవి ♦ శుద్ధచరిత్రుఁడు నిశ్చలాంగుఁడై
కూడఁగఁబట్టి యక్షముల ♦ కూటువు డెందము నొక్కవట్టి పె
ల్లాడు మహోర్మి నక్రముల ♦ నాఁచి చలింపని యబ్ధివోలెఁ గొ
ల్లాడఁదొడంగెడిం దపము ♦ నబ్బురమయ్యె మహాత్మ! చూచితే. 10

కం. వాతాపాయాంభోనిధి, భాతి మెలఁగు నితని తపము ♦ వశ్యముసేయుం
జాతువుగాక శ్రితజన, త్రాతా ! నీవఖిల సిద్ధి ♦ దాయివి గావే ? 11

చం. అన భగవంతుఁ డీశ్వరుఁ డు ♦ మాంగనఁజూచి హసన్ముఖాబ్జుఁడై
యనియె భవాని ! యీమునిశ ♦ లాగ్రణి యచ్యుతగాఢభక్తి పెం
పునఁ దనమానసాబ్జమున ♦ మోక్షముసైతము గోరఁడన్నచో
ననఁబనియేమి ? యింక నిత ♦ రార్థము గోరఁడటంచు మానినీ ! 12

ఆ. అయిన సాధువర్యుఁ ♦ డగు వీనితోడ సం
భాషణంబు సేయు ♦ వాఁడ నివ్వ
డదియ పరమలాభ ♦ మగు మానవులకును
సాధుసంగమంబు ♦ సముచితంబు. 13

వ. అనుచు సాత్వతశరణ్యుండును సర్వవిద్యాగణ్యుండును నిఖిలప్రాణిశ్వరుండును నగు మహేశ్వరుం డల్లన మార్కండేయు చెంత కరుగుటయు నమ్ముని

శుద్ధధీవృత్తియగుటం దన్ను విశ్వంబును మఱచియున్న సాక్షాత్కరించిన
జగదాత్ములఁ బార్వతీపరమేశ్వరుల నెఱుంగఁడయ్యె. 14

కం. గిరిశుఁడు భగవంతుం డది
యెఱింగి నిజయోగమాయ ♦ ఋషిహృదయగుహాం
తరమునఁ జొరఁబాఱెం బ
య్యౌర వివరమునందుఁ జొచ్చు ♦ నట్లుక్షణమునన్. 15

వ. అక్కారణంబున, 16

తే. వనజమిత్రోదయంబున ♦ భాసమాన
మగు పొడుపుదిక్కువోలె స్వీ ♦ యహృదయాంబ
రమ్ము దేదీప్యమానమై ♦ క్రాల నేమి
చోద్యమంచు లోఁజూపునఁ ♦ జూచుచుండ 17

కం. కంటంబడె నతనికి ము,క్కంటి తటిత్పింగవర్ణ ♦ ఘనజూటుఁడు మే
నంటిన వాల్గంటి గలుగు,దంట పొడలగింటము మొలఁ ♦ దాల్చిన దణియున్

కం. ధనువు శరంబుఁ ద్రిశూలం
బు నసిం జర్మముఁ గపాల ♦ ముం డమరుకమున్
ఘనపరశు వక్షసూత్రం
బునభీతిం బదికరములఁ ♦ బూనినవాఁడున్. 19

ఆ. ఇట్లుతోఁచి శంభుఁ ♦ డెసఁగ నుద్యద్రవి
వోలె నేలయిట్టి ♦ లీలఁ గ్రాలె
నను చు విస్మితుఁడయి ♦ తన సమాధినివీడి
కన్నుఁదోయిఁ దెఱచి ♦ కడఁకతోడ 20

కం. రుద్రుని దయాసముద్రుని, భద్రుని భృంగీశ్వరముఖ ♦ పారిషదార్చా
త్ముద్రునిఁ ద్రిజగద్రక్షో,న్నిద్రునిఁ గని భక్తిమ్రొక్కె ♦ నిజశీర్షముతో. 21

తే. ప్రమథయుతులౌ పురాణదం ♦ పతుల కంత
స్వాగత మ్మాసనమ్ము పా ♦ ద్యమ్ము నర్ఘ్య
మొసఁగి స్రగ్గంధ ధూపదీ ♦ పోపహార
ముఖ సపర్యలసల్పి య ♦ మ్మునివరుండు 22

తే. ఎవనిచేత నీ జగము ని♦ర్వృతమొ? యే మ
హాప్రభావుండు పూర్ణకా ♦ మప్రదీప్తుఁ
డావిభునకు నీకేమిత్తు ♦ నయ్య? కొండ
యంతదేవున కున్నకొం ♦ డంతపత్రి? 23

సీ. కద్రుజటాటవిం ♦ గంగఁదాల్చినవాని, కేనిచ్చు నర్ఘ్యంబు ♦ లెంచనొక్కొ?
మడికాసుగట్టుపై ♦ నడయాడువానికి, నేనిచ్చుకుశపీఠ ♦ మెంచనొక్కొ?
ఫణిశిరోమణి విభూ ♦ షణుఁడైనవానికి, నేనిచ్చు నక్షత ♦ లెంచనొక్కొ?
చంద్రసూర్యాగ్ని లోఁ ♦ చనుఁడగువానికి, నేనిచ్చు దివ్వియ ♦ యెంచనొక్కొ?

తే. చదలుసిగ దునేదారికి ♦ స్రజ మొసంగి
యష్టభూతియుక్తున కుప ♦ హార మొసఁగి
స్వామి! నామఱకువ బయ ♦ ల్పఱచుకొంటి
శరణు! శరణు! క్షమింపు దో ♦ షములఁ ద్రుంపు. 24

తే. నిర్గుణునకును శివునకు ♦ నిత్యునకును
శాంతునకుఁ బ్రహ్మమునకును ♦ సత్యునకు ర
జోజుష్టునకు ఘోరునకుఁ ద ♦ మోజుష్టునకు
నీకు మ్రొక్కు చేమోడ్పు వె ♦ న్నల జోహారు. 25

అశ్వధాటి. భీమా! త్రిపూర్దనుజభీమా! శ్రితాంతరసుభీమార్జనోద్యమ! సుధా
ధామార్ధశేఖర! త్రిధామా! వచోధికసుధా మాధురీగుణ! శివా
కామా! కుమారజనకా! మాన్యశీల! జితకామా! సురేంద్రవినుతా!
సోమా! సరోజహితసోమాగ్నినేత్ర! [1] సితసోమా! దయాజలనిధీ! 26

అశ్వ. మింటన్ సిగన్ నుదుటికంటన్ సెగన్ గళమువింటన్ హరిన్ నిలిపి మే
నంటన్వ్యాలంబది మలదంటం జెలంగి నెనరుంటం బసల్గులుకు క్రే
గంటం జగంబరయుచుంటన్ మదిందెలిసికొంటం గడుం బెరిమ ము
క్కంటి నిన్నెనం దలఁచుచుంటి న్వడి న్మనువుమంటిం గొనంబులగనీ! 27

కం. అనియీగతిఁ బొగడంగా, విని పరితుష్టుఁడు ప్రసన్న ♦ విమలాత్ముఁడు స
జ్జనగమ్యుఁ డీశ్వరుం డి,ట్లనె లేనగ వాననమున ♦ నడుగిడుచుండన్. 28

ఉ. మెచ్చితి నీప్రవర్తికి న ♦ మేయ తపంబుననిష్ఠ కివ్వ డే
నిచ్చెదఁ గోరుకొమ్ము వర ♦ మెయ్యదియే మదమోహవీక్షచేఁ
దచ్చనలేక మర్త్యుఁ డమృ ♦ తత్వ మహత్త్వము నెందు వేల్పులం
దెచ్చిన మాత్రయుంబు వర ♦ దేశ్వరులయ్యె యెఱుంగఁ జెప్పితిన్. 29

తే. సాధువుల్ భూతవత్సలుల్ ♦ శాంతమతులు
సంగరహితులై బ్రాహ్మణుల్ ♦ సతము మాత్ర
యమున కేకాంతభక్తులై ♦ యైకమత్య
మూర సమదర్శనులు వీత ♦ వైరులగుచు 30

(1) సిత,సా + ఉమా,దేహకాంతౌతుసాత్త్రియాం, ఉమాస్యాదతసీగౌరీహరిద్రాకీర్తికాంతిషు. (నానా)

తే. ఉండెదరు వారిఁగని ప్రీతి ♦ నొదవి జనులు
లోకపాలురె గాక వా ♦ ణీశశంభుఁ
డేను శ్రీహరియును నుతి ♦ యించి పూజ
సలిపి మఱి యుపాసింతుము ♦ సంయమీంద్ర! 31

ఉ. ఏమిటికిల్లు వారలవ ♦ యిం గలుగు న్ననరంచు నెంతువో
మా మువురందు వారి కణు ♦ మాత్రము భేదము గోచరింప ద
య్యా! మఱి స్వాన్యభేద మిసు ♦ మంతయు వారికి లేద, కావునే
యేమటువంటి మిమ్ము భజి ♦ యించుచునుండుము భూసురాగ్రణీ! 32

ఉ. తోయమయాలు తీర్థవిత ♦ తుల్ మఱి ప్రాణవిహీన మృచ్ఛిలా
ప్రాయములైన విగ్రహప ♦ రంపరలుం జిరకాల సేవలం
జేయునుగాక శీఘ్రమున ♦ సేయువుపూతము, దృష్టిమాత్రనే
చేయఁగలారు భూమిసుర ♦ శేఖరులౌ మిముఁబోంట్లు సంయమీ! 33

మ. అతిప్రావరులై తపంబునను స్వా ♦ ధ్యాయంబునన్ సంయమో
న్నతి నాత్మైకసమాధి మాత్రవిమలా ♦ న్నాయ స్వరూపంబు స
మ్మతిమైఁ దాల్చుచు నుండునట్టి ద్విజవం ♦ శశ్రేష్ఠుల న్నా నమ
స్కృతు లొక్కమ్మడిఁ జేరుచుండెడిని జు ♦ మ్మా భూసురగ్రామణీ! 34

తే. అట్టి పూజ్యులౌ మిముఁగను ♦ లారఁగన్న
విన్న నంత్యజులేని పా ♦ పిష్ఠులేని
పావనతఁగందు రనఁగ సం ♦ భాషణాది
కముల ఫలమును జెప్పఁగ ♦ శక్యమగునయ్య! 35

కం. హరిహరులకుఁ గలదు భిదా,స్ఫురణమ్మని పలుకునట్టి ♦ మూఢాత్ములకుం
బరగవ యిహపరలోకము,లెరియుదు మవ్వారిఁగాంచి ♦ యేనుం హరియున్

తే. తమవిధిని దాముసేయుచోఁ ♦ దగవుగలదె?
విధినతిక్రమించిననై ♦ విఘ్న మొదవు
కలహములు నరకమ్ములు ♦ గలుగు గ్రుద్దు
లాడుకొనుటకె? శాస్త్రమ్ము ♦ లవతరించె? 37

తే. స్వప్రయోజనార్థము భేద ♦ సరణి కల్పి
తమ్ము కాపురుషులచే య ♦ థార్థమునకుఁ
బారమార్థికమున లేదు ♦ పాఱఁజూచి
మూలముట్టుగఁ ద్రయ్యంత ♦ ముల నెఱుఁగవె? 38

కం. లోకమ్ము భిన్నరుచిగద, యేకైవడి నెవఁడుగోరు ♦ నే మా రూప
స్వీకృతిఁదోఁతుము భక్తా,నీకమునకు, మందుఁ దెలియఁగ ♦ నేగఁడు దీనిన్. 39

తే. దాసుల యభీష్టముకొలంది ♦ దద్గుణములు
వానిఁబట్టి క్రియలు వానిఁ ♦ బట్టి హరిహ
రాజనామముల్ దనరెడి ♦ నంతెకాని
నిక్కమునకు లోకేశ్వరుం ♦ డొక్కఁడుగద. 40

కం. అని చంద్రశేఖరుఁడు చె
ప్పిన ధర్మరహస్య సముప ♦ బృంహిత వాగ్గుం
భన పీయూషము శ్రుతిపుట
లను ద్రావియుఁ దనివిసనఁ డి ♦ లాసురుఁడెడఁదన్. 41

కం. చిరకాలము హరిమాయా
పరతంత్రుం డగుచుఁ బడిన ♦ బహులాయాసా
విరతక్లేశము వెంటనె
హరవాగమృతమునఁ బాసి ♦ యతఁ డిట్లనియెన్. 42

కం. అరరే! భగవచ్చర్యల, శరీరు తెలియఁగఁగలారె? ♦ జగదీశ్వరు లే
క్షైల ప్రముఖ్యదుల ప్రశంసిం, తురు తమకు నియమ్యుల నవి ♦ నోదంబోక్షో!

శా. స్వామీ! దేహుల ధర్మమార్గము గ్రహిం ♦ పంజేయఁగా నిక్కిరో
ద్దామల్ మీరలు మర్త్యధర్మముల శ్ర ♦ ద్ధాయుక్తి బోధింత్రు పై
నామోదింతురు ప్రస్తుతింత్రొరులుచే ♦ యు న్నిగ్రహింత్రు మీ
యీ మాయాక్రియలం బ్రభావ మసదా ♦ నేమీకు? లోకేశ్వరా! 44

ఆ. ఇచ్చవచ్చినట్టు ♦ లెన్నొ మాయాక్రియల్,
సలుపుచుండు నైంద్ర ♦ జాలికుండు
తాముఁగూడ నవ్వ ♦ ధముసఁ జేయుచునుండు,
రీసు తలఁపు లల్ప ♦ లెఱుఁగఁ గలరె? 45

చం. చెలఁగి యవిద్య స్వప్నము సృ ♦ జింపఁగ జీవుఁడొసర్చినంచు న
జ్ఞులు తలపోయుచందమునఁ ♦ జూ; నిజమాయ సమస్తవిశ్వముం
గలుఁగఁగఁజేయు నీకు నొడిఁ ♦ గట్టుట యీవు సృజించి దానిలో
పల వసియించి యయ్యమభ ♦ వంబులఁ గందువటే! పరాత్పరా! 46

చం. త్రిగుణముల న్వహించి యవి ♦ త్రిప్పెదు యంతగ నంతెగాని జీ
వుగతి నడంగఁబో, వొకఁడుఁ ♦ బోల్పఁగ నీకుసముండు లేఁడు నీ

వ గురుఁడ వెల్లవారలకు ♦ బ్రహ్మము నీవగుమూర్తి కేవల
త్వగరిమఁ గ్రాలుచుందు భగ ♦ వంతుఁడ! నీకివె మత్ప్రణామముల్. 47

ఆ. నీదుదర్శనమున ♦ నే పూర్ణకాముండ, సత్యకాముఁడగును ♦ జనుఁడు భూమ!
అందువలన నీదు ♦ సందర్శనముకన్న, నింక నేవరమ్ము ♦ నిచ్చగింతు? 48

కం. ఐనను భగవానుఁడ! నీ, పైనట్టితె పరమభాగ ♦ వతులందుఁ జ్యోతిం
గానని భక్తిగలుగ నీ, వే నాకొకవరము శ్రితజ ♦ నేప్సితదాయీ. 49

సీ. అనుచు మార్కండర్షి ♦ ప్రార్థింపఁగా హైమ
వతి యనుమోదింప ♦ భవుఁడు ప్రేమ
మొలుకుచూపుల నిట్లు ♦ పలికె నీకోరికి
సిద్ధించు మఱి ముని ♦ శ్రేష్ఠ! నీక
ధోక్షజుపై భక్తి ♦ యక్షీణమగును నా
కల్పాంతకీర్తియుఁ ♦ గలుగుఁ బుణ్య
మజరామరత్వంబు ♦ నబ్బుఁ ద్రైకాలిక
జ్ఞానంబు బ్రహ్మావ ♦ ర్చసము నొదవు

తే. అమిత వైరాగ్యయుతము జ్ఞా ♦ నమును బడసె
దవు మహాపురాణాచార్య ♦ తయు లభించు
ననివరములిచ్చి మునినుతు ♦ లందికొనుచుఁ
దృప్తుఁడై శివతోడ నం ♦ దివయి నెక్కె. 50

వ. నిటలాక్షుండు గగనంబున నరుగుచుఁ దన దేవేరికిం దొల్లి యమ్మృకండు
తనయుండు విష్ణుమాయావిభూతి ననుభవించిన ప్రకారమ్ము నుడువుచుం
గైలాసంబునకరిగె నని సూతుండు వెండియునిట్లనియె. 51

కం. ప్రవిమలభార్గవవంశో, ద్భవుఁ డచ్యుతభక్తిరతుఁ డ ♦ వాప్తమహాయో
గ విభూతిమహిముఁడై యి, చ్చ వచ్చినటు లిప్పటికినిఁ ♦ జరియించుఁజుమీ.

కం. స్ఫురిత మృకండప్రకృతి, స్ఫురిత మునివరేణ్య వివిధ ♦ చర్యావిలస
చ్చరితము హృదయానందద, భరితము వింటిరె విప్ర ♦ వంశ్యలలాముల్.

వ. మీసందియంబు తీఱినదనితలంతు మహర్షులారా! సప్తకల్ప ప్రళయాత్మకం
బైన భగవన్మాయావైభవంబు మార్కండేయునికొక్కనికిమాత్రమే భగవ
దిచ్ఛచే నాకస్మికంబై యనుభూతంబైనది గాని యది సర్వజనసాధారణ
మైనదిగాదు. మాయాస్వభావము తెలియని కొంద ఱజ్ఞులు దైవయుగ
సహస్రద్వయమానంబున మాటిమాటికి వచ్చుచుండు విశ్వసామాన్యకల్ప
ప్రళయంబులే యవియని భ్రమంబడి పలుకుచుందు రట్లుగాదు. మాయా

శిశు శ్వాసోచ్ఛ్వాసములవలన నేనువర్యాయములు తదుదర ప్రవేశ
నిర్గమనములవలని స ప్తకల్పప్రళయంబులు తత్క్షణమాత్రంబున వాని
కొక్కనికి జరిగినట్లున్నవని విద్వాంసులు భావింతురు. అసలు మాయ
యన సర్గప్రళయాదిలక్షణమగు సంసృతియేసుమీ. మఱియు నింద్రజాలి
కుండే యెన్ని యేని యద్భుతంబులం జేయుచుండు నీక భగవంతుఁ డొక్క
క్షణంబున నెన్ని కల్పంబులం జూపఁడు? 54

కం. ఈ మార్కండుచరిత్రము, ప్రేమము తోలఁ కాడ విన్న ♦ వినిపించినఁ గ
ర్మాళిత సంసారాంబుధిని, నామానవు లుత్తరింతు ♦ రశ్రమభంగిన్. 55

వ. అని శ్రీసూతపౌరాణికుండు పలికెను.

ఇది దశమాధ్యాయము సమాప్తము

---

## ఏకాదశాధ్యాయము

కం. కించిద్జ్ఞానిచేతను ద్రావ, యించుచు భాగవతమిట్టి ♦ దే నీమాయా
చంచ త్ప్రభావగరిమ ము, దంచల్లోకచయజఠర! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము. అవ్వలఁ బురాణశ్రోతలగు మహర్షులలో శౌన
కుండు సూతునితో నిట్లనియె. 2

కం. విమలాత్మ! భక్తవర్యా! సమస్త తంత్రార్థతత్త్వ ♦ సారవిదు లుదా
త్త మనీషులైన మిముఁ బ్రశ్న మొకండడిగెద నెడంద♦ సందియ మెడలన్.

తే. కేవలుఁడగు శ్రీవిష్ణుపూ♦జావసరము,
లందుఁ దాంత్రికు లెట్టిత ♦ త్త్వాలచేత
నంగముల నుపాంగమ్ముల ♦ నాయుధముల
భూషణమ్ములఁ గల్పింత్రు ♦ పుణ్యపురుష! 4

కం. ఇట్టిక్రియా నైపుణమున, నెట్టిజనుండైనఁగాని ♦ యెనయు నమృతతా
పట్టంబుఁ గాన మీరి,ప్పట్టున నిది తెల్ప వేఁడు ♦ వాఁడ మహాత్మా! 5

### —* సూతుండు మహాపురుషపూజాక్రమ మెఱిఁగించుట *—

వ. అనినసూతుండు విష్ణువిభూతులను వేదతంత్రములందుఁ జెప్పిన బ్రహ్మ
ద్యాచార్యులకు నస్మద్గురువర్యులకు నమస్కరించి నుడివెద ననిగురునమ
స్కారం బాచరించి యిట్లనియె. ప్రకృతి సూత్ర మహ దహంకార

---

1. అధ్యాయ ప్రారంభము 14-1-1947

పంచతన్మాత్రమ్ములను తొమ్మిదితత్వములచేతను, నేకాదశేంద్రియము పంచ
మహాభూతమ్ములను షోడశవికారంబులచేతను, విరాట్పురుషుండువిర్మితుండు
చేతనాధిష్ఠితుండైన వీనియందు భువనత్రయము గోచరించుచున్నది. 6

సీ. బ్రహ్మాండదేహావ వి ♦ రాట్పురుషునకును
భూమ్యాద్యధ స్సప్త ♦ భువనములును
చరణముల్, దివములీ ♦ ర్ష; మ్మాకసముసాభి;
రవినేత్రములు; సమీ ♦ రణుడునాస;
దాసిపుల్ చెవులు; ప్ర ♦ జాపతిప్రజనసేం,
ద్రియము; మపానంబది ♦ మృత్యు; వఖిల
లోకపాలురుబాహు ♦ లుం; జంద్రుఁడుమనంబు;
యముఁడుభ్రూయుగము; దం ♦ తములుజ్యోత్స్న;

తే. వ్రీడయుత్తరోష్ఠంబు, క్రీ ♦ డెనవిలోభ
మవనిజములురోమములు; స్మ ♦ యమ్ముభ్రాంతి;
జలధరములుకేశమ్ములై ♦ వెలయు; నిట్లి
యంగములసంగు మనకున్న ♦ యు ట్లతనికి. 7

తే. అవనిలోఁ బ్రతివ్యక్తి స్వీ ♦ యమగుజేన
నేడుజేనలపొడవుండు ♦ నీక్రమమున
నీవిరాట్టుం దనవితస్తి ♦ నేడుజేన
లుండు నెంతచెట్టుకు గాలి ♦ యుండునంతె. 8

వ. అమ్మహాపురుషుం డాత్మజ్యోతిని గౌస్తుభరత్నంబుగను వక్షస్థలంబున
వ్యాపించిన తన్మణిప్రభాపటలంబును శ్రీవత్సంబుగను నానాగుణమయం
బైన స్వకీయమాయను వనమాలగను వేదంబును పీతవస్త్రంబుగను
త్రిమాత్రప్రణవంబును బ్రహ్మసూత్రంబుగను సాంఖ్యయోగంబుల మకర
కుండలంబులుగను బ్రహ్మలోకంబు సర్వలోకనమస్కృతంబు గిరీటంబుగను
నవ్యాకృతమును దాశయనించియుండు ననంతుండుగను ధర్మజ్ఞానాది
యుక్తంబైన సత్త్వగుణంబును నాసనపద్మంబుగను నింద్రియమనోదేహ
బలయుతంబగు ప్రాణతత్వంబు గదగను నొనర్చికొని ప్రకాశించు
చున్నాఁడు. మఱియు నతనికి జలతత్వంబుశంఖంబుగను దేజస్తత్వంబు
సుదర్శనంబుగను నాకాశతత్వంబు ఖడ్గంబుగను దనరారుచున్నది. అతని
చర్మమ్ము తమోమయమ్ము, శార్ఙ్గకార్ముకమ్ముకాలమయమ్ము తూణీ
రమ్ముకర్మమయమ్ము. అయ్యెజన కింద్రియంబులే శరంబులు క్రియాశక్తి
యుక్తమనంబే రథంబు శబ్దాదితన్మాత్రములే రథబహిరభివ్యక్తి ఆదేవుండు

ధరించిన ముద్రలవలననే యతని వరదానాభయదానాది క్రియా
స్వరూపము సంభావ్యంబగు. 9

తే. అర్కమండలంబె దేవ ♦ యజనభూమి;
ఘనగురూపాత్త మంత్రదీ ♦ క్షయె తదీయ
పూజకర్హత; యీదేవ ♦ పూజవలన
వృజిననాశమౌ నంచు భా ♦ వింపవలయు. 10

కం. భగవంతుఁడు భగశబ్దో, పగతైశ్వర్యాది షట్క ♦ వనజముఁ గయి లీ
లగఁదాల్చుఁ, జామరవ్యజ, నగతిక ధర్మము యశమ్ము ♦ నర్మిలిఁబూనున్.

కం. అకుతోభయ వైకుంఠ, ప్రకటితధామమను నాత ♦ పత్త్రిముఁదాల్చున్.
సకలామ్నాయ భుజంగాం, తకుపై యజ్ఞపురుషుం డ ♦ తండు చరించున్ 12

ఆ. కేవలాత్మరూపు ♦ నీ విష్ణుదేవు ని, త్యానపాయిని యగు ♦ నట్టి శక్తి
శ్రీస్వరూపమున భ♦జించుచునుండు ను, రమ్మునందుఁ గాఁపు ♦ రమ్మువెట్టి

తే. పరము నతని నాగమతంత్ర ♦ పార్షదాధి
నాయకుండు విష్వక్సేన ♦ నాముఁడు, నణి
మాది కాష్టగుణములు నం ♦ దాదిరూప
మునను దద్ద్వారపాలు రౌ ♦ చును భజింత్రు. 14

వ. అమ్మహాపురుషుండు స్వయముగా వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ
నామమ్ములఁ జతుర్మూర్తివ్యూహమ్ములఁ బరగి సేవ్యుండగు. 15

సీ. బాహ్యేంద్రియములచే ♦ బహుళార్థము లనుభ
వించు జాగ్రద్దశ ♦ విశ్వుఁడగుచు;
స్వాంతవిషయమగు ♦ స్వాప్నికావస్థలో
భాసిల్లుఁ దైజసా ♦ హ్వయము పూని;
బహిరంతరింద్రియో ♦ పశమంబు కల్మిఁ ద
దుభయ సంస్కారమ్ము ♦ లొందిటూరు
నజ్ఞానమండలి ♦ యుల సుషుప్తిస్థితిఁ
బ్రాజ్ఞనాముండనఁ ♦ బరిఢవిల్లు;

ఆ. అమలమైన జ్ఞాన ♦ మలరు ముక్త్యవస్థ
యందుఁ దాఁ దురీయుఁ ♦ డనఁగ నెగడుఁ;
బరమపురుషుఁ డజుఁడు ♦ భగవానుఁ డిట్లు దే
హమున నల్తెఱఁగుల ♦ నాడఁదలఁచి. 16

వ. ఇట్లు భగవంతుం డీశ్వరుండు పాదాద్యంగంబులచేతను గరుడాద్యుపాంగంబులచేతను సుదర్శనాద్యాయుధంబులచేతను కౌస్తుభాద్యాకల్పంబులచేతను భాసిల్లుచు వాసుదేవాదిచతుర్మూర్తియగుచు విశ్వాదిచతుర్నామంబు లొలసి జీవత్వంబొనయక నియంతగా నలరుచు హరి సంతతసేవ్యుం డగుచున్నాఁడు. 17

ఆ. స్వమహిమంబువలనఁ ♦ బరిపూర్ణుఁడై యుండు
బ్రహ్మకారణుఁడయి ♦ పరగుచుండు
స్వప్రకాశుఁడగుచు ♦ సర్వంబెఱుఁగుచుండు
నట్టిబ్రహ్మమునకు ♦ నంజలింతు. 18

తే. స్వీయమాయచేత ♦ విశ్వంబుఁ బుట్టించుఁ, దనుపుఁ ద్రుంచి వేయుఁ ♦ దానె కంజ
బ్రహ్మవిష్ణురుద్ర ♦ వరనామములు దాల్చి, యట్టిబ్రహ్మమునకు ♦ నంజలింతు. 19

ఆ. అనవరత మహాప్ర ♦ తాక్షుఁడయ్యును విప్ర
తాక్షునట్లు తోఁచు ♦ నన్నిగనుచుఁ
దత్పరులకు నాత్మ ♦ తత్త్వంబుగ లభించు
నట్టిబ్రహ్మమునకు ♦ నంజలింతు. 20

శా. శ్రీకృష్ణా! వ్రజకామినీ వ్రజనుతా! ♦ వృష్ణీంద్ర! గోవింద! భూ
లోకారిక్షితిపాలవంశదహనా ♦ లోకా! ప్రపూతప్రథా!
పాకారిప్రణుతా! యనంతవిభవా! ♦ వాచంయమాదిత్వర
త్నాకేలీ! శ్రవణాభిమంగళ! ననుం ♦ గాపాడవే మ్రొక్కెదన్. 21

ముక్తపదగ్రస్తసీసము.

నందాదిభక్తహృ ♦ న్మందిరస్థిరవాస! వాసవాద్యమరసే ♦ వ్యపదపద్మ!
పద్మాసతీమనః ♦ పంకేజలోలంబ! లంబమానాలకో ♦ ల్లసితసుముఖ!
సుముఖోత్తమవచోభి ♦ శోభితేద్ధవతార! తారాచలోదార ♦ ధైర్యసార!
సారసపత్రవి ♦ శాలనేత్రవిరాజ! రాజార్ధశేఖర ♦ ప్రాణమిత్ర!

తే. మిత్రకోటిసమప్రభా ♦ మేయకాయ! కాయజాతీతసౌందర్య ♦ ఘనవిలాస!
లాసతర్పితగోపగో ♦ పీసమాజ! మాజడతఁ బాపి ప్రోవుస ♦ మ్మదముసంద 22

చం. నిరతము వేఁగుజామునను ♦ నిద్దుర లేచి వినిర్మలాత్ముఁడై
పరమపవిత్రుఁడై మదిని ♦ బట్టి తదంఘ్రుఁ జేర్చి యిమ్మహా
పురుషుని లక్షణంబు లిటు ♦ బుద్ధిజపించెడివాఁ డెఱింగెడిన్
బరము గుహాశయు న్నిగమ ♦ వందితునం బరమాత్ము బ్రహ్మమున్. 23

వ. అనినశౌనకమహర్షి యిట్లనియె. 24

తే. [1] అర్కమండలంబె దేవ ♦ యజనభూమి
యుంటి, మఱి తొల్లి యభిమన్యు ♦ నాత్మజునకు
[2] వినిచె సంగ్రహముగ రవి ♦ విషయము భగ
వానుఁడైన శ్రీశుకయోగి ♦ వక్కాఁడె ననఘ ! 25

కం. నానెలలఁ బెక్కుతెఱఁగులఁ, గలిగెడి సౌరగణ సప్త ♦ కమ్మందురు వా
రల పతులనాపుకర్మా,దులఁ దెలుపుమహరియ కాదె ♦ ద్యుమణిగ నెలుఁగున్ 26

## సూతుండు శౌనకాదులకు ద్వాదశాదిత్యవ్యూహము నుడువుట

వ. అని శ్రీసూతుండిట్లనియె. 27

తే. సర్వదేహుల కాత్మఁ జే ♦ శ్వరుఁడు విష్ణు
వతఁడు లోకయాత్ర జరుగు ♦ నట్టివనికిఁ
దన యనాద్యవిద్యా మహ ♦ త్త్వమున సూర్యు
వెలయఁ జేయు నాతఁడు లోక ♦ ములఁ జరించు. 28

తే. సృష్టికర్త లోకాత్ముండు ♦ శ్రీహరియె వి
కర్తనుఁడు క్రియాభేదంబు ♦ గా నుపాధి
కల్గె; నంతియు భిన్నులు ♦ గారు వీరు
"సూర్య ఆత్మా జగత" యంచు ♦ శ్రుతియు లేదె! 29

ఆ. ద్విజవరేణ్య! సర్వ ♦ వేదక్రియలకు నీ
తండె మూలమగు క ♦ తముఁ గాదె!
ఋషివతంసు లర్క ♦ నెన్నిరో విధములఁ
బొగడుచుందు రెదలు ♦ పొంగువాఱ. 30

కం. సమయమ్ము ఫలము క్రియ కా
ర్యము కరణము కర్త దేశ ♦ మామ్నాయము ద్ర
వ్యము నను నీతొమ్మిదిచం
దముల హరియొకండ వెలుఁగుఁ ♦ దన ప్రకృతిగతిన్. 31

వ. సమయమనఁ బ్రాతరాదికాలము. ఫలమనా స్వర్గాదికము క్రియయనంగ ననుష్ఠానము కార్యమన యాగాదికము. కరణమన స్రుగాదిక మామ్నాయమన మంత్రము ద్రవ్యమన వ్రీహ్యాదికము వీనికిమూలము సూర్యుండగుట నతనిగూర్చి యెఱుంగవలసియున్నది. 32

తే. కాలరూపుఁడౌ భగవంతుఁ ♦ డోలి బార
నెలలయందు వేర్వేఱు పం ♦ డ్రెండు గణము

(1) 10 వ పద్యమున (2) పంచమస్కంధమున

లలరి సేవింపఁగా లోక ♦ యాత్రజరుగు
పొందుఁ జరియించుఁ దద్విధం ♦ బును వినుండు. 33

తే. ప్రతిగణంబున మాసాధి ♦ పతి ఋషీశ్వ
రుండు గంధర్వుఁడును నప్స ♦ రోవనితయు
యక్షుఁడును నాగపతియును ♦ రాక్షసుండు
నుండి యాయా నెలలఁ జోపు ♦ చుందు రెలమి. 34

సీ. హేతిదైత్యుఁడు రథ ♦ కృన్నామయక్షుండు
తుంబురుగంధర్వుఁ ♦ డుం బులస్త్య
మునియు వాసుకియును ♦ భుజగవర్యుఁడు కృత
స్థలియను నప్సరో ♦ లలన ధాత
యనురవి మధుమాస ♦ మునుగడపుచునుంద్రు;
పుంజికస్థలియును ♦ పువ్వుఁబోఁడి
నారదాఖ్యాశగం ♦ ధర్వుఁడు కచ్ఛనీ
రుండు నాగుఁడు పుల ♦ హుఁడు మౌని

ఆ. రాక్షసుఁడు ప్రహేతి ♦ యక్షుండును రథౌజుఁ డర్యమాభిధుండు సూర్యుఁ
డిట్లు వారలెల్లఁ జేరి వైశాఖమాసంబు నడపుచుంద్రు మౌని నాథులార!

సీ. తక్షకోరగుఁడు ర ♦ థస్వనయక్షుండు
పౌరుషేయుండను పలలభోజి
హాహాఖ్యగంధర్వుఁ ♦ డత్రిఋషివరుండు
మేనకాప్సరసయు ♦ మిత్రనామ
సవితయు జ్యేష్ఠమా ♦ సముఁగడపుచునుంద్రు
చిత్రస్వనుఁడు దైత్య ♦ శేఖరుండు
సహజన్యయక్షుఁ డ ♦ చ్చరలేమరంభ హూ
హూనామగంధర్వుఁ ♦ డురుగుణుండు

ఆ. శుక్రనామకుండు ♦ చక్రి వసిష్ఠుండు, ఋషియు వరుణుఁడనెడు ♦ నినుఁడు వీర
లందఱెలమిఁ గలిసి ♦ యాషాఢమాసంబు, నడపుచుంద్రుమౌనినాథులార!

సీ. చర్యరాక్షసుఁడు వి ♦ శ్వావసుగంధర్వ
వర్యుఁ డేలాపుత్ర ♦ పన్నగుండు
నంగిరోమౌని దే ♦ వాంగనప్రమ్లోచ
శ్రోతృయక్షుండు నిం ♦ ద్రుఁడనుసూర్యుఁ
డీసమూహము నభో ♦ మాసంబుఁగడపుచు
శంఖపాలుఁడనుభు ♦ జంగపతియు

వ్యాఘ్రుఁ డిత్యుఁడు భృగు ♦ వాచంయమ శ్రేష్ఠుఁ
డాసారణాఖ్యాక ♦ యక్షవరుఁడు.

తే. మఱి యనుమ్లోచయ నెడున ♦ చ్చరయు నుగ్ర
సేననామకగంధర్వ ♦ శేఖరుఁడు
బలసికొల్వ వివస్వదా ♦ హ్వయుఁడునూర్యుఁ
డెడరి భాద్రపదంబును ♦ నడపుచుండు. 37

సీ. కంబలాశ్వుండునా ♦ గవరుండు శతజిత్తు
యక్షుండు జమదగ్ని ♦ యమి తిలోత్త
మాభిధాప్సరస బ్ర ♦ హ్మోపేత దైత్యుండు
ధృతరాష్ట్రగంధర్వుఁ ♦ డతి ముదమునఁ
గొలువ నిషంభరా ♦ ఖ్యుఁడు రవి యాశ్వయు
జంబును బ్రేమతో ♦ సాఁకుచుండు;
సత్యజిద్యక్షుఁ డ ♦ శ్వతరాఖ్యభోగి వి
శ్వామిత్రమౌని య ♦ ప్సరసరంభ

తే. ఘనుఁడయిన మఖాపేత రా ♦ క్షసుఁడు సూర్య
వర్చసుండను గంధర్వ ♦ వంశజుండు
సాహ్యమొంద విష్ణువనెడి ♦ సవిత పూని
కార్తికమ్మునఁ బాలించు సౌ ♦ ఖ్యమ్ముగలుగ. 38

సీ. ఊర్వశీవనిత తా ♦ ర్క్ష్యుండు యక్షుండు వి
ద్యుచ్ఛత్రువను రాక్ష ♦ సోత్తముండు
ఋతసేనగంధర్వుఁ ♦ డతిబలుండగు మహా
శంఖనాగుండు క ♦ శ్యపమహర్షి
కొలువ నంశువనున ♦ ర్కుఁడు మార్గశీర్ష మా
సమ్మును నెమ్మితో ♦ జరుపుచుండుఁ
బూర్వచిత్తియను పూ ♦ వుంబోఁడి కర్కోట
కాహియు నూర్ణుఁడన్ ♦ యక్షవరుఁడు

ఆ. స్ఫూర్జుఁడనెడి రాక్ష ♦ సుఁ డరిష్టనేమి గం
ధర్వుఁ [1]డాయువనెడి ♦ తాపసుండు
బలసి కొలుచుచుండ ♦ భగుఁడను సూర్యుండు
పుష్యమాస మెల్లఁ ♦ బ్రోచుచుండు. 39

1. "క్రతురేవవ" అని కూర్మ పురాణమునఁ గలదు.

సీ. గౌతమ బ్రహ్మర్షి ♦ వాతరాక్షసుఁడు సు
షేణుఁడన్ గంధర్వ ♦ శేఖరుండు
సురుచి సమాఖ్య య ♦ క్షుండు ఘృతాచ్యప్స
రోంగనయు ధనంజ ♦ యాహ్వయ ఫణి
సేవింపఁ బూషాఖ్య ♦ చిత్రభానుఁడు మాఘ
మాసంబుఁగా చుఁ బ్రే ♦ మమ్ము దోలుక
[2]సేనజిదప్సరో ♦ మానిని యైరావ
త భుజంగపతి భర ♦ ద్వాజహూని

తే. విశ్వగంధర్వుఁడును సుర ♦ ద్వేషి వర్చ
సుండు [3]క్రతునామకుండు య ♦ క్షుఁడు భజించు
చుండఁ బర్జన్యనామకో ♦ యుండు సూర్యుఁ
డెలమి ఫాల్గున మాసంబు ♦ నేలుచుండు. 40

కం. ఇవి శ్రీహరిరూపుఁడవు, సవితృ, విభూతితతు లుభయ ♦ సంధ్యల నిత్యం
బవిరత భక్తిని వినిం, దవిలి, తలంచునరు పాప ♦ తతి నాశముగన్.

కం. ద్వాదశమాసంబుల నిటు, లాదిత్యుఁడు షట్సవర్య ♦ లంది తిరుగుచున్
సాధృతి నిహవరశుభ ధీ, చోదనమును సల్పుచుండుఁ ♦ జుమి సర్వులకున్

సీ. స్వవరత్రయిన్ ఋషుల్ ♦ సన్నుతుల్ సేయంగ
నచ్చరల్ ముందు నృ ♦ త్యములుసలుప
గంధర్వులు మనోజ్ఞ ♦ గానంబులొనరింప
గ్రామణుల్ రథచోద ♦ కతనుబూన
నాగులు రథబంధ ♦ నమున రజ్జులుగాఁగ
బలశాలులగు దైత్య ♦ వర్యులెలమిఁ
బిఱిఁదిదెస వహించి ♦ యరదంబుఁ ద్రోవంగ
నర్కుండు చరియించు ♦ నంతెకాక

తే. వాలఖిల్యు లర్వదివేల ♦ బ్రహ్మఋషులు
తన కభిముఖంబుగానిల్చి ♦ యనవరతము
శ్రుతిచయంబులతోడ సం ♦ స్తుతులొనర్పఁ
గ్రాలుచుండు శ్రీసూర్యనా ♦ రాయణుండు. 43

2. "విశ్వాచి" అని కూర్మపురాణము.

3. 'ఋతుః' అని బొంబైప్రతి. క్రతుః అని వావిళ్లప్రతి. కూర్మమునను "క్రతుః" అనియే కలదు,

ఆ. ఇట్లనాదినిధనుఁ ♦ డీశుండు శ్రీహరి
కల్పకల్పమందు ♦ దల్పభంగిఁ
దనరఁ దా విభాగ ♦ మొనరించుకొని లోక
చయముఁ గాచుచుండు ♦ సంతతంబు. 44

వ. అని శ్రీసూతుండు శౌనకాదులకుం జెప్పె. 45

ఇది పదునొకండవ యధ్యాయము సమాప్తము.

---

## ద్వాదశాధ్యాయము

కం. కోట్యర్క సమాంగప్రభ!
త్రుట్యద్గళ సూత్రరిపుజ ♦ భూజన! సిద్ధా-
పట్యాచరిత! మునిహృదయ
ప్రాట్యంఘ్రిద్వయ సరోజ! హరిహరనాథా! 1

వ. [1] దేవా! యవధరింపుము. అంత శ్రీసూతుఁడు శౌనకాదులతో నిట్లనియె. 2

—* ఏతత్పురాణోక్త విషయ సంగ్రహము *—

తే. మ్రొక్కి లిడెద మహాధర్మ ♦ మునకు జోత
లిడెద శ్రీకృష్ణునకు విశ్వ ♦ సృష్టికేళి
కంజలింతు బ్రాహ్మణులకు ♦ సవల నుక్త
ధర్మములను సంగ్రహముగాఁ ♦ దలఁతు మరల. 3

కం. మీరడిగిన కతమున ఋషు, లారా! నుడివితిని శ్రుతిర♦సాయనముగ శ్రీ
నారాయణ పుణ్యకథా, సారమ్ముగ వేదవీధి ♦ సంచారమ్ముగ. 4

తే. అఖిల పాపహరుండు నా ♦ రాయణుండు
హరి హృషీకేశ్వరుఁడు సాత్వ ♦ తాశ్రయుండు
తామరసనిభ నేత్రుం డి ♦ దంపురాణ
మందు సంకీర్తితుండయ్యె ♦ ననఘులార! 5

వ. ఇందు సర్వవిశ్వసృష్టిసంహారకారణము నిర్గుణపరబ్రహ్మమును నపరోక్ష విజ్ఞానానుభవపర్యంతము జ్ఞానమ్మును దత్సాధనమ్మును నభివర్ణితములు. మఱియు భక్తియోగముఁ దదాశ్రయమగు వైరాగ్యమును నిరూపితములు.

---

(1) 28-1-1947 అధ్యాయప్రారంభము

కం. నారదవృత్తాంతంబును, బారీక్షితగాథ శాప ♦ వశత నిరశనం
దా రాజర్షికి వ్యాసకు, మారుని శుకగోష్ఠి యాది ♦ మస్కంధమునన్. 7

తే. యోగమున నర్చిరాదుల ♦ నొందుటయును
ధాతృనారదగోష్ఠి వ ♦ తారవర్ణ
నమ్ము వైరాజపురుష స ♦ ర్గమ్ము నాది
గాఁగఁగలదు ద్వితీయమా ♦ స్కంధమందు. 8

వ. విదురోద్ధవసంవాదము, విదురమైత్రేయసంభాషణము పురాణ సంహితా ప్రశ్నంబును ప్రళయంబున మహాపురుషసంస్థితియు గుణక్షోభరూప ప్రాకృతికసర్గంబును మహదాది వైకృతికసృష్టియు విరాట్పురుషాధార బ్రహ్మాండసంభూతియు స్థూలసూక్ష్మకాలగతియుఁ బద్మసముద్భవంబు, వరాహావతారము హిరణ్యాక్షవధము నూర్ధ్వతిర్య గవాక్సర్గంబులు రుద్రసృష్టియు శతరూపా స్వాయంభువ మను జననంబును గపిలావతారంబును గపిలదేవహూతి సంవాదంబును నాదిగాఁగలది తృతీయస్కంధము.

కం తొమ్మండ్రు ప్రజాపతు లుద, యమ్మగుటయు దక్షుచేయు ♦ యజ్ఞమ్ము వినా
శమ్మగుటయు ధ్రువుచరి, త్రమ్మును బృథుచక్రవర్తి ♦ రమ్యచరితమున్. 10

వ. నారద ప్రాచీనబర్హిస్సంవాదమ్మును మున్నగునవి కలది చతుర్థస్కంధము 11

కం. అమలము ప్రియవ్రతచరి, తము నాభిచరిత్ర ఋషభ ♦ తనయ భరత వృ
త్తము ద్వీప వర్ష భూధర, సముద్ర కూలంకషావ ♦ చయ వర్ణనముల్. 12

వ. జ్యోతిశ్చక్రసంస్థితియుఁ బాతాళ నరకభేద వర్ణనములుగలవి పంచమ స్కంధము. 13

తే. దక్షజన్మంబు సతినిసం ♦ దనల కమర,
దైత్య తిర్యగ్భుజంగ ప ♦ తత్త్రిముఖులు
వొడముటయుఁ ద్వాష్ట్రిపుట్టువుం ♦ బొడవడఁగుట
లలరునదియ షష్ఠస్కంధ ♦ మనఁగఁబడును. 14

కం. నిక్కపుహరిదాసుల మున్, లెక్కింపంబగిన భక్తి ♦ లీనుఁడు జగమం
దొక్కఁడ ప్రహ్లాదుఁ డతని, మక్కువకథ గలద స ♦ ప్తమస్కంధమునన్ 15

తే అష్టమంబునంగలవు మ ♦ న్వంతరాను
చరితములును గజేంద్రమో ♦ క్షణము వార్ధి
మథన దేవరాక్షసయుద్ధ ♦ మత్స్యకూర్మ
వామనాద్యవతారాభి ♦ వర్ణనములు. 16

సీ. రాజవంశానుకీ ♦ ర్తనము నిక్ష్వాకువం
శ్యుండయిపొల్చు సు ♦ ద్యుమ్నుచరిత
మును, నిలోపాఖ్యాన ♦ మును సూర్యవంశాను
చరిత శర్యాతిరా ♦ జర్షి మహిత
యగు సుకన్యాగాథ ♦ యంబరీషుచరిత్ర
మిక్ష్వాకుజన్మంబు ♦ నింద్రవాహు
వృత్తము మాంధాతృ ♦ వృత్తాంతమును సౌభ
రితపోబలము త్రిశం ♦ కు తనయుకథ.

తే. సగరుకతయు భాగీరథీ ♦ సంభవంబు
విమలుఁడైన ఖట్వాంగభూ ♦ విభుని నడత
సర్వపాపావనోదన ♦ క్షమము రామ
భద్రు దివ్యచారిత్రాభి ♦ వర్ణనమ్ము 17

కం. నిమివిభు నంగపరిత్యాగము జనకోద్భవము తార ♦ గావించిన కా
ర్యమును బురూరవు ననురాగము భార్గవరాముచేయు ♦ క్షత్త్రక్షయమున్.

తే. అవల నహుష యయాతి దుష్యంత భరత
రంతిదేవ శంతను భీష్మ ♦ రమ్యకథలు
యదుకులానుకీర్తన మాది ♦ యా విషయము
లలరెడిని నవమస్కంధ ♦ మందు మివుల. 19

తే. కృష్ణదేవుండు వసుదేవు ♦ నింటఁబుట్టి
నందుకడఁ బెరుగుట పూత ♦ నా వధంబు
శకటుత్రోపుఁ దృణావర్త ♦ చాలనంబు
వత్స బక మారణం బఘో ♦ ద్వాసనంబు. 20

సీ. బ్రహ్మ మాయాప్రభా ♦ వముగంట బలుఁడు ధే
నుకు మన్నిగొనుట కృ ♦ ష్ణుండు కాళి
యాహి గర్వోద్ధతి ♦ నడఁచుట గోగోప
కుల నెరగలినుండి ♦ తలఁగుటయును
బలుఁడు ప్రలంబుని ♦ బిలుకుమార్చుట నందు
రక్షయు గోపికా ♦ వ్రతము హాని
పత్నులభక్తి వి ♦ ప్ర జనానుతాపంబు
భూరి గోవర్ధనో ♦ ద్ధారణంబు

తే. శక్రకృతము యజ్ఞాభిషే ♦ చనము గోపి
కాంగనాక్రీడ శంఖచూ ♦ డాసుహరణ

వృషభ తురగరూపాసుర ♦ విదళనములు
విమలుఁ డక్రూరురాక గో ♦ పికల వగవు. 21

కం బలరామకృష్ణులు మహా
త్ములు మధురకుఁజనుట హస్తి ♦ ముష్టిక చాణూ
రుల కంసాదులవధ మె
జ్జల మృతసుతుఁ దెచ్చి సంత ♦ సము గూర్చుటయున్. 22

వ మధురవసించుచు బలకృష్ణులు యాదవప్రియకార్యము లాచరించుటయుఁ గృష్ణాదేశంబున నుద్ధవుఁడు గోపికలచెంత కరుగుటయుఁ బలుమారులు జరాసంధ సైన్యము రామకృష్ణులు వధించుటయు యవనేంద్ర ఘాతనంబును కుశస్థలీవివేశనము రుక్మిణీహరణము పారిజాతానయనము మార విజృంభణము బాణభుజకృంతనము నరకాసుర సంహరణము షోడశ సహస్రాంగనావరణము చైద్య పౌండ్రక సాల్వ దంతవక్త్ర శంబర ద్వివిద ముర పంచజనాదిమారణము వారాణసీదహనము పాండవుల నిమిత్తము చేసికొని కృష్ణుఁడు భూభారమడంచుటయు మున్నగు కథలు దశమస్కంధమునఁ గలవు. 23

కం. పాఱులు వ్రేల శపించుట
నారద వసుదేవభాష ♦ ణము కృష్ణుఁడు తన్
గోరఁగ సర్వోపనిష
త్సార మ్ముద్ధవునితోఁ బ్ర ♦ సంగించుటయున్. 24

కం. యాదవనాశము బల దా, మోదరు లాత్మీయ యోగ ♦ యుక్తిఁ జనుట లో,
నౌ దివ్యకథలుగల వే, కాదశమగు స్కంధమందు ♦ ఘనగుణులారా !

కం. యుగలక్షణ వృత్తులు కలి
యుగనర కష్టములు నాలు ♦ గోజల లయముల్
తిగతెగల పుట్టువులు ది
వ్యగతిక్ బలి విష్ణురాతుఁ ♦ డరుగుట మఱియున్. 26

కం. శ్రుతిశాఖా విభజనమున్ యతిమార్కండచరితము మ ♦ హాపురుషాంగ
స్తుతి సూర్యవ్యూహాదులు, చతురంత నుడివితిని ద్వాద ♦ శస్కంధమునన్ 27

కం. మీరడిగిన ప్రశ్నమ్ముల, కారసి యుత్తరములిడితి ♦ సజ్ఞాత్ముని లీ
లారూప కర్మముల నొ, ప్పారఁగఁ గీర్తించితిని మ ♦ హామునులారా ! 28

## ఫలము

కం. ధరజాతియుఁ బఱియైనను, మఱచియుఁ దుస్థితియైన వ్యాజ♦మునఁగియు నార్తిం
బొరలియు నైనను బెద్దఁగ, "హరయే నమ" యన్న జాలు♦నడఁగు నఘంబుల్.

ఉ. కాంచనచేల! శత్రుజన♦కాల! దయాగుణలోల! భక్తర
క్షాంచితశీల! యోగిహృద♦యాటనశీల! యటంచు భక్తిఁ గీ
ర్తించిన విన్న, నావలను♦దిక్కు హరించి తలంగు దుఃఖముల్
మంచుల నేఁడి పెల్లుపలె♦మబ్బులఁ గన్నడిగాడు పుంబలెన్. 30

తే. అచ్యుతుఁడు భగవానుం డ♦నోక్షజుం డ
కీర్తితము లౌ కథల్ మృషా♦గిరము లల్ప
ములు నసత్యముల్; కీర్తితం♦బులు బలే! శు
భాకరములు పుణ్యదముల్ య♦థార్థములును. 31

కం. ఎది యుత్తమకీర్తి గుణా,భ్యుదయము గానంబు సేయు♦నో యది రమ్యం
బది రుచికర మది యానం,దద మది శోకాబ్ధిశోష♦ణము మర్త్యులకున్.

ఉ. ఎమ్మెయిఁ జిత్రశబ్దముల♦నేర్చిననే? మది విశ్వపావన
త్వమ్మునఁ గ్రాలు నచ్యుతు న♦దార యశంబును దృప్తిదీఱ గా
నమ్మునఁ జేయఁడేఁ గరట♦నాయకతీర్థము యద్ది హంససే
వ్యమ్మది గాదు సూ! పరమ♦హంసతతుల్ జలజాక్షసేవకుల్ 33

మ. ప్రతిపద్యంబున వానినామ మలరా♦రంగాఁ బనే? మీకు శా
శ్వత కీర్త్యంకితమైన గాథ యగునేఁ♦జా లట్టిదానిన్ సమా
దృతి విన్న న్వినిపించినన్ మఱియుఁ దా♦నే పాడుకొన్నం బురా
కృత ఘోరాఘపరంపరల్ క్షణములో♦క్షీణించెడిన్ శౌనకా! 34

కం. పురునైష్కర్మ్యంబయ్యును, హరికీర్తి విరహితమైన♦నలరదు కంటే!
మఱి యుత్తమకర్మము నీ,శ్వరార్పితము గాదయేని♦వరలునటయ్యా! 35

కం. అమలచరిత! శౌనక! యు,త్తమకర్మము గూడఁ జేయు♦తఱినే ఫలకా
లమునందే సురుతర కష్టములం గలిగించుఁ జూవె♦జనములకెపుడున్. 36

మ. తమవర్ణాశ్రమ ధర్మనిష్ఠలు తపో♦దానశ్రుతాదుల్ యశో
ర్థములం గోరియ సల్పుచో నవి సిర♦ర్థంబుల్ సుమీ వాసఁ గ
ష్టమొదక్కన్ మఱి వాసికిం జతగఁ గృ♦ష్ణస్వామి పాదారవిం
ద మహాసంస్మృతి కల్గినం బసిడిమే♦నం దావియున్నట్టులే. 37

చం. హరిగుణకీర్తన శ్రవణ♦సాదరముఖ్యములం దదంఘ్రి సం
స్మరణములన్ విరక్తియును♦జ్ఞానము సత్త్వవిశుద్ధి శాంతియున్

నిరుపమభక్తి చేకుఱు, న ♦ నేకవిధాఘము లాఱిపోవు న
ప్పురుషు సమస్తభద్రములు ♦ పొందును వేయునిఁకేల శౌనకా ! 38

ఉ. ఓయవనీసురుల్ ! తమర ♦ నుత్తమభక్తి సతం బనన్యభా
వాయతి దేవదేవు నఖి ♦ లాత్ము నదేవు ననంతు నీశు నా
రాయణు నాత్మరూపు హృద ♦ యంబుననిల్పి భజించియుంటిరా
రా ! యిది యెంతదొడ్డవిష ♦ యంబు ! కృతార్థులరైతి రెంతయున్. 39

తే. మున్ను ప్రాయోపవిష్టుఁడై ♦ యున్న యాత్త
రేయుఁడును మునీంద్రులము సం ♦ ప్రీతివినఁగఁ
దపసిమున్న సెప్పిన యాత్మ ♦ తత్త్వ మడిగి
దానిఁదలపించితిరి నేఁగృ ♦ తార్థతముఁడ ! 40

కం. పొగడఁదగిన లీలలుగల
నగధరు మాహాత్మ్యము శుభ ♦ నాశక ముప్పొం
గఁగ నెమ్మదు లింతవఱకు
జగతీసురులార ! మీకుఁ ♦ జాటితిఁ జుండీ. 41

తే. నానుడివియున్న యీపురా ♦ ణమ్ము ననుది
నమ్ము నెవ్వఁ డనన్యమా ♦ నసముతోడ
జామయిన క్షణమైనను ♦ శ్రద్ధగలిగి
వినునొ ? వినిపించునో తాఁ బ ♦ విత్రుఁడగును. 42

కం. ఈదీని ద్వాదశినో ? యే, కాదశినో విన్నఁగలుగుఁ ♦ గడునాయువుకూ
రామందు గాక చదివిన, చో దీక్షగ నఘములడఁగి ♦ శుద్ధతముఁడగున్. 43

తే. ఉపవసించి యీసంహిత ♦ నుదితభక్తి
మధురయందు ద్వారకయందు ♦ మఱియుఁబుష్క
రమ్మునందుఁ బఠించెడు ♦ నమ్మనుష్యుఁ
డెపుడు సంసారభయము వ ♦ హింపఁబోఁడు 44

కం. దీనిఁజదివించి వినియెడి, మానవులకు దేవమౌని ♦ మను సిద్ధపితృ
క్ష్మానాథు లభీష్టంబులు, మానుగఁ గురియుదు రనేక ♦ మార్గములదయున్.

తే. అవనిసురుఁ డెల్లశ్రుతుల న ♦ ధ్యయనమాచ
రించి పొందుఫలమ్ము గో ♦ ఘృతము పాలు
తేనె వెల్లువల్ గట్ట న ♦ రితతి కన్న
మిడినఫలము దీనిఁబఠింపఁ ♦ బడయు నరుఁడు. 46

కం. ఏవిధిఁ బఠించినం భూ, దేవుఁడు బ్రహ్మజ్ఞుఁ డగుని పరమ ♦ ధ్రువపదమొందున్
భూవరుఁడు చదివినం బా, రావారపరీతముం ధ ♦ రం బాలించున్. 47

ఆ. వైశ్యవరుఁడు దీనిఁ ♦ బఠియింపఁ గోటికిఁ
బడగ నెత్తఁగలఁడు ♦ ప్రాజ్ఞులార!
శూద్రవరుఁడు దీని ♦ శోధింప సర్వపా
పములఁ బాసి శుద్ధిఁ ♦ బడయఁగలఁడు. 48

చం. కలిమల సంహతిక్షపణ ♦ కారణుఁ డచ్యుతుఁ డెవ్వసంహితా
వలులఁ గథాంతరంబులనె ♦ పాసఁబడుంజుమి యాడనాడ; న
ట్టు లిచటంగాద దీననెపు ♦ డుం బ్రతిగాథఁ బ్రతిప్రసంగమున్
దొలుకు నశేషమూర్తి మహి ♦ మోజ్జ్వలకీర్తి యనేకభంగులన్. 49

ఉ. ఆయజు నాత్మసత్త్వని న ♦ నంతుని నచ్యుతు నైజశక్తిచే
నీయఖిలంబు లీల సృజి ♦ యించుచుఁ బెంచుచు సంయమించుచున్
బాయకయుండువాని శివ ♦ పద్మ విరించిన ముఖ్యదేవ దు
ర్జ్ఞేయచరిత్రు నీశ్వరుని ♦ జేతులుమోడ్చి నమస్కరించెదన్. 50

ఉత్సాహము ॥ ఊరివోవుచున్న ప్రకృతి ♦ యుం బురుషుఁడు మహదహం
కారములును శబ్దపంచ ♦ కమ్మును నవశక్తు లే
పార స్వాత్మయందు స్థిరచ ♦ రాశిఁజేసి వానిలోఁ
దారెను నుపలబ్ధిమాత్ర ♦ ధాము దేవు బ్రొక్కెదన్. 51

చం. అసితము నాత్మసౌఖ్య నిభృ ♦ తానుభవంబునఁ గుల్కు చన్యభా
వనలఁ బరిత్యజించి మురభంజను దివ్యమనోజ్ఞలీల లా
త్మను గరఁగింపఁజేసెఁ బెరి ♦ మన్ సుపురాణముఁ దత్త్వదీపము
య్యనఘు శుకర్షిచంద్రముని ♦ వ్యాసతనూజు నమస్కరించెదన్. 52

వ. అని సూతుండు నిమీలితాక్షుండయ్యె. 53

ఇది ద్వాదశాధ్యాయము
సమాప్తము.

## త్రయోదశాధ్యాయము

కం. శ్రీమత్కారుణ్య కటా, క్షామృత వర్షాభివర్ధి ♦ తాంతర్దృష్టి
స్తోమ హృదయ పరమానం, దామల సస్యప్రకాశా! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! అవధరింపుము. అంత శ్రీసూతుండు నిమీలితాక్షుండై చేతులు
మోడ్చి 2

మ. ఎవనిన్ స్తోత్రమొనర్తురో వరుణ రు ♦ ద్రేంద్రాజముఖ్యుల్ సదా
ఎవనిన్ బాడుచునుందురో ? సామగులు సాం ♦ గోద్ధశ్రుతిశ్రేణిచే
ఎవనిన్ ధ్యానగతాంతరంగులయి యో ♦ గీశుల్ గనుంగొందురో
ఎవనిం గాలదిశాదులంటుకొన వా ♦ యీశుం బరున్ బ్రమ్రొక్కెదన్. 3

మ. కలశోదంచనముల్ సరోవ్రాతములుం ♦ గాలూనఁగాఁజాల క
వ్వల నొక్కబ్ధియుఁబట్టకేయుజలధుల్ ♦ వ్యాపించి పైనందిన
ప్రలయంబం దఖిలౌషధీకలిత నా ♦ వం దాల్చి వేఁబోకగా
నలువం జేర్చిన మీనమీనము మదే ♦ నస్సంహతిం గూల్చుతన్. 4

చం. తరిమల గర్గిరం దిరుగఁ ♦ దద్దృషదగ్రనిఘృష్టిఁ బృష్ఠపుం
దురద యడంగి కూర్కునెడఁ ♦ దోఁచిన వేనఁ గలంగి ముల్ సరి
ద్వరుఁ డిపుడుం దదీయమగు ♦ వాసన శ్రాంతియెఱుంగ కెప్పుడుం
దిరుగుచుపట్టు నాకమఠ ♦ దేవునియూర్పులు మమ్ముఁ బ్రోచుతన్. 5

చం. ఘురఘుర ఘుర్ఘురించునెడ ♦ ఘోణబిలంబుననుండి పడ్డ శీ
కరమొకఁ డీచతుర్దశ జ ♦ గంబులయందు వడంకుచున్న భూ
తరుణిని ముస్తకంబునటు ♦ తాల్చిన యజ్ఞవరాహ దంష్ట్రికా
గ్ర రుచిరకోణ మస్మదఘ ♦ కాండము ఛిన్నమొనర్చు గావుతన్. 6

చం. కలుములపొత్తిపెన్నఖులఁ ♦ గంకతమై పొలదిండిపిండుగుం
డెలకడికండలందఱుగ ♦ నిష్ఠురమౌకరపత్రమై శ్రితా
వళిపెనుమూఁపుపై దివిజ ♦ పాదపభూస్రజమై తనర్చు నా
జ్జ్వలనరసింహహస్తనఖ ♦ జాలము మాకొలప్రక్షాలించుతన్. 7

చం ఇన శశి భూ దిగంబర యు ♦ గేత దథస్థ్స జగంబు లేదు నొం
ట, నొకట నూర్ధ్వరత్తభువ ♦ నంబులు లోఁచినదేది? దేనిభ
క్తిని గడుఁగ స్వరించి యుల ♦ తీర్థము ముజ్జగముం బవిత్రముం
బొనరుచుచుండె నవ్వటుగుఁ ♦ బ్రోడ పదాబ్జము మమ్మునేలుతన్. 8

చం అలకృతపేర్యవంశవ స ♦ హస్రభుజాగ్ర కదుష్ణ రక్తధా
రలఁ బదనెక్కి దుర్జయ ధ ♦ రాపుల శీర్షము లిర్వదొక్కమా

---

1. 14-2-1947 అధ్యాయ ప్రారంభము

ర్గిలఁబడఁ ద్రుంచి తండ్రిఋణ ♦ మీఁగి ప్రశాంతతఁగన్న భార్గవో
జ్జ్వలిత వరశ్వధప్రభలు ♦ పాచుత మద్వృజినాంధకారమున్. 9

మ. అపరాధించని చంపఁగాదిపుడుఁ, ద్రౌ ♦ సావేశునింగాంచి తీ
చ్చపడుం బాఱెడివానిఁగాంచి విచికి ♦ త్సాలోలమాఁ, గావుతా
వృపతీ ! నీ శరణంబు సొచ్చితిఁనం ♦ బోషించుఁబో చేతన
త్వవకీతుంబలె పట్టిరాము శరరో ♦ పంబేలు నేకాకిన్. 10

చం. జననికి విశ్వదర్శనము ♦ సంగెను ప్రేతలమాఁనముల్ గలం
చెను శిశుపాలముఖ్యుల గ ♦ సించెను బార్థుని సంశయంబు మా
న్చెను ధరణీభరం బుడిపె ♦ శిష్టపథంబును నిల్పె బోధముం
బెసిచె యశోదనందనుని ♦ పిన్నని పువ్వులచూపు నన్నదన్. 11

మ. ఒకకాలంబుననే యనేకవిధ రూ ♦ పోపేతుఁడై యుండుఁ గొం
డికతానంబుననే జగచ్చయముఁగ ♦ న్పింపం బ్రదర్శించు నొ
క్కొక గేహంబున నేకదిష్టముననే ♦ యుండున్ యశోదా కుమా
రకుఁడో! మాయలమారివాఁడో? సగుణ ♦ బ్రహ్మంబొ కీర్తించెదన్. 12

## షోడశదళపద్మబంధము

25 9 1
సీ. * హా స్త్రియూధేశ రక్షాంచితా మిత కృపా
10 26 11
శర్మ దేవాశౌరి ఖలగణారి
2 12 27
మేఘుసన్నిభ దేహామి శ్రీ కృతేంపీ హా
13 3
గరుడము హితవత్ర శం జనేత్ర
14 28 15
సద్గుణనిక ర విశద రుచిభూషాఘు
4 16 29
టి తహృదయా భా వటిష్ఠ నా గ
17 5 18
వతి గర్వహారణ గు రుతనూభ వ ప్రాణ
30 19 6
సం ధా నచరి త విశ్వధర రు చిర
20 31 21
భోగి మి శ్రవర్య జ్కీ కాయాగ దం ష్ట్రి
7 22 32
హారినా నా మునివశ ర ణ్యశ్రుతి తం త్ర

* 1 మొదలు 32 వఱకు వరుసగా నంకెల క్రింది యక్షరములఁ జదివికొనఁడు.